# సమ్రాట్ ప్రౌఢదేవరాయలు

[ప్రతాపదేవరాయలు]

మూలము :

శ్రీ కొరటి శ్రీనివాసరావు

అనువాదము :

శ్రీనివాసపురం సోదరులు

పబ్లిషర్సు

జనతా ప్రచురణాలయం

ఏలూర్ రోడ్ : : విజయవాడ-2.

# అంకితము

నిత్యకల్యాణము పచ్చతోరణమై కలియుగ వైకుంఠమన
వెలసిన - చిలువరాయని కొండపై నెలకొని కొలువ
వచ్చెడివారి పలుపాములలోని కలుషము తొలంచి
వేసినట్లు నిలువుదోపిళ్ళ నిప్పించుకొని
తలపులతోబాటు తలనుగూడ బోడి
చేయించి, మఱిజన్మము లేని
మహాపదమును గుత్తగట్టెడి
'అలిమేలుమంగ తేనికి'

సభక్తికముగ
సమర్పణము.

# అవతారిక

రెడ్డిరాజుల కాలమున మహమ్మదీయ కబంధహస్తములలోఁబడి వాడి వత్తయిపోయిన కాకతీయాంధ్ర సామ్రాజ్య పునాదులపైని తల యెత్తి హైందవమతమును, వారి యాచార్య వ్యవహారములను, నిలువఁ బెట్టఁగలిగిన మహోన్నతమైన సామ్రాజ్యములలో విజయనగర సామ్రాజ్య మొకటి. ఇది తుంగభద్రానదీ తీరమున పంపా క్షేత్రమున నిర్మింపఁబడినది. ఈ నగరపు తొలి రాజ్యాధినేతలైన మొదటి హరిహర బుక్కరాయాదులు కూడఁ గాకతీయుల యొద్ద భాండాగారాధ్యక్షులుగ నుండినవారే। వీరును నాంధ్రకవులను బోషించి, వారిచే ననేక విధము లగు వినూత్న కావ్యములను రచియింపఁజేసి యాంధ్రభాషా యోష కెన లేని సేవఁ జేసిరి.

విజయనగర సామ్రాజ్యేతిహాస నవలా మాలికా పాఠకుల హృదయ ఫలకమందు సామ్రాజ్య వైభవ ఘట్టమునందలి మలిమెట్టును జిత్రించునదియే యీ "ప్రౌఢదేవరాయలు" అను నవల।

విజయనగర సామ్రాజ్య స్థాపనముజేసి పరిపాలించిన సంగమ వంశములో మూడవ వాడుగ సింహాసన మధిష్ఠించిన రెండవ హరిహర రాయల మనుమడును, మొదటి దేవరాయల పుత్రుడునునైన రెండవ వీరవిజయ బుక్కరాయలకు దేవరాయలు, పర్వతరాయలు, హరిహరాంబ, ప్రతాపదేవరాయలు నను సంతానముండెను.

ఈ వీర విజయరాయల మరణానంతర మీతని జ్యేష్ఠ పుత్రుడైన దేవరాయలు క్రి. శ. 1419 సం॥న విద్యానగర సింహాసనాధీశ్వరు డయ్యెను. ప్రౌఢదేవరాయలను పేర వ్యవహరింపబడిన ఈతనిని ఇమ్మడి (లేక రెండవ) దేవరాయలనియు, ప్రతాపరాయలనియు, మరియు నేనుం గుల వేట యందాసక్తి మెండుగా నుంటచే గజవేట దేవరాయలనియు గూడ బిలిచిరి. సంగమవంశ చక్రవర్తులలో నింతటి పేరు ప్రతిష్ఠల

నార్జించిన వా రీతడు మినా మరిలేరు. ఈతడు స్వభావతః జైనమతాభి మాని. ఈ సామ్రాట్టు కాలము (1423-47)న విజయనగర సామ్రాజ్య మపార వైభవోపేతమై యుండి యాంధ్ర, కర్ణాట సాహిత్యములకు స్వర్ణయుగమని చెప్పనొప్పి యుండెను. సకలవిద్యా సనాథులైన శ్రీనాథ కవిసార్వభౌముడును, డిండిమభట్టుగ ప్రఖ్యాతుడైన యరుణ గిరినాథ డును, కుమారవ్యాస, చామరసాది ప్రతిభా సమన్వితులైన కర్ణాటక మహాకవులును నీ కాలముననే ప్రకాశించిరి. ఆంధ్ర పాఠకలోకమునకు సుపరిచితములైన "మచ్చిక లేనిచోట ననుమానము వచ్చినచోట మెండుగా, గుత్సితులున్నచోట ..................పెమ్మయసింగ ధీమణీ !" అను మకుటముతో పెమ్మయ సింగరాజును సంబోధించుచు కొన్ని చాటు పద్యములనో, శతకమునో వ్రాసిన 'జక్కన' కవి కూడ యీతని కాలము వాడేనని 'ప్రయోగరత్నాకరము' నుడువుచున్నది. అగుట 'విక్రమార్క చరిత్రము'ను వ్రాసిన జక్కన విఖిన్నుడా ? యను విషయము సుబోధ కముగ లేదు.

సామ్రాట్ ప్రౌఢదేవరాయల పరిపాలనా సమయముననే కొండ వీడు, వినుకొండ రాజ్యములు విజయనగర సామ్రాజ్యమున లీనమైనవి. వినుకొండ, కందుకూరు రెడ్డిరాజులును, పద్మనాయకులును, సామంత మండలేశ్వరులుగ నుండిరి. కొండవీడు, వినుకొండ దుర్గములు స్వాధీ నము జేసికొను సందర్భమున తెలుగు రాయడును పంటమైలార రెడ్డి యును రాయల కత్యంతము సాహాయ్య మొనర్చి యుండిరి. ఆ సమయ మున చామనామాత్యుడు, సింగన, లక్ష్మణ యను దండనాయకులును మంత్రులైయుండిరి. వీరిలో లక్ష్మణ దండనాయకు డవక్ర విక్రముడు, ప్రభుభక్తి పరాయణుడు, రాజనీతిజ్ఞుడై యుండెను. ప్రౌఢదేవరాయలు తన చక్రవర్తిత్వమునకు లోనైన 'అరగ' రాజ్యమునకు శ్రీగిరినాథుడును, గోవా-గుత్తి రాజ్యమునకు త్ర్యంబకదేవుడు, హండియరాయలును, మంగుళూరు ప్రాంతమునకు నాగన్న ఒడయరును, బరకూరుసీమకు చందరస, నరసింహ ఒడయరులును, నేటి యుత్తరార్కాడు జిల్లా ప్రదేశమునకు ప్రతాపదేవరాయలును ప్రతినిధులుగ నుండ పాలించు

చుండెను. ప్రౌఢదేవరాయలు సింహాసనాసీనుడై యుండ వ్యవసాయాభి వృద్ధికి మిక్కిలిగ దోహద మొనర్చి తన ముత్తాతగారైన రెండవ హరిహరరాయలు నిర్మించిన 'హరిద్రా' సేతువును పునర్నిర్మాణము జేసిన తరువాత సామ్రాజ్యాభివృద్ధికి మూలకందమై సప్తాంగములలో ప్రధానములైన కోశ, దుర్గ, బలములను బరిపుష్టములుగ జేయ సంకల్పించిన తరుణమున యాతనికి దురుష్కులతోడను, గజపతులతోడను సంభవించిన యుద్ధముల మూలమున అపరిమితమైన ద్రవ్యము వ్యయమయ్యెను. ఖర్చుపడినది పోగా యాతని ధనాగారమున నుండిన రత్నములుగాక ఎనుబదియైదుకోట్ల వరహాలుండెననియు, క్విలన్, సిలోన్, పులికట్, పెగూ, టెనాసీరమ్ మొదలగు దేశముల యధిపులీ ప్రౌఢదేవరాయలకు కప్పము గట్టుచుండి రనియు 'న్యూనిజ్' వ్రాసియున్నాడు.

ప్రౌఢదేవరాయలు రాజకీయ ప్రజ్ఞగలవాడు. రాజ్యపరిపాలనా దక్షత యందత్యంత నిపుణుఁడు. భాషాప్రియుఁడు, కవి పండిత పోషకుఁడు. విద్యానగర మేలిన రాజుల యందనేకులు 'దేవరాయ' నామధేయులు కలరు. కాని రెండవ హరిహరరాయల తనయుఁడైన మొదటి దేవరాయల యందును, పిమ్మట నాతని మనుమఁడైన ప్రౌఢదేవరాయల యందును మాత్రమే ఈ 'దేవ' శబ్దము రూఢముగాఁ గన్పించుచున్నది. ఇతని కాలమున కొండవీడు, వినుకొండ రాజ్యములును, పద్మనాయకులును, కందుకూరి రెడ్లును సామంతులైరి. ఈతని రాజ్యము కృష్ణానదీ పర్యంతము వ్యాపించియుండెను. తెలుఁగు రాయఁడును, పంటమైలారు రెడ్డి నాయఁకుడును యాతనికి రెండు భుజములై యుండిరి. వీరిద్దఱు మిగుల శౌర్య సంపన్నులై దేవరాయలునకుఁ గరము తోడు పడుచు నాంధ్రసాహిత్యము నందభిరుచి గలిగియుండిరి. తెలుఁగురాయఁడు కవి సార్వభౌముఁడగు శ్రీనాథ మహాకవీంద్రుని మిక్కిలి గారవించి, యాతనికి కస్తూరి మొదలగు సుగంధ ద్రవ్యములను బహుమతిగా నిచ్చినట్లు "అక్షయ్యంబగు సాంపరాయని తెనుఁగాధీశ కస్తూరికా భిక్షా దానము" అను నాతని పద్యపాదమువలనఁ దెలియుచున్నది. ఈతఁడు కవులకు కస్తూరి దానము చేయుటలో మిగుల ప్రఖ్యాతుఁడు.

జగత్ప్రసిద్ధుండగు ప్రౌఢ పండితకవియు, సకలశాస్త్ర పారంగతుఁడునైన శ్రీనాథ మహాకవి సార్వభౌముడు జైతయాత్రకరిగి వచ్చు నాఁడు మార్గ మధ్యమున యప్పుడు కర్ణాటాంధ్ర రాజ్యము (విజయనగరము)ను పాలించుచుండిన ప్రౌఢదేవరాయల యాస్థాన విద్వాంసుఁడుగా నుండిన యష్టదిగ్జయ యశో వష్టంభుఁడగు గౌడడిండిమభట్టుని యుద్భట వివాదమున నోడించి యాతని కంచు ఢక్కను బగులఁ గొట్టించి యాతని 'కవిసార్వభౌమ' బిరుదము నొడిచికొనిన విషయ మాతని జీవితమందలి యొక సుప్రసిద్ధ ఘట్టము. దీని నా కవిసార్వభౌముడు 'దీనార టంకాలఁ దీర్థమాడించితి దక్షిణాధీశు ముత్యాలశాల' యను పద్యములో ఘనముగఁ జెప్పుకొని యున్నాడు. అంతియకాక, కాశీఖండ సప్తమాశ్వాసాంతమునఁ గృతిపతియైన వీరభద్రారెడ్డిని సంబోధించుచు నాతఁడు చెప్పిన :

> 'కర్ణాట క్షితిపాల మౌక్తిక సభా గారాంతరావర్తిత
> స్వర్ణస్నాన జగత్ప్రసిద్ధకవి రాట్సంస్తుత్య చారిత్ర....'

యను పద్యమును విజయనగరమున రాజదర్శనమునకై వేచి యుండిన సందర్భమున రచించిన చాటువులిందలి 'లక్షణోపేంద్ర దేవరాయ క్షితీంద్ర' ప్రౌఢదేవేంద్ర రాయభూపాల వరుని; సమ్ముఖమ్మున దయఁ జూచు ముమ్మసుకవి యను సంబోధనములు నిందుకుఁ బ్రబల నిదర్శనములు. ఈ 'ముమ్మకవి' యనువాఁడు రాయల యాస్థానమున నొక ధర్మాధికారిగా నుండెను.

"శ్రీనాథునకును, డిండిమభట్టు (అరుణగిరి నాథు) నకును బాండిత్య విద్యా వివాదము జరిగినది. ఆ యుద్భట వివాద సమయమునఁ బ్రౌఢదేవరాయల సమక్షమున మాధ్యస్థము వహించి డిండిమ భట్టారకుని 'కవిసార్వభౌమ' బిరుదము నాతని కూడఁ దీయించి శ్రీనాథుని కంటగట్టిన పండితమౌళి, చంద్రభూషణ (శేఖర) క్రియాశక్తి రాయలని 'దీనారటంకాల....' యను పద్యమునందలి చతుర్థ పాదమువలనఁ దెలియుచున్నది. చంద్రభూషణ క్రియాశక్తి నామాంకితులగు శైవాచార్యులు శాసనములందు వేర్వేఱు కాలములలో భిన్నభిన్నముగఁ గన్పట్టు

చున్నారు. మొదటి హరిహర, బుక్కరాయాదుల కాలమున క్రీ. శ. 1349 ప్రాంతమునాటి 'కోడూరు' శాసనములో నొక చంద్రశేఖర క్రియాశక్తి రాయలు పేర్కొనఁబడి యున్నాడు. క్రీ. శ. 1378 నాఁడు వోగటి (మైసూరు రాష్ట్రము) శాసనములో మఱియొక చంద్రశేఖర క్రియాశక్తి కలఁడు. అతఁడే కోడూరు శాసనములోఁ బేర్కొనఁబడినవాఁడు కాఁదగునని బ్రహ్మశ్రీ నేలటూరు వేంకట రమణయ్యగారు 1945 సం॥ అక్టోబరు 'భారతి' లోని 'చంద్రభూషణ క్రియాశక్తి' యను వ్యాసమున వ్రాసియున్నారు. కాని యిందలి యసంగతములఁ బరామర్శించుచు— విమర్శకాగ్రేసరులు, ఐతిహాసిక సామ్రాట్టులునైన బ్రహ్మశ్రీ బండారు తమ్మయ్యగారు 1946 సం॥ మే నెల 'భారతి'లో 'శ్రీనాథుడు—చంద్రభూషణ క్రియాశక్తి రాయలు'అను ప్రతి వ్యాసమును వ్రాసి ప్రకటించి యున్నారు.

'ప్రౌఢదేవరాయల యాస్థానమున శ్రీనాథ—డిండిమ భట్టారకుల వివాదమున మాధ్యస్థమును వహించిన చంద్రభూషణ క్రియాశక్తి రాయలు క్రీ శ. 1349 నాటి కోడూరు శాసనమున నుదాహృతుఁడయిన వాఁడును, క్రీ॥ శ॥ 1378 నాటి వోగటి శాసనమునఁ బేర్కొనఁబడిన వాఁడునుగాని గాక, క్రీ॥ శ॥ 1438 సం॥రము నాటి విడుమామిడి [నేటి అనంతపురము జిల్లా) మఠమునందలి శాసనములో నుదాహరింపఁ బడిన వాఁడుగా గన్పట్టు చున్నాఁడు. ఈతఁడే శ్రీనాథునికిఁ గవిసార్వభౌమ బిరుదమును బాదుకొల్పిన వాఁడనుట నిశ్చయము.

'విజయనగర సామ్రాజ్య స్థాపకులైన తొల్లింటి సంగమరాజులు, బుక్కరాయాదులు సామాన్య శైవ మతస్థులే యైనను, వారి వంశ్యులలో గడపటి వారగు ప్రౌఢదేవరాయలు,నాతని పుత్రులు మల్లికార్జునరాయలు విరూపాక్షరాయలు వీరశైవ మతమును స్వీకరించినట్లు తెలియుచున్నది, చామరసుకవి రచియించిన కన్నడ 'ప్రభులింగ లీలె' యను గ్రంథ పఠనమువలనఁ గలిగిన యభివివేకమున రెండవ దేవరాయలు క్రీ॥ శ॥ 1430 లో వీరశైవ మత దీక్షను బొందెనని క్రీ॥ శ॥ 1672 వ, సం॥

మున రచితమైన 'భైరవేశ్వర కావ్య కథా సూత్ర రత్నాకరము' ను క్రీ॥ శ॥ 1650 లో రచియింపఁబడిన 'గురురాజ చరిత్ర'యు, క్రీ॥శ॥ 1763 లోని 'చోర బసవరాజ చరిత్ర' యను గ్రంథమును జెప్పు చున్నవి. [చూ. రావుసాహేబ్ హయవదనరావుగారి మైసూరు గెజిటీరు మూఁడవ భాగము; కర్ణాటకవి చరిత్ర ద్వితీయ భాగము 64, 65 పుటలు] 'యధారాజా తధా ప్రజాః' యను నట్లాతని యమాత్యులైన లక్కణ, జక్కణాదులు కూడ నాతని మార్గమునే యనుసరించిరి ప్రౌఢదేవరాయ లకు 'వీరశైవాగమ సార సంపన్న' యను బిరుదము క్రీ॥ శ॥ 1419లో నీయఁబడినది. చామరసుని ప్రభులింగలీల లను ఆకాలముననే పిడుపర్తి బసవకవి తెనుగు పద్యములుగ మార్చెను. పందొమ్మిదవ శతాబ్దపుటుత్త రార్ధములోని వాడగు నడకుదుటి రామకవి గూడ దీనిని తెలుఁగులోని కనువదించి యుండెను.

'ఈ రెండవ దేవరాయలకు నంజప్ప, మూరురాయ బసవశంకర సెట్టి నాయకులను కుమారులుకూడ నుండిరని యొక కన్నడ శాసనమునఁ గలదు [చూ. ఎపిగ్రాఫియా కర్ణాటికా 15 వాల్యూము అరసికేరి జిల్లా నెం. 280-9 దు], పైగా నీతఁడు తనకొమరితను వీరశైవ జంగమ మతమునకుఁ జెందిన వీరన్న యొడయురున కిచ్చి వివాహము గావించి నట్లు విరూపాక్ష పండితుని కన్నడ 'చెన్న బసవపురాణము'నఁ గలదు. [చూ. పుటలు 758-59, కాలజ్ఞాన సంధి 60, పద్యములు 19, 21] ఈ రాయల కాలమునాటి నాణెములపై నంది, నీలకంఠ, వృషభముల ముద్ర లున్నవి. అవి వీరశైవ మత సంబంధక చిహ్నములు. దీనింబట్టి చూచి నను యాతఁడు వీరశైవ మతమును స్వీకరించెనని రూఢి యగుచున్నది. [చూ.'విజయనగర రాజుల నాణెములు'అను శీర్షికతో శ్రీ E. Hultzch దొరగారు 1920 సం॥ మే నెల 'ఇండియను ఆంటిక్వరీ వాల్యూము 57 పుటలు 301, 302 లలో ప్రకటించిన వ్యాసములు] ఈ యాధారముల వలన రెండవ దేవరాయలు వీరశైవుఁడని తేలినది. ఇందుచే నాతని పుత్రులు, తరువాతి రాజు మల్లికార్జునరాయలు, మూఁడవ విరూపాక్ష

రాయలు ననువారు కూడ వీరశైవ మతానుయాయులే యని యేర్పడినది. అనంతాచార్యవి రచితమైన 'ప్రపన్నామృతము' అను గ్రంథమున విరూపాక్షరాయలు వీరశైవుఁడని వ్రాసిన యంశములుగూడ నీ యూహను బలపఱచు చున్నవి.

శ్రీ డిండిమకవి యథార్థ నామము—'నృత్తరాజు' అని కుమార గిండిమవి రచితమైన 'వీరభద్ర విజయ డిండిమము' చెప్పుచున్నది. ఈతడు గౌడ బ్రాహ్మణుఁడును, సామవేద శాఖీయుఁడును, వరేంద్రాగ్రహార వాస్తవ్యుడును, అష్ట భాషా కవితా సామ్రాజ్య ధౌరేయుఁడును నైనవాడు. ఈతడు భళ్ళాల రాజాస్థాన విద్వాంసుల గర్వము నణచినట్లు తెలియుచున్నది. అభిరామాంబిక యీ డిండిమకవి దుహిత. ప్రథమ డిండిమభట్టుగా చరిత్ర ప్రఖ్యాతుఁడైన వాఁడీతడే। ఈతడు క్రీ॥ శ॥ 1270 వ సంవత్సరమున బుట్టి క్రీ॥ శ॥ 13,0 వ సంవత్సరము వరకును అనగా నూఱేండ్లు జీవించి యుండిన 'వేదాంత దేశిక' ల వారికి సమకాలీనుడు, వైష్ణవ మత ప్రచారకులైన వేదాంత దేశికుల వారికిని, శైవమత ప్రచారకులైన శ్రీ డిండిమ భట్టారకుల వారికిని మత విషయమున ననేక వాద ప్రతివాదములు జరిగినట్లును, ఏతత్సందర్భమున నొండొరుల నాక్షేపించుచు వచ్చినట్లును దెలిపెడు కథలు 'కంచి' మొదలగు దక్షిణ దేశములం దిప్పటికిని ప్రజలు చెప్పుకొనుచున్నారు. ఈతని యనంతర మీ బిరుద మితని దౌహిత్రుఁడైన యరుణగిరి నాథుఁడు [యోగానంద ప్రహసనకర్త] ధరించెను. ఈతనికి బిమ్మట నీతని కుమారుడు రెండవ రాజనాథుఁ డీ బిరుదమును బొందెను. ఈ రెండవ రాజనాథుఁడు 'జైమినీ భారతము'ను గృతినందిన సాళ్వగుండ నరసింహరాయల యాస్థానకవి. 'సాళువాభ్యుదయ' 'రామాభ్యుదయ' కావ్యముల కర్త. ఈతని తనయుఁడైన రెండవ యరుణ గిరినాథునకు 'కుమార డిండిము'డను నామాంతరము గలదు. ఈతఁడాంధ్ర భోజుఁడని చరిత్ర ప్రసిద్ధినిగన్న శ్రీకృష్ణరాయల తండ్రియగు తుళువ నరసింహరాయల యాస్థానకవి. 'వీరభద్ర విజయ డిండిమ' మను కావ్యమునకు గర్త. ఈ కుమార డిండిముఁడు వీర నరసింహరాయల మరణానంతర మాతని

పుత్రుడు శ్రీకృష్ణదేవరాయల కాలమునందు గూడ నుండినట్లు తెలియు చున్నది. కుమార డిండిముని కుమారుఁడగు మూడవ రాజనాధునికే 'రాజ నాథ డిండిముఁ'డను మరియొక పేరు గలదు. ఈతఁ డచ్యుతరాయల యాస్థానకవి. 'అచ్యుత రాయాభ్యుదయ' మను కావ్య కన్యకకు జన కుఁడు. దీనినిబట్టి చూడ నీ బిరుదము లీ వంశమువారికి బితృపితా మహ పారంపర్యముగ వచ్చుచున్నట్లు తోచుచున్నది.

'ప్రధమ అరుణగిరినాధు [గౌడడిండిమ భట్టు] న కీ బిరుదము 'బ్రహ్మాండ భాండపి చండ మండలిత విజయ డిండిము' దగు ప్రధమ డిండిమభట్టు కవి యనఁగా దన మాతామహుని నుండి సంక్రమించినది. ఈతఁ డసామాన్య పాండిత్యమును, నిరుపమాన కవితా సామర్థ్యమును గలవాడు. ఈ డిండిమభట్టసింహము ప్రౌఢ దేవరాయలని ప్రసిద్ధిగాంచిన రెండవ దేవరాయల యాస్థానకవి। ఈతనికి, నాంధ్ర కవి సార్వభౌముఁ డగు శ్రీ నాథభట్ట సుకవికిని మనయాంధ్ర వాఙ్మయ చరిత్ర యంద త్యంత సన్నిహిత సంబంధ మేర్పడి యున్నది. మన యాంధ్ర కవి యైన శ్రీనాథుని చరిత్రము స్ఫురించినపు డంతయు బ్రౌఢ దేవరాయ లును, నానా దేశ సంచార సమ్యగుపాత్త విజ్ఞాన ఘనుండును, రాజ సంస్థాన విఖ్యాత విశాలయశుండును, నానాశాస్త్ర పాండితీ శౌండిమా క్రాంత దిగ్జయ యుతుండును, నానాకావ్య నిర్మాణ చాతుర్య విఖ్యాత తుండును. శంభుప్రసాద మానిత తరుండును నైన డిండిమభట్టునుగూడ మానస వీధిని విహరించుచుందురు.

'క్రీ॥ శ॥ 1424 వ సంవత్సరమున యా రెడ్డిరాజ్యము లస్త మించి, తనకాశ్రయము లేకపోవుటచే ధనార్జనము కొఱకు శ్రీనాథుకు జైత్రయాత్ర కుపక్రమించినాడు. ఈ యాత్రలో గొంతకాలమునకు విజయనగర రాజ్యాధినేతయు, కర్ణాటాధీశ్వరుడునునైన ప్రౌఢ దేవరాయ లను సందర్శించి, యాతని యాస్థానమునందు బండితకవిగా నుండిన యష్ట దిగ్జయ యశోవష్టంబుఁడగు గౌడ డిండిమభట్టారకు [మొదటి అరుణగిరినాథు]ని యుద్భట వివాద ప్రౌఢిమ నోడించి, మహేశద మహిమోజ్జ్వలమైన యాతని 'కవిసార్వభౌమ' బిరుదము నొడిచికొనఁ

గలిగినాడు. డిండిమ మనునది యొక వాద్య విశేషము. ఇది యానాటి రాజాస్థాన డిండిమ కవుల విజయ [మునకు] చిహ్నము. ఈ డిండిమ కవులు రాజసభకు బోవునపుడు సభాసదులకు వారి రాకను తెలుపు కొరకీ వాద్యము ముందుగా మ్రోగింప బడుచుండెడిదట! దీనిని 'కంచు ఢక్క' యని శ్రీనాథుని 'దీనారటంకాల....' యను చాటు పద్యము నుడువు చున్నది.

'శ్రీనాథుడు ప్రౌఢదేవరాయల యాస్థాన గౌరవమును బొంది బహు ధన కనక వస్తు నిచయమ్ములతో రాయల కొలువు వీడ్కొని దిరిగి వచ్చునపుడు మార్గములో విక్రమసింహపురి [నేటి నెల్లూరు జిల్లా] యందలి 'వెంకటగిరి' సంస్థానాధిపతులకు బూర్వుడును, గోల్కొండ లోని మెతుకు [మెదక్] సంస్థానాధిపతియునైన రావు వంశ సర్వజ్ఞ సింగ భూపాలుని సందర్శించినది, కాశీఖండ రచనమునకు బూర్వము. భీమఖండ రచన యనంతరమునై యుండునని తలంచుట సత్యదూరము కానేరదు. స్వయముగా కావ్య విరచనాసామర్థ్యము గలిగి బహు శాస్త్రములయందు బ్రవీణుడయి సర్వజ్ఞుడై సారస్వత రంగమున నైతము రాజకీయ క్షేత్రమునందువలె శాశ్వత ప్రతిష్ఠ నార్జించుకొనిన వాడును, మహా విద్వాంసుడును, రాజకవియును నైన సింగ భూపాలుని యట్టివేత్త యెదుట దన పాండిత్యమును జూపబోవుటకు మునువచ్చుట దనకు పరాభవము కలుగకుండ జేయుమని శ్రీనాథుడు తన యిష్టదేవతయైన 'శారదాంబ' ను బ్రార్థించి యున్నాడు. ఈ విషయమున గొందరు సంశయపడి యున్నారు. ఎదిరి బలాబలములు తెలియనప్పు డెంతటి బలవంతుడైనను కొంత జంకి తనకు విజయ మందజేయ వలసినదని తన యిష్టదైవమును దొలుత బ్రార్థించుట సాజమగదా? అట్టిచో శ్రీనాథు డాచరించినదానిలో నసహజమే మున్నది?

శ్రీనాథుడు సర్వజ్ఞ సింగమనీని యాస్థానమునకు బోయినప్పుడు తదాస్థాన కవులు 'గోలకొండ, మాలముండ, పూలదండ, కొత్తకుండ' యను పదములనిచ్చి భారతార్థము వచ్చునట్లొకవుగ నొక పద్యమును జెప్పుమని యడుగ నాతడు :

'ఓయి ధృతరాష్ట్ర నీ కొడుకుత్త గోల
కుండ విధ మాలముండ గృష్ణుండు కాచి
పాండు సూనుల గెల్పించు నంత యగుచు
నుదరమున బూలదండ రే కొత్తకుండ'

అని పూరించెనట —

ప్రౌఢదేవరాయలు వీరశైవ దీక్షనంరతము 'ఉజ్జని' [నేటి బళ్ళారి జిల్లా] యందలి సద్ధర్మ సింహాసన పీఠమునకును, పండితారాధ్య సూర్య సింహాసనమునకును గూడ శిష్యుడుగ నుండినట్లు తెలియుచున్నది. హూవల్లి పంచవణిగె నందీశ శివకవి యను నతడు కన్నడ భాషలో వ్రాసిన 'మరుళారాజ్య విజయ' మను గ్రంథములో ప్రౌఢదేవరాయలకు జిరకాలము సంతతి లేకపోవుటచే నప్పుథ యుజ్జిని పీఠాధిపతుల బ్రార్థింపగా వా రాతనికి సంతానము గలుగునటిను గ్రహించిరని వ్రాయబడి యున్నది. అందుచే నాతఁడు విజయనగరమునఁ దన యాస్థానమునఁ బండితారాధ్య పీఠాభిషిక్తుఁడైన చంద్రభూషణ క్రియాశక్తి రాయలను శివాచార్యునిఁ గూడ నియమించుకొని యాతనిని పరమభక్తి గౌరవముతో సేవించుచుండెననుట సత్యము. ఈ చంద్రభూషణ శివాచార్యుఁడు పండితారాధ్య పీఠాధీశ్వరుఁడుగ క్రీ॥ శ॥ 14౩–50 సం॥ లకు నడుమ నుండినట్లు సేలము జిల్లా హోసూరు వాస్తవ్యుఁడు 'షల్లకవి' యను నాతఁడు క్రీ॥ శ॥ ౫00 ప్రాంతమున రచించిన 'పండిత చరిత్ర' మను ప్రబంధము వలనఁ దెలియుచున్నది. ఈ గ్రంథము నేఁటి గూళూరు [బాగేపల్లి తాలూకా, మైసూరు రాష్ట్రము] మఠాధీశ్వరులచే 1952 సం॥మున బెంగుళూరులో ముద్రింపఁబడి ప్రకటింపఁబడి యున్నది. ఈ గ్రంథము తుదనీయఁబడిన తత్పూర్వ పూర్వాచార్యుల పట్టవల్లరిలో నీ చంద్రభూషణ శైవాచార్యుఁడు పేర్కొనఁబడి యున్నాఁడు. ఈ క్రియాశక్తి రాయలకు సంబంధించిన శాసన మొకటి నిడుమామిడి మఠములో నిప్పటికిని భద్రపఱుపఁబడి యున్నదందురు. ఈ పీఠము నందలి విషయములనుబట్టి యీతఁడు తఱచు రాయల యాస్థానమున

విజయనగరమునందే యుండెడి వాఁడనియుఁ దుదకచ్చటనే లింగైక్యము జెందెననియుఁ దెలియుచున్నది. ఈతని సమాధి యిప్పటికిని హంపి [పంపా] క్షేత్రమున నున్నదఁట ! అప్పు డుపపీఠములుగ నుండిన క్రియాశక్తి రాయల పీఠములుగూడ నీ చంద్రభూషణ [క్రియాశక్తి] శైవాచార్యులవారి పర్యవేక్షణమునందే యుండినవి. అదికారణముగా చంద్రభూషణ, క్రియాశక్తి రాయలు అను నామద్వయము క్రమముగా శ్రీనాథుని నాఁటికి 'చంద్రభూషణ క్రియాశక్తి రాయ'లను నొకే పదముగ మార్పు నొంది యుండవచ్చును.

శ్రీనాథునకుఁ గవి సార్వభౌమ బిరుదమును ప్రౌఢదేవరాయల యాస్థానమునఁ బాదు కొల్పిన పండితమౌళి యీతఁడే యనుటకెట్టి సందియమునులేదు. మా యీ యభిప్రాయముతో విజ్ఞు లేకీభవింతురు గాక !

'ప్రౌఢదేవరాయలకు ప్రఖ్యాత నామాంకితుఁడైన రెండవ దేవ రాయలు తాను వీరశైవుఁడయినను తన జ్యేష్ఠ సోదరియగు 'నారమ్మ'ను వైష్ణవ రామానుజ మతీయుఁడైన సాళ్వ తిప్పదేవున కొసఁగి వివాహాము గావించెను. (చూ. కృష్ణస్వామి అయ్యంగారి విజయనగర చరిత్రాధార ములు, Sources Vijayanagar History పుట 62, ఇండియన్ ఆంటి క్వరీ 62 వాల్యూము 1.12 భాగములు పుట 7, 913.14 మైసూరు ఆర్కియాలజీ రిపోర్టు పుట 4..)

క్రీ శ. 11.4 సం॥మున ప్రౌఢదేవరాయల మంత్రియైన జక్కనామాత్యుఁడు, దేవరాయల బావమఱఁదియును, వైష్ణవ మతీయుఁ డును నైన సాళ్వ తిప్పదేవునకు కోలారుజిల్లా లోని తేకల్ (మాలూరు?) పరగణాను వప్పగించెను (చూ. 1928 సం॥ మే నెల ఇండియను ఆంటి క్వరీ 57వ, వాల్యూము పుటలు 77-85 )

ప్రౌఢదేవరాయల కాలమున రాజకీయముగ నాతని సోదరికిని, వైష్ణవుఁడగు సాళ్వ తిప్పభూపాలునికిని జరిగిన వైవాహిక బంధము కారణముగ సాళ్వ నరసింహరాయల కాలము నాఁటికే క్రమముగ వైష్ణ

వము ప్రాబల్యము నొంది. తత్ఫలితముగ తిరుపతి యందలి వీరభద్ర విగ్రహము పూర్తిగా నేఁటి వెంకటరమణ మూర్తిగ మార్పునంది యుండవచ్చునేమో ! యను నూహను ఆర్థర్ ఎస్. కాక్స్ కలెక్టరుగారు 1880 సం॥లో ప్రచురించిన 'నార్త్ అర్కాట్ మాన్యుయల్' లోని 'శ్రీ వెంకటేశ్వరుని తొలుత శివునిగా భావించి పూజించుచుండిరను విషయము నిర్వివాదాంశము. భగవద్రామానుజా చార్యులు తిరుపతికి వచ్చిన సందర్భమున ఆ మూర్తిని విష్ణుదేవునిగ మార్చుట, పూజించుట జరిగినది' అంతేగాక ఆ కాలమున ఈ భార్యలేని దైవమును కుమార కార్తికేయుడు (బాలమురుగన్)గ గూడ దలచుచుండిరని వ్రాసిన మాటలు బలపరచుచున్నవి.

ఈ సాళువ నరసింహరాయడు విజయనగర రాజుల యేలుబడిలో 'టంగుటూరు' మండలమునకుఁ బ్రధాన దండనాయకుఁడుగా నుండెను. అది తాళ్ళపాకకుఁ గొలఁది దూరమున నున్న యొక గ్రామము. తాళ్ళపాక అన్నమాచార్యులనాఁటి కది యొక మండల ప్రధాన నగరముగ నుండినది కాని ఈనాఁడది యొక కుగ్రామమైనది పరిపాలనా సౌకర్యముల కొఱకై నాఁటి విజయనగర రాజులు తమ రాజ్యమును మండలములుగా విభజించి, ప్రతి మండలమున కొక దండనాథుని నియమించి తత్పరిపాలనా భార మాతని భుజస్కంధములపై నుంచెడివారు. నాఁడు దేశము సుభిక్షముగ నుండెను. వృత్తుల యందొకనితో నొకఁడు పోటీ పడలేదు. పదిమందిని జెఱచి యొకఁడు లాభమందవలెనన్న దురూహలు లేవు. నాఁటి సామాజిక నియమములు ధర్మ పరాయణములు. దానిచే బ్రకృతికి మానవునిఁ జూచినఁ బరమ ప్రీతి. అపుడపుడు మహమ్మదీయులు గావించు యుద్ధముల గడబిడంతోఁ దక్క మఱి దేనితోడను నాఁటి మానవ జీవితమున కశాంతి యనునదియే లేదు. దేవరాయలంతటి ధర్మమూర్తి; ప్రజారంజకుడు.

దేవరాయల వైభవములు అనుజన్ముఁడైన పర్వతరాయల కీర్ష్య జనింపజేయ నాతని నెట్లయిన తుదముట్టించి, సింహాసనమును కైవస మొనరించుకొను దలంపున దాను నిర్మించిన నూతన గృహప్రవేశ

మహోత్సవపు మిషచే అన్నగారి నాహ్వానింప, నాయన నైన యోగంబున దనక స్వస్థతగా నుండుటచే రాజాలనని చెప్ప విఫలమనోరథుడైన ప్రతాపుడు మరియొక పన్నాగమున నన్నను బొడిపింప సమకట్టి దేవరాయలు తప్పించుకొనగల్గెను. ఆనాటి విజయనగర రాజ కుటుంబమునందలి స్థితి గతుల నాకళింపు జేసుకొని బహమనీ సుల్తానువైన అల్లాయుద్దీను దేడు లక్షల వరహాలు కట్టవలసినట్లు రాయలకు వార్త నంపగా నాతడు మండి పడి చండప్రచండుడై వారిపై దాడి వెడలిపోయి ముద్గల్లు, రాయచూరు, వెంగాపురము దుర్గముల వశపఱచుకొని, సాగరు, బిజాపుర ప్రాంతము వరకుగల దేశము నంతయు కొల్లగొట్టి భామినీరాజ్యము నల్లకల్లోలము జేయుచుండ సుల్తాను సైన్యము లెదుర్కొని అపజయము నాహ్వానించి, రాయలతో సంధి నెఱపినవి.

ఈ విధముగ దన పూర్వులనుండి మహమ్మదీయ సుల్తానులతో గలుగుచుండిన యనేక వైషమ్యములను తొలగించి, రాజ్యమున శాంతి నెలకొల్పి, యనేక సంస్కృతాంధ్ర కర్ణాట కవివరులను బోషించి, మనోమోహన కావ్యముల నెన్నింటినో బ్రకటింపజేసి, సకల మతముల వారిని సమదృష్టితో నాదరించి, యపజయం బనునది యెఱుంగక, యరి ధారుణీ పతుల బాదాక్రాంతులగావించి, శాస్త్రమను బుద్దిని గలిగి, రాజ్యాంగములను నవయవముల నెనగి, రహస్య రక్షమను కవచమును దాల్చి, గూఢచారులను నయనములచే దూతముఖమున నఖిల సౌఖ్యములు సెలగ బాలించిన విమల యశోమూర్తి ప్రౌఢదేవరాయ దివాకరుడు. క్రీ. శ. 1446 సం॥ మేనెల తే 26 దిని యస్తంగతుడయ్యెను. (చూ. ఎపిగ్రాఫియా కర్ణాటికా వాల్యూము శ్రీవణ బెళగోళ 328) ఆనాడు యావదాంధ్రజాతి విచారసాగరమున మునిగిపోయినది. శారద నిరాలంబమైనది కవి పండితులు దిక్కుమాలిన వారైనారు కీర్తికాంత యనదయై విలపించినది. ప్రౌఢయగు కవితాకాంత భర్తృవియోగము సహింపనోపక కంటికిమంటికి నేకధారగ వెక్కివెక్కి యేడ్చినది.

ప్రౌఢదేవరాయ! ఆర్యావర్తము నీకు ఋణగ్రస్తమై యున్నది. నీ చరిత్రము భావి చక్రవర్తుల కాదర్శప్రాయమైనది. గీర్వాణాంధ్ర

కర్ణాటక సాహిత్యములు యావజ్జీవము నిన్ను స్మరించి యశుశ్రి తర్పణ మొసఁగ గలవు. నీ యట్టి గుణ రత్నాకరుఁడగు కుమారుని గనుటకు భారతమాత ఎన్నినోములు నోచెనోకదా! ఆ మహాతల్లికి నింక నట్టి భాగ్యము కలదా? భగవంతుఁడు భారత మాతృ గర్భ శుక్తి ముక్తా ఫలములఁబోలు నీ యట్టి రాజకుమారుల నింకను భూమియం దవతరింపఁ జేయుఁగాక!

ప్రౌఢదేవరాయల కాలమున నాంధ్రి భారతి యఖండ గౌరవ మందినది. శ్రీనాథాది మహాకవులు కనకాభిషేకాది సత్కారములచే నలంకరింపఁ బడినారు. తీయని ప్రబంధములు రచియింపఁ బడినవి. నాఁడు పద్య సాహిత్యమునకంటె గద్యసాహిత్యము మిపుల వాసికెక్కినది. ఈ వచన సాహిత్యమును సేవించిన వారిలో లక్కణ, జక్కణ దండనాయకులు ప్రముఖులు. ఆంధ్రి పతాక నా దంబరతలమున స్వైర విహారముఁ గావించినది.

శిల్పాచార్యుల సిద్ధ హస్తములచే నాఁడమరశిల్పములు సృజింపఁ బడినవి. దేవాలయములు, విగ్రహములు, మంటపములు లోనగునవి సకల కళా సౌందర్యముచే కళ కళ లాడినవి. తాళ్ళపాక యన్నమా చార్యాది వాగ్గేయ కారుల మధుర కంఠములు మారుమ్రోగినవి. వేయేల? నాఁడు రాణింపని లలితకళయే లేదు. సామ్రాజ్యమునందంతటను నూత నోత్సాహము వెల్లివిరిసినది. విజయధ్వనులు పొడసూపినవి. కావుననే ప్రౌఢదేవరాయల కాలము స్వర్ణయుగ మయ్యెను.

ప్రౌఢదేవరాయలకుఁ బొన్నలాదేవి, సింహళదేవి యను నిరువురు భార్యలుండిరి. వీరిలో బొన్నలదేవికి మల్లికార్జున రాయలును, సింహళదేవికి విరూపాక్ష రాయలును జన్మించిరి. మొదటి హరిహర, బుక్కరాయ, ప్రౌఢదేవరాయాది సంగమ వంశ ధారుణీశ్వరుల యేలుబడిలో వే విధములఁ బెంపు పెందిన విజయనగర సామ్రాజ్యము మల్లికార్జున, విరూపాక్ష రాయల కాలమున మిగుల దుర్బలస్థితికి వచ్చినది. విరూపాక్ష రాయల యనంతరము రాజ్యమునకు వచ్చిన యాతని పుత్త్రుఁడు కూడఁ

దండిగ్రివలెనే దుర్వ్యసన ప్రియుఁడై యుండుటచే నాతని సేనాపతులలో బ్రఖ్యాతి వహించిన సాళ్వ నరసింహరాయలు సమర్థతా హీనుఁడును, భ్రాతృ హంతయునైన రెండవ విరూపాక్ష రాయలను జంపి తాను చక్రవర్తి యయ్యెను. ఈ యుద్ధములను, రక్త ప్రవాహములను పుంభావ సరస్వతి అన్నమాచార్యుల వారి హృదయము నెంతయో సంక్షోభ పఱచినవి. మానవుల ముష్కరతను మిగుల నిందించుచు నాతఁ డెన్నియో కృతులను రచియించి యున్నాడు. ఈ సంగమ వంశపు రాజులలో విరూపాక్ష రాయల రెండవ కుమారుడైన విరూపాక్షరాయలే కడపటి వాఁడు. సాళువ నరసింహరాయలు చక్రవర్తియైనప్పటి నుండి విజయనగర సామ్రాజ్యము సాళ్వ వంశపు నృపతుల పాలనములోనికి వచ్చినది.

క్రీ॥ శ॥ 14.0 వ సం॥మున విజయనగరమును సందర్శించిన ఇటలీ దేశస్థుడైన 'నికొలో డెయికోంటి' యను నాతడు 'లాటిను'భాషలో నీ నగరమును గూర్చి:

"విజయనగర మహా సామ్రాజ్యము మిక్కిలి నిట్రముగనున్న పర్వతముల సమీపమునఁ గట్టఁబడియున్నది. ఆ నగరముయొక్క చుట్టుకొలత యిరువది మైళ్ళు. (అరువది యని నొకచోఁగలదు) ఈ నగరమున నాయుధములఁ ధరింప సమర్థులగు భటులు తొంబదివేలు గలరు. ఆ పురవాసులు సంవత్సరమునకు మూఁడు గొప్ప పండుగలు జేపెదరు. అందొక పండుగ దినమున స్త్రీ పురుషాదు లాబాల వృద్ధుల సహితముగ నదులయందును, సముద్రముల యందును స్నానము లాచరించి నూత్నాంబరములను ధరించి శుచి వ్రతులై భజనలు, నృత్యములు, విందులు సలుపుచు సంతసస్వాంతులై యామత్రయము గడుపుదురు. మఱియొక పండుగనాఁడు దేవాలయముల లోపలను, వెలుపలను దీపారాధనలను జేయుచుందురు. మూఁడవ పండుగనాఁడు నవరాత్రోత్సవములు చేయఁబడును. ఆ దినములలో వీధులందు దూలములను బాతించి వాని కొనలకు నానా విధములకు వర్ణ వస్త్రములను, జరీ అంచు గుడ్డలను గటుచుందురు. అందొక్కొక్క భక్తిపరుని యా దూలము చివరనుంచి పలు విధములగు పండ్లతోఁ గొట్టుదురు.వారా పండ్ల దెబ్బల నోపికతో నోర్చు

కొని యుందురు. ఈ మూడు పండుగలేగాక మఱియొక పండుగ నా త్రిరాత్రముల యందు జరుపుచురు. ఆనాఁడు వసంతమను పేరఁ బసుపు నీళ్ళను రాజమార్గముగుండ నడచి వెళ్ళు వారిపైని జల్లుచుందురు. నగర ప్రజ లీయది చూచి కేరింతలు పెట్టి చప్పట్లు చరచుచుందురు. మఱియు నచ్చటి ప్రజలు తమ యిష్టము ననుసరించి యనేక భార్యలను పరిగ్రహించుటయుఁ గలదు. భర్త్రు మరణానంతర మా భార్యలంద ఱాతని శవముతోఁగూడ నగ్నిప్రవేశము జేయుచుండిరి. విజయనగర ప్రభువు హిందూ దేశము నందలి తక్కిన రాజేంద్రులకంటెను యత్యంత బలాఢ్యుడు. ఆ ప్రభువునకుఁ బండ్రెండువేలు భార్యలు గలరు. వీరిలో నాలుగు వేలు రాజెచటికిఁ బోయిన నచటికిఁ గాలినడక మీఁదఁ బోవుచుందురు. మఱి నాలుగువేలు స్త్రీలు సౌందర్య భూషితలై యశ్వరాజముల నధిరోహించి, రాజు వెన్నంటిఁ బోవుచుందురు. తక్కిన నాలుగువేల భార్య లాతడు మరణించిన పిమ్మట నాతని శవముతో గూడ సహగమనము చేయ నిశ్చయించుకొనిన వారైయుండిరి సంవత్సరములో నేదో యొక కాలమున దను యిలువేల్పుగా బూజించెడి విగ్రహమును రెండు రథములమధ్య నునిచికొని నగరవీథుల నూరేగించుట కలదు బాలిక లందమైన వస్త్రము లను ధరించి, దేవుని గూర్చి పాటలను బాడుచు యా రథముల ననుసరించు చుందురు. భక్త్యావేశ పరవశులై యనేకమంది ప్రజ లా రథచక్రముల క్రిందబడి మరణము నొందిన భగవంతుడు ముక్తిని బ్రసాదించు నను మూఢనమ్మకముతో నట్లుచేసి తమ ప్రాణము లర్పించుచుండిరి. మరికొందరు తమ గళమున నురివేసికొని, దాని కొసను రథమునకుగట్టి బాధనొందుచు బ్రాణములను విడుతురు. ఈ నగరము వజ్రములకు బ్రసిద్ధి గాంచినది" అని వ్రాసియున్నాడు.

పిమ్మట క్రీ॥ శ॥ 1443 ప్రాంతమున 'షాహరుఖ' యను పారసీక దేశపు చక్రవర్తి 'అబ్దుల్ రజాక్' అను నాతనిని విజయనగిరమునకు రాయబారిగ బంపెను. ఆతడు విజయనగరమునకేతెంచి, దానివైభవము నిట్లు వర్ణించి యున్నాడు:

"1443 సం॥ ఏప్రియల్ మాసాంతమున విజయనగరమును జేరితిమి మమ్ము గొని తెచ్చుటకు రాయలు తన పరివారము నెదురుగ బంపెను. నగరములోనికి దీసికొనిపోయి వసించుటకు మాకొక సుందర మందిర మిప్పించెను. రాయల రాజ్యము కృష్ణానది నుండి సింహళ ద్వీపము వరకు వ్యాపించి యుండెను. విజయనగరమున నడకొండవలె నుండు వేయి ఏనుఁగులు గలవు. పదునొకండు లక్షల వీరభటులుగలరు. దక్షిణ హిందూదేశమున యా కాలమున నంతటి బలాధికుడగు రాజేంద్రుడు మరియొక్కరుడు గానరాడు. అంతటి పార్థివముగల పట్టణ రాజము మరియొకటున్నట్లు మేము వినియు, జూచియు నుండలేదు.

విజయనరగరము సప్తప్రాకార పరివేష్టితము. అందు మొదటి దుర్గము కఱకు రాళ్ళతో నెలకొనియుండి. గుఱ్ఱములుగాని, భటులుగాని నడచుటకు వీలులేని యట్లు దుర్గమముగ నుండును. మొదటి దుర్గమునుండి మూడవ దుర్గము వరకుగల ప్రదేశమంతయు సాగుచేయు పొలములు, తోటలు మున్నగు వానితో నుండును. అచటనుండి యేడవ దుర్గము వరకుగల స్థలము జన సంఘములతోడను, రాజమందిరములు, గొల్వు కూటములు, సభా మంటపములు మొదలగు వానితోడను బొలుపారు చుండును.

అందలి వీధులు విశాలములై చక్కగా నుండును. గులాబి పూలన్ని బజారులలోను యమ్మబడుచున్నవి. ఆ నగరప్రజలు గులాబి పూవులను యాహారమునకంటె నావశ్యకములై విగ బావించు చుండిరి. ఆ నగరమందలి వర్తక శ్రేష్ఠులచే వజ్ర, వైఢూర్య, నీల, గోమేధిక, పుష్యరాగ, మరకత మాణిక్యాదులైన నవరత్న రాసులు విక్రయింప బడు చుండును. పూలబజారులలో పుష్పలావికలచే పరిమళ భరితములగు బహువిధ ప్రసూనములు విక్రయింప బడుచుండును. అట్టి వీధులగుండ నేనుగులు, పల్లకీలు, బండ్లు మొదలగున వెల్లప్పుడు వచ్చుచు బోవు చుండును. నునుపైన ఱాతికాల్వలో బజారుల ప్రక్కలగూడ బరిశుద్ధ జలము పట్టణమంతయు బ్రవహించు చుండును.

రాజసౌధ ద్వారమున నొక సభా మంటపముండును. అందు నిత్యము రాజకీయోద్యోగులు చుట్టు గొల్చుచుండ దండనాథుడు కొలువుండును. ఖడ్గపాణులైన రక్షకభటు లందు గాపుందురు. ఏదైనను విజ్ఞాపన మొనరింప దలచిన వా రచ్చటికి వచ్చి మనవి జేసికొందురు. దండనాథుడు వారి విన్నపముల విని, విమర్శించి తీర్పుజెప్పి పంపివేయును. అతని తీర్పున కింక బైతీరుపు లేదు. ఏనాటి కొల్వు కూటపు విషయము లానాడు దండనాథుడు (దివాను) సప్తద్వారములను దాటి యంతఃపురమును జొచ్చి, రేని కెరిగించుచుండును. అతడు రాజుకడ కేగునపుడు వేత్రధారులు బరాబరులు దెలుపుచుందురు. వంధి మాగధులు స్తోత్రపాఠములు చదువుచుందురు. బహువిధ మంగళ వాద్యములు వాయింపుచుందురు.

రాణ్మందిరమునకు వెనుక భాగమున దండనాథుని గృహము కలదు. ఆ మందిరము నానుకొని కొంచెము యెడమ పార్శ్వమున నాణెముల ముద్రించు 'టంకసాల' కలదు. దానికెదుట నగరపాలుని సౌధము గలదు. ఆతనికిక్రింద నగర పరిరక్షణకు బండ్రెండువేల భటులుండిరి. టంకశాలకు సమీపమున నిరువది గజముల వెడల్పును, రెండువందల గజముల పొడవునుగల యొకసుందరమైన వీధి కలదు. దాని కిరుపార్శ్వముల గళారాజితములైన శృంగారపు గట్టడములు గలవు. వాని గోడలపై సింహశార్దూలాది వన్యమృగముల చిత్రము లద్భుతముగ జిత్రింపబడి యున్నవి అచటికి సమీప్యమున వేశ్యవాటిక కలదు అందు నవయౌవన విలాసినులగు వెలయాండ్రు కలరు. సానులు మొదలు తుదకు వీధిలో వినోదకాలక్షేపము సలుపు దొమ్మరి పడుచులకు సైతము మిగుల విలువ గల రత్నాభరణములు గలవు. టంకసాల నానుకొనియే గజశాలగలదు. అందొక్క యేనుగున కొక్కొక్క కట్టడము కలదు. మదగజముల నంపు గొలుసులతో బంధితురు. ఆకరుల యాహార పానీయములందు దినదిన మత్యంత శ్రద్ధ కైకొనబడుచుండును.

ఒకనాడు నన్ను రాయ లాస్థానమున కాహ్వానించెను. నేను రాజసభ కేగితిని. మంత్రి దండనాథాది ప్రభుత్వోద్యోగులు తన్ను పరి

వేష్ఠించి యుండ రాజకుమారుడు [ప్రౌఢదేవరాయలు] సింహాసనాసీనుడై యుండెను. అతని కిరుపార్శ్వముల జనస్తోమము వృత్తాకారముగ నిలువబడి యుండెను. రాయలు పట్టు పీతాంబరమును ధరించియుండెను. పలుచనైనట్టియు. పొడవైనట్టియు దేహము గలిగి నలుపును దెలుపును గాక చామన ఛాయంబోలు రూపమును గలిగియుండెను. అతని చెక్కులు మెత్తనివై పలుచగ నుండెను. అతనికి గడ్డమున వెంట్రుకలు లేవు అతని చూపత్యంత మనోహరముగ నుండును. అతనికి ఏడునందల భార్యలును యుంపుడు కత్తెలును గలరని తెలియవచ్చినది. మహానవమి పండుగనాడు రాయలు [ప్రౌఢదేవరాయలు] తనకు సామంతులై కప్పములు గట్టుచున్న వారి నందఱను దన యాస్థానమునకు రప్పించి దర్బారు చేసెను. వారు మిక్కిలి రమణీయంబగు నంబారీలతో నలంకరింపబడిన యేనుగులను వేయింటిని దమతోడ దీసికొని వచ్చిరి.

ఆనాడు నగరమెల్ల సుందరముగ నలంకరింపబడి యుండెను. ఒక మైదానమున గొప్ప పందిళ్ళు వేయబడి యుండెను. అందొక పందిరి యందు రాజసింహాసన మమర్పబడి యుండెను. కొంతతడవు రాజందు గూర్చుచుండెను. అంతఃపురమునకును, పందిళ్ళకును మధ్య నాటగాండ్రును, గాయకులును, కథకులును యుండిరి. రాయల కెదుటనున్న తెర కావల మంజుల వస్త్రాలంకారులగు నటకులు నృత్యములు సలిపిరి. గారడివాండ్రు మిక్కిలి యానందము కలుగునట్లుగ నేనుగులచే నాటలాడించిరి, మూడు దినము లీ విధముగ నాటలతోను,బాటలతోను,వినోదములతోను గడపబడినవి. నాకు రాజ దర్శన మానాడైనది.

రాయల సింహాసనము మిక్కిలి వైశాల్యము గలిగి సువర్ణముతో జేయబడి యమూల్యములగు మణులచే దొదుగబడి యున్నది. సింహాసనము కెదుర జదరముగనున్న యొ మెత్త గలదు. దాని కొసలయందు మూడు వరుసల ముత్యములతో గట్టబడియుండెను.జేడా మూడు దినములా మెత్తపై గూరుచుండి యుండెను"

విదేశీయులచే నీ విధముగ వర్ణింపబడిన విజయనగరము పదు

నాలుగు, పదునైదు శతాబ్దులయందు మహోజ్జ్వల సామ్రాజ్యముగ వెలసి యుండెననుట కెట్టి సందియమును లేదు.

క్రీ॥ శ॥ 14—16 శతాబ్దుల యందాంధ్ర సామ్రాజ్య లక్ష్మికిఁ దావలమై యాంధ్ర భాషా యోషామణి యౌవన మందిన మందిరమై పరమతములకు ద్రాపై. యప్రతిమ వీరభటులకు జన్మభూమియై. యరి వీరులగు మహమ్మదీయులకు బ్రిక్కలో బల్లెమై. దిన దిన ప్రవర్ధమానయై. యైశ్వర్య శౌర్య విద్యాధన ప్రాభవములందు బ్రపంచమున సాటిలేని మేటి నగరమని పూర్వ పశ్చిమ ఖండ వాసులచే ననేక విధముల గీర్తింపబడి. శిల్పకళా నైపుణ్యమునకు విహార భూమియై శరణార్థులకు రక్షక స్థానమని వినుతికెక్కిన విజయనగర మిప్పుడు రూపరి. జనశూన్యమునైన యరణ్యమునై చూపఱకు భీతిని; మనస్సంతాపమును గలుగజేయుచు 'హంపీ వినాశ' మన ప్రసిద్ధిగాంచినది. హా ! హతవిధీ! ఆ కళామందిరమును నామమాత్రావశిష్టము గావించితివి. కాలపురుషా! నీ యాకలి కా మహా నగరమే దొరికినదా ? మీరందఱు గలసి యా పట్టణమును గ్రసించితిరిగాని దాని యమృత కళా ప్రశస్తి నేమి చేయగలరు? అక్షయమగు కీర్తి నార్జించుకొన్న దా పట్టణ రాజము !

ఓ మహా యాంధ్ర సామ్రాజ్యమా ! విజయనగర పట్టణ రాజమా ! సూర్య చంద్రు లున్నంతవరకు నీ నిర్మల యశస్సు భూలోకమున నివసించును. నీ పేరెంత వరకు నీ లోకమున బ్రజలుచ్చరించు చుందురో యంతదనుక నీ కీర్తి వ్యాపించి యుండును. సంస్కృతాంధ్ర కర్ణాట భాషామ తల్లుల కీ వొసంగిన యాశ్రయ మత్యంత ప్రశంసనీయమైనది. నీయండ నెందఱు సాహిత్య చక్రవర్తులు కవివరేణ్యులు తరింపలేదు? గీర్వాణాంధ్ర కర్ణాట భాషలలో వెలువడిన యనేక కావ్య కన్యకలకు నీవు మాతృ స్థానమగుట నాంధ్రుల భాగ్య విశేషము ! నీ యశోలక్ష్మికి నెల్లవేళలం దెల్లరును నీరాజన మియ్యగలరు. వర్తమాన భవిష్యత్తులలో భారత వర్షమున నీ యట్టి మహా సామ్రాజ్యము లేదు. పట్టణములకేమి? లెక్కకు మీరి పెక్కులున్నవి. నీ వలె లక్ష్మి సరస్వతుల కాశ్రయమిచ్చిన పత్తనమేది? రెండువందల యేబదేండ్లు మహా

వైభవమున వెగడితివే! ఆర్యాంధ్ర వాఙ్మయములు నిన్ను కలకాలము సన్నుతించుచుండ గలవు. ఓ విద్యానగర మహా సామ్రాజ్యమా! నిన్నెంతని కీర్తింప గలము? నీ వైభవమును కవికోకిలలై గానముచేసిన ఆనాటి విద్యా వాచస్పతులలో సహస్రాంశమేని పాండిత్యములేని మే మేమని వర్ణింపగలము? వర్ణింపలేము !!

మా పూర్వ గ్రంథముల వలెనే సదయ హృదయులగు పాఠక లోక మిద్దానిని సైతము సమాదరింతురని యాశించు చున్నారము. దీని తరువాతి కథా భాగమునకై 'రాజ్యక్రాంతి' యను గ్రంథమును జదువ గోరెదము.

శ్రీ విశ్వావసు
పౌష్య. రథసప్తమి
31-12-1965

ఇట్లు విన్నవించు,
విద్వజ్జన విధేయులు,
శ్రీనివాసపురం సోదరులు
"అనంత–సింహ"

గమనిక:– ఈ నవలయందలి 'భామినీ షట్పది' గీతికల యనువాదమును 'కవికిశోర' శ్రీశ్రీ నరసింహాచార్యులుగారు చేసిరి.

# 1

# ప్రకృతి శోభ

అది క్రీస్తుశకము వేయిన్నీ నాలుగువందలా యిరువదియేడవ సంవత్సరమందలి ఒకదినము—

ఆనాడొక రాజపుత్రుడు అశ్వారూఢుడై సహ్యాద్రి నిర్జనారణ్య ప్రదేశములో పయనించుచున్నాడు. ఆకాశమంటుచూ ధీరముగా నిలబడిన వృక్షములు జూడ ముచ్చట గొలుపుచున్నవి. సుదూరములో మౌనముద్రదాల్చి, గంభీరముగా తపస్సుకు కూర్చొనిన జడధారులవలె, నిశ్చలముగా నిలబడిన పర్వతోత్తుంగ శిఖరములు దృగ్గోచరము లగుచున్నవి. ఫలపుష్పభరితయగు వనదేవత ప్రఫుల్లవదనయైన సుందరివలె చిత్తాకర్షకముగా నున్నది. ఆమె సంతోషసాగరమందలి తరంగము లనునట్లు-గలగలమని ప్రవహించుచున్న నిర్ఝరణులూ, వన్యమృగములూ అప్పుడప్పుడూ ఆ యరణ్యమందలి నిశ్శబ్దతను భేదించుచున్నవి.

ఆ రాజపుత్రుడు యివేమియునూ గమనించక, అశ్వారూఢుడై వెళ్ళుచునేయున్నాడు. అయిననూ దూరపు దిగంతములవరకూ వ్యాపించియున్న ఆ నిసర్గరామణీయకతను చూచినప్పుడును, గిరికందరములనుండి ప్రవహించుచున్న సెలయేళ్ళ చప్పుడు వినినప్పుడును, ఒక్కొక్కసారి అతని హృదయము సహజముగా సంతసించెడిది. మనస్సు ఆ ప్రకృతి సౌందర్యమునకు వశమైనప్పు డతడొక క్షణకాలమాగి చూచుచూ మరల ముందుకు పోవుచున్నాడు.

కాని, నీడవలె అతనిని వెన్నంటి వచ్చుచున్న వృద్ధ రాజకర్మ చారికి మాత్రము యీ సుందర ప్రకృతిదృశ్యము లేశ‌యునూ పరిణామ మును కలిగించినట్టు కనబడలేదు. అతని వదనము ఉద్విగ్నముగానున్నది. మనస్సు ఆందోళనముతో కూడియున్నది. అతడొకసారి తాము ప్రయా ణించి వచ్చిన దూరమును, మరొకపర్యాయము తాము చేరవలసిన గమ్య మును చూచి నిట్టూర్పు విడచినాడు. ఎచ్చటయునూ నిలువక వచ్చు చున్ననూ, తమ ప్రయాణము ఆలస్యమైనదనియే అతని భావన. ఒక సారి నెత్తిపై కెక్కిన సూర్యునిజూచి వేళను గుర్తించ ప్రయత్నించుచూ, వేరొకసారి తమను వెన్నంటి వచ్చుచున్న అశ్వారోహకుల నాయకుని బిల్చి, యింకనూ ఎంతదూరము ప్రయాణించవలయునని సంజ్ఞచేసి అడుగుచూ, అతనినుండి సమాధానము వచ్చిన తరువాత మరల మార్గాను సారి యగుచున్నాడు.

ఈ విధముగా వారి ప్రయాణము సాగుచుండగా, రాజపుత్రు డొకసారి దృగ్గోచరమైన సెలయేటి సొబగునకు మూర్ఛపోయి క్షణ కాలము నిలువబడినాడు.

ఇదిచూచి ఆ వృద్ధామాత్యునకు దిగులు కలిగినది. "ప్రభూ! మనము చేరవలసిన శిబిరమింకనూ ఆమడ దూరమున్నది. ఇంతవరకే మనమాలస్యము చేసితిమి. ప్రకృతి సౌందర్యమును తిలకించుచూ నిల బడిన, శిబిరమును చేరుటకు సాయంకాలము కాగలదు" అని ఉస్సు రనుచూ నిట్టూర్చినాడు.

అమాత్యుల మాటల కా ప్రభువు నవ్వినాడు.

అతడే సామ్రాట్ ప్రౌఢదేవరాయలు!

"ఏమి ప్రభూ! నా పలుకులు మీకు హాస్యాస్పదములుగా నున్నవా?" అని విహ్వలుడై ఆ వృద్ధమంత్రి ప్రశ్నించినాడు.

"లేదు; అమాత్యా! మీ పలుకులకు నేను నవ్వలేదు. మీ మాటల సరణిని జూచి నాకు నవ్వు కలిగినది. నా భోజనపానాదుల విషయమును మనస్సున నిడుకొని మీరు వ్యథజెందుచున్నారని దోచుచున్నది. నాకిచ్చట వనసంపదను చూచిన తరువాత ఆకలి బాధయే కలుగలేదు"

"తమరు రసికులేగాక-కవియనికూడ నాకు తెలియును ప్రభూ! కాని, మలెరాజ్యపు (మలెనాడు) ప్రకృతి సౌందర్యమునకు పరవశులై, మనమిచ్చట నిలచిన శిబిరములో మనరాకకొరకై నిరీక్షించెడి మండలేశ్వరుడు వీరన్నయునూ, మన బుక్కరాయ (బుక్కన్న)లునూ, యిచ్చట మన కేప్రాణగండము సంభవించినదోనని, అన్నపానీయములను వదలి దిగులందగలరు. అడవిపంది వేటకై నిలచి మనమిదివరకే చాల పొద్దుపుచ్చినాము. ఇక ఆలస్యమొనరింపక త్వరితముగా శిబిరమును చేరుకొననలయును. అట్లుకానిచో, కొందఱు ప్రభుభక్తి పరాయణులను వృథగా యిడుమల గుడిపించినట్లు కాగలదు"

ఈ మాటలువిని ప్రౌఢదేవరాయ లేమియునూ జవాబుచెప్పక, అశ్వమును ముందుకు పోనిచ్చినాడు. లక్కనామాత్యుల మాటలవలన సంతోషము కలుగలేదనుట కాతని ముఖమేసాక్షి - అది గంభీరముగానున్నది. ఆ వదనమును చూచి, ప్రభువులకు తన మాటలవలన నేమైననూ బాధకలిగినదేమోయని భావించిన అమాత్యుడు అతనివద్దకు తన గుఱ్ఱమును నడిపించుకొని వెళ్ళి, క్షమాపణ నర్థించుచున్నవానివలె :

"ప్రభూ! నా మాటలు మీ సునిశిత హృదయమునకు బాధను కలిగించి యుండినచో క్షమించ ప్రార్థితుడను. మిమ్ములను బాధించవలయునని నేనా విధముగా ననలేదు. తమరు కవి హృదయముగల రాజకుమారులని నే నెఱుగుదును-రసికులనియూ తెలియును. భావుకులైన తమకీ సుందరప్రకృతి దృశ్యములు తృషను గలిగించుటకు సమర్థనీయములుగా నున్నవనికూడా గ్రహించినాను. తమ హృదయము శ్రుతిచేసిన వీణ. దానిలోనుండి మధురనాదము వెలువడుటకు ఎక్కువ శ్రమ యక్కరలేదు. తమనీ ప్రకృతిలోని ఒక్కొక్క దృశ్యమూ మైమరపింపగలదు. సౌందర్యానుభూతిలో ఆత్మరతిని పొందగలరు. కాని, మేము సామాన్య మానవులము. ఇంకనూ చెప్పవలయునన్నచో నేనొక మట్టిపాత్రను. దానినుండి వెలువడునది కటుధ్వనియేగాని, యింపైన వీణాగానముకాదు. తమ సౌందర్యమును గ్రహించునట్టియూ, చూచునట్టియూ చక్షువులు నాకులేవు. మీ యంతటి భావనాహృదయము గలిగినవాడను కాను, నేనొక హృదయశూన్యుడను-విరాగిని" అని చెప్పి నవ్వినాడు.

అమాత్యుల పలుకులు ప్రౌఢదేవరాయలకు బాధను కలిగించినవి.

"అమాత్యశేఖరా! మిమ్ములను హృదయశూన్యులగు విరాగులని యనినవారు పెద్ద తప్పుచేసిన వారగుదురు. మీరు శుష్క-వేదాంతులు కారు—రాజకీయమంతటి నీరసవృత్తిలో నుండియునూ భక్తిరసపానము జేసిన శివయోగులు. శ్రీ బసవేశ్వరులవలెనే భక్తులు-ప్రభుత్వోద్యోగులు! వారివలెనే పదవిలో యుంటూ, అధ్యాత్మ జీవనమును గడుపుచున్న విరక్తులు-వీతరాగులు! మిమ్ములను మీరే 'మట్టిపాత్ర' యని ఎందులకు న్యూనత పరచుకొనెదరు?"

ప్రభువు మాటలలో అమాత్యునిపట్ల తనకుగల ప్రీత్యాదరముల వలెనే, అభిమానముకూడా నిండియున్నది. అతడు స్నేహాంతఃకరణల నిర్మలదృష్టితో లక్కనామాత్యులను జూచి, అర్థగర్భితముగా నవ్వినాడు.

లక్కనామాత్య లందుకు బ్రత్యుత్తరము జెప్పక వారువమును తన 'రికాబు'తో గొట్టి, దానిని వేగముగా బరువెత్తించినాడు.

తక్కిన ఆశ్వికులు మౌనముగా వారి ననుసరించినారు.

# 2

# గహన గమనము

సామ్రాట్ ప్రౌఢదేవరాయలు మలెరాజ్యమునకు నేత్రప్రాయమైన అరగసీమయందు దండు విడిసియున్నారు. తన సామంతరాజగు అరగరాజ్య పీఠనప్రభువు చిరకాలముగా నిచ్చుచుండిన ఆమంత్రణమును స్వీకరించి, అవకాశమేర్పరచుకొని అతడచ్చటికి వచ్చియున్నాడు.

అచ్చటికి వచ్చుటలో సామ్రాట్టులకొక స్వార్థముకూడానున్నది. 'ప్రౌఢప్రతాపి' యని బిరుదుగాంచిన ప్రౌఢదేవరాయలకు వేటయనిన

మక్కువ ఎక్కువ. అందుననూ 'గజవేట' యనిన పంచప్రాణములు. అతడు తనకుగల బిరుదులన్నింటిలో 'గజవేటకాడు' అను బిరుదును గర్వముతో చెప్పుకొనువాడు.

పేరుకుతగినట్టు ప్రౌఢదేవరాయలు గజవేటలో ప్రౌఢప్రతాపియే! అతనికి అరణ్యమునందలి దుష్టమృగములను సంహరించుటొక క్రీడా వినోదమైననూ, మదించిన ఏనుగులను బట్టి, వాటికి శిక్షణనిచ్చి, అడవి ఏనుగులను పెంపుడు గజరాజములనుగా చేయుటనిన చాల ప్రియకరమైన వినోదము. మిక్కిలి శ్రమకునూ, అపాయమునకునూ మూలస్థానమైన యీ గజవేటా వినోదము, అనేక పర్యాయములు ప్రభువులకు ప్రాణగండమునుకూడా తెచ్చినది. అయినను దీనిని మాత్రమతడు విడువలేదు. ఇది తనవంటి పురుషసింహాని కొప్పునట్టి ఏకైక క్రీడయని దలచువాడు. కనుకనే అతడు పలువారులు అపాయకారకమైన యీ యడవి ఏనుగుల వేటకు వెళ్ళెడివాడు.

ఈ పర్యాయ మతడు వీరన ప్రభువుయొక్క ఆమంత్రణమును స్వీకరించి అరగసీమకు వచ్చినది కూడా, అతని మలెరాజ్యములో నసంఖ్యాకములుగా నున్నవని చెప్పబడుచున్న అడవి యేనుగులను బట్టి, తన రాజధానియగు విజయనగరమునకు తీసుకొని పోవలయునను నుద్దేశముతోడనే!

పూర్వమునుండియు పశ్చిమ ఘట్టములలో ఏనుగు లెక్కువగా నివసించు చుండెడివి. సామ్రాజ్యమునకు కావలసిన గజముల నచ్చటి కాననములనుండి బట్టితెచ్చి, శిక్షణనిచ్చి వశపరచు కొనెడివారు. వీటికి తోడుగా గజసైన్యమున కావశ్యకమైన ఎక్కువ ఏనుగులను సింహళము, బర్మా, పెగూ ప్రాంతములనుండి అధిక ధనవ్యయముచేసి తెప్పించుకొనువారు. అదేవిధంగా అరబ్బీ వర్తకులచే ఓర్మెజ్, శిరాజ్ ప్రాంతములనుండి అశ్వములను తెప్పించుకొనువారు.

బహమనీ సుల్తానులు అశ్వపతులుగనూ, ఉత్కళ రాజులు గజపతులుగనూ, విజయనగర సామ్రాట్లు నరపతులుగానూ బిరుదులను

దాల్చినవారు. కాని, మొదటినుండియునూ ప్రౌఢదేవరాయలకు గజ సైన్యముపట్ల, విచిత్రమైన వ్యామోహము గలదు. అందుచే అతడు బాల్యమందే—యువరాజుగా నున్నప్పుడే—వేట నెపముతో వెళ్ళి, ఎన్నియో నేనుగులను బట్టి సైన్యములో జేర్చినాడు. ఇప్పుడు సామ్రాట్టైన పిమ్మట అతని యీ వ్యామోహము గజవేటకాడను బిరుదును ధరింపజేసినది. ఈ బిరుదును సార్థకపరచుకొనవలయు ననునదియే యాతని ఉత్కటాకాంక్ష !

అనాదిగా మలెరాజ్యమందలి కుగ్రామ వాసులగు మావటివాండ్రకు ఏనుగులను బట్టి, స్వాధీనపరచుకొని - వాటిని విక్రయించు టొకవృత్తి. కాలక్రమమున నీ వృత్తికి అందరునూ పూనుకొని, కంటి కగపడిన ఏనుగును పట్టుకొనుచూ వచ్చినారు. చివరకు ఏనుగుల గుంపులు నిర్జనారణ్యములకు వెళ్ళి నివసించ సాగినవి.

పురాతన కాలమునుండియూ ఏనుగు భారతీయులకు పవిత్రమైన వస్తువులలో నొకటి. మంగళకర ప్రాణులని పరిగణించ బడిన గోవు, అశ్వములవలెనే ఏనుగుకూడా ఒకటి—ఇంద్రుని ఐరావతము వైభవమునకు సంకేతమైనచో, గజేంద్ర మోక్షపు కథ శ్రీ మహావిష్ణువు భక్త వాత్సల్యముయొక్క ఉజ్జ్వల చారిత్ర్యము. ఏనుగు దేహశక్తికినీ, దీర్ఘాయుస్సునకునూ, బుద్ధిబలమునకునూ పేరుగాంచినట్టి. అన్నివిధములైన మంగళకార్యములలోనూ, సమారంభములలోనూ విశేషమైన గౌరవమును పూజలను అందుకొను ప్రాణి. హిందువుల వలెనే జైన-బౌద్ధులుకూడా తమ తమ ధర్మములలో గజమునకు విశిష్ట స్థానమునిచ్చి గౌరవించినారు.

జిన శిశువుకు చేయునట్టి పంచకళ్యాణములలో నొకటి యగు జన్మాభిషేక కళ్యాణమునకు అమరేంద్రుని గజ సందోహ మత్యావశ్యకము. దేవాంగన నృత్యము ఐరావతముయొక్క కోర దంతమునందు వికసించిన పద్మదళముమీద జరుగుచున్నది. బౌద్ధ ధర్మమునందు సిద్ధార్థుని యవతారమును సూచించునది కూడా గజమే ! దివ్యమైన తెల్ల ఏనుగ నొకదానిని మాయాదేవి స్వప్నములో జూచినది. బుద్ధుని జంపు

టకు భగదత్తుడు బంపిన క్రూరమైన గజము నతడెట్లు వశపరచుకొనినా డనునది సర్వులకూ దెలిసిన విషయమే। దిక్కులను మోసుకొని యున్న దిగ్గజములు హిందూ పురాణ - కావ్యములలో నొక యద్భుత కల్పన.

ఈ విధముగా పురాణేతి హాసములలో సుప్రసిద్ధమైన గజ రాజము ప్రజల లౌకిక జీవనములోకూడా మహత్తరమైన పాత్రవహించి నది. ఏనుగులను పట్టి, వశపరచుకొని, యోగ్యమగు శిక్షణనిచ్చి శాంతి మరియును యుద్ధకాలములయందు వాటి నుపయోగించు కొనువారు.

విజయనగర సామ్రాట్లు పూర్వమునుండియును తమ చతు రంగ బలములతో గజసైన్యములకు ప్రముఖ స్థానమిచ్చి గౌరవించెడు వారు. గజసైన్యము లెక్కువ సంఖ్యలో నున్నవానికే విజయవధువు మాలవేసెడిది. యుద్ధములో ఏనుగులకు మద్యమును త్రాగించి, వాటి కోరదంతములకు కత్తులను గట్టి శత్రువులమీద పడజేయుటయూ, వాటి మూపుపై నిరుపైపులను నిర్మించిన అంబారీలలో నిలబడి యుద్ధమొన రించుటయూ, ప్రాచీన యుద్ధవిద్యలలో నొకటిగా నుండెడిది. ఈ శత్రు మర్దన కార్యమున కనియే రాజులు ఏనుగులను సాకెడివారు.

సామ్రాట్ ప్రౌఢదేవరాయల కిటువంటి దుర్భేద్యమూ—నజే యమూనైన యొక గజసైన్య మేర్పరచుకొని, చీటికిని - మాటికిని తమ కుపద్రవముల నిచ్చుచున్న బహమనీ సుల్తానుల గర్వమణచ వలయు నని నాతని యాశయము। ముద్గల్లు నివాసియగు శిల్పి తిమ్మోజీ కుమార్తె పార్వతి మూలముగా మొదటిదేవరాయలకు జరిగిన పరాభవము— రాయపరాభవము —ను అతడు మరువలేదు. ఆ పగకు ప్రతీకారమును దీర్చుకొనుటకు ప్రౌఢదేవరాయలకు గజసైన్య మత్యంతావశ్యకముగా నున్నది.

ఏనుగులను పట్టుకొనుటయూ, వశపరచుకొనుటయూ వాటి చరిత్రవలెనే విస్మయకరమైన సాహసకార్యము.

ఏనుగు వేడిమిని భరించలేని ప్రాణి. భారతదేశము, ఆఫ్రికా దేశములే వాటి నివాసస్థలములు. భారతదేశములో నైతమవి యన్ని

ప్రదేశములలోనూ నివసించుటలేదు. అస్సాము మరియూ సహ్యాద్రి నిర్జనారణ్యములలో మాత్రమే నివసించెడివి.

ఏనుగులు సామ్యాన్యముగా ఒంటరిగా తిరుగవు. అవి ఎల్లప్పుడును గుంపులు కట్టుకొనియే సంచరించెడివి. బలాఢ్యుడైన గజరాజీ యూథమునకు నాయకుడు—మార్గదర్శి. ఐకమత్యములో నున్న బలము నవి గ్రహించినట్టు మరి ఏ యితర ప్రాణులునూ గ్రహించి యుండవు.

అవి గుంపుసు విడచి ఒంటరిగా తిరుగుచున్నప్పుడు వాటిని వెన్నంటి తరుముట చాల అపాయకరము. తమ ఏకాంత జీవనమునకూ, స్వాతంత్ర్యమునకూ, స్వాభిమానమునకూ అడ్డుతగులు వారి నెవరినీ యవి లక్ష్యపెట్టవు. కోపించిన ఏనుగునూ, మదించిన గజమునూస్వాధీన పరచుకొనుటకు అంకుశముండవలయును. వాటి గ్రహణశక్తి, జ్ఞాపక శక్తి చాల పదునైనది గనుక యవి అపాయమని తోచినచోట క్షణ కాలము నిలువవు. గుంపునుండి వేరుపరచి వాటిని వెన్నంటి పట్టుకొనుట చాల సాహసముతో గూడినపని. ఈ కార్యమునందు యశస్సుకంటెనూ అపయశస్సే హెచ్చు !

ఏనుగులను పట్టుకొనుటకు మావటివాండ్రు అనేక పద్ధతు లనుసరించెడివారు. మొదట వాని నివాసస్థానమును కనుగొని, అవి సంచరించెడి మార్గములలో పురుషప్రమాణమున కంటెనూ కొంత ఎక్కువ లోతుగల గుంట ద్రవ్వి, దానిని తడికెలతో మూసి, దానిపై మట్టివేసి తెలియకుండునట్టుగా జేసి, అవి యా గోతిలో పడినప్పుడు గోతిలో పడిన ఏనుగును క్రమముగా వశపరచుకొను టొక పద్ధతి.

గజయూథమును చెల్లాచెదరు చేయుటకు, కర్కశ వాద్యముల తోడను, అగ్ని మొదలగు భయంకర వస్తువులతోడనూ వాటికి దిగ్భ్రమను గలిగించి, ఇరుకు దారులలో నడిపించుకొని వెళ్ళి, వాటిని పట్టుకొనుట కొరకే నిర్మించిన కొయ్యల కోటలోనికి తోలి పట్టుకొనుట వేరొక పద్ధతి. ఈ పద్దతిని 'ఖెడ్డ' మని యందురు.

ఇటువంటి ప్రయత్నములలో కొన్ని పర్యాయములు కోపించిన

ఏనుగుల వలన 'నరమేధ' జరుగుటయునూ గలదు. తమను ముందుకు నడిపించుకొనివచ్చి, పట్టుబడుటకు కారణభూతమైన గజరాజము నపి క్రూరముగా త్రొక్కి చంపుటయునూ గలదు. తమను వశపరుచుకొనుటకై వచ్చిన పెంపుడు గజముల వంచనకు లోనై, స్వాతంత్ర్యమునకై కృంగి, ఆ చింతతో నిద్రాహారములను మాని, ప్రాయోప వేశముచేసి, ప్రాణములను త్యజించెడి క్రందములు కూడా గలవు.

వనగజము తన వస్తుస్థితి నర్థముచేసుకొని పెంపుడుకరిగా మారుటకు చాల దినములు కావలసివుండును. దీనికి గజశిక్షణలో నేర్పుగలిగిన మావటీండ్లెంత యవసరమో, శిక్షణబొందిన ఏనుగులుకూడా నంతియే ముఖ్యము. తన స్వాతంత్ర్యమును బలిగావించి, నాగరిక జీవితమునకొకసారి యలవాటుపడినచో దానివలన ప్రభువుల కధికలాభ మేర్పడ గలదు.

కాని, మావటివాండ్రి కార్యమునకు ప్రాణముః మీది యాశ వదలుకొని పూనుకొనవలసి వుండును. వశమగుట కిచ్ఛగించని గజ రాజములవలన కలుగు అనాహూత మింతింతనరానిది. ఈ అపాయముల కన్నింటికినీ వారు సంసిద్ధులై పుండవలయును.

పట్టుబడిన ఏనుగులను వశపరచుకొనుటకు మావటివాండ్రు అనేక తంత్రములను పన్నెడివారు.

ఉపవాసము, అగ్నిభీతి. కృశింపజేయుట మొదలగు సాధనములతో వాటిని క్రమక్రమముగా వశపరచుకొనెదరు. గజమును వశపరచుకొనుటకు మావటివారొక గజభాష నేర్పరచుకొన్నారు. వారిచ్చు సంజ్ఞలను గ్రహించి, ఏనుగులు దాని కనుగుణముగా ప్రవర్తించెడివి.

'వహివహి' యనిన ఏనుగు నడచును. 'హేట్ హెడ్' యనిన నిలుచును. 'చించి' యనిన కూర్చొనును. 'గుగ్గులు' యనిన స్థిరముగా నిలువబడును. 'భరిభరిహి' యనిన తొండమెత్తి నమస్కరించును. ఈ విధముగా గజభాషలో భజిభజి, యేయే, దేదేహి, దేదీ, బుధబుధ, లోచ్‌లోచ్, ఘేఘే శబ్దములకు విశేషార్థములున్నవని యందురు.

ఈ గజభాషలోనూ, గజవిద్యయందునూ ప్రౌఢదేవరాయలు నిజముగా ప్రౌఢుడే। చూపుమాత్రముననే యతడు గజ హృదయమును తెలుసుకొను శక్తి గలిగివుండెను. గంగ సామ్రాట్ సైగొట్టు శివమారుని వలె నతడునూ గజవిద్య-హృదయము క్షుణ్ణముగా నెరింగినవాడు. అతడు ధరించిన 'గజవేటకాడ'ను బిరుదు అంకితనామముగాక నన్వర్థనామమే యైనది.

# 3
# అర్తారావము

అరగసీమను వదలి ప్రౌఢదేవరాయలు లక్కనామాత్యులతో అశ్వికదళము వెంటరా తన గజవేట శిబిరమునకు ప్రయాణించుచుండగా, మార్గమున కడ్డుపడి ఒక యడవి వరాహము పరుగిడుటను చూచినాడు. అది కనబడుటతోడనే వీరుడైన యా ప్రభువునకు దానిని వేటాడ వలయునని మనసు కలిగినది. వేటకది తగిన సమయముకాదని లక్కనామాత్యులు చెప్పుచున్ననూ వినక ప్రౌఢదేవరాయలు వేట కుద్యుక్తుడైనాడు.

ఆ వరాహము బాగుగాతిని బలిసివున్నది. దానినికొట్టి చంపుటనిన సులభమైన పనిగాదు. కాని, ప్రౌఢదేవరాయలు వెనుకాడలేదు. అతడు చేత బల్లెమును పట్టుకొని, కాలునివలె వరాహముమీదికి లంఘించినాడు. దీర్ఘకాల పోరాటానంతరము దానిని చంపి. యమసదనమునకు బంపినాడు. ఈ పోరాటమువలన అతని కాయాసము గలిగిననూ, లభించిన విజయముతో మానసమానంద తరంగితమైనది. వేటయందు తనకు విజయము లభించినందు కాతడు సంతసముచే మెల్లగా మార్గము ననుక్రమించినాడు.

వారీ విధముగా సాగివచ్చుచుండగా దారిలో నొక అనూహ్యమూ, ఆకస్మికమూనగు సంఘటన జరిగినది. వారు తమ శిబిరమునకు రెండు, మూడు క్రోసుల దూరములోనుండగా నెవరో స్త్రీ రోదించుచూ వున్నట్టు వినబడినది. అప్పటికి వారు చంద్రగుత్తి పరిసరములలోనికి వచ్చినారు.

ఈ నిర్జనారణ్యములలో రోదించుచున్న వారెవరని ప్రౌఢదేవ రాయల కాశ్చర్యమైనది. ఎవరో దుఃఖార్తులై వుండవచ్చునని భావించి, వారిని సమాధాన పరచవలెనని ననుకొన్నాడు. ఆ భావము కలిగినతోడనే లక్కనామాత్యులవైపు తిరిగి: "అమాత్యా! సమీపము నందిచ్చట ఎవరో రోదించుచున్నట్టు వినబడుచున్నది. పాపం! ఎవరో? ఏమి కారణమో? ఏ విపత్తులో చిక్కుకొనివున్నారో తెలియదు. రండు, వెళ్ళి పరికించుదము" అని అన్నాడు.

సామ్రాట్టుల మాటలాలించి లక్కనామాత్యుడు క్షణకాలము సబుద్ధెనించి చెవియొగ్గి వినినాడు. అతని కే యార్తనాదమునూ వినబడ లేదు. వృక్షముల 'మర్మర' శబ్దముతప్ప మరేధ్వనియునూ శ్రవణపుట మున బడలేదు.

"ప్రభూ! గాలిసవ్వడి తమకు దుఃఖార్తుల రోధనధ్వనివలె విన బడివుండును. ఈ నిర్జనారణ్యములో దుఃఖార్తు లెక్కడివారు?" అని సమాధానపరచినాడు.

"లేదు, అమాత్యా! నా చెవులారా విన్నాను. అది వృక్షముల 'మర్మర' శబ్దముగాదు. ఎవరో స్త్రీ రోదించుచూ నుండవలయును. ఇప్పుడుతన రోదనమును నిలిపివున్నది" అని తన మాటలనే సమర్థించు కొన్నాడు. ఇదివిని లక్కనామాత్యులు నవ్వుచూ—

"ప్రభూ! తమ సునిశిత హృదయమున కీ నిర్జనారణ్యమున నైతమెవరో దుఃఖించుచున్నట్టు దోచిన అందుల కాశ్చర్యపడవలసిన బనిలేదు. గాలిసవ్వడిలోకూడా తమకు దీనుల యార్తనాదమే వినబడు చున్నది" అనినాడు.

"లేదు అమాత్యా! ఎవరో అనాథ స్త్రీ యార్తనాదమును చెవు

లార విన్నాను. ఆ యాక్రందనము చాల సమీపమునుండియే వినవచ్చినది. ఆమె యిచ్చటనే ఎచ్చటనో దుఃఖిస్తూ కూర్చొని వుండవచ్చును-రండు వెదకుదము"

"ప్రభూ ! తమరు వినిన రోదనము స్త్రీ రోదనముగాక, నేదియో అడవి జంతువుయొక్క ప్రసవవేదనయై వుండవచ్చును. తమరీ యల్ప విషయమునకై ప్రయాణము నాపుటయా ?" యని అతడు కొంత విసుగుగా అనినాడు.

ప్రౌఢదేవరాయ లీ మాటకు జవాబిచ్చునంతలో సమీపమందలి పొదరింటినుండి ఎవరో దుఃఖించుచుండుట వినబడినది.

"హా ! దైవమా ! మే మొనరించిన ఏ యపరాధమున కీ శిక్షను విధించినావు ? మమ్మీ దుర్మార్గుల చేతినుండి కాపాడగల ధర్మాత్ములు-వీరపురుషులు ఈ జగత్తులో జన్మించలేదా ? అయ్యో నన్నీ దుష్టుల బారి నుండి రక్షించువారెవరునూ లేరా ? 'ప్రౌఢప్రతాపి'యని బిరుదుగాంచిన ప్రౌఢదేవరాయల రాజ్యములో నిరపరాధులగు మా కీ యన్యాయము జరుగవచ్చునా ? మాకీ దుస్థితి సంభవించవచ్చునా, అయ్యో, హతవిధీ ! నన్ను నా పతికి-పుత్రికకు దూరముచేసి, యింకనూ యెందులకు బ్రతికించి వున్నావు ? మరల నీ దుష్టులవలన నే పరాభవ మనుభవించ వలయునని నన్ను జీవములతో నుంచినావు ? నావంటి నిర్భాగ్యురాలు బ్రతికి వుండరాదు. కాని మరణించుటకు సైతము నాకు స్వాతంత్ర్యము లేకపోయినది గదా !"

ఈ ప్రలాపము ప్రౌఢదేవరాయలకూ, లక్కనామాత్యులకూ స్పష్టముగా వినబడినది.

ప్రౌఢదేవరాయలా ధ్వని వినవచ్చిన వైపునకు బయవెత్తినాడు. దుఃఖార్తురాలైన స్త్రీ నోటిద్వారా తన పేరుచ్చరింపబడుటను విని అతని కాశ్చర్యమైనది. ఆ యార్తురాలెవరో తన రాజ్యమునకు సంబంధించినదై వుండవచ్చునని యామెను రక్షించుటకై వెనుకముందు చూడక లంఘించి నాడు.

లక్కనామాత్యుడుకూడా తన ప్రభువు ననుసరించి ఆ పొదరింటి వద్దకు వచ్చి నిలచినాడు. అమాత్యుల యాజ్ఞమేర కాతని యనుచరులు పొదలో నణచిపెట్టిన ఒక పల్లకీని వెలుపలికి తీసినారు. అందులో సుమారు నలుబదేండ్ల ప్రౌఢయగు నొక స్త్రీ తలవెండ్రుకలు చెదరి, గాయపడి, బంధితురాలై అస్తవ్యస్తముగా పడియుండుట గోచరించినది.

ఆమె కాలుచేతుల నెవరో పిచులు బంధించి, యామెను మేనాలో పరుండజేసినారు. ఆకుష్టులామె నెచ్చటికో సాగించుచుండగా ప్రౌఢ దేవరాయల పరివారముయొక్క ఖురపుటధ్వని విని, పల్లకీని పొదలో అణచిపెట్టి, తాము కొంతదూరము వెళ్ళి దాగియుండినారు. ప్రౌఢ దేవ రాయల పరివారము దాటివెళ్ళిన తరువాత నామెను తమ గమ్యస్థానము నకు తీసుకొని పోవలయునను నిచ్ఛ వారికున్నట్టు తోచుచున్నది. కాని, ఆమె యదృష్టము బాగుండుటచే నావిపత్సమయములో ప్రౌఢ దేవరాయలే యచ్చటికి వచ్చినాడు. భగవంతుడామె మొరవినెనేమో ?

లక్కనామాత్యు లామెను పల్లకీనుండి క్రిందికి దింపి, ఆమె కాలుచేతులకుగల బంధనముల నూడదీసి, శైత్యోపచారములు జేసినాడు. తరువాత కొంతసేపటి కామెకు ప్రజ్ఞ గలిగినది. ఉన్మాదము కొంతతగ్గి, తన ప్రస్తుతస్థితిని గ్రహింపగలిగినది. తన నా దుష్టుల బారినుండి రక్షించిన లక్కనామాత్యుల — ప్రౌఢదేవరాయల ముఖములను ఒక్క క్షణ కాల మవలోకించినది. ఆమెకేమని తోచినదో వడుగున వచ్చి ప్రౌఢ దేవ రాయల పాదములపై బడినది.

"తండ్రీ ! ఈ హంతకుల చేతినుండి నన్ను తప్పించినారు. అట్లే నా సర్వస్వమైన పొన్నలనుకూడా అనీచుల బారినుండి రక్షింపుడు !" అని యేడ్చినది.

"తల్లీ ! నీ వీ విషయమై చింతించకుము - సమాధానపడుము. నీకెవరివలననూ కీడు సంభవింపనేరదు - నిశ్చింతగా నుండుము" అని సామ్రాట్ ప్రౌఢదేవరాయ లామెను సమాధాన పరచినాడు.

"తండ్రీ ! తమను జూచిన నాపాలిటి భాగ్యదేవతలవలె కనబడు చున్నారు. నిర్భాగ్యురాలనైన నన్ను కాపాడిన తమరెవరు ? నన్ను

రక్షించినట్టే నా ముద్దుల తనయను—పొన్నలను మీరు రక్షించలేరా ? ఆమెను మీరా హంతకుల చేతినుండి ఎట్లయిననూ తప్పించియే తీరవల యును. ఆమె బ్రతుకనిచో, నేను బ్రతికియూ మరణించినట్టే. నా జీవితము వ్యర్థము ! తండ్రీ. తమరు నన్ను రక్షించినట్టే నా కుమార్తెను రక్షించలేరా ?" అని దైన్యముగా ప్రార్థించినది.

తల్లీ ! ముందు నీవు కొంత సమాధానముజెంది, అటుపిమ్మట నీవెవరు ? నీకీ విపత్తు ఎట్లు సంభవించినది ? అను విషయములను దెలుపుము. నీవు కులీనుల యింటబుట్టిన స్త్రీవలె కనబడుచున్నావు. నిన్నీ స్థితికి తెచ్చిన నీచులెవరు ? నీకుమార్తె ఎచ్చటికి వెళ్ళినది ? ఆమెనెవ రపహరించుకొని వెళ్ళినారు ? అన్నియునూ వివరముగా దెలుపుము. పంపాపతిసాక్షిగా మేము నీకుమార్తెను కాపాడుటకు మా వలన సాధ్య మగునంతవరకునూ బ్రయత్నించెదము" అని ప్రౌఢదేవరాయ లాసక్తిని కనబరచినాడు.

"మీరెవరో మహాత్ములవలె నున్నారు. నా పాలిటి పుణ్యమే మీ రూపములో నా సహాయమునకు వచ్చినట్టు దెలియుచున్నది. మీకు నా దారుణోదంతము నెట్లు దెలుపను ? దానిని చెప్పుటకు సైతము నాకు నోరు రాకున్నది. ఆ సంఘటనను దలచుకొనిన, నాకు బిచ్చెత్తగలదు. మరల మీ రా విషయమును నాకు జ్ఞప్తికి తేకుడు" అని యామె దైన్య ముగా ప్రార్థించినది.

ఈ మాటకు మారుపలుకక ప్రౌఢదేవరాయలు లక్కనామాత్యుల ముఖ మవలోకించినాడు.

లక్కనా మాత్యుడు తన ప్రభువు చూపులోని యర్థమును గ్రహించి, ఆమెను కొన్ని సాంత్వన వచనములతో సమాధానపరచి, యామె కరుణగాథను తెలుసుకొనినాడు.

4

# దారుణోదంతము

ఆమె పేరు పద్మలదేవి. చందగ్రిగుత్తి రాజగు త్రియంబకదేవుని సహోదరి. త్రియంబకదేవు డామెను బారకూరు రాజునకిచ్చి వివాహము చేసినాడు. కాని, పద్మలదేవి నడిప్రాయమందే భర్తను పోగొట్టుకొని పుట్టినిల్లు చేరినది. విధవయైన పిమ్మటామెకు సవతిబిడ్డల చేతిక్రింద బ్రతుకు దుస్సహమైనది. అందువలననే యామె తన ఏకైక పుత్రిక యగు పొన్నలాదేవిని వెంటనిడుకొని చంద్రగుత్తికి తిరిగివచ్చి, తన యన్నగారి ఆశ్రమములో నిలచినది.

బిడ్డలులేని త్రియంబకదేవుకు సంతోషముగానే విధవయైన సోద రికి, యామె కుమార్తెకు తనయింట ఆశ్రయమిచ్చినాడు. పొన్నలాదేవిని కన్న కుమార్తెవలె నతి గారాబముగా పెంచినాడు. వీలైనచో యామె నొక యోగ్యుడైన వరునికిచ్చి వివాహముచేసి, తన రాజ్యమును వారి కప్పగించి తాను నిశ్చింతుడుగా నుండవలయునని దలచినాడు. కాని, అత డొకటి దలచిన, దైవమొకటి దలచినది.

సామ్రాట్ వీర విజయుని కాలములో నతని విశేషానుగ్రహము నకు పాత్రుడైన త్రియంబకదేవుడు చంద్రగుత్తి మండలముతోబాటు 'గోవా'కు కూడా అధిపతియైనాడు. ఇది బారకూరు రాజునకూ, కొన్ని కారణాలతో త్రియంబకదేవుని మీద ద్వేషమును వెలిగ్రక్కుచున్న, మలెరాజ్యముగా ప్రసిద్ధిజెందిన బోలెయ దుర్గము ముమ్మయ నాయకునికీ సహించరానిదైనది. వారుభయులూ ఒక్కటై త్రియంబకదేవునిమీద కత్తి నూర సాగినారు. ఏవిధముగా నైననూ త్రియంబకదేవుని ఉన్నతిని నాశమొనర్చి యాతని చంద్రగుత్తి-గోవా రాజ్యములను తాముకైవసము

జేసికొనుటకై తగిన సమయము కొరకెదురు చూడసాగినారు. వారు నిరీక్షించిన సదవకాశ మొకటి తనకు తానై యేర్పడినది.

పొన్నలాదేవి బాలగా నుండిన దిప్పుడు ముగ్ధయైనది. ఆమె కిరువది సంవత్సరముల ప్రాయము సమీపించినది. త్రియంబకదేవు డామెను రాజకుమారివలె పెంచినాడు. సార్వభౌముని పెండ్లాడుటకు తగిన యర్హత గలదని అతడామెకు క్షత్రియోచితమైన విద్యలన్నియునూ నేర్పినాడు. ఆమె యుద్ధవిద్యలైన గుర్రపుస్వారి, ఖడ్గవిద్య, విలువిద్య మొదలగు వానియందునూ, సంగీత; సాహిత్య; నృత్యములందునూ పరిణతురాలైనది.

లలిత కళలందునూ, యుద్ధవిద్యలలోనూ నిష్ణాతురాలైన తన పెంపుడు కుమార్తెను జూచి, ఎన్నియో పర్యాయములు త్రియంబకదేవునికి సంతోషమునకంటెనూ సంతాపమే ఎక్కువగా కలిగెడిది. ఇంతటి యపూర్వ కన్యారత్నమును తాను సార్వభౌమునికిగాక అన్యులకిచ్చిన నది యామె కన్యాయ మొనరించినట్లు కాగలదని భావించెడివాడు.

కాని విజయ సామ్రాట్టులు తనవంటి సామంత రాజుయొక్క పుత్రికను వధువుగా స్వీకరించుట జరుగగలదా ? వారి యంతస్తెక్కడ ? తన అంతస్తెక్కడ ? సామ్రాట్టులతో రక్తసంబంధమును గోరుట గగన కుసుమమునకై చేతులు చాచినట్టేనని యతడు భావించినాడు. అయిననూ ఒకొక్క పర్యాయము తన కుమార్తె రూప గుణ యౌవనములనూ,ఆమె సత్ప్రవర్తననూ, సరస భాషణములను చూచి, ఆమె నుదుట నేమి వ్రాసి యున్నదో యని సమాధానపు నిట్టూర్పు వదలువాడు. తన యీ స్వప్నము జీవితకాలములో నిజము కాగలదాయని అతని పితృహృదయము తపించసాగినది. కుమార్తెను గురించిన యాలోచనలతో మైమరచి, సుందర స్వప్నసీమలో విహరించుచుండగా, అతనికి దుస్స్వప్నమువలె ముమ్మడి నాయకుడు కనబడినాడు. ఆతని దర్శనముతో పొన్నలాదేవి భవిష్యత్తును గురించి, త్రియంబకదేవుడు నిర్మించుకొని యుండిన సువర్ణ స్వప్న సౌధము గభాలున కూలి నట్టయినది.

ముమ్మయ నాయకుడు బోలెయ దుర్గమునకు రాజై, దాని పరిసర ప్రదేశముల కన్నింటికినీ అధిపతి యైనాడు. అతడు సేవుణ వంశము నకు చెందినవాడు. తన దుష్కృత్యముల చేతనూ, హత్య - దోపిడీల చేతనూ అతడా ప్రాంతమున కంతటికినీ బలిష్ఠమైన వ్యక్తియైనాడు. అతని నెదిరించి ఎవరునూ బ్రతుక వీలుగాక పోయినది. దుష్టుడు-దుర్మార్గుడు, నీచుడు-క్రూరుడునై యతడు ప్రజాపీడనమునకు పేరుగాంచినాడు. కాని, అతడు విజయనగర సామ్రాట్టుల కధీనుడై యుండి,ప్రతివర్షమూ వారి రాజబొక్కసమునకు చెల్లించవలసిన కప్పములను—కానుకలను సరిగా అప్పగించు చుండుట వలన సామ్రాట్టు లతని నేమియునుచేయక విడచిపుచ్చుచుండిరి. సామ్రాజ్య నిష్ఠ గలిగియున్న యతనిని ద్వేషింప జేయుట సార్వభౌముల కిష్టము లేకపోయినది.

అందుచే నతనిరాజ్యములో ప్రజలకు నెమ్మదిలేకపోయినది. అంతియ కాదు, అతని యుపద్రవమునకూ, దౌర్జన్యకృత్యములకూ భీతిల్లి ప్రజలా దుష్టుని చేతిలో బాధలను భరించలేక, తమతమ యిండ్లు-వాకిండ్లను విడచి, మరొక ప్రాంతమునకు వలస వెళ్ళినారు. అతని హత్యలకు, అత్యాచారములకు, దోపిడీలకు భీతిల్లి ప్రజలు తమంతతామే అతడు కోరి నది యిచ్చి పంపెడువారు - లేదా అతనినుండీ దూరము తొలగెడివారు. ఈ విధముగా ముమ్మెయనాయకుడు దైత్యసదృశుడై, బోలెయ దుర్గములో అట్టహాసముతో మెరయుచున్నాడు.

త్రియంబక దేవునిమీద మొదటినుండియునూ అతనికి మత్సరము గలదు. తానెంత కుప్రసిద్ధుడో, చంద్రగుత్తి రాజంతటి సుప్రసిద్ధుడై, సామ్రాజ్యమందలి స్వామి నిష్ఠాగరిష్ఠులలో ప్రథమ గణ్యుడైయున్నాడు. అతని సేవానిష్ఠకు సుప్రసన్నులైన సామ్రాట్ వీరవిజయు లతనికి గోవా సరిహద్దును కానుకగా నిచ్చినారు. ఇది ముమ్మయ నాయకునికి సహించరాని సంగతియైనది.

గోవా విజయనగర సామ్రాజ్యమందలి వాణిజ్య ప్రపంచమునకు రాజబాటగా రూపొందినది. గోవా, మొన్నావరము, భట్కళ్, మంగుళూ

రుల ద్వారా విదేశీవర్తకులు తమ వ్యాపారములలో కనకవర్షమునే కురి పింపజేసినారు. భారతదేశమందలి వస్తు సంబారములు, మస్లిన్, పట్టు మొదలగు సన్ననిబట్టలూ దేశ విదేశములలో ప్రసిద్ధిని బొందినవి. గోల్కొండ వజ్రములుకూడా యిదే విధమైన ప్రసిద్ధిని బడసినవి. ఈ వస్తువులన్నియునూ సామ్రాజ్యమందలి పశ్చిమ రేవుపట్టణములనుండి విదేశముల కెగుమతి యగుచుండెడివి.

గోవానుండి విదేశములకు వెళ్ళుచున్న ఆహారపదార్థములమీదనూ, వజ్రములు, ముత్యములు, రత్నములమీదనూ, విలువగల వస్త్రముల మీదనూ, విదేశములనుండి దిగుమతియగుచున్న అశ్వములు, మందు గుండు సామగ్రి మొదలగు వాటిమీద విశేషమైన సుంకము విధించి, సామ్రాట్టులు మాత్రమేగాక-చంద్రగుత్తిరాజులూ శ్రీమంతులు కాసాగి నారు. సామ్రాజ్యములో చంద్రగుత్తి రాజు పేరుప్రతిష్ఠలు పెరగసాగి నవి. తనవలెనే మలెరాజ్యమైన చంద్రగుత్తి రాజునకు లభించిన యీ పదవిని చూచి సహించలేక, అతని నాశముకొరకై ప్రతీక్షించుచుండిన ముమ్మయనాయకుని కిప్పుడు తనకుతానై ఆ సుయోగము లభించినది.

ముమ్మయనాయకుని వలెనే చంద్రగుత్తి త్రియంబక దేవునిమీద మత్సరము దాల్చిన బారకూరు రాజు తన సవతి చెల్లెలగు పొన్నలాదేవిని ముమ్మనాయకున కొసగి వివాహము చేయునట్లు వాగ్దానమిచ్చి.ఈ వార్తను త్రియంబక దేవునికి తెలియజేసినాడు.

ఈ వార్తవిని త్రియంబకదేవుడు నవ్వి ఊరక వుండిపోయినాడు.

అతడీ విషయము నుపేక్షించి, వూరక నుండిపోయిననూ అది యంతటితో ముగియలేదు. పెండ్లికుమారుడైన ముమ్మయనాయకుడు బార కూరు రాజు ప్రోత్సాహముతో, పొన్నలాదేవిని కోరి, మంగళద్రవ్యము లతో పురోహితులను చంద్రగుత్తికి బంపి, తాను కన్యార్థియై వచ్చుటకు వచ్చుచున్నట్టు తెలియజేసినాడు.

త్రియంబకదేవుడీ విషయము నిప్పుడు దీర్ఘముగా నాలోచించు నట్టయినది. అతడీ వివాహమునకు తన యసమ్మతిని తెలుపక, ఉపాయ ముగా నా విషయమునుండి తప్పించుకొన బ్రయత్నించినాడు. పొన్నలా

దేవికి యోగ్యుడైన వరునితో వివాహము నిశ్చయమైనదని అబద్ధపు వార్తను చెప్పి పంపినాడు.

కాని ముమ్మయనాయకుడూ, బారకూరు రాజూ ఈ వార్తను నమ్మ లేదు. వారు తమ గూఢచారులను బంపి, త్రియంబక దేవుడిది యంత యునూ తమను వంచించుటకై పన్నిన పన్నుగడయని తెలుసుకొనినారు. ఇది నిజమని తెలియగానే వారతనిమీద యుద్ధమునకు వెళ్ళుటకై యొక గుర్రిడిసాకు కొరకెదురు చూడసాగినారు.

చంద్రగుత్తి గడిప్రదేశమునూ, బోలెయదుర్గము గడిప్రదేశ మునూ పరస్పర మొకదాని కొకటి కలసియున్నవి. ముమ్మయనాయకుడు తనకు జరిగిన పరాభవమునకు ప్రతీకారమునునట్లు, సరిహద్దు ప్రాంత మందలి గ్రామముల మీదపడి, వారిని కొల్లగొట్టసాగినాడు. అంతటితో తృప్తిజెందక అతడు చంద్రగుత్తిద్వారా సామ్రాట్టులకు పంపబడుచూ యుండిన ఉత్తమాశ్వములను దొంగిలించి, యా దొంగతనమును చంద్ర గుత్తి రాజున కంటగట్ట బ్రియత్నించినాడు.

ఏ ఉపాయముతోనైననూ చంద్రగుత్తి - విజయనగర రాజుల మైత్రిని విరచి, వారికి మిత్రభేదమును కలిగించి, దానినీ పొన్నలాదేవినీ తాను కబళించవలయునని యతని ఉత్కటాకాంక్ష! కాని దూరదర్శియూ, రాజనీతి కోవిదుడూనైన త్రియంబక దేవుడీ విషయముపట్ల తొందరపడి తానే ఆయుధమును చేతికి తీసుకొనక, సామ్రాట్టులైన వీరవిజయ రాయలకు నివేదించినాడు. వీరవిజయరాయలీ విషయమై ఏదియేనొక పరిష్కారము చేయవలె ననుకొనుచునే హఠాత్తుగా మరణించినాడు. అతని మరణానంతరము ప్రౌఢదేవరాయలు సింహాసన మధిష్ఠించినాడు.

ప్రౌఢదేవరాయలు సార్వభౌముడైన పిమ్మట ఈ ముమ్మయ నాయకుని దుండగముల నెట్లయిననూ అరికట్టించ నిశ్చయించి, యా నిశ్చయమును లేఖామూలముగా త్రియంబక దేవునికి తెలియపరచి, నాత నికి అభయప్రదానము చేసినాడు. తానతి త్వరలో అరగసీమకు వచ్చు చున్నట్లునూ, ఆ సమయములో ముమ్మయనాయకుని యహంకారమును మూలోత్పాటనము జేయుటకై తగు క్రమచర్య తీసుకొనునట్లునూ యా

లేఖయందు దెలిపినాడు. అతడు ప్రౌఢ దేవరాయల రాక నెదురు చూచు చుండగనే జరుగరాని హత్యాకాండ జరిగిపోయినది.

త్రియంబక దేవుడు, సార్వభౌముడు తన రాజ్యమునకు రాక మునుపే తానే ఉపాయముగా ముమ్మయనాయకుని చెరబట్టి సార్వభౌముని కప్పగించినచో తన గౌరవము ద్విగుణీకృతము కాగలదని భావించి, అతనిని బట్టుకొనుట కొక పన్నుగడ పన్నినాడు.

ఆ పన్నుగడ మేరకొక లేఖవ్రాసి, తన విశ్వాసమునకు పాత్రులైన భటులద్వారా దానిని ముమ్మయనాయకునికి బంపినాడు. ఆ లేఖ యందతడు ముమ్మయనాయకుడే తన కుమార్తె పొన్నలాదేవి కనురూపు డగు వరుడని తానిప్పుడు గ్రహించియున్నట్టూ, ఈ వివాహమునకు తాను చాలా ఆతుర్రత జెందుచూయున్నట్టూ, కనుక పెండ్లి కుమారుడై యతనిని వెంటనే చంద్రగుత్తికి బయలుదేరి రావలసినదనియూ ఆహ్వానమును బంపినాడు.

ఈ లేఖ చదివి ముమ్మయనాయకునికి స్వర్గము మూడడుగులలో నున్నట్టుగా దోచినది. అతడానాడే వధువు కివ్వవలసిన వస్త్రములు, ఆభరణముల నెత్తుకొని మితపరివారము వెంటరా చంద్రగుత్తికి ప్రయాణమైనాడు. తనవంటి బలాఢ్యుని మోసగించు టెవరివలననూ సాధ్యము గాదనియూ, తనతో వైరము కట్టుకొనినచో ఎవరునూ బ్రతుకరనియూ భావించిన ముమ్మయనాయకుడు త్రియంబక దేవుని యామంత్రణమును సత్యమనియే యనుకొన్నాడు. అయిననూ ధూర్తుడైన యతడు త్రియంబక దేవుని వలన తనకేమైననూ యాపద సంభవించినచో రక్షణార్థ ముండనిమ్మని.తన సైన్యమునకు రహస్యముగా చంద్రగుత్తి సరిహద్దులో విడిసియుండుట కాజ్ఞాపించి, తన యాప్త మిత్రులతో గలసి పెండ్లి కుమారుడై యతడు చంద్రగుత్తికి ప్రయాణము సాగించినాడు.

చంద్రగుత్తిని చేరగనే త్రియంబక దేవు డతనినీ, అతని మిత్రులనూ రాజయోగ్యమైన విడుదులలో దిగవిడచినాడు. వారచ్చటినుండి తప్పించుకొని వెళ్ళకుండుటకై వేగుల వారిని నియమించినాడు. ఈ

విషయ మెట్లో ముమ్మయనాయకునికి తెలిసినది. వివాహ నెపముతో తనను బంధించి, సార్వభౌముల కప్పగించుటకై త్రియంబక దేవుడు పన్నుగడ పన్ని యున్నాడని తెలియగనే యాతడు కోపించిన మృగ రాజ మైనాడు. కాని తానప్పుడు అల్పసంఖ్యలో నుండుట వలన తొం దరపడిన కార్యభంగము కలుగ గలదని భావించి, తన కోపము నణచు కొని, అచ్చటినుండి ప్రాణములతో బయటపడుట కాలోచించినాడు.

త్రియంబక దేవు డానాటి సాయంకాల మతని విడిదికి వచ్చి— "వరుని రాజమర్యాదతో అంతఃపురమునకు దోడ్కొని పోవుటకు అన్ని యునూ సిద్ధమైనవి" అని విన్నవించినాడు. ఇది విని ముమ్మయనాయ కుడు చిరునవ్వుతో తన యంగీకారమును తెలియజేసి, త్రియంబక దేవుని సాగనంపినాడు.

ముమ్మయనాయకుడు ఊరేగి తన యంతఃపురమునకు వచ్చినప్పు డతనినీ, యతని పరిజనులనూ బంధించి,కారాగారమున బడవేయవలయు నని త్రియంబక దేవుని యాలోచన.

కాని అప్పటికే నగరములోనున్న నిసబ్బతను, అధికారులలో కన బడుచున్న కళవళమును, ఆందోళనను, రహస్య మంతనములను జూచి, యిక తడవుచేసినచో తమ కథ పూర్తి యగునని దలచి, ముమ్మయ నాయకు డచ్చటనుండి తప్పించుకొన నిశ్చయించినాడు.

అతడు తనను మోసగించ బ్రయత్నించిన త్రియంబక దేవుని మోసగించి, యాతడు పన్నిన వలనుండి తప్పించుకొని బయటపడదలచి తన నమ్మికకు పాత్రుడగు నొకయనుచరునికి తన వేషమువేసి, యతనిని తన విడిదిలోనుంచి, హఠాత్తుగా పారిపోయి తల దాచుకొన్నాడు.

వరుని ఊరేగింపు గడబిడలో నిది త్రియంబక దేవునికి గాని, యాతని పక్షము వారికి గాని తెలియదు. వారు కృతక వేషధారి యగు ముమ్మయనాయకునే నిజమగు ముమ్మయనాయకుడని భ్రమించి, యతనిని చెఱబట్టుకొనగా అప్పుడు యదార్ధ విషయము బయటపడినది. ముమ్మయ నాయకుడు చేతికి చిక్కినట్టే యుండి, త్రియంబక దేవుని ఎత్తునకు పై

యెత్తువేసి తప్పించుకొనినాడు. తన పన్నుగడ ఫలించలేదని త్రియంబక దేవునికి చాల వ్యధ కలిగినది. కాని కార్యము మించిపోయినది.

అయిననూ యతనికి వివాహమను మిషతో ముమ్మయనాయకుని మోసగించి నందుకు కొంత సంతోషమే కలిగినది. పద్మలదేవి,పొన్నలా దేవి కీ విషయమెరిగించి,నవ్వుకొనుచూ విరోధికి సరియైన యవమానమే జరిగినదని సంతోషించుచుండగా అనిరీక్షితముగా నొక పెద్ద గండము సంభవించినది.

చంద్రిగుత్తి నుండి ఉపాయముగా తప్పించుకొని బయటపడిన ముమ్మయనాయకుడు సూటిగా తన సైన్యము విడిచియున్న చోటుకు వెళ్ళినాడు. తన యాప్తులగు దండనాయకుల కీ జరిగిన సంగతులన్ని యునూ జెప్పి, తనకు జరిగిన అవమానమునకు —మోసమునకు— తగిన ప్రతీకారమును దీర్చుకొనుటకై వెంటనే చంద్రిగుత్తి మీదికి దం డెత్తి వచ్చినాడు.

చడి–చప్పుడు లేక హఠాత్తుగా వచ్చి పడిన యీ శత్రు దాడిని నిరీక్షించని వాడగుటచే త్రియంబకదేవుకు భీతిల్లినాడు. వెంటనేయతడు కోట ద్వారములను మూసి, దాని రక్షణకు కావలసిన క్రమచర్యలను తీసుకొన్నాడు. ఈ వార్తను మిత్రులగు అరగసీమ పాలకుడు వీరన నాయకునకూ, సామ్రాట్ ప్రౌఢదేవరాయలకూ నెరింగించి, వారి సాయ ము నర్ధించినాడు.

ముమ్మయనాయకుని వలన హఠాత్తుగా రాజ్యమునకు సంభవిం చిన యాపదను తన భార్యకునూ, సోదరి యగు పద్మలాదేవికినీ, నామె కుమార్తె యగు పొన్నలాదేవికినీ తెలిపి, వెంటనే వారినచ్చటనుండి తప్పించుకొని వెళ్ళి, అరగసీమలో రక్షణ పొందవలిసినదని చెప్పినాడు.

త్రియంబకదేవుని భార్య యింగులకు సమ్మతించలేదు. భర్త ఎచ్చటనున్న నచ్చటనే తన స్థానమనియూ, అతనికి సంభవించిన స్థితిని తానుకూడా సంతోషముగా ననుభవించునట్లునూ, భర్తను యాపదలలో దిగవిడచి, పిరికివానివలె తలదాచుకొనలేనట్లునూ స్పష్టముగా జెప్పివేసి

నది. ఆమెను సమాధాన పరచుట కతడు చేసిన ప్రయత్నములన్నియును విఫలములైనవి. చివరకు పద్మలవైపు తిరిగి :

"పద్మలా! నీవైనను నా మాటను వినుము. నీవు మా వంశ లతవు. నీవును ఈ పొన్నలయూ సురక్షితముగా నుండిన నేను శత్రువులమీదపడి యుద్ధమొనరించుటకు నిశ్చింతుడనై వెళ్ళెదను" అన్నాడు.

"అన్నగారూ! తండ్రివలెనున్న నిన్నీ పరిస్థితిలో విడచి నే నెచ్చటికీ వెళ్ళలేను. నీ కీ ముప్పును తెచ్చిన దానను నేనే! నా వలననే కదా నీవు బారకూరు రాజుతో వైరమును కట్టుకొనినని.నా యీ కుమార్తె పొన్నలకొరకే గదా దుష్టుడగు ముమ్మయినాయకునితో శత్రుత్వమేర్పడి నది. నిన్నీ విపత్తులో విడచి నేను తలదాచుకొనినచో ప్రజలేమనగలరు? దేవుడు సైత మీ కార్యమును మెచ్చగలడా?" అనినది పద్మలాదేవి.

"సోదరి, ఏమి నీ మాటలు? నీ కొరకై ఈ యుద్ధము ఘటించి నదని యనుకొనుట తప్పు. ముమ్మయనాయకు డెంతటి నీచుడనునది నీకు దెలియదా? ఎప్పుడో ఒకనాడు మన మా దుష్టుని శిక్షించ వలసియే యుండెడిది. ఆ కార్య మిప్పుడే జరుగుచున్న దంతియే! సామాన్తుల సహాయము నునకందునంతవరకును యతనితో వైరము కట్టుకొని. పోరునకు సిద్ధపడక యుండవలసినది. కాని యీ నీచుడు పొన్నల జీవితమునకు చిచ్చుపెట్ట ప్రయత్నించినాడు. తగినబుద్ధి జెప్పుటకై నే నతని నుపాయముగా పట్టి బంధించ బ్రయత్నించినాను. కాని అతని యదృష్టము మంచిదగుటచే పట్టుబడక తప్పించుకొనినాడు. ఇప్పుడు మనపై దండెత్తి వచ్చి యున్నాడు. దీనికంతటికినీ మేము భీతిల్లువారము కాము. అది వేరువిషయము. కాని ఈ విపత్కర పరిస్థితియందు నీవూ - పొన్నలయూ రాజధానిలో నుండు టంత క్షేమకరము కాదు. మిమ్ములను నే నా దుష్టుల బారినుండి రక్షించుకొనలే కిట్లు చెప్పుచున్నానని భావించకుడు. మీ కొరకు కాకపోయినను, నా కొరకైనా నీవు నీ కుమార్తెతో బాటు యిప్పుడే బయలుదేరి, సురక్షితమైన ప్రదేశమును చేరుకొన వలయును. ఈ గండము గడచిన తరువాత మిమ్ములను మరల పిలిపించుకొనెదను"

అని చెప్పగా, విధిలేక పద్మలాదేవియూ, నామె పుత్రికయూ సమ్మతించినారు.

కాని వారి దురదృష్టమేమో ! చంద్రగుత్తి కోటయందలి అంతఃపురములోనుండి తప్పించుకొనుటకు గల రహస్య మార్గమును ముమ్మయ నాయకుని ప్రలోభమునకు బలియైన నీచులెవరో శత్రువులకు తెలియ జేసినారు.

పద్మలాదేవి, పొన్నలాదేవులు తమ కే యపాయమును లేదని భావించి, మారువేషములో నా సొరంగ మార్గ మతిక్రమించి వెలుపలికి వచ్చినారు. ఇక తప్పించుకొన వలయునను కొనుచున్నంతలో వారు ముమ్మయనాయకుని సైనికులకు పట్టుబడినారు.

'వెదకబోయిన తీవ పదములకు తగిలిన దనునట్లు, తా నెవరి కొరకై యింతటి శ్రమ దీసుకొన్నాడో వారు శ్రమ పడనక్కర లేకయే తన కైవసమైనందుకు మిక్కిలిగా సంతోషించి, వేర్వేరు పల్లకీలలో వారిని తన రాజ్యమగు బోలెయ దుర్గమునకు బంపి తాను చంద్రగుత్తిని ముట్టడించినాడు.

ముమ్మయనాయకునివద్ద నెక్కువమంది యోధు లుండుటచేతనూ, త్రియంబకదేవుని యుద్ధసన్నాహము లసంపూర్ణములుగా నుండుట చేతను, అతి త్వరలో చంద్రగుత్తి దుర్గమతని వశమైనది. త్రియంబక దేవుడు రాజధాని రక్షణకై పోరాడి వీరునివలె మరణించినాడు. ఈ వార్త విని యతని పత్ని దుష్టుడగు ముమ్మనాయకుని చేతికి చిక్కి యవమానము నందుటకంటెను మరణించుట మేలని, అగ్నిప్రవేశము జేసినది.

చంద్రగుత్తి ముమ్మయనాయకుని వశమైనది. అచ్చటి సమస్త సంపదయూ నాతడు కొల్లగొట్టినాడు. నగరమును నాశమొనర్చి, తనకు జరిగిన పరాభవమున కచ్చటి నిరపరాధ ప్రజలమీద పగదీర్చుకొని నాడు. అనంతర మచ్చట తన దండనాయకు నొకనిని నియమించి, పొన్నలా దేవిని కలుసుకొనుటకయి బోలెయ దుర్గము దారి ననుసరించినాడు.

కాని పద్మలాదేవి యదృష్టము—అరగమునకు వచ్చిన ప్రౌఢ దేవరాయలు తన గజవేట శిబిరమునకు తిరిగివెళ్ళుచుండగా, మార్గమధ్యములో నామె నపహరించుకొని బోలెయ దుర్గమునకు వెళ్ళుచున్న వారి దళమెదురైనది. దూరమునుంచీనే ప్రౌఢదేవరాయల అశ్విక సైన్యము యొక్క ఖుర పుధ్వని నాలించిన యా దళనాయకుడు, తాము వారి కింట బడిన బ్రతుకుట కష్టమని భావించి, పద్మలాదేవియున్న పల్లకీ నచ్చటనే యొక పొదరింటిలో దాచిపెట్టి, తాముకూడా యచ్చటనున్న గుబురుచెట్ల నడుమ దాగుకొన్నారు.

పద్మలాదేవి చేసిన యాక్రందనము వలన ముమ్మయనాయకుని పన్నుగడ విఫలమైనది. ఆమె రోదనమును విని ప్రౌఢదేవరాయలు సకాలములో వచ్చి రక్షించినాడు.

ప్రౌఢదేవరాయలు వచ్చుటను దూరమునుండియే చూచిన ముమ్మయనాయకుని భటులిక తా మచ్చట నిలచినచో అపాయము కలుగగలదని గ్రహించి, పద్మలాదేవి నచ్చటనే వదలి పలాయనము చిత్తగించినారు.

చేతికి చిక్కినపిట్ట తప్పించుకొని పారిపోయినందుకు వారికి చాల వ్యథ కలిగినది. ఇప్పుడిక ఎట్లయిననూ చేసి, యింకను తమ వశములో నున్న పొన్నలాదేవిని బోలెయ దుర్గమునకు సురక్షితంగా సాగించి, తమ ప్రభువుయొక్క కోపాగ్ని కాహుతికాకుండా తప్పించుకొనదలచి, వారచ్చటనుండి పొన్నలాదేవియున్న పల్లకీవద్దకు పరుగిడినారు.

అప్పటికి ప్రౌఢదేవరాయలకు పద్మలాదేవిద్వారా పొన్నలాదేవి విషయము—ఆమె నింకొక పల్లకీలో బోలెయదుర్గమునకు తీసుకొని పోవుచున్న విషయము తెలిసినది. ఇప్పు డాలస్య మొనరించిన సర్వనాశనము కాగలదని తలంచి, లక్కనామాత్యులను పిలచి—

"అమాత్యా। పద్మలాదేవిని నేను సమాధాన పరచగలను. మీరు తక్కిన పరివారముతో బయలుదేరి, సమీపమునందెచ్చటనో వెళ్ళుచున్న

పొన్నలాదేవి పల్లకీని శత్రుహస్తములనుండి స్వాధీనపరచుకొనుడు. ఇప్పుడు ప్రతిక్షణమూ అమూల్యమైనది. మన మాలసించినచో నా ధూర్తులు పొన్నలాదేవి జీవితమునకు చిచ్చుపెట్టవచ్చును. ఆ నీచులామెను బోలెయ దుర్గమునకు తీసుకొని వెళ్ళకమునుపే, మీరామెను పట్టి తేవల యును. ఆమెను శోధించనిదే, యామె సంగతి తెలుసుకొననిదే తిరిగి రాకూడదు" అని కఠినముగా నాజ్ఞాపించి,లక్కనామాత్యులను బంపినాడు.

వేరు దారిలేక లక్కనామాత్యుడు పద్మలాదేని,ప్రౌఢదేవరాయల సేవకై నల్వురు యోధులను విడచి, తక్కిన సైన్యముతో పొన్నలాదేవి పరిశోధనకై బయలుదేరినాడు.

# 5

# రాజాజ్ఞ

ప్రౌఢదేవరాయలు పద్మలాదేవి దురంతోదంతమును విని, చాల వ్యథజెందినాడు. సామ్రాజ్యముయొక్క ముఖ్య స్వామి విశ్వాసపాత్రులలో నొకడగు త్రియంబకదేవునికి, అతని భార్యకు, సోదరికి కలిగిన దుస్థితికై చాల పరితపించినాడు. దుష్టుడైన ముమ్మయనాయకునిమీద అతని కమిత మైన కోపము వచ్చినది. తన సామ్రాజ్యములో ధర్మాత్ములకు సంభ వించిన దుర్గతిని దలచుకొని రోషకషాయితుడైనాడు. వెంటనే బోలెయ దుర్గముపై దండెత్తి వెళ్ళి, దుండగీడగు నా ముమ్మయనాయకుని శిక్షించి, త్రియంబకదేవునికి జరిగిన యన్యాయమునకు తాను పగదీర్చుకొన వలయునని యనుకొన్నాడు.

కాని తొందరపడుట కది సమయముగాదు. అతని చేతినుండి మొదట పొన్నలాదేవిని రక్షించవలయును. ఆమెను రక్షించనిదే

ముమ్మయనాయకుని మీద జరుపు జైత్రయాత్ర పరోక్షముగా పద్మలా దేవికి విధించు శిక్షయే కాగలదు. ప్రౌఢదేవరాయలు దీర్ఘముగా నాలోచించి, తన శిబిరమునకు వెళ్ళిన పిమ్మట, యీ విషయమై తీసుకొనవలసిన క్రమచర్యలను నిర్ణయించవచ్చునని భావించి, సూటిగా శిబిరమునకు ప్రయాణమైనాడు.

దారిలో ముమ్మయనాయకుని దండయాత్ర ప్రకరణమున తన పాత్రగూడా నున్నట్లు. ప్రౌఢదేవరాయలు విషాదపడుచూ చెప్పినాడు :

"తల్లీ ! నేను—సామ్రాట్టునైన నేను— మా సామంతరాజులలోకెల్లా గొప్పవారగు శ్రీ త్రియంబకదేవులకు సకాలములో సాయపడక, నాలస్యముగావించి యపరాధ మొనరించినాను. దుర్మార్గుడూ, దుష్టుడూ నగు నా ముమ్మయనాయకుని యింతవరకునూ శిక్షించక విడచిపెట్టినదే తప్పైనది. నే నరగసీమకు వచ్చినప్పు డతని దుశ్చర్యలను విచారించుకొన గ నని తెలుపుచూ, త్రియంబకదేవులు బంపిన లేఖను నిర్లక్ష్యము జేసినాను. సకాలములో వారికి సాయపడియుండినచో,మీ సహోదరులూ, మీ ముద్దుల తనయ నా నీచునికి బలియయ్యేడువారు కారు" అని యీ కార్యములో తా నపరాధము జేసినట్లు విషాదపడినాడు.

"ప్రభూ ! తమవలన ఏ యపరాధమూ జరుగలేదు. ఆ దృష్టితో జూచిన నిదియంతయూ మాదుర్విధి ! నా ఫాలమున నిదియంతయూ జూడవలయునని లిఖించియుండగా, మీరు మాత్రమేమి చేయగలరు ? నాకిప్పుడు రాజ్యకోశములపై నాశలేదు. నా బిడ్డ యీ నరరూప రాక్షసుని బారినుండి బ్రతికి బయటపడినచో జాలును. ఇంతకంటెనూ అధికమేమియునూ నేను భగవంతుని కోరుటలేదు" అని బాధగా యనినది పద్మలా దేవి.

"తల్లీ ! మీరు పొన్నలావిని గురించి చింతించకుడు. మీరామెను వీరరమణివలె పెంచినారు. ఆ ధూర్తుడగు ముమ్మయనాయకుని భోగలాలస కెప్పటికినీ నామె బలికానేరదు. అటువంటి సమయము వచ్చినప్పు డెట్లతనిని మోసగించు టనునది నామెకు బాగుగా దెలియును. మా చేతనైనంతవరకూ యీమె నా నీచుని చేతినుండి రక్షించుటకు బ్రయత్నించగలము. మా లక్కనామాత్యు లీ కార్యమునకై వెళ్ళినారనిన, నిక

వారు వట్టిచేతులతో తిరిగిరారు. మీ కుమారులు క్షేమసమాచారము లారసియే వచ్చెదరు. మీరు నిశ్చింతగా నుండుడు" అని సమాధాన పరచినాడు.

ఇంతలో వారు గజవేట శిబిరమును సమీపించినారు. వారికి స్వాగతము పలుకుటకు వీరననాయకుడూ, సామ్రాట్టుల అంతఃపురామాత్యుడు బుక్కన దండనాయకుడూ ఆతురులై నిలబడియున్నారు.

సామ్రాట్టులా శిబిరమునకు వచ్చుటకు పూర్వమే వారుభయులూ నచ్చటికి వచ్చినారు. తానే స్వయముగా నిలచి, శిబిరపు ఏర్పాటులను గావించినాడు వీరననాయకుడు. అన్ని విషయములకూ తానే పర్యవేక్షకుడుగా నిలచినాడు.

ఈ పర్యాయము లభించెడి ఏనుగుల సంఖ్యమీద వేట యశస్సు నిలబడియున్నది. ఈ గజవేటయొక్క యశస్సుమీద వీరననాయకుని గొప్పతన మాధారపడియున్నది.

ఈ వేట మూలముగా తాను సామ్రాట్టులకు ప్రీతిపాత్రుడై, సామ్రాజ్య మందందరి కంటెను పెద్ద సామంతరాజుగా పేరుగాంచవలయునని వీరననాయకుని హృదయమందలి కోర్కె. అందువలననే యతడీ గజవేటకు సంబంధించిన ప్రతికార్యమును తానే చూచుకొనుటకై యీ కాననములో నిలువబడియున్నాడు. సామ్రాట్టులకూ, వారి పరివారమునకూ, వేటలో సాయపడువారికీ, మావటివాండ్రకూ వారి వారి యంతస్తుకు తగిన శిబిరములను వేయించినాడు. ఆ సహ్యాద్రి కాననములోని యీ గజవేట శిబిరములొక చిన్న నగరమువలె శోభించసాగినవి.

ఆ నాడచ్చటికి సామ్రాట్టులు వచ్చుటచే, నతని స్వాగతమునకన్ని యేర్పాటులునూ, ఎక్కువ ఉత్సాహముతో గొప్పగా సాగినవి. అంతఃపురామాత్యులు బుక్కన దండనాయకుడు, అలసి వచ్చెడి సార్వభౌములకు ప్రియమైన భక్ష్య భోజ్యములను దయారుచేయించి, నాతని రాకకై నిరీక్షించుచున్నాడు.

కాని, పూర్వాహ్ణమునకు మునుపే రావలసిన సామ్రాట్టులు మధ్యాహ్నము మీరినను యింకనూ రాలేదు. ఇప్పుడు రాగలరు; యిక

కొంతసేపటిలో రాగలరు నని వారు నిరీక్షించి, నిరీక్షించి విసుగుజెంది నారు. సామాన్నిట్టులుగాని,యాతని పరివారముగాని సంజయైననూ శిబిరము నకు రాలేదు. వారి యీ యాలస్యము ప్రభుభక్తి పరాయణులైన బుక్కన వీరననాయకుల దిగులునకును—యాందోళనకును కారణమైనది.

సాయంవేళ యగుచున్ననూ వారెందులకింకనూ రాలేదు ?—ఆలస్యమగుచో వార్తయైననూ జెప్పి పంపెడివారు. కాని ఏ విషయమును తెలియకపోగా, మార్గమధ్యమున నేదో జరుగ గూడని దుస్సంఘటన జరిగి యుండవచ్చును. ప్రభువులేదో నాపదలో దగుల్కొని యుండ వచ్చునని వా రుభయులూ శరీరమంతయును కనులుజేసుకొని, నిరీక్షించ సాగినారు.

పూర్తిగా సంజె గడచునప్పటికి సామాన్నిట్టులూ, పద్మలాదేవి యును శిబిరమునకు వచ్చినారు. వారిని చూచిన పిమ్మట వీరనయూ, బుక్కనయూ నొక సమాధానపు నిటూర్పు విడచినారు. ప్రస్తుతమునకు తా మనుకొన్నట్టు సామాన్నిట్టుల కే యాపదయును రాలేదు—వారారోగ్య ముగా, క్షేమముగా నున్నారు కదా యని ఆ స్వామి నిష్ఠాగరిష్ఠులు హర్షించినారు. సామాన్నిట్టులను క్షేమముగా శిబిరమునకు దోడ్కొనివచ్చిన తమ దైవమును వారు ప్రార్థించినారు.

పౌఢదేవరాయలు శిబిరమునకు రాగానే, పద్మలాదేవి కుప చర్యలుచేసి, ఆమె గాయములకు ఔషధోపచారములు చేయవలసిన బాధ్య తను బుక్కన కప్పగించి, తాను ముమ్మయనాయకుని విషయమై నే తీర్మానము చేసుకొనవలసినదీ, వీరనతో చర్చించి తరువాత నిర్ణయించు కొనవచ్చునని, యతనిని సముఖమునకు రావించుకొనినాడు.

వీరననాయకు డీ పిలుపును విని, యాందోళనజెంది—సామాన్ని ట్టుల శిబిరమునకు పరుగున వచ్చినాడు అతనిని గౌరవముగా నాహ్వా నించి, పౌఢదేవరాయలు జరిగిన వృత్తాంతమంతయూ సవివరముగా నెరిగించినాడు.

ఈ విషయము విని వీరననాయకుడు బొడుగరచినాడు. అత డీ

సంగతిని నమ్మలేక పోయినాడు. ప్రౌఢదేవరాయలుగాక మరెవ రీ కథను తెలిపియున్నను ఖండితముగా నతడు నమ్మెడువాడుకాడు. కళ వళము — కుతూహలము రెండును రూపుగొన్నవేమో యనునట్లు కూర్చొనినాడు.

అతడేమియును మారుపల్కక పోవుటను జూచి, "వీరననాయ కులూ ! ఇప్పుడు ప్రతి ఘడియయూ నమూల్యమైనది. మనము మన పరిశోధన నొక క్షణకాల మాలస్యముచేసినచో పొన్నలాదేవి యా దుష్టులకు బలియై అసువులను గోల్పోవచ్చును; లేదా ఆత్మహత్య చేసుకొన వచ్చును. ఆమె బోలెయ దుర్గమును చేరక మునుపే—మనము రక్షించ వలయును. అంతియగాక, మన సామంత శ్రేష్ఠులగు త్రియంబక దేవుని పై నిష్కారణముగా పగ సాధించిన యా నీచుని శిక్షించి, వారియాత్మకు శాంతిని కలుగజేయవలయును. వారికి జరిగిన యన్యాయమును చక్కదిద్దవలయును. ఈ కార్యము లిప్పుడు చేబూన వలసి యున్నది. దీనికి మీ సాయమత్యంతావశ్యకము" అని ప్రౌఢదేవరాయలే యనినాడు.

"ప్రభూ ! తమ రీ విషయమై చింతించకుడు. ఈ కార్యమునకు నేను నా గూఢచారులను నియమించెదను. పొన్నలాదేవి ఎచ్చటనున్నను వారు రక్షించి తోడ్కొని వచ్చెదరు. అట్లే మమ్మయనాయకు డెచ్చట దాగియున్నను విడువక శిక్షించి రాగలరు. తమరు దిగులు జెందక, ముందు భోజనము కానిండు.అనంతర మీ విషయమును గురించి మనము సావధానముగా చర్చించుకొన వచ్చును" అన్నాడు వీరననాయకుడు చిరునవ్వు నవ్వుచూ.

అతని నిరుద్వేగ వదనమును, త్రియంబకదేవునికి సంభవించిన దుస్థితిని వినియునూ, ఏ సానుభూతి వాక్యములను పలుకక, భోజనము చేయు దనుచున్న యాతని ప్రవర్తన ప్రౌఢదేవరాయలకు వేసటను కలిగించినది. ఈ పలుకులతో, సార్వభౌముల హృదయములో నాతనిపై చిరకాలముగా నుండిన సంశయ భావము దృఢమైనది.

ప్రౌఢదేవరాయలకు చాలకాలముగా వీరననాయకుని స్వామిభక్తి పట్ల సంశయమే కలుగుచుండినది. అతడెంతటి ఉత్కటాకాంక్షగల

సామంత రాజైనదీ సార్వభౌములకు దెలియును. రహస్యముగా నతడు ముమ్మయనాయకునికి సాయపడు చున్నాడేమో నను యనుమానముకూడా పొడసూపినది. మలెరాజ్యమైన చంద్రిగుత్తి త్రియంబక దేవుని యున్నతిని చూచి సహించలేక, తానే యతనిమీద దండెత్తి వెళ్ళ వీలుగాక, తన యాశ్రిత రాజగు ముమ్మయనాయకుని నియమించి యుండవచ్చునను వదంతికూడా పుట్టినది. ఈ వదంతులను నమ్ముటకన్నను ప్రత్యక్షముగా బరీక్షించి చూచుటకయి, గజవేట నెపముపై లక్కనామాత్యులవెంట అరగసీమకు వచ్చినాడు.

కారణములేనిదే వచ్చినచో సంశయాస్పదము కాగలదని, గజవేట నెపములో స్వార్థమును సాధించుకొనుటకయి వచ్చినాడు.

ఈ విషయము వారు భావించిన దానికంటెనూ ఘోరతరముగా నున్నది. తన సామంతులలో మొలకెత్తిన నీ అంతఃకలహ బీజమును వీలైనచో నాశమొనర్చి, సామంత రాజులందరిలో సౌహార్ద్రతను కలుగజేసి, సామ్రాజ్యమునకు బలమైన పునాది నేర్పరచ వలయునని సామ్రాట్ ప్రౌఢదేవరాయ లనుకొన్నాడు.

అందువలననే యాతడు ముమ్మయనాయకుని విషయములో తొందరపడక, అతనికి పరోక్షముగా సాయపడుచున్నాడని చెప్పబడిన వీరననాయకుని సమీపమున జూచి, అతని నిజస్వరూపమును గ్రహించ వలయునని, ప్రౌఢదేవరాయలు చంద్రిగుత్తి త్రియంబక దేవునికి సైన్య సహాయమును బంపక, ముమ్మయనాయకుని ప్రవర్తనమును అరగమునకు వచ్చినపుడు విచారించునట్టుగా తెలిపి, లేఖ వ్రాసినాడు.

కాని, అతడు అరగమునకు వచ్చి, కొంతకాలము విశ్రాంతి తీసుకొని, గజవేట శిబిరమునకు వచ్చునంతలో మెఱపువలె నీ హత్యాకాండ జరిగిపోయినది.

"వీరననాయకులూ ! స్వామిభక్తి పరాయణులలో ప్రథమగణ్యులైన త్రియంబక దేవులకు ఆ ద్రోహియగు ముమ్మయనాయకుని వలన గలిగిన అన్యాయములనూ, అత్యాచారములనూ వినిన తరువాతకూడా

మీరీ సంగతిని గురించి నిర్లక్ష్యముగా మాటలాడుటను జూచిన నా కాశ్చర్యము గలుగుచున్నది.

"మీకునూ, దీనికినీ ఏ సంబంధమునూ లేనిరీతిని మాటలాడుచున్నారు. ముమ్మయనాయకుడు అరగరాజ్య మండలి యొక చిన్న పాళేగాడను విషయమును, వాస్తవముగా మీరు విస్మరించియున్నట్టు దోచుచున్నది. అతడు తన పొరుగు రాజ్యమగు చంద్రిగుత్తి పట్ల ప్రవర్తించిన విధానమును జూచిన నాకు మీమీదకూడా సంశయము కలుగుచున్నది" అనినాడు ప్రౌఢదేవరాయలు.

"ప్రభూ ! నావలన యపచారము గలిగియుండిన క్షమింప వేడికోలు. ముమ్మయ నాయకుడు నా సంస్థానములలో నొకటియగు బోలెయ దుర్గమున కధిపతి యను మాట నిజమే ! కాని, యతడు మన రాజ భాండాగారమునకూ, సామ్రాట్టులకూ చెల్లించవలసిన కప్పములను, కానుకలను తప్పక చెల్లించుచూ వచ్చుచుండుటచే మన మతనిపై ఏ రాజ ద్రోహాపాదనయునూ లేక శిక్షించుటకు వీలుగాక పోయినది"

"ఏమీ ! ఆ ద్రోహి దుష్కృత్యములను జూచియూ మీరతనిని నిరపరాధి యనుచున్నారా ? మా సామ్రాజ్యమునకు ప్రథమ గణ్యుడుగా నుండిన స్వామి నిష్ఠాగరిష్ఠుడగు త్రియంబక దేవునికి జరిగిన యన్యాయములను చూచుకొని యూరకుండెదరా ? ఆశ్చర్యము ! ఆ ద్రోహి మాకు చెల్లించవలసిన కప్పములను-కానుకలను చెల్లించినంత మాత్రమున, యంతటితో సామ్రాజ్యమునకు మీ బాధ్యత తీరిపోయిన దనుకొనుచున్నారా—ఎట్లు ?" తిరస్కారముగా యనినాడు సామ్రాట్ ప్రౌఢదేవ రాయలు.

"ప్రభూ ! నావలన నేరము గలిగియుండిన క్షమింప బ్రార్థితుడను. ముమ్మయనాయకుడు చంద్రిగుత్తి మీద జరిపిన యీ దురాక్రమణలో నాకే మాత్రమునూ జోక్యములేదు. రాజద్రోహియగు నతనిని తాము బట్టి బంధించి, విచారణకు గురిచేసి, శిక్షింపుడు. నేను వద్దనుట లేదు"

"ఆ ద్రోహిని శిక్షించు విషయమును మేము చూచుకొనగలము ఇప్పుడు చెప్పుడు; యింతవరకూ నీ దుష్టుడగు ముమ్మయనాయకుడు మీ రాజ్యమందునూ, ప్రక్కరాజ్యములలోనూ నెన్నియో హత్యలనుజేసి, ప్రజాపీడిత కార్యములలో మునిగినాడు. అతనిని చూచుకొనుచూ మీరెందుకు వూరకుంటిరి? మీ యీ నిర్లక్ష్యముయొక్క యుద్దేశమేమి? చంద్రగుత్తి త్రియంబక దేవుని నాశమును యతనివలెనే మీరునూ లోలోపల కోరుకొనుచున్నట్టు మేము భావింపవచ్చునా?"

ఈ మాటలువిని వీరననాయకుడు బెదుగరచినాడు. అతని వదనము కళావిహీనమైనది. తడియారిన పెదవులను నాలుకతో సరిజేసుకొనుచూ, తడబడుచూ అనినాడు :

"ప్రభూ! అంతటి స్వార్థమేదియునూ నాకులేదు. నేనూ, త్రియంబక దేవుడునూ ఆప్తమిత్రులము. ఇట్లుండగా—"

"మీరు త్రియంబక దేవుని మిత్రులేయైనచో, మీ సామంతుడైన యీ చిన్న పాళెయగానికి చంద్రగుత్తి రాజ్యముమీద దండెత్తి వెళ్ళుటకు అంతధైర్య మెచ్చటనుండి రాగలదు? మీ రీ విషయముపట్ల ఉద్దేశపూర్వకముగనే నిర్లక్ష్యభావమును వహించి యుండుటను జూచిన— ముమ్మయనాయకుని వలె మీరునూ త్రియంబక దేవుని యభ్యుదయమును సహించలేక నాతని వినాశమును గోరుచున్నట్టు తోచుచున్నది. ఇందులకు మీ సమాధానమేమి?"

"ప్రభూ! నాకంతటి విద్రోహాలోచన లేమియునూలేవు. పంపాపతి సాక్షిగా నామాట సత్యము! కాని, ప్రబలుడైన ముమ్మయనాయకునితో వైరమును గట్టుకొనలేక, ఈ విషయముపట్ల కొంత నిర్లక్ష్యమును వహించుటయే నేను జేసిన మహాపరాధము! తొలుదొల్తనే సామ్రాట్టులకీ విషయమును తెలిపి, ఆ ముమ్మయనాయకుని శిక్షించియుండిన యిప్పుడు నాకీ యారోపణ వచ్చియుండెడిదికాదు" అని తలవాల్చి, ఖిన్నుడై నిలబడినాడు.

"వీరననాయకులూ! మేము మిమ్ములను రాజద్రోహియని యను కొనలేదు-అనుకొనుటయునూలేదు. మీ నిష్ఠపట్ల మాకు పూర్తిగా విశ్వాసము గలదు. కాని, మన సామంతుడగు నొకనిచే జరిగిన యీ విద్రోహమునకు మీరు బాధ్యులను విషయమును మాత్రము మరువకుడు. సకాలములో మీరు జాగ్రత్త వహించియుండిన, త్రియంబక దేవుల హత్య తప్పియుండెడిది! మీరు వహించిన తాటస్థ్య విధానమువలన మేమొక ప్రభుభక్తి పరాయణుని అన్యాయముగా బోగొట్టుకొనినాము" అని ప్రౌఢదేవరాయలు విషాదమును వ్యక్తపరచినాడు.

సామ్రాట్టు లనిన యీ మాటలతో వీరననాయకునకు తొలిసారిగా తన రాజద్రోహ మెంతటి యక్షమ్యాపరాధమనునది తెలిసినది. అతడు దాని పరిణామమును దలచుకొని గడగడ వణకినాడు. సామ్రాట్టుఁకు తానిప్పుడు తన నిష్ఠపట్ల నమ్మిక కలిగించనిచో, వారు సందేహించవచ్చునని భావించినాడు. అంతియగాక ఏ గౌరవమునకై తానీ గజవేట నేర్పరచినాడో, యా ఉద్దేశమిప్పు డపార్థమున కవకాశ మివ్వగలదు. అందు కనియే అతడు తన యుద్దేశమును విశదపరచుచూ అనినాడు :

"ప్రభూ! తాము నిజము చెప్పినమా, అబద్ధము చెప్పిననూ విన గలరు. ఈ వీరననాయకు డెప్పటికినీ స్వామిద్రోహి కాడు. పూజ్యులైన హరిహరదేవ సార్వభౌములు మా పూర్వుల నిష్ఠను చూచి, ఈ యరగ సీమను మాకు దయపాలించినారు. సామ్రాట్టుల మహా సేనాధిపతిగా నుండిన గుండదండ నాయకుడు మా తీర్థరూపులకు 'మూరురాయరగండ' డను బిరుదు ననుగ్రహించినారు. మేము విజయనగర సామ్రాట్టులను నిష్ఠతో గొల్చుచూ వచ్చినాము. ఎటువంటి పరిస్థితిలోనైననూ మేము ప్రభువుల ఉప్పుదిని వారికి ద్రోహము చేసియుండలేము. ఇటువంటి ఉత్తమ కులమునకు సంబంధించిన నావలన తెలియక అపరాధమేమైననూ జరిగి యుండినచో క్షమించ ప్రార్థన!" అని దైన్యముగా వేడు కొన్నాడు.

"అట్లయినచో మీరు మమ్మయనాయకుని విద్రోహకర చర్యల

నరికట్టుట కిదివరకే ఎందులకు ప్రియత్నించలేదు ? ఈ విషయమును మీరు మాకెందులకు తెలుపలేదు ?"

"ప్రభూ ! యథార్థమును నేను తమ సన్నిధిని విన్నవించుకొనుచున్నాను. సావధానముగా నాలించ ప్రార్థన: నేను. ముమ్మయనాయకుడు ఇరుగు-పొరుగు రాజ్యములలో జరుపుచూ యుండిన హత్యలు-దోపిడీలను గురించి వినియుంటిని. కానీ. అతనితో వైరము గట్టుకొని, యీ మలెరాజ్యమును బరిపాలించుట కష్టతరము. ఎందుకనగా నతడు సేవురా కులమునకు చెందినవాడు. అతని కీ మలెరాజ్యమందలి సంస్థానములలో గల పుళిందులందరి సహాయముగలదు. ఈ రాజ్యమందలి పాళియగాండ్రిందిరిలో నతడు మిక్కిలి సమర్థుడు. అతని రాజధాని సహ్యాద్రి సమీపమందలి కానన ప్రదేశమున నున్నది. అది మంచి ఆయకట్టు స్థలము. నిష్కారణముగా నతనితో వైరము గట్టుకొనినచో, పుళిందకులముచే నిండిన యీ మలెరాజ్యములో అశాంతి తలజూపగలదని భీతిల్లినాను. దీనికి తోడతనికి బారకూరు, బంకాపురము, బంగాడి రాజుల సహాయముకూడా నున్నది. ఈ కారణములచేతనూ, అగగరాజ్య క్షేమ దృష్టితోడనూ, సామ్రాజ్య భద్రతా హితదృష్టితోడనూ నేను ముమ్మయ నాయకుని వైరమును కట్టుకొనుటకు వెరగుపడినాను. ఇదియే నే నొనరించిన మహాపరాధము. అందులకై నే నిప్పుడు వ్యథపడుచున్నాను. సామ్రాట్టులు నా యపరాధమును పైరింపవలయును" అని వినమ్రుడై ప్రార్థించినాడు.

ఇదంతయునూ మౌనముగా వినుచూ నుండిన సామ్రాట్ ప్రౌఢ దేవరాయలు గంభీరముగా అనినాడు :

"వీరననాయకులూ ! మీ యీ ఒక్క కర్తవ్య పరాఙ్ముఖతకై నిష్కారణముగా మేము త్రియంబక దేవుని పోగొట్టుకొనవలసి వచ్చినది. అతని సహోదరి పద్మలాదేవియూ, నామె కుమార్తె పొన్నలాదేవియూ అన్యాయముగా నా దుష్టుని చేతికిచిక్కి బాధ లనుభవింపవలసి వచ్చినది. అదృష్టవశమున పద్మలాదేవిగారు మనకు లభించినారు. ఇక పొన్నలా దేవినికూడా దుష్టుడగు నా ముమ్మయనాయకుని వజ్రముష్టినుండి తప్పించి,

తీసుకొని వచ్చు బాధ్యత మీయది. వారమురోజులలో నామె నే విధముగా నైననూ తోడ్కొనివచ్చి యామె తల్లి కప్పగించనిచో, త్రియంబకదేవు నికి జరిగిన యన్యాయమునకుగా మీరు శిక్ష ననుభవించవలసియుండును"

ఈ తీర్పును విని వీరననాయకుడు గడగడ వణకినాడు. ప్రేత దర్శనము చేసుకొనిన వానివలె నతని ముఖము భీతిచే కళావిహీనమైనది. అతడు ప్రౌఢదేవరాయలనుండి యనుజ్ఞ బడసి, దుర్భిక్షను పరిగ్రహించి నట్టు భావించుచూ, అచ్చటినుండి బయలుదేరినాడు.

# 6

# గజాఖేటనము

వీరననాయకుని బంపివేసిన తరువాత ప్రౌఢదేవరాయలు మలె రాజ్యములో జరిగిన విద్రోహము తాను భావించిన దానికంటెనూ నెక్కుడపాయకర స్థితిలోనికి వచ్చినదని గ్రహించినాడు. ముమ్మయనాయకుడు తాననుకొన్నట్టు ఒక చిన్న పాళియగాడు కాక,సామ్రాజ్యమునకు ప్రబల శత్రువను విషయమిప్పుడు తెలిసినది. అతనిని జూచి వీరననాయకుడే భీతిల్లుచున్నాడనినచో, నిక అతడెంత ప్రబలుడై యుండవలయును ? అతనికి మలెరాజ్యమందలి పుళిందు లందరి సహాయమూ పూర్తిగా నున్నది. అంతియగాక తదితర చిన్న-పెద్ద రాజుల సాయముకూడా నున్నది. ఈ ప్రోత్సాములచే నతడు మదించి, కంపిలరాయలవలె నొక మాతన పుళింద సామ్రాజ్యమును నిర్మించుటకై బ్రియత్నించుచున్నచో ఆశ్చర్యపడనలసిన పనిలేదు.

తానీ దుష్టుని యింతవరకునూ పెరుగుటకు విడచినదే యపరాధ మైనది. అతనిమీద తానిదివరకే కఠినచర్య తీసుకొని యుండవలసినది.

తన నిర్లక్ష్యమువలన త్రియంబకదేవుడు నిష్కారణముగా బలియైనట్టే, సామ్రాజ్య భద్రతకూడా బలియగు సమయ మాసన్నమైనదని తన ప్రవర్తనకు తానే విషాదపడినాడు ప్రౌఢదేవరాయలు.

ముమ్మయనాయకునిమీద నేదైననూ కఠినచర్యకు పూనుకొనుటకు మునుపే యతని చేతినుండి పొన్నలాదేవిని రక్షించవలసియున్నది. అట్లు కానిచో తమ తొందరపా టామె సుకుమార జీవితమునకు మృత్యువు కాగలదు. లక్కనామాత్యుడు తిరిగి వచ్చునంత వరకునూ, ముమ్మయ నాయకుని పట్ల ఏ యంతిమ నిర్ణయమునకు వచ్చుటకునూ సాధ్యము లేదు.

సామ్రాట్టులు, లక్కనామాత్యుల రాక నెదురుచూచుచూ కూర్చున్నారు. ఒక వారమురోజులు గడచిననూ ముమ్మయనాయకుని చేతికి పట్టుబడిన పొన్నలాదేవి విషయముగాని, యామెను వెతుకుటకై వెళ్ళిన లక్కనామాత్యులను గురించికాని, ఏ సంగతియునూ తెలియలేదు. ఇది చూచి ప్రౌఢదేవరాయలకు దిగులు కలిగినది.

బహుశః ఆ దుష్టునివలన పొన్నలాదేవి కేదో యాపద సంభవించి, నామె యాత్మహత్య జేసుకొని యుండవలయును. ఈ వార్తను తెలియజేయుట కిష్టములేక లక్కనామాత్యు లెచ్చటనో తలదాచుకొని యుండవలయునని తోచసాగినది. కాని మరల తన యీ యాలోచన సరియైనదిగా నుండదనియూ, ఎంతటి భీకరవార్తయైననూ అమాత్యుడు తిరిగివచ్చి చెప్పక ఉప్పుదనియూ ననుకొనినాడు.

అయినచో, అమాత్యు డింతకాలమైననూ ఎందులకు తిరిగి రాలేదు ?

ఎంత యాలోచించిననూ దీనికి కారణము ప్రౌఢదేవరాయలకు తెలియకపోయినది. ఈ చింతతోనే యతడు నిద్రాహారములనుకూడా మానినాడు. కాని, యతనికి మనశ్శాంతి మాత్రము లభించలేదు.

పొన్నలాదేవిని గురించిన విషయము నామె తల్లికి తెలుపుటకు వీలులేక, ప్రౌఢదేవరాయలు తా నపరాధియని భావించుకొన సాగినాడు.

పద్మలాదేవికి తన ముఖమును చూపుట కతనికి సిగ్గు కలిగినది. అతడు తాను వచ్చిన కార్యమును మరచి, మృగయా వినోదక్రీడలను విడచి, సదా ఏకాంతమును కోరసాగినాడు.

గజవేటకని యింతవరకు నుత్సాహముతో ముందుకువచ్చి,ఇప్పుడు పొన్నలాదేవి సంఘటనతో మనస్సుకు వ్యధకలిగి, సదా శోకమూర్తియై కూర్చొనియున్న సార్వభౌములను జూచి, అంతఃపురామాత్యుడు బుక్కన దండనాయకునకు సఖేదాశ్చర్యము గలిగినది. సార్వభౌము డీ విధముగా చింతామూర్తియై యుండుట నతడెప్పుడునూ చూచియుండలేదు. అతని మనసును బాధించుచున్న పొన్నలాదేవి విషయమును కొంతకాలము మరచునట్టుగా జేయునిచో, సార్వభౌముని యారోగ్యము చెడగలదని అతడు గ్రహించినాడు. విదార్విహారములందును, వినోదములందును నాసక్తి కనబరచని సార్వభౌముల పరిస్థితి యతని కళవళమునకు కారణమైనది. ఏ విధముగా నైనను సార్వభౌముల మనసును గజవేటవైపు త్రిప్పినచో నతడు మునుపటివలె కాగలడని భావించి, బుక్కనామాత్యు డీ విషయమై సార్వభౌములను సందర్శించుటకు గజవేటగాండ్లలో ముఖ్యుడగు భరమన మావటీని పంపినాడు.

భరమన మావటీడు ప్రౌఢదేవరాయల శిబిరమునకు రాగా, సార్వభౌముడేదియో నొక కావ్యమును జదువగోరి, తల్లీనుడుకాలేక, విఫలుడై శతపథ తిరుగుచున్నాడు. అటువంటి సమయములో తనను సందర్శింప వచ్చిన భరమన మావటీని జూచి, సార్వభౌముని కాశ్చర్య మైనది.

"భరమనా, విశేషములేమి ? క్రొత్తగా ఏనుగులేమైనను కంట బడినవా?" అని కుతూహలముతో బ్రశ్నించినాడు.

"ప్రభూ ! క్రొత్తగా ఏనుగులను వెదకు మాటుండనిండు. ఇప్పుడు చేసుకొనియున్న ప్రయత్నములనే వదలుకొనవలసిన పరిస్థితి యేర్పడినది" అన్నాడు, బలవంతముగా చిరునవ్వును ప్రదర్శింప బ్రయత్నించుచూ భరమన మావటీడు.

"ఎందులకు?"

"ఎందులకేమి ప్రభూ! మనమిచ్చటికి వచ్చినది గజవేటకొరకు. అందుకు వలసిన యేర్పాటులన్నియును ముగించి వారము దినములైనవి. తమరొక పర్యాయమైనను వాటిని పరిశీలించుట కావైపు వచ్చుటగానీ, ఆ విషయిమై మాతో బ్రస్తావించుటగాని ఏమియును చేయలేదు. తమ కెందులకో గజవేట పట్ల హఠాత్తుగా విసుగు జనించినట్లు దెలియు చున్నది. మావలన నేమైనను యపరాధము జరిగియుండిన క్షమించ వల యును. తమ నిరుత్సాహమును జూచి నాకు చాల వ్యధగా నున్నది. మావటి వాండ్రిందరూ దిక్కుతోచక కూర్చొని యున్నారు. వారిని తాము సమాధాన పరచవలయును" అని వినమ్రుడై యన్నాడతను.

"భరమనా! నీవలన యపచార మేమియును జరుగలేదు. ఎందు వలననో కొన్ని రోజులనుండి నా మనస్సు కేదో యొక విధమైనమబ్బు గ్రమ్మియున్నది. దేనియందును సంతోషమూ—ఉత్సాహమూ రెండును లేవు. ఏదియో వ్యాకులముగా నున్నది. మరికొన్ని రోజు లీ స్థితియందే గడపిన నాకు నిజముగా బిచ్చి పట్టగలదు."

"అందులకనియే నేను తమ సన్నిధికి వచ్చినాను ప్రభూ! తమ పరిస్థితిని జూచి, శిబిరములోని వారందరూ దిగులుపడి కూర్చొని యున్నారు. తమరు ముమ్మయనాయకుని విషయమును మిక్కిలిగా మన సున నిడుకొని చింతించు చున్నట్టు దోచుచున్నది. నా కాజ్ఞనిండు. ఆ దుష్టుని చెరబట్టి తెచ్చి తమ పాదములమీద బడవేయుదును."

"అతనిని శిక్షించుటొక పెద్ద పనికాదు భరమనా! కాని యతనికి పట్టుబడిన పొన్నలాదేవి నెట్లు రక్షించ వలయుననునది మా చింత. ఎంత యాలోచించినను సరియైన మార్గము గోచరించుటలేదు. ఈ పని మీద వెళ్ళిన లక్కనామాత్యులుగాని, వాతని యనుచరులుగాని, వీరన నాయకుని భటులుగాని, యింకను ఏ విషయమును దెలుపకున్నారు. ఈ స్వల్ప కార్యమున కింతటి విలంబనయా? యని మనస్సుకు విసుగు జనించినది."

"ప్రభూ! తమరు చింతించకుడు. లక్కనామాత్యులు వెళ్ళి

యుండినచో వట్టిచేతులతో తిరిగిరారు. వారు వచ్చువరకును తాము గజ వేటకయి నేర్పరచిన ఏర్పాటులను జూడవచ్చునుగదా ! తమరు శిబిరము నుండి వెలుపలికి వచ్చిన యెడల మాకందరికినీ నూతనోత్సాహము జనించగలదు" అన్నాడు భరమన మావటీడు.

ఈ సలహాకు సామ్రాట్టు తలయూపి, తన సమ్మతిని తెలియజేసినాడు. అతనికికూడా తనను వేధించుచున్న పొన్నలాదేవి చింతనుండి మనస్సును కొంత ప్రశాంతింప జేయునట్టి వీరోచితమైన వినోదమేదైనను నొకటి కావలయునని దోచినది.

ప్రౌఢదేవరాయలకు తా నింతవరకూ వృథగా కాలహరణము జేసితినని సిగ్గుగలిగి, భరమన మావటీనితో మరునాడు వేకువఝామున తాను గజవేటకయి వచ్చుచున్నట్లుగా తెలియజేసినాడు. భరమన మావటీనికి చాలా సంతోషమైనది. ఒక్కన తన ప్రయత్నము ఫలించినందులకయి మిక్కిలిగా యానందించినాడు.

భరమన మావటీని కిచ్చిన మాటప్రకారము మరునా డుదయమే ప్రౌఢదేవరాయలు వేటదుస్తులను ధరించి, గజవేటకయి నేర్పాటు చేయబడిన బ్రయత్నములను చూచి వచ్చుటకయి యశ్వము నధిరోహించి బయలుదేరినాడు. భరమనయూ, నతని గుంపువారగు యితర మావటీవాండ్రును సామ్రాట్టుల ననుసరించినారు.

వారు ఏనుగులు గుంపుకట్టి నివసించుచున్న నదీ తీరమునకు వచ్చినారు. అచ్చట ఇభరాజముల చర్యలను గమనించి, యా విషయములను సామ్రాట్టుల కెరుగ జేయుటకయి నియోగింపబడిన నొక మావటీడు పరుగునవచ్చి—"ప్రభూ ! అన్యాయ మన్యాయము" అని బిగ్గరగా నిట్టూర్చినాడు.

"ఏమి జరిగినద"ని సార్వభౌము డాందోళనగా యడిగినాడు.

"మేము 'ఖెద్దా'ను నిర్మించుచున్న విషయమెట్లో నా ఏనుగుల గుంపుకు దెలిసిపోయినది. అవి వేరొక దిక్కునకు వెళ్ళిపోవుచున్నవి. మన మిప్పుడే వానిని బట్టుకొను ప్రయత్న మాచరించనిచో, మన

కనులుగప్పి వెళ్ళిపోగలవు. ఒక్క పర్యాయ మవి యీ ప్రదేశమును విడచి వెళ్ళుటకు నిశ్చయించుకొన్నచో, వాటిని మరల మన 'ఖెడ్డా'ల వైపునకు మరలించుట దుస్తరము. వెంటనే మనము కార్యోన్ముఖులు కావిచో, యిదివరకు చేసిన ప్రయత్నములన్నియునూ వ్యర్థము కాగలవు" అని విన్నవించుకొనినాడు.

ఇదివిని ప్రౌఢదేవరాయల కాందోళన గలిగినది. బహుశ్రమల కోర్చి, ఏనుగులను పట్టుకొనుటకై యీ ప్రదేశమందు 'ఖెడ్డా'ను నిర్మించుట మైనది. గజయూథ మిప్పు డా ప్రదేశమునుండి కాలు కదపినచో తమ శ్రమయంతయూ బూదిదలో బోసిన పన్నీరువలె వ్యర్థము కాగలదు. కాబట్టి గజము లచ్చటినుండి వెళ్ళుటకు మునుపే నే మాత్రమునూ సందడిలేక వాటిని బట్టుకొను ప్రయత్న మాచరించవలయును. ఈ సమయమున ప్రతిక్షణమూ నమూల్యమైనది యని ప్రౌఢదేవరాయలు భావించినాడు.

గజముల నతడు దూరమునుండి చూచి వచ్చుటకై గుబురుచెట్ల మరగున దాగి, నదీ తీరమునకు వెళ్ళినాడు.

అచ్చట 'శరావతి'యొక్క ఉపనది యొకటి ప్రవహించుచున్నది. అది యీ ప్రదేశము నందొక పెద్ద మడుగు నేర్పరచి ముందుకు సాగినది. అచ్చట జంబు, తుంగలు సమృద్ధిగా పెరిగియున్నవి. నదినీరు నిర్మలముగా నున్నది. యధేచ్ఛమైన నీరు-యధేచ్ఛమైన యాహారము ! వాటికింకేమి కావలయును ?

అచ్చట దాదాపు రెండువందల ఏనుగులు నిరాటంకముగా నే యపాయమునూ దలపక, నీటిలో స్వేచ్ఛగా విహరించుచూ, జలకేళి సలుపుచున్నవి. కొన్ని పెద్దపెద్ద గజరాజములు తీరములో పెరిగియున్న జంబును దినుచున్నవి. మరికొన్ని తొండముతో జంబు నూడలాగి, నదిలోనికి విసరి యానందించుచున్నవి. వేరొక కొన్ని తీరమందలి చల్లని యిసుక తిన్నెలపై పడుకొని విశ్రాంతి తీసుకొనుచున్నవి. తల్లి ఏను

గులు తమ గున్నలకు నీటితో స్నానమాడించు పనిలో నిమగ్నమై యున్నవి. తొండముతో నీటిని పీల్చుకొని పిచికారీతో గొట్టినట్టు ఆ నీటిని తమ పిల్లలపై చిమ్మి యానందించుచున్నవి. గున్న ఏనుగుల కది యొక వినోదముగా నున్నది. ఈ విధమైన యాటలలోపడి, యవి సంతోషముతో మైమరచియున్నవి.

ఆ దృశ్యమును జూచి, భావుకుడైన ప్రౌఢదేవరాయలకు హృదయ మానందముతో నిండిపోయినది. వాటి స్వేచ్ఛాజీవితమును జూచి, యిటు వంటి ప్రాణులకు తాను 'పారతంత్ర్యపు శృంఖలము'లను దగిలించు టయా ! యని క్షణకాలము వ్యథజెందినాడు. స్వాతంత్ర్యముయొక్క విలువను గ్రహించిన స్వాభిమానియగు నా సార్వభౌమునికా ప్రాణు లను జూచి, యా విధముగా దోచుటలో ఆశ్చర్యమేమియునూ లేదు.

కాని యది భావోన్మాదములో మైమరచి కూర్చొనుటకు తగిన సమయముకాదు. వెంటనే తాను కార్యాచరణ కుపక్రమించవలయును. లేనిచో ఒక మాసము రోజులుగా తామొనరించిన ప్రయత్నములన్నియూ నిష్ఫలములు కాగలవు. ఒక్కపర్యాయ మవి తమ పన్నుగడను పసిగట్టి నచో, మరల వాటిని బట్టుకొనుట సాధ్యముకాదు. అవి ప్రౌఢదేవ రాయలు మరునాడు ఏనుగులను వెన్నంటి తరుముటకై యాజ్ఞనిచ్చి, శిబి రమునకు వెనుదిరిగినాడు.

ఆనాటి రాత్రి ఖరమన మావటీడు, తన సంగడికాండ్రి నంద రనూ సమావేశపరచి, ఏనుగులను బెదరించుటకై తప్పెట కొట్టువారినీ, తాము కోరిన మార్గములో వాటిని నడపుటకు దివిటీలు బట్టువారినీ, పెంపుడు ఏనుగులను వెంటనిడుకొని రావలసినదని మావటీవాండ్రినూ తమ తమ పనులకు నియోగించినాడు.

ఆ ఏర్పాటు ప్రకారము తప్పెట కొట్టువారు, రణవాద్య విశేషము లైన కొమ్ము, కహళి, భేరి, డోలు తదితర చర్మవాద్యములనూ వెదురుతో చేసిన వాద్య విశేషములనూ, వాటిని వాయించు వాద్యగాండ్రినూ వెంట బెట్టుకొని మరునా డుదయమే ఖరమన మావటీడు బయలుదేరినాడు.

దిక్కులు పిక్కటిల్లజేయు నా కర్కశవాద్యముల ధ్వనికి అరణ్య మందలి మృగములన్నియునూ భీతిల్లి దిక్కుకొకటై పారిపోసాగినవి. ఏనుగులుకూడా దిక్కుతోచక ఘీంకారములు చేయుచూ ముందుకు దూకినవి. అవి అటు నిటు తప్పించుకొని పారిపోవుటకు వీలులేనట్లు, దివిటీలను బట్టుకొన్న సైనికులు కోలాహలము చేయుచూ, అగ్నిజ్వాలను చూపి భయపెట్టుచూ వాటినొక చోటకు గుంపుగా తోలినారు. ఈవిధముగా మూడువైపులనుండి వెన్నంటి తరుముచున్న తమ శత్రువుల బారినుండి తప్పించుకొనుటకై యవి మిగిలియున్న ఒకేయొక మార్గమును-తమ పతన మార్గమును బట్టి ముందుకు పోసాగినవి.

మావటివాండ్రు చేసిన భయంకరమైన శబ్దములకు దిగ్భ్రమ పొందిన ఏనుగులు తమను ముందుకు నడుపుకొని వెళ్ళుచున్న నాయకుని వెన్నంటి 'ఖెడ్డా'లు నిర్మింపబడిన మార్గమునే యనుసరించినవి.

ప్రౌఢదేవరాయలు 'ఖెడ్డా'ము వద్ద నెత్తగు మంచమీద వేయబడిన సుఖాసనములో నాసీనుడైయున్నాడు. అతడు దూరమునుండి వినవచ్చుచున్న మావటివాండ్ర కోలాహలమునూ, గజయూధము లేపుచున్న ధూళినీ చూచి.యవి తాము నిర్దేశించిన వైపునకే వచ్చుచున్నవని సంతోషపడినాడు.

మొదట యవి విశాలమైన బయలులో పరుగిడినవి. ఆ విధముగా కొంతదూరము ముందుకు వెళ్ళినకొలదిని దారి యిరుకై, ఒక కనుమ మార్గ మనుసరించినవి. మావటివాండ్రు ఉద్దేశపూర్వకముగనే వాటి నీ మార్గమును బట్టించినారు. ఇరుకైన యా కనుమనుండి తప్పించుకొని పోవుటకు వాటికి సాధ్యముకాదు. అంతియేగాక నా కనుమదారి ననుసరించిన ఏనుగులిక తమ స్వాతంత్ర్యమును వదలుకొనినట్టే! ఆవిధముగా వెళ్ళ యవి. పెద్దపెద్ద మ్రాకులతో నిర్మితమైన-ఖెడ్డము కోటలో చిక్కుకొనగలవు.

ప్రౌఢదేవరాయలు నిరీక్షించినట్టుగా అన్నియునూ సుగమముగానే జరిగినవి.

ఏనుగులు పడుచూ-లేచుచూ వచ్చి మ్రాకులతో నిర్మింపబడి యున్న కోటలో జొరబడగానే ప్రౌఢదేవరాయలా కోటద్వారమును క్రిందికి దింపి, వాటిని బంధించుడని యాజ్ఞాపించినాడు. సామ్రాట్టుల యాజ్ఞమేరకు భటులు బహుభారముగానున్న కొయ్య వాకిటిని క్రిందకు దింపి, గుంపునందలి దాదాపు రెండువందల ఏనుగుల నాకృతక కోటలో బంధించినారు. ప్రౌఢదేవరాయలు వాటిని వశపరచుకొనుటకు చతురులైన మావటివాండ్రను నియమించి గజవేట యశోవంతముగా నెరవేరినందుకు సంతోషించుచూ, భద్రమన మావటీని ప్రస్తుతించి, తన శిబిరమునకు తిరిగి వచ్చినాడు.

శిబిరమును చేరుకొనగా అచ్చట యింతకంటెనూ ప్రియకరమైన వార్త యతనికొరకై వేచియున్నది.

# 7

# అన్వేషణము

శిబిరములో పద్మలాదేవి ప్రౌఢదేవరాయల రాకను నిరీక్షించుచూ కూర్చొని యున్నది. అతడటు గజవేటకని శిబిరమును విడచి వెళ్ళిన పిమ్మట యిటు లక్కనామాత్యుడు పంపిన నొక భటుడు పద్మలాదేవి కొక లేఖను తెచ్చి యిచ్చినాడు. ఆ లేఖలో నమాత్యుడు పద్మలాదేవికి, ప్రౌఢదేవరాయలకు ప్రియమును గూర్చు నొక సంతోషవార్తను తెలియజేసినాడు.

అది పొన్నలాదేవిని గురించిన విషయము. దుష్టుడగు ముమ్మయనాయకుని చేతినుండి తప్పించుకొని యామె క్షేమముగా నున్నట్టు తెలిపినాడు. కాని పొన్నలాదేవి మాత్రి మతవి కింకనూ లభించి యుండలేదు.

తన కుమార్తె యా దుష్టుని బారినుండి తప్పించుకొనినదను విషయమును వినగానే పద్మలాదేవికి సంతోషముతో గంతులు వేయవలయుననునట్టయినది ఆమె యీ సువార్తను పౌఢదేవరాయల కెరిగించుటకై నావేగ మానసముతో కూర్చొని యున్నది.

పౌఢదేవరాయలు కూడా సంతటి యాతురతతోడనే శిబిరమునకు వెనుదిరిగి వచ్చినాడు. తమ గజవేట యశోవంతమైనదను సంతోష వార్తను పద్మలాదేవికి తెలుపవలయునని, యామె శిబిరమునకు వెళ్ళవలయు ననుకొనుచున్నంతలో ఆమెనుండి పిలుపందినది. ఆ పిలుపు నందుకొని త్వరితముగా పద్మలాదేవి శిబిరమునకు వెళ్ళినాడు.

సార్వభౌమునికి పద్మలాదేవి సుచితరీతిని స్వాగతము పలికి, ఆదర సత్కారము లొనరించి, తరువాత నవ్వుచూ చెప్పినది :

"ప్రభూ ! మీకు ప్రియకరమూ-సంతోషకరమూనగు యొక వార్త వచ్చియున్నది"

"తల్లీ ! అంతటి ప్రియకరమైన వార్తనే మీకొరకై నేనునూ తెచ్చినాను" అనినాడు సామ్రాట్ పౌఢదేవరాయలు.

"అది యీనాటి గజవేట విషయమేకద ప్రభూ :"

"ఔను !"

"ఈనాటి వేటలో నెన్ని ఏనుగులు పట్టుబడినవి?" కుతూహలము నాపుకోలేక ప్రశ్నించినది పద్మలాదేవి.

"దాదాపు రెండువందల గజములు పట్టుబడినవి. పంపానాథుని కృపచే మన ప్రయత్నమునకు ప్రథమ పర్యాయమే యశోమాల కంఠము నలంకరించినది. మీరు మాకు లభించిన ఘడియయొక్క ఫలితమేమో, ప్రథమ ప్రయత్నములోనే యున్ని యిభరాజములు మా వశమైనవి. ముందెన్నడూ యింతటి గజసంపద మాకు లభించి యుండలేదు. ఇది యంతయునూ మీరు మా శిబిరమున యడుగిడిన ఘడియయొక్క ఫలితము"

"కాదు-పంపానాధుని యనుగ్రహఫలము ! మీ దైవభక్తికి—

ప్రజావాత్సల్యమునకు తగిన ఫలితమును భగవంతు డనుగ్రహించినాడు. ఇంతకంటెనూ నెక్కుడగు నొక సంతోషవార్త వచ్చియున్నది. లక్కనామాత్యులు లేఖను వ్రాసి బంపియున్నారు"

"ఏమి వ్రాసియున్నారు ?" ఆశ్చర్యమును బ్రకటించుచూ ప్రశ్నించినాడు సామ్రాట్టు.

"భగవంతుని దయవలన పొన్నల క్షేమముగా నున్నదట"

"అయినచో, నామె యమాత్యుల చేతికి చిక్కినదా ? ఎప్పుడు చిక్కినది ? ఎచ్చట చిక్కినది ? ఆమె సురక్షితముగా నున్నదికదా ?" యని ఒక్కసారిగా నాలుగైదు ప్రశ్నలను వేసినాడు సామ్రాట్టు.

ఆ ప్రశ్నలకు సమాధానము లిచ్చుటకు మారుగా పద్మలాదేవి తనకు వచ్చిన లేఖను సామ్రాట్టుల చేతి కందించినది. అందులో నీ విధముగా నున్నది —

"తల్లీ !

మిమ్ములనూ, సామ్రాట్టులనూ విడచి వచ్చిన తర్వాత, చిరకాలానంతరము యీ లేఖ వ్రాయుచున్నాను. ఇంతకంటెనూ త్వరితముగ వ్రాయుటకు వీలుగాక పోయినందులకు క్షమింప బ్రార్థన !

సంతోషకరమగు నొకవార్తను తమకూ, పూజ్యులైన ప్రభువులకూ విన్నవించుకొనుటకు హర్షించుచున్నాను. మన యందరియొక్క పూర్వార్జిత పుణ్యవిశేషమువలన మాకు పొన్నలాదేవిని గురించిన వార్త తెలిసినది. దుష్టుడగు మమ్మయనాయకుని సైనికుల చేతినుండి నామె ఎట్లో తప్పించుకొని, క్షేమముగా నున్నట్లు తెలిసినది.

ఈ సంతోషవార్త మాధవశర్మ యను నొక కరణమువలన దెలిసినది. ముకుంద పెద్దయను నొక వైష్ణవ పండితుడు భార్యాబిడ్డల సమేతముగా 'ఉడిపి'కి యాత్ర వెళ్ళి యుండెనట. యాత్ర ముగించుకొని తన గ్రామమునకు వచ్చుచుండగా దారిలో నసాధారణ రూపవతియైన ఒక చిన్నదానిని చూచినాడట. ఆమె గాయపడి, ప్రజ్ఞాశూన్యురాలై ఒక మడుగు దగ్గర పడియుండినదట. ఆమెను చూచి, అనుకంపము జనించి, ముకుందపెద్ద తనవెంట స్వగ్రామమునకు తోడ్కొని వెళ్ళెనట.

తలమీద తగిలిన దెబ్బవలననో, లేక జన్మతః మూగియో ఆమెకు మాటలు రావట। ఎంత ప్రియత్నించిననూ ఆమె నామముగాని, తలి దండ్రుల నామధేయములుగాని తెలుసుకొనుటకు సాధ్యముగాక పోయిన దట. ఆ స్థితిలో యామె నచ్చట విడచి వెళ్ళుటకు మనసురాక తమవెంట తీసుకొని వెళ్ళినారట.

ఆమె పేరు, కులగోత్రములు ఆ కరణముద్వారా మాకు తెలియక పోయిననూ, ఆమె దొరికిన స్థలమునుబట్టి చూచిన నామెయే పొన్నలా దేవియై యుండవచ్చుననుటకు సందియములేదు.

ఆమె క్షేమసమాచారములను గురించి దెలిసిననూ మ్ముమ్మయనాయ కుని భటుల చేతినుండి ఎట్లు తప్పించుకొనినది, ఎందులకామె స్మృతి గోల్పోయినది, ఆ విప్రోత్తము డామె నెచ్చటికి తోడ్కొని వెళ్ళినాడు ? అను విషయములను గురించి వివరములు తెలియకపోయినవి.

అతడు ముళబాగిలు మండలమునకు సంబంధించిన నొక అగ్రి హార నివాసియగు సదాచార సంపన్నుడైన బ్రాహ్మణుడట. ఈ విష యము నాధారముజేసికొని, మే మతనిని వెదకిపట్టి, పొన్నలాదేవిని పరి శోధించి తోడ్కొని రావలసియున్నది. ఈ సంగతిని మీకు తెలియజేసి, యిప్పుడే ముళబాగిలు మండలముపైపునకు వెళ్ళుచున్నాను. బహుశః మా మాదనవలన మీరింకనూ ఎక్కువ విషయములు తెలుసుకొనగలరు. దైవానుగ్రిహమువలన మా యీ ప్రియత్నము సఫలము కావచ్చును.

సాధ్యమైనంత త్వరలో పొన్నలాదేవిని దోడ్కొని వచ్చి, మీ సన్నిధిని నిలుపగలను. ఈ విషయమై మీరు చింతించకుడు. ఇంతవరకూ యీ చీకటిలో దారిజూపి నడిపిన ఆ పంపానాథుడే యికముందుకూడా మాకు చేయూతనిచ్చి, యశస్సును కలిగించ గలడను నమ్మికగలదు. సామ్రాట్టులకు నా ప్రణామము లర్పింపుడు. వారికికూడా యీ విషయ ములను దెలుపుచూ వేరొక లేఖ వ్రాసియున్నాను.

ఇట్లు,
తమ విశ్వాసపాత్రుడు,
అక్కనామాత్యుడు"

ఈ ఉత్తరమందలి విషయములను చదివి, సామ్రాట్టుల ముఖము వికసించినది. చేయిజారిపోయిన ఒక యపూర్వ నిధి మరల కైవసమైనంతగా సంతసించినాడు. ఈ వార్త తెలిసినందులకై యతడు లక్కనామాత్యులకూ, తమమీద ననుగ్రహము జూపిన పంపాపతికీ మనసార వందనము లర్పించినాడు.

"తల్లీ! ఇదంతయూ ఆ పంపానాథుని యనుగ్రహ విశేషముగాక మరేమియునూ కాదు. లేనిచో ముమ్మయనాయకుని చేతినుండి ఆమె సురక్షితముగా తప్పించుకొనుటనిననేమి? లక్కనామాత్యులు తమరాడిన మాటలను కార్యరూపమున చేసి చూపినారు. మన కృతజ్ఞతకు పాత్రులైనారు" అని గంభీరముగా యనినారు.

అంతలో అంతఃపురామాత్యుడు బుక్కననాయకుడు సామ్రాట్టులకు వ్రాయబడిన లేఖను తెచ్చి యిచ్చి వెళ్ళినాడు. ఆ లేఖలో క్రిందటి లేఖయందలి విషయములే నున్నవి. దైవానుగ్రహమున్నచో మరొక వారము దినములలో వచ్చి సామ్రాట్టులను కలుసుకొనునట్టుగా వ్రాసినాడు లక్కనామాత్యుడు.

సామ్రాట్ ప్రౌఢదేవరాయలు లక్కనామాత్యుల రాకనే ఎదురు చూచుచూ కూర్చున్నాడు. కాని, అమాత్యుడు తన లేఖలో దెలిపినట్లు, ఒకవారము రోజులైననూ వెనుదిరిగి రాలేదు. ఎందుల కాలస్యమైనది? అతనికి పొన్నలాదేవి జాడ దెలిసినదో లేదో? యని సందేహించుచుండగనే అమాత్యుడు ముళువాయి (ప్రస్తుతము కోలారుజిల్లా యందలి ముళబాగలు) నుండి వ్రాసిన మరొక లేక వచ్చి చేరినది.

ఆ లేఖలో లక్కనామాత్యుడు తాను ముళువాయికి వచ్చిన తర్వాత ముకుందపెద్దను గురించిన విషయములు కొన్ని లభించి యున్నట్టునూ, భగవదనుగ్రహమున్నచో మరొక వారమురోజులలో పొన్నలాదేవితో బాటు వచ్చి, సామ్రాట్టులను సందర్శించునట్టునూ తెలియజేసినాడు. పద్మలాదేవి, సామ్రాట్టులు అమాత్యుల రాక నెదురుచూచుచూ రోజులు గడుపసాగినారు.

లక్కనామాత్యుడు తాను వ్రాసిన గడువునకు పూర్వమే గజవేట శిబిరమును చేరి, పొన్నలాదేవిని సామ్రాట్టుల కప్పగించి "ప్రభూ! తమ యాజ్ఞమేరకు పొన్నలాదేవిని సురక్షితముగా తీసుకొని వచ్చి తమ కప్పగించినాను. భగవదనుగ్రహమువలన తమ కిచ్చిన వాగ్దానమును నెర వేర్చుకొన్నాను. ఈ కన్యారత్నమును తాము స్వీకరించి, పద్మలాదేవి కప్పగింపుడు" అని వినమ్రుడై విన్నవించుకొనినాడు.

"అమాత్యా! ఉండిన మీవంటి స్వామి నిష్ఠాగరిష్ఠులే యుండవల యును. మిమ్ములను గన్న భూమాత ధన్యురాలు!"

అని చెప్పి, ప్రౌఢదేవరాయలు పొన్నలాదేవిని పద్మలాదేవి కప్పగించినాడు.

చిరకాలానంతరము పద్మలాదేవికి కుమార్తె సందర్శన భాగ్యము లభించినది. ఆమె పరుగున వచ్చి, కుమార్తెను కౌగిలించుకొని తనయ మరల తనకు దక్కినదికదా? యని ఆనందాశ్రువులు రాల్చినది. ఆమెను ముమ్మయనాయకుని బారినుండి రక్షించితెచ్చిన లక్కనామాత్యునకు తన కృతజ్ఞతలు తెలుపుకొనినది.

"అమాత్యులూ! నావలన తమకు చాలా యిబ్బందులు కలిగినవి. కాని, మాకష్టమును మీతో నివేదించుకొనక యింకెవరితో నివేదించుకొన గలము? ప్రజావత్సలులైన సామ్రాట్టులు వారు! వారికి తగిన ప్రభు సేవా పరాయణులు మీరు! మిమ్ములను గన్న యీ భూమాత ధన్యు రాలు!" అని పద్మలాదేవి తన యానందమును వెల్లడించినది.

"తల్లీ! మేము మా కర్తవ్యమును నిర్వహించినాము. దీనిలో నే గొప్పయునూలేదు" అని అమాత్యు డనినాడు.

పద్మలాదేవి, విగ్రహమువలె నిలబడి రెప్పవాల్చక తననే చూచు చున్న పొన్నలాదేవిని అనుకంపనుతో నవలోకించుచూ,"అమాత్యులూ, ఈ బిడ్డను మీ రా క్రూరరాక్షసుల చేతినుండి ఎట్లు తప్పించినారు? ఈమె మీకెచ్చట లభించినది? ఎట్లు లభించినది? అన్నియునూ సవివరముగా

దెలుపుడు. ఆ వివరములను వినవలయునని చాల కుతూహలముగా నున్నది" అని యడిగినది.

"ఔను, అమాత్యా! ఈ పొన్నలాదేవి మీకెచ్చట లభించినది? ఎట్లు లభించినది? అని తెలుసుకొనుటకు నేనుకూడా కుతూహల పడు చున్నాను. ఆ విషయమును సవివరముగా తెలుపుము" అని ప్రౌఢదేవ రాయలు ధ్వని మేళవింపజేసినాడు.

"ప్రభూ! అదొక పెద్ద గాథ. ఈ సాహసములో పురుష ప్రయత్నమునకంటెనూ, దైవకృపయే గొప్పది. ఆ పంపానాథుని యను గ్రహములేనిచో ఈ బిడ్డ మరల మనకు లభించియుండదు" అని చెప్పి, క్షణకాలా నంతరము తాను ప్రౌఢదేవరాయలను విడచి వెళ్ళిన తరువాత అప్పటివరకునూ జరిగిన విషయములన్నియునూ వివరముగా తెలిపినాడు.

అవును, నిజముగా నదియొక అద్భుతమునూ, రమ్యమునూ గల యట్టి కథ!

# 8

# పుత్రికా ప్రాప్తము

అనాడు సార్వభౌముని యాజ్ఞను తలదాల్చి లక్కనామాత్యుడు పొన్నలాదేవి నన్వేషించుటకై బయలుదేరినాడు. కాని యా కార్యము ప్రౌఢదేవరాయలు భావించినంత సులభతరముకాక పోయినది.

చంద్రగుత్తి నుండి బయటపడిన ఆ తల్లీకూతుళ్ళు ముమ్మయనాయ కుని చేతికి పట్టుబడగానే తమ కథ ముగిసినదని భావించినారు. కాని, అదృష్టవశమున పద్మలాదేవి సామ్రాట్టుల సాయముతో ఆ హంతకుల

చేతినుండి తప్పించుకొనినది. పొన్నలాదేవి మాత్రము వారికంత సులభ ముగా లభించలేదు.

ఆమె పల్లకీని మోయుచున్న బోయీలు వేరొక మార్గమునబడి బోలెయ దుర్గమునకు నడువసాగినారు. నిర్మానుష్యమైన ఆ యరణ్య ములో వారి దారిని గుర్తించుట కష్టతరమైనది. అయిననూ భగవంతునిపై భారముమోపి, లక్కనామాత్యుడు తన యనుచరులతో వారు వెళ్ళిన మార్గము నన్వేషించుచూ బయలుదేరినాడు.

అతనిని వెన్నంటి వచ్చిన అశ్విక దళనాయకుడు, అమాత్యుల వద్దకు వచ్చి—

"ప్రభూ ! చంద్రగుత్తినుండి బోలెయ దుర్గమునకు రెండు మార్గములున్నవి. ఒకటి సమీపముగా నున్నది; ఇంకొకటి దూరముగా నున్నది. ఆ సమీపపుదారి కొండలు-గుట్టలు నడుమనున్నది. అది నిర్మా నుష్యమగు దుర్గమ కానన ప్రదేశమును దాటి వెళ్ళును. ఈ దారియందే పొన్నలాదేవి నా ఘాతుకులు బోలెయ దుర్గమునకు తీసుకొని వెళ్ళు చుందురు. ఆలస్యము చేయక మన మీ దారి ననుసరించు టుత్తమము" అని సలహా నిచ్చినాడు.

లక్కనామాత్యుల కీ సలహా ఉత్తమమైనదిగా తోచినది. వెంటనే వారు రాజబాటను విడచి కొండలు-గుట్టల నడుమ వెళ్ళు దుర్గమారణ్య మార్గములో తమ గుఱ్ఱములను ముందుకు నడపినారు. ఈ మార్గము వెంబడి వారు చాల దూరము ప్రయాణించి, ఒక గ్రామమును చేరినారు.

ఆ గ్రామవాసులను విచారించగా, నా మునుపటిరోజు ఆ మార్గ ముగా ఒక పల్లకీ వెళ్ళినదనియూ, దానిని పదిమంది యోధులు వెన్నంటి వెళ్ళుచుండిరనియూ తెలిసినది. ఆ పల్లకియే పొన్నలాదేవి నెత్తుకొని పోవుచున్నదై యుండునని, చతురుడైన లక్కనామాత్యుడు గ్రహించి నాడు. వారచ్చట చాలసేపు నిలువక తమ ప్రయాణమును మరల ముందుకు సాగించినారు.

ఈ విధముగా ప్రయాణించుచుండగా, మార్గమధ్యమున వారికి

వీరననాయకుడు పొన్నలాదేవి నన్వేషించుటకై బంపిన భటుల గుంపు ఎదురైంది. వారి నీ విషయమై విచారించగా తమకే పల్లకియునూ ఎదురు పడలేదని తెలియజేసినారు. ఆ మాటవిని లక్కనామాత్యునికి కలిగిన విరాశ యింతింతనరానిది.

వాస్తవాంశమేమనగా, వీరననాయకుడు పంపిన గుంపున కెదురుగా ముమ్మయనాయకుని భటులు వచ్చుచున్నారు. మధ్యాహ్న మగుటచే వారు పల్లకీ నెచ్చటనైనా ఒక నీరుగల ప్రదేశములో దింపి, అచ్చట తమ భోజన పానీయములను ముగించుకొని తర్వాత ప్రయాణము సాగించ వచ్చునని, సమీపములోనున్న మడుగువద్ద నిలచినారు.

వారచ్చటికి వచ్చునంతలో సైనికులు మాటలాడుకొను శబ్దమును-గుఱ్ఱపు డెక్కల ధ్వనియును వినబడి దిగ్భ్రాంతులైనారు. పల్లకీలోనున్న పొన్నలాదేవి యిది చూచి రక్షింపుడని అరచినది. ఆమె కేకలతో తమ జాడ శత్రువులకు తెలిసి, తామెల్లరూ వారికి పట్టుబడవచ్చునని భీతిల్లి నారు. ఆ దళనాయకు డామె నోరు మూయించుట కెంతయో ప్రయత్నిం చినాడు. కాని ప్రయోజనము లేకపోయినది. అతనికి మరేమి చేయుట కునూ తోచక, తనవద్దనున్న కొయ్యతో బలముగా ఆమె తలపై మోది నాడు. ఆ దెబ్బకు తలనుండి రక్తము స్రవించుచుండగా ఆమె స్మృతి కోల్పోయినది. అతడు మెల్లగా ఆమెను పల్లకీలో పరుండబెట్టినాడు.

ఇదంతయూ క్షణకాలములో జరిగిపోయినది. ఖురపుటధ్వని చాలా సమీపమున వినబడసాగినది. తమను వెన్నంటి వచ్చుచున్న సైని కులు తమకంటెనూ ఎక్కువ సంఖ్యలో నున్నారని గ్రహించిన ముమ్మయనాయకుని భటులు తాము ఇక అచ్చట ఆలసించిన అపాయ మని గ్రహించి, పల్లకీని నది ప్రక్కన పారవేసి, పారిపోయినారు. కొంతసేపు ఎచ్చటనో దాగివుండి, తర్వాత తీసుకొని వెళ్ళుటకయి వచ్చి చూడగా పల్లకీలోనుండిన పొన్నలాదేవి కనుమరుగైనది. వీరన నాయ కుని సైనికులామెను తీసుకొని వెళ్ళియుండవచ్చునని భావించి, ఆ ధూర్తులు జరిగిన సంగతి తమ నాయకునికి తెల్పుటకయి బోలెయ దుర్గము దారి బట్టినారు.

జరిగిన విషయ మేమనగా, వారటు వెళ్ళగానే యిటు జ్ఞానశూన్యురాలై పల్లకీలో పడియుండిన పొన్నలాదేవికి స్పృహ వచ్చినది. ఆమె తానున్న పల్లకీనుండి బయట పడుటకెంతయో యత్నించినది, కాని సాధ్యము కాకపోయినది. ఆమె కాలు చేతుల నా నీచులు బలముగా బంధించి వేసినారు. అతి ప్రయత్నముమీద నోటితో కట్లను విప్పుకొనినది. అనంతర మొక క్షణమైననూ అచ్చట నిలువక పారిపోయినది.

ఆమెకు తా నెచ్చట నున్నదీ, ఏమి చేయుచున్నదీ తెలియదు. పిచ్చిదానివలె పరుగిడ సాగినది. ఆ విధముగా నదివెంబడి చాలదూరము పరుగిడి, చివరకు శక్తిగుంది, అలసటజెంది నదియొడ్డున స్పృహ గోల్పోయి పడిపోయినది.

ఈ స్థితిలో ఆమె ఆ విధముగా ఎంతసేపు గడిపినదో నామెకే తెలియదు. స్పృహ వచ్చునప్పటి కొక వృద్ధ బ్రాహ్మణ దంపతులు తన కుపచర్యలు చేయుచుండుట తెలుసుకొనినది. వారి చిన్న పిల్లవాడు ఆందోళనగా ఆమెను చూచుచూ నిలబడినాడు.

ఆమె కిదియంతయును ఆశ్చర్యమును కలిగించినది. తా నెవరు? తా నచ్చటి కెందులకు వచ్చినది? తన కుపచర్యలు చేయుచున్న ఆ కరుణామూర్తు లెవరు? అను విషయము లేమియునూ ఆమెకు బోధ పడలేదు. ఆశ్చర్య పూరితములైన నయనములతో మౌనముగా నామె తన కుపచర్యలు చేయుచున్న దంపతుల ముఖ మవలోకించినది. ఆమెకు స్పృహ కలుగుట జూచి ఆ వృద్ధ బ్రాహ్మణుడు ప్రశ్నించినాడు :

"తల్లీ! నీ వెవరు? ఇచ్చటికెట్లు వచ్చితివి? ఈ నిర్జనారణ్యములో గాయపడి పడియుండుటకు కారణమేమి? నిన్నీ స్థితికి దెచ్చిన నీచు లెవరు?"

ఈ మాట లామెకు వినబడినవో లేదో-ఆమె ఏమియును బదులు పలుకక, గాజువంటి తన నిర్జీవములైన కనులతో చూడసాగినది.

"నీ వెవరు కుమారీ! నీ పేరెయ్యది? నీ ఊరెయ్యది?" అని మరల నా వృద్ధ బ్రాహ్మణుని పత్ని యడిగినది.

ఆ మాటలకు కూడా నామె జవాబు చెప్పక, విగ్రహమువలె అట్లే పడుకొని యుండసాగినది. ఆమెకు ఉచ్ఛ్వాస నిశ్వాసములు సరిగనే యున్నవి. కాని యామె మనుషులను గుర్తించునట్టి స్థితిలో లేదు. తలకు తగిలిన దెబ్బవలన నామె స్మృతి శక్తి పూర్తిగా గోల్పోయినది. తనను గురించి ఎంత యాలోచించిననూ ఆమె కేమియును దోపక పోయినది. ఏమి చెప్పుటకును నోరుకూడ వచ్చుటలేదు. తా నీ లోకపు వ్యక్తిని కాదను నట్టామె, మౌనముగా వారిని తిలకించ సాగినది.

ఆ వృద్ధ దంపతుల కా చిన్నదాని విషయమై ఏమియును తెలియ పోవుట వ్యథను కలిగించినది. ఆమె ఎవరు? ఆమె తలిదండ్రు లెవరు? ఎవరివలన ఆమె కీ దుర్గతి ప్రాప్తమైనది ? మొదలగు విషయములను తెలుసుకొన వలయునని వారికికుతూహలముగా నున్ననూ, ఆ సంగతులను దెలుపుటకు పొన్నలాదేవి సమర్థురాలు గాలేక పోయినది. ఆమె నచ్చటనే విడచి వెళ్ళుటయా? లేక తమవెంట తోడ్కొని వెళ్ళుటయా అని కొంతసేపాలోచించి, వారు చివరకు ఆ చిన్నదాని నెవరైనను తమ బిడ్డయని గుర్తించి అడిగినచో వారి కప్పగించ వచ్చునని తీర్మానించి,తమతో తీసుకొని వెళ్ళినారు. మమ్మయనాయకుని సైనికు లామెకొరకయి మరల వచ్చి చూడగా నామె వారి కచ్చట కనబడలేదు. అప్పటికే ఆమె చాల దూరము వెళ్ళిపోయినది.

ఆ వృద్ధ దంపతులు ఉడిపికి వెళ్ళియుండిన యాత్రికులు. వారు తమ క్షేత్ర యాత్రను సుగమముగా సాగించుకొని, స్వగ్రామమునకు తిరిగి వచ్చుచున్నారు. వారి యూరు ముళవాయి—ముళబాగలు—మండలమునకు చేరిన చంద్రపురమను అగ్రహారము. అచ్చట వారు వెంకటరమణస్వామి దేవాలయమునకు అనుకుబగానుండి, కాలమును సుఖముగా గడుపువారు.

ఆ బ్రాహ్మణుని పేరు ముకుందపెద్ద. అతడు విద్వాంసుడూ, దైవభక్తి గలవాడూ నగు భూసురశ్రేష్ఠుడు. తన సదాచార, సద్వర్తనలచే ఊరిలోని వారందరి ప్రీత్యాదరములకు పాత్రుడైనాడు. సుశ్రోత్రియుడూ, పౌరాణికుడూ నగుటచే చుట్టుపట్ల గ్రామములో కూడా గౌరవ

న్వితుడై నాడు. అతనికి సంస్కృతము, తెలుగు, కన్నడము మొదలగు భాషలపై నధికారము గలదు. అందరును అతనిని 'ముకుందపెద్ద' యని పిలచువారు. పెద్ద — పెద్దవారు — యనున దతని పేరునందలి యొక భాగమే యైనది. అది యతనికి ప్రజాసామాన్య లిచ్చిన బిరుదు.

చిరకాలముగా అతనికి తమ ఆరాధ్య దైవమైన ఉడిపి శ్రీకృష్ణ భగవానుని దర్శనము చేసుకోవలయునను ఆశ గలదు. మర్త్యుడై జనించిన తరువాత ఉడిపి శ్రీకృష్ణుని దర్శించనిచో సార్థకమేమి గలదని అతని పత్ని యనుచుండెడిది. ఈనాడు — రేపు అని ఈ విధముగా వారు గడచిన పది సంవత్సరములుగా తమ ఉడిపి ప్రయాణమును వాయిదా వేయుచూ వచ్చినారు. ఈ కాల వ్యవధిలో యెప్పుడును వారి కా క్షేత్ర యాత్రా యోగము కలుగలేదు. కాని ఈ పర్యాయము ముళువాయి నగర మందలి వైష్ణవ భక్తు లనేకులు ఉడిపికి వెళ్ళనున్న సంగతి విని, ధైర్యము చేసి ఆ దంపతు లిరువురూ బయలు దేరినారు.

ఆనాడు వారు తమ యాత్రనుండి వెనుదిరిగి వచ్చుచుండగా, ధర్మ కర్మ సంయోగమనునట్లుగా పొన్నలాదేవి వారికి లభించినది. ఆడబిడ్డలు లేని యా దంపతు లామెను భగవంతుడే తమకు ప్రసాదించినేమోయని భావించి, ఆమెను తమవెంట తమ స్వగ్రామమునకు తీసుకొని వచ్చినారు స్వగ్రామమునకు తిరిగి వచ్చునపుడొక రోజు వారు మాధవశర్మ యను నతని కతిథులై అతని యింటనుండి నందువలన, పొన్నలాదేవి విషయమై అతనికి అల్ప స్వల్ప సంగతులు తెలిసినవి. తనకు తెలిసిన విషయములనే అతడు లక్కనామాత్యులకు చెప్పినాడు.

మాధవశర్మ చెప్పిన వివరముల నాధారము చేసుకొని ముకుంద పెద్ద రక్షించిన బాలికయే పొన్నలాదేవియై యుండవచ్చునని లక్కనామాత్యు డనుకొన్నాడు. కాని ఆ విషయమై అతనికెక్కువ వివరములు తెలియలేదు. ఏమైననూ కానీ, ముకుందపెద్దను వెదకికొని తాను ముళువాయికి వెళ్ళినచో, అచ్చట తన సహోదరుడగు మాదన (మాదన్న) దండనాయకుని వలన అన్ని విషయములనూ తెలుసుకొనవచ్చునని యూహించి, తడవుచేయక వెంటనే అతడు ముళువాయికి పయనమైనాడు.

లక్కనామాత్యుల నిరీక్ష వ్యర్థము కాలేదు. ముళువాయికి వచ్చిన తరువాత అతనికి తనకు కావలసిన విషయ సంగ్రహణము చేసికొను టెక్కువ కఠినతరము కాలేదు.

ముళువాయి ప్రాంత్యమును పరిపాలించుచున్న మాదన దండ నాయకుడు లక్కనామాత్యుల చిన్నతమ్ముడు. సింగన, లక్కన, జక్కన, మాదన దండనాయకులు ప్రాచీన రాజకుటుంబములలో నొకటియగు హొయిసల వంశమునకు సంబంధించినవారు. వారు విష్ణువర్ధనుని గోత్రి జులు. వారి తండ్రి హెగ్గడదేవుడు, తల్లి ఓబాంబ. వీరికి జనించిన యీ నల్వురు సోదరులు స్వశక్తి-సామర్థ్యములతో కొంతకొంతగా వున్నతి లోనికి వచ్చినవారు.

అందరికంటెనూ పెద్దవాడగు సింగన నాయకుడు సైన్యములో నున్నతాధికారిగా నున్నాడు. లక్కనామాత్యుడు వైదిక విద్యలో పరిణ తుడై, సంస్కృతాంధ్ర కర్ణాటములలో మహాపండితుడూ, కవియూనైన వాడు. పరమ శివభక్తుడు. అతడు తన గురువగు చంద్రభూషణ క్రియా శక్తి దేవుల సలహా మేరకు 'శివతత్త్వ చింతామణి' యను గ్రంథమును రచించినాడు. అతని ప్రజ్ఞకు మెచ్చి సామ్రాట్ ప్రౌఢదేవరాయ లతనికి ముళువాయి రాజ్యమును యిచ్చి ఏలుకొమ్మనెను. అతని ప్రతినిధిగా యిప్పు డా రాజ్యము నతని సోదరుడగు మాదన దండనాయకుడు పాలించుచున్నాడు. ఆ రాజ్యమునకు తేకలునాడు, రాజగంభీర దుర్గమూ అనునవి కూడా చేరియున్నవి.

లక్కనామాత్యునికి 'దక్షిణ సముద్రాధిపతి' యను బిరుదుకూడ సున్నది. అతడు మహా శివభక్తుడగుటచే, విరూపాక్ష పురములో నొక ప్రసన్న విరూపాక్ష దేవాలయమును కట్టించినాడు.

చిరకాలముగా లక్కనామాత్యునికి తన రాజ్యమునకు వచ్చుట కవకాశము లభింపలేదు. ఇప్పుడు పొన్నలాదేవిని గురించి అతడు ముళు వాయికి రావలసివచ్చినది.

ఏ విషయమూ దెలుపక హఠాత్తుగా వచ్చిన అన్నగారగు లక్క

నను జూచి మాదనకు ఆశ్చర్యమైనది. లక్కన జరిగిన విషయములను దెలిపిన పిమ్మట అతడు తన సమాధానపు నిట్టూర్పు విడచినాడు.

సోదరుని సాయముతో లక్కనామాత్యునికి ముకుందపెద్ద నివసించు అగ్రహారమును వెతకుటంత కష్టతరము కాలేదు.

గూఢచారుల సాయముతో అతడు ముకుంపెద్ద నివాసస్థలమైన అగ్రహారమును బరిశోధించి, అలస్య మొనరించక తానే ఛద్మవేషధారియై చంద్రపురమునకు వెళ్ళినాడు.

అతను సామాన్యుడగు జంగమయ్య వేషములో నున్నాడు. ఆ వేషములో అతని నెవరునూ గుర్తించలేకపోయినారు.

ముకుందపెద్ద కొరకై వచ్చునప్పటి కతడు యింట లేకుండెను. విచారించగా అతడు ప్రక్క గ్రామమున కేదియో పనిమీద వెళ్ళినాడనీ, సాయంకాలమునకు తిరిగి రాగలడనియూ నాతని భార్య చెప్పినది.

అతడు వచ్చునంతవరకునూ ఊరక యింట గూర్చుని చేయున దేమున్నదని లక్కనామాత్యుడు గ్రామము నొక పర్యాయము చుట్టి వచ్చినాడు.

దారిలో నొక యాగంతుకు డతనిని జూచి "తా మీ యూరికి క్రొత్తగా నున్నట్లు దోచుచున్నది. తమ రెవరిని కలుసుకొనవలయును?" అనినాడు.

"నేను ముకుందపెద్ద యను వారింటికి వచ్చియున్నాను"

"అతడు తోడ్కొని వచ్చి యున్న ఆ పిల్ల విషయమును గురించియే కదా ?" ఆగంతుకుడు నిర్బంధపెట్టుచున్న ధోరణిలో అడిగినాడు.

"ఏమీ, ముకుందపెద్దగారు పిల్లను దోడ్కొని వచ్చియున్నారా?"

"ఔను. అతడు యాత్రకని వెళ్ళియుండెను కదా ! తిరిగి వచ్చునపుడొక యూరిలో నిలచినాడట. అచ్చట తన కుపచర్యలు చేసిన ఒక పిల్లను చూచి, జాలిగొని యామెను గొనివచ్చినాడు"

"మా కేమియునూ దెలియవు. మేము దారిన బోవువారము. వారు విద్వాంసులని విని, వారి దర్శనము చేసుకొని వెళ్ళుటకై వచ్చినాము"

"మీరా మూగిపిల్లకు తండ్రియో-లేక సంబంధ బాంధవ్యము గలవారో అయి యుందురనుకొన్నాను"

"ఆ పిల్ల మూగదా ?"

"ఔను. ఆ చిన్నది మాట్లాడుటను గ్రామములో నెవరునూ చూచి యుండలేదు. ఆమె యొక పిచ్చిపిల్ల. కాని చూచుటకు దంతపు బొమ్మ వలె నున్నది. ఇంకనూ వివాహములేదు. ఆమెను చేబట్టు వా డదృష్ట వంతుడు"

ఈ మాటలువిని లక్కనామాత్యునికి కుతూహలము రెచ్చినది. ముకుందపెద్ద రాకమునుపే ఆమెనొక పర్యాయము చూచి-సాధ్యమైనచో నామె వృత్తాంతముకూడా తెలుసుకొనవలయు ననుకొన్నాడు.

అతడు మరల యింటికి వచ్చుటచే ముకుందపెద్ద భార్య యతనిని భోజనమునకు బిలిచినది.

"నా భోజనమైనది తల్లీ ! ఇప్పుడా తొందరేమియునూ లేదు. పండితు లెప్పుడు రాగలరు ?"

"ఏమి, వారిని శీఘ్రముగా చూడవలసి యున్నదా ?"

"ఔను !"

"వారివలన నేమి కావలసియున్నది ?"

"తల్లీ ! మీ రన్యథా భావింపకుడు. మీయింటనున్న చిన్నదాని విషయమును నేను తెలియగోరుచున్నాను. ఆమె ఎవరు ? మీ కెచ్చట దొరికినది ? దయయుంచి తెలుపుడు"

ఈ మాటలు విని ఆమె ఔడుగరచుకొనినది.

"మీ కా వివరము లెందుకు?" అని ప్రశ్నించినది.

"ఆమెను నేను చూడవలయును. మా మూగిపిల్ల ఒకతె కొలది దినముల క్రిందట యీ మలెయరాజ్యమునందే దారతప్పియినది. ఆమెను వెదకుచూ నేను తిరుగుచున్నాను. మీ యింటనున్న చిన్నదే మా అమ్మాయియై యుండవచ్చునని ఎవరో చెప్పగా— చూడవచ్చినాను."

"మీ అమ్మాయి పేరేమి?"

"పొన్నలాదేవి!"

ఈ పేరు వినగానే ముకుందపెద్ద భార్య ముఖము ముడుచుకొని నది. ఆమె వణకుచున్న కంఠస్వరముతో అనినది:

"తమరు సాయంకాలము వరకును వేచియున్నచో మా వారు రాగ లరు. వారిని కలసి మీరన్ని విషయములనూ మాట్లాడుకొనవచ్చును."

అని యామె వంటయింటిలోనికి వెళ్ళిపోయినది.

సాయంకాల మగునప్పటి కొక పెద్ద మూట మోసుకొని,ముకుంద పెద్ద యింటికి వచ్చినాడు. అతని భార్య లక్కనామాత్యులను పరిచయము జేసినది. ఎందుకో, అతనికి పరిచయము సంతోషమును కలిగించలేదు. ఇది గ్రహించి లక్కనామాత్యుడు :

"స్వామీ, పండితులుగారూ! మా మాట నొకదానిని సావధాన చిత్తులరై విని, సమాధాన మివ్వగలరు. మేము రాచకార్యార్థమై వచ్చిన వారము. అయినను మా గృహకృత్యమును విన్నవించుకొనవలసియే యున్నది."

"ఏమది, స్పష్టముగా జెప్పుడు."

"మీరు దోడ్కొని వచ్చిన ఈ చిన్నది మాచంద్రగుత్తి త్రియం బకదేవుని సోదరి కుమార్తె పొన్నలాదేవి. బోలెయ దుర్గము ముమ్మయ నాయకు డామెను బలాత్కారముగా అపహరించినాడు. అదృష్టవశమున అతనిచేతినుండి తప్పించుకొని, ఆమె మీ వద్ద ఆశ్రయము పొంది యున్నది."

"ఏమీ, ఆమె చంద్రగుత్తి రాజు కుమార్తెయా?"

"ఔను!"

"మీరెవరో మేము తెలుసుకొనవచ్చునా ?"

"మీవద్ద దాపరిక మెందుకు?—నేను లక్కనామాత్యుడను. మీ మాండలీక ప్రభువుకు అన్నగారిని. విజయనగర సామ్రాట్టుల పాదసేవకు డను"

ఈ మాటవిని ముకుందపెద్ద పరుగునవచ్చి లక్కనామాత్యుల పాదములమీద పడినాడు.

"ప్రభూ ! నావలన అపచారము జరిగియుండినచో క్షమించ వల యును" అని వేడుకొన్నాడు.

అనంతర మతడు తనకు పొన్నలాదేవి లభించిన కథను సవివర ముగా తెలియజేసినాడు.

"ఈ అల్పకార్యమునకై తా మిచ్చటికి వచ్చుటయా? పాదసేవకు నకు లేఖ పంపి యున్నచో, నేనే పొన్నలాదేవిని తోడ్కొని వచ్చి అప్పగించెడు వాడను" అని సవినయముగా విన్నవించుకొనినాడు.

అమాత్యులకు పొన్నలయొక్క దురంతోదంతము విని కను లశ్రుపూరితములైనవి. ఆమె మాటలు రాని మూగదని తెలియగా మోద ఖేదము లేకకాలములో జనించినవి.

"ఏమీ, ఆమెకు మాటలు రావేమి?"

"వచ్చును. కాని ఆమెకు ఏదియో అపఘాతమైనది. స్మృతియే లేదు. తనపేరు, తల్లిదండ్రు లెవరు అను స్మరణ యిసుమంత యైనను లేదు. మన దురదృష్టమున కామె మూగదానివలె నున్నది"

అని ముకుందపెద్ద విషాదముగా ననినాడు.

అటుపిమ్మట వారు మిత్రులవలె గూర్చుని, అనేక విషయము లను ఆత్మీయముగా చర్చించుకొనినారు. దుష్టుడగు ముమ్మయనాయకుని వలన చంద్రగుత్తి త్రియంబకదేవునికీ, అతని సోదరి పద్మలదేవికీ, ఆమెకుమార్తె యగు పొన్నలాదేవికి సంభవించిన దుస్థితిని దలచుకొని దుఃఖించినారు.

"పండితులూ ! మీ రీ పొన్నలాదేవిని రక్షించకుండినచో, నామె మాచేతికి మరల లభ్యమై యుండెడిది కాదు. మీరు చేసిన సాయమునకు మే మాజన్మాంతమూ కృతజ్ఞులముగా నుందుము" అనినాడు లక్కనా మాత్యుడు.

"అమాత్యులుగారూ ! మేము చేసినది మాత్ర మే మున్నది ?

ఆపదలో నున్న నౌక ఆడబిడ్డను చూచి, అనుకంపము గలిగి తోడ్కొని వచ్చి ఆశ్రియమిచ్చినాము. దీనిలో మే మొనరించినది—మనుష్య మాత్రుడు యింకొకరికి చేయునట్టి సాయమును చేసినాము. అంతియే! అంతకంటెనూ ఏ గొప్పయును దీనిలో లేదు" ముకుందపెద్ద అనినాడు.

"అదికాదు పండితులూ, మీ రా చిన్నదాని కాశ్రియ మిచ్చి లో కాపవాదమునకు గురియైనారు. పర్జనులనోట బడినారు. ఈ దృష్టినిబట్టి చూచిన మీరు చేసిన సాయము గొప్పది."

"అమాత్యులూ! లోకములో సుజన దుర్జను లుభయులూ నున్నారు. లేనిచో నిది మర్త్యలోకముగా తోపదు—దేవలోకము కాగ లదు. మనము ప్రాపంచికులమైన తరువాత దూషణ—భూషణలు తప్పవు. వాటికి మనము విచలితులముకాక, శాంతచిత్తముతో మన పాలిటి కర్తవ్యమును మనము నిర్వహించవలయును."

"ఔను, ఈ విషయమును మన పూర్వులెందరో చెప్పియున్నారు: 'పుడమిలో జన్మించిన పిమ్మట దూషణ—భూషణలు జరిగినపుడు, కోప పడక శాంతమును వహించవలయును' అని. కాని యిది ఆచరించిచూపు టకు కూడా ధైర్య మవసరము!"

"అమాత్యులూ! మేము పౌన్నలాదేవి కాశ్రియ మివ్వ నిశ్చ యించినపు డామె ఎవరు? ఆమె పేరేయది? యను విషయములేమి యును మాకు తెలియ లేదు. ఆడబిడ్డలు లేనందువలన దైవమిచ్చిన బిడ్డ యని ఆమెను పరిగ్రహించినాము. లోకాపవాదమునకు భీతిల్లకయింతవర కునూ ఆమెను కన్నబిడ్డవలెనే పోషించుచూ వచ్చినాము. ఈ ఘడియ నుండి ఆమె మా బిడ్డకాదు. మీ బిడ్డ" అని గద్గదకంఠముతో పలికినాడు ముకుందపెద్ద.

ఇంత స్వల్పకాలములోనే వారి కంతటి యాత్మీయత ఏర్పడుటను జూచి లక్కనామాత్యుని కాశ్చర్యమైనది "పండితులూ! మీ రీ విషయమై చింతించకుడు. సామ్రాట్టులు పౌన్నలాదేవి రక్షణా భారమును తముపై వేసుకొన్నారు. వా రా తల్లీకూతుండ్రి కాశ్రియమిచ్చినారు. ఇప్పుడు

మీరు నా ప్రశ్నకొక జవాబు చెప్పవలయును. పొన్నలాదేవి మూగియని ప్రజలనుకొనగా విన్నాను. ఆమెకు మాటలు రావేమి ? ఆమె స్మృతి హీనయైనదా ? దయయుంచి తెలుపుడు !"

"అమాత్యులా ! మీవద్ద సంకోచపడు చెందులకు ? పొన్నలకు తానెవ్వరైనదీ, తన పేరేమి, తన తలిదండ్రు లెవరు అనున దొక్కటి యునూ తెలియదు. తన గడచిన జీవితము నందలి ఘటనలుకూడ జ్ఞాపకమునకు వచ్చుటలేదు. మే మామెను 'పొన్న' యని పిలిచెడివారము— ఆమె శరీరకాంతిని జూచి. కాని, చివర కామె నిజముగనే పొన్నలాదేవి యైనది" అని నవ్వినాడు.

"ఆమె యీ విధముగా ఎందులకైనది ?"

"ఆ విషయము మాకు తెలియదు అమాత్యులా ! ఆమెను మేము చూచినపుడు తలమీద పెద్ద దెబ్బతగిలి, ఆ గాయమునుండి రక్తము స్రవహించుచుండినది. బహూశః నీచులెవరో ఆమెకా దుస్థితిని గలిగించి యుండవచ్చును. ఆ దెబ్బకు స్మృతి గోల్పోయి ఆమె పడియుండినది. మే మామెను తోడ్కొని వచ్చి ఔషధోపచారములు చేసినాము. కాని గాయము వాసియైననూ ఆమె మనుష్యులను గురించునట్టి స్థితికి రాలేక పోయినది. తన గతజీవనముయొక్క స్మృతి యేమాత్రమునూ ఆమెకు కలుగలేదు. అందుచే మే మామెను గురించి ఏ విషయము తెలుసుకొనుటకునూ అసమర్థులమైనాము. ఆమె చంద్రగుత్తి త్రియంబక దేవుని కుమార్తెయని తెలిసియుండిన తోడ్కొని వచ్చెడివారము కాము-సామాగ్రులు కప్పగించి వచ్చియుందుము"

"మీ రామెను దోడ్కొని వచ్చుట మేలైనది పండితులూ ! ఆ విపన్నావస్థ యందామె అన్యులపాలై యుండినచో నామె జీవితము నాశనమై యుండెడిది. మీ రాశ్రయమిచ్చి పోషించి, పునర్జన్మ దాతలైనారు. మీ సేవను మేము మరువలేము," అనిచెప్పి, పొన్నలాదేవిని బిలిపించి యామె ముఖమవలోకించినాడు.

"అమ్మా, పొన్నలా !" అని గాద్గదికముగా యనినాడు. ఆమె

లక్కనామాత్యులను భీతిగొలుపుచున్న నేత్రములతో చూచినది. కాని ఏమియునూ మాటాడలేదు.

"పొన్నా, వీరు లక్కనామాత్యులు. సామ్రాజ్యమునకు మహా ప్రధానులు - దండనాయకులు. నిన్ను మీ తల్లివద్దకు తీసుకొని వెళ్ళుటకై వచ్చియున్నారు. వారికి నమస్కరించు తల్లీ!" అని చెప్పినాడు ముకుందపెద్ద.

ఈ మాటకు జవాబుగా ఆమె మౌనముగా క్షణకాలము లక్కనామాత్యుల ముఖమును చూచి, తరువాత శిలాబాల వలె నిలబడినది.

"అమ్మా, నిన్ను మీ తల్లి చెంతకు దోడ్కొని పోవుటకై వచ్చియున్నాను," లక్కనామాత్యు లనినారు.

ఈ మాటలు వినబడని దానివలె, ఆమె బొమ్మవలె అట్లే నిలబడినది. అమాత్యుల మాట ఏ పరిణామమునూ కలిగించలేదు - వారికి చాల నిరాశయైనది.

"అమాత్యులూ, పొన్నలాదేవి ప్రవర్తనకు మీరు విసుగు జెందకుడు, ఆమెకు తా నెవరు? తన తల్లి ఎవరు? అను విషయము తెలియదు. తెలిసియుండినచో సంతోషముగా మీవెంట వచ్చెడిది" అన్నాడు ముకుందపెద్ద.

"అమ్మాయీ, నావెంట వచ్చెదవా? మీ తల్లి వద్దకు తోడ్కొని వెళ్ళెదను!" అని మరల యడిగినాడు లక్కనామాత్యుడు.

పొన్నల కామాట అర్థమైనది. రానని తల యాడించినది.

"ఎందులకు రానసెదవు?"

ఆమాట కామె ఏదియో చెప్పబోయినది. కాని, మాటలు వెలువడక, కన్నీళ్ళు కార్చుచూ ముకుందపెద్ద పాదముల మీద పడి, అతని కాళ్ళను వదలక పట్టుకొనినది.

"బహుశః మిమ్ములను వదలి ఆమె ఎచ్చటికి వెళ్ళుటకునూ యిష్టపడునట్టు లేదని తెలియుచున్నది పండితులూ! మీ నుండి బలవంతముగా నామెను తోడ్కొనిపోయిన, గోవత్సమును గోవునుండి వేరు చేసినట్టు కాగలదు. అట్లు చేయుటచే ఎవరికినీ మేలు కలుగదు. కాబట్టి,

తమరు నా కోరికను మన్నించి, వావెంట సామ్రాట్టుల వద్దకు రావల యును" అని దైన్యముగా ప్రార్థించినాడు.

గత్యంతరములేక, పొన్నలాదేవి కొరకై ముకుందపెద్ద లక్కనా మాత్యులతో అరగసీమకు వెళ్ళుట కొప్పుకొనినాడు.

"కాని, అమాత్యులూ! ఒక షరతు మీద వచ్చెదను. నన్ను మీరు సామ్రాట్టుల వద్ద నిలుపుకొనుటకు వత్తిడి చేయరాదు."

"ఎందులకు పండితులూ!"

"నే నెచ్చట? సామ్రాట్టు లెచ్చట?"

"పండితులూ! మా సార్వభౌములు విద్వాంసులు. పైగా విద్వజ్జన పక్షపాతులు. మీరు పొన్నలాదేవిని ఆపదలో కాపాడి పోషించుట, మీ విద్వత్తు, సౌజన్యములను జూచి, సామ్రాట్టులు మిమ్ములను తన యాస్థాన మండలి విద్వన్మణులలో నొక్కనినిగా నియమించుకొని, మీకు కృతజ్ఞత లర్పించవచ్చును. అందులకు సిద్ధముగనే మీరు బయలుదేరి అరగసీనుకు రావలసినదని నా వేడికోలు!"

"అమాత్యులూ! సార్వభౌముల విద్యాపక్షపాతమును పలువురి నోట నేను కూడ వినియున్నాను. తమవంటి విద్వాంసులూ, ప్రభుభక్తి పరాయణులూ వెంట నుండగా, సామ్రాట్టులు విద్వజ్జన పక్షపాతు లగుట ఆశ్చర్యము కానేరదు. కాని నే నెచ్చట?—సామ్రాట్టుల ఆస్థాన మెచ్చట? మహాప్రభువు లొకవేళ యీ గౌరవమును నా కొసగిననూ దానిని పొందగల అర్హత నాకులేదు—"

"తమరు 'పెద్ద' యనగా, గొప్పవారను గౌరవమును ప్రజల నుండి బడసియున్నారు. కాబట్టి, మాకు కూడ మీరు పెద్దవారే. మీవంటి సజ్జనులనూ, విద్వాంసులనూ మిత్రులుగా పొందుచున్న మేము, భాగ్యవంతుల మనియే అనుకొనవలయును. మీరు మాకు మిత్రులై, పొన్నలాదేవికి పెంపుడు తండ్రియై మాతో నుండుడు" అని బలవంతము చేసిన పిమ్మట అతడు లక్కనామాత్యుని వెంట అరగసీమకు వెళ్ళుట కొడంబడినాడు.

ఆ నిశ్చయము మేరకు ముకుందపెద్ద, అతని భార్య, పొన్నలా దేవిని తోడ్కొని లక్కనామాత్యుల వెంట అరగసీమకు వచ్చినారు.

ఈ వారవిని పౌఢదేవరాయలు :

"అమాత్యులూ ! మీరీ విషయమును మునుపే ఎందులకు చెప్పక పోయితిరి? పొన్నలాదేవిని రక్షించిన ఆ మహాత్ము లెచ్చట ? వారిని చూడవలయునని నాకు చాలకుతూహలముగా నున్నది" అని పౌఢదేవ రాయ లనినాడు.

లక్కనామాత్యుడు ముకుందపెద్ద దంపతులను సామ్రాట్టుల సముఖమునకు రావించినాడు.

ఆ భూసురుడు పౌఢదేవరాయలకు నమస్కరించుటకు పూర్వమే ఆ భూపాలు డతని పాదములకు బ్రణమిల్లి :

"స్వామీ ! మీ విషయనుంతయు మా అమాత్యులు మాకు విన్న వించినారు. తమరు మా కొనరించిన సాయమును మేమీ జన్మలో తీర్చ లేము. మీరీ రాజకుమార్తెను ఆపదలో కాపాడక యుండినచో, ఆమె మాకు లభించియుండెడిదికాదు. మీకెట్లు కృతజ్ఞత లర్పించవలయునో తెలియకయున్నది" అనినాడు.

ఇంతలో సామ్రాట్టుల చెవిలో లక్కనామాత్యు డేదియో ఊది నాడు.

"స్వామీ ! తమ పాండిత్యమును గురించి మేము విని యున్నాము. తమరు మారుమూల అగ్రహారములో నుండినచో, తమ పాండిత్యము అడవిని బూచిన పూవుకాగలదు. అది మా యాస్థాన మును — మా రాజధానిని — అలంకరించునట్టు చేయవలయు నను నదియే మా అమాత్యుల సలహా ! తమరీ సలహాకు సమ్మతించి, మా యాస్థాన విద్వాంసులలో నొక్కరై పొన్నలాదేవికి దిక్కుగా యిచ్చటనే యుండ వలయునని మా ప్రార్థన !" అని చెప్పినాడు.

ఈ మాటకు ముకుందపెద్ద "మహాప్రసాదమును నేను తిరస్క రించుటలేదు ప్రభూ ! కాని, యీ గౌరవమునకు నే నర్హుడనా ?" యని ఆలోచించుచున్నాను" అన్నాడు.

"మీ రిందులకు సమ్మతించనిచో, పంపావతి మీద ఆన" యని లక్కనామాత్యు లనగా, యిక విధిలేక, "శ్రీహరి చిత్తమెట్లున్నదో అట్లు జరుగనిమ్ము" అని, ముకుందపెద్ద సామ్రాట్టుల వద్ద నిలుచుటకు సమ్మతించినాడు.

# 9

# జన్మాంతరము

మహారాణి పద్మలాదేవి తన కుమార్తెను గురించిన బంగరు కల లన్నియూ కరగిపోయినవి. ఆమె పొన్నలాదేవిని తన ప్రాణమున కంటెనూ అధికముగా భావించి, ఒక అనర్ఘ్యమైన రత్నమని ఆమెను పోషించుకొని వచ్చినది. తన కుమార్తె రూప లావణ్యములను జూచి, సార్వభౌమునికి వధువు కాదగినదని యనుకొనెడిది.

అందుల కనుగుణముగనే త్రియంబకదేవు డామెను పెంచినాడు. ఆదర్శ క్షత్రియ రమణుల కుచితములగు విద్యలన్నియునూ నేర్పించి నాడు. ఈ పర్యాయము అరగసీమకు రానున్న సామ్రాట్ ప్రౌఢదేవ రాయల కామెను వధువుగా అర్పించ వలయునని అతని హృదయాంత రాళపు కోర్కె. ఇది పద్మలాదేవికికూడా ప్రియకరముగానే యుండినది. కాని యీ ఆశాలతతో పుష్పము వికసించకమునుపే లతయే వాడిపోవు నట్టి సంఘటన ఘటించినది.

ఇప్పుడు పొన్నలాదేవి మరల ఆమెకు లభించిననూ ఆమె మును పటి పొన్నలాదేవి కాకపోయినది. పొన్నల ప్రాణముతో నున్నది. కాని తన తల్లిని పూర్తిగా మరచిపోయినది. తన గతజీవిత స్మృతులన్నియునూ

మరచిపోయినది. తల్లి పాలిటి కామెయొక ఆగంతుకురాలు-నూతనవ్యక్తి యైనది. తన నాపదలో రక్షించి, కాపాడిన ముకుందపెద్ద దంపతులమీద గల ప్రీతి ఆమెకు తల్లిమీద లేకపోయినది. ఆమె పాలిటికి పద్మలాదేవి పరకీయురాలైనది.

కుమార్తె విచిత్ర పరివర్తనము జూచి పద్మలాదేవికి కలిగిన నిరాశ యింతింతనరానిది. ఆమె కుమార్తెను మునుపటి పొన్నలనుగా చేయుటకు తన చాతుర్యమునంతయునూ ప్రయోగించినది. వైద్యులచే చికిత్స చేయించినది. మంత్రవాదులచే రక్షాబంధనము జేయించినది. మొక్కుకున్నది-కానుకలు ముడుపు గట్టినది.కాని ఏమియునూ ప్రయోజనము లేకపోయినది.

పొన్నలాదేవి తన తల్లిని గుర్తించలేకపోయినది. తన గతకాలము జీవనమును జ్ఞప్తికి తెచ్చు స్మృతి నామె కోల్పోయినది. కుమార్తెవలె చూచుకొనుచున్న ముకుందపెద్ద దంపతు లుండుటచే నామె దుఃఖమునకు కారణము లేకపోయినది. కాని గతకాలమందలి ఋణానుబంధమునూ, స్మృతినీ కోల్పోయిన ఆమెను చూచినప్పుడు, దుఃఖము పెల్లుబికి వచ్చెడిది. తాను కుమార్తెకొరకై నిర్మించిన స్వర్ణస్వప్న హర్మ్య మొక్కసారిగా నేలకూలిపోయి నట్టామెకు తోపసాగినది. ఇది ఆమెకు భరించరాని బాధయైనది.

కుమార్తె తనకు మరల లభించిన దినము పద్మలాదేవి కొక మరపురాని దుర్దినము !

ఆమె కుమార్తె క్షేమమునకై పరితపించి, చాతకపక్షివలె నిరీక్షించినది. కుమార్తెను చూడగానే ఆనాడు సంతోషమును పట్టలేక పరుగున వెళ్ళి ఆమెను కౌగిలిలోనికి చేర్చుకొని, ఆనందాశ్రువులు రాల్చి తన శిబిరమునకు తోడ్కొని పోయినది. కాని ఈ ఉపచారము పొన్నలాదేవికి, యిష్టములేని వ్యక్తిని బలాత్కరించి నట్టేనని తోచినది. నిర్జీవ ప్రతిమ వలె ఆమె తల్లి ననుసరించినది.

"అమ్మా, పొన్నలా ! నాతల్లీ-చివరకా దుష్టుడగు రాక్షసుని బారి నుండి తప్పించుకొని బ్రతికి వచ్చితివా ? నీవు మాకొరకై ఎంత రోదిం

చితివో ? ఎంత బాధపడితివో ?" అని తల్లి వగచినది.

ఈ మాటలకు పొన్నలాదేవి బదులుపలుకలేదు. తల్లి మాటలపై నాసక్తి కనబరచలేదు.

"ఎందులకమ్మా, అట్లు చూచుచున్నావు ? నేను నీ తల్లిని— పద్మలాదేవిని. నన్నింత త్వరలోనే మరచిపోయినావా ?" అని బాధా హృదయముతో యనినది.

ఈ మాటకుకూడ పొన్నల మారు పలుకలేదు. నిర్జీవ ప్రతిమవలె నిలబడినది.

ఇది జూచి తల్లికి మర్మాఘాతమైనది.

"ఎందులకు తల్లీ ! నన్ను గుర్తించలేక పోవుచున్నావా ? నేను నీ తల్లి పద్మలాదేవిని"

గుర్తు తెలియలేదని పొన్నల తల యూపినది. పద్మలాదేవికి నెత్తిపై పిడుగు పడినట్టయినది. ఆమె కన్నీరు కార్చుచూ అనినది :

"అయ్యో ! నా బిడ్డకెవరో ఏమో చేసినారు. ఆమె మమ్ముల నందరనూ మరచిపోవునట్టు చేసినారు. అయ్యో దైవమూ ! మే మింత కాలము బాధపడినది చాలదని మరల మా కీ కష్టమును తీసుకొనివచ్చి పెట్టినావా?" అని యేడ్చినది.

ఈ మాట లేమియును పొన్నలాదేవి మీద పరిణామమును కలిగించలేదు.

కుమార్తెకూ తనకూ గల సంబంధము తెగిపోయినదని ఇప్పుడు పద్మలాదేవికి కూడ ఖచితమైనది. తమను తల్లీ—కూతుళ్ళవలె కలుపు-మమతా బంధనపు—బాంధవ్య లత తెగిపోయినదని తెలియగనే ఆమెకు చాల వ్యధ కలిగినది.

ఆమె అపుడే రాజవైద్యులను రావించి, పొన్నలాదేవి పరిస్థితి వారి కెరిగించినది.

అంతయూ విని, పొన్నలాదేవిని పరీక్షించిన పిమ్మట రాజ వైద్యులు తమ యభిప్రాయమును వెలిబుచ్చినారు.

"తల్లీ! ఈమె కేదియో హఠాత్తుగా అపఘాత మేర్పడి. మస్తిష్కమునకు దెబ్బతగిలి, స్మృతిని కలిగించెడు పొరలు పనిచేయుట మానివేసినవి. బహుశః యీమెకు మరల తన పూర్వస్మృతి కలుగ వచ్చును-కలుగకపోవచ్చును. ఆమెకు పూర్వస్మృతి కలుగుటకు, మునుపటివలె యగుటకు, శస్త్ర చికిత్స వలన లాభములేదు—మరల ఆమె తల కేదియోనొక అపఘాత మేర్పడి, మస్తిష్కమందలి పొరలు సరిపడిననే మాత్రము ఆమెకు పూర్వస్మృతి కలుగ గలదు. అది యీ జన్మలో జరుగుట మీ ఉభయుల అదృష్టముపై నాధార పడియున్నది. ఈ విషయమై మే మేమిచేయుటకునూ అశక్తులము"

ఈ సలహా విని, పద్మలాదేవి దిగ్భ్రమజెంది నిలబడినది. వారి సలహాను త్రోసిపిరాజని శస్త్రచికిత్సకు గురిజేసినచో, పొన్నలాదేవికి ప్రాణాపాయ మేర్పడగలదు. అందులకనియే ఆమె తనకుమార్తె నుదుట వ్రాసిన ప్రకారము జరుగనిమ్మని ప్రయత్నము లన్నియునూ మానుకొనినది.

కాని, పొన్నలాదేవి యదృష్టము గొప్పది. ఆమె గోల్పోయిన స్మృతి మరల వచ్చి, ఆమె మునుపటివలె యగుటకు ఎక్కువకాలము పట్టలేదు. అటువంటి యపఘాతమొకటి ఎవరునూ నిరీక్షించని విధమున సంభవించినది.

ఆనాడు ప్రౌఢదేవరాయలు తాను గజవేటలో చెరబట్టిన ఏనుగుల నెట్లు వశపరచుకొనుచున్నా రనునది చూచుటకై శిబిరమునకు సమీపములోనున్న గజశాలకు వెళ్ళినాడు. అతనికి గజశిక్షణలోమంచి యనుభవము-పాండిత్యము గలదు. అతని పర్యవేక్షణ క్రిందనే మావటీండ్రు పట్టుబడిన యేనుగులకు నాగరిక జీవనము నలవడ జేయుటకై శిక్షణ నిచ్చెడివారు. చిన్నపిల్లలకిచ్చు శిక్షణవలె, వాటికి శిక్షణ జరుగుచున్నది. కొన్ని ఏనుగులు తమ స్వాతంత్ర్యమునకు తిలాంజలి నిచ్చి, నూతన జీవన విధానమున కనుగుణముగా మారి, సుఖపడ సాగినవి. మరికొన్ని స్వాతంత్ర్యమునకై బరితపించి, పరితపించి, అన్నపానీయములను వదలినవి. అటువంటి వాటి నతి చతురతలో దారికి తీసుకొని రావలసి

యున్నది. వాటి మనసును నొప్పించక, వశపరచుకొనుట చాల కఠినతర కార్యమైనది. ఈ కార్యమునకు ప్రౌఢదేవరాయలే స్వయముగా పూను కొనినాడు.

అతడు క్రొత్తగా పట్టిన ఏనుగు నొకదానికి, వశపడియున్న ఒక గజరాజముతో శిక్షణ నిచ్చు కార్యములో నిమగ్నుడై యున్నాడు. మావటి వాడు గజభాషలో ఏనుగులకు శిక్షణ నిచ్చుచున్నాడు. పెంపుడు కరులు వాటికి మార్గదర్శకములుగా నున్నవి. ప్రౌఢదేవరాయ లీ శిక్షణను జూచుచూ మైమరచి యుండగా, ఎవరో 'ప్రభూ!' అని యరచినారు.

ప్రౌఢదేవరాయరాయలు దిగ్భ్రాంతి జెంది ఆ పిలుపు వినవచ్చిన వైపు తిరిగి చూచినాడు. దూరములో ఒక మావటివాడు బిగ్గరగా అరచు కొనుచూ, పరువెత్తి వచ్చుచున్నాడు. ఏదియో జరుగరాని యనర్థము జరి గిన దనుట ట్టతని వదనము కళావిహీనమై యున్నది. అతడు ముక్కు పుటము లెగరవేయుచూ వచ్చి నిలబడినాడు.

"ప్రభూ! అపాయ మపాయము! మొన్న పట్టుబడిన ఏనుగు లలో ఒక గజరాజము తప్పించుకొని, తన నెదిరించిన వారినందరినీ త్రొక్కి చంపుచూ వచ్చుచున్నది. అది యీవైపునకే వచ్చుచున్నది.తమ రిచ్చటినుండి వెంటనే పారిపొండు!" అని విన్నవించినాడు.

"ఆ గజరాజ మెచ్చట నున్నది?" అని ప్రౌఢదేవరాయలు అడుగుచుండగనే శిబిరములో కోలాహలము చెలరేగినది. భటులు భీతిల్లి గగ్గోలు పెట్టుచూ పారిపోసాగినారు. "ప్రభూ! ఆ దైత్యగజము యీ వైపునకే వచ్చుచున్నది. తమరిచ్చట నుండినచో అపాయము కలుగ గలదు. దయయుంచి తాము బయటపడి, దాని బారినుండి తప్పించుకొన వేడికోలు"

అని మావటివాడు దైన్యముగా ప్రార్థించినాడు.

ఇంతలో భరమన మావటీడు కూడ పరుగునవచ్చి అన్నాడు:

"ప్రభూ! అపాయము. ఒక గజరాజు చెరనుండి తప్పించుకొని మావటివాండ్ల మీదనూ, భటుల మీదనూ పగదీర్చుకొనుచున్నది. ఎదుట

పడిన వారిని చంపుచూ ముందుకు దూకి వచ్చుచున్నది. దానిని స్వాధీనము లోనికి తెచ్చుటకు వలనుపడలేదు. తమరు దయయుంచి యిచ్చట నుండితక్షణమే వెళ్ళిపొండు" అని మొరబెట్టుకొన్నాడు.

అంతలో పిచ్చియావేశమును పొందిన నల్లటి కొండ వంటి ఒక గజరాజము ఘీంకారము చేయుచూ, తన ఘీంకారములతో అరణ్యమును ప్రతిధ్వనింపజేయుచూ, ఎదురుపడిన వ్యక్తులనూ-వస్తువులనూ త్రొక్కి-నాశనమొనర్చుచూ వచ్చుచున్నది.

ప్రౌఢదేవరాయలు అపాయమును గ్రహించి, ఏనుగుకు కనబడక ప్రక్కకు తప్పుకొని, దాని చేతినుండి తప్పించుకొనినాడు. ఒక మావటివానిని తన తొండముతో చుట్టి పైకెత్తి చంపుటను జూచి అతడు కనులు మూసుకొన్నాడు. ఈ విషమ పరిస్థితిలో దాని నట్లే వదలినచో, ఎక్కువ ప్రాణాపాయములు కలుగవచ్చునని భీతిల్లి, వెంటనే దానిని చంపుదని యాజ్ఞాపించినాడు.

కాని, పిచ్చి పట్టినట్టు, పైబడవచ్చుచున్న ఆ గజరాజము నెదిరించి చంపునంతటి ధైర్య మెవరికినీ లేకపోయినది. భరమన మావటీడు దానిని నిగ్రహించుటకై చేసిన ప్రయత్నము లన్నియునూ వ్యర్థమై, సామ్రాట్టుల వద్దకు పరువెత్తి వచ్చినాడు. ఇప్పుడు దాని నెట్లయిననూ చంపియే తీరవలయును. లేనిచో, దాని చేతికి పట్టుబడి ఎక్కువమంది ప్రాణములను గోల్పోవలసి యుండును.

ప్రౌఢదేవరాయలా ఏనుగును సంహరించుటకెవరునూ ముందుకు రాకపోవుటను జూచి, తానే ఆ కార్యమునకు పూనుకొనినాడు. ఇదిజూచి బుక్కనయూ, భరమనయూ భీతిల్లి సామ్రాట్టులను అడ్డుకొన బ్రయత్నించినారు. కాని ప్రయోజనము లేకపోయినది.

ఇంతలో సేవకుడొకడు బిగ్గరగా అరచుచూ వచ్చి, "ప్రభూ! అది అంతఃపురస్త్రీలు గల శిబిరము వైపునకు పోవుచున్నది. అచ్చట నున్న స్త్రీలు భీతిల్లి పారిపోవుచున్నారు" అని తెలియజేసినాడు.

ఇది విని ప్రౌఢదేవరాయలకు చప్పున పద్మలాదేవి స్ఫురణకు వచ్చినది. ఆమె కుమార్తె పొన్నదేవికూడా జ్ఞప్తికి వచ్చినది. వారి గతి ఏమౌతుందోనని భీతిల్లి, సామ్రాట్టులు వెంటనే వారి రక్షణకు బరువెత్తి నాడు.

అప్పటికి పద్మలాదేవి కూడ మదించిన ఏనుగు తన శిబిరము మీదికి మున్నుగ్గి వచ్చుచున్న సంగతివిని, కుమార్తె నచ్చటినుండి ఒక సురక్షితమైన స్థలమునకు దోడ్కొని వెళ్ళదలచి, ఆమెయున్న శిబిరము నకు వచ్చినది. ఇక పిలుచుకొని వెళ్ళవలయు ననుకొనుచున్నంతలో, అచ్చటికా మదించిన ఏనుగు దైత్యావేశముతో ఘీంకరించుకొనుచూ వచ్చినది. పద్మలాదేవి భీతిజెంది బిగ్గరగా అరచినది. తాము దాని కంట బడినచో, యిక బ్రతుకుట కల్ల యని భయపడినది. అది సమీపించు టకు మునుపే అచ్చటినుండి తప్పించుకొనుటకై పరువెత్తినది.

కాని పొన్నలాదేవికి యాపదను గురించి ఏమాత్రమునూ తెలి యదు. పిచ్చిదాని వలె ఆమె ఏనుగనే చూచుచూ నిలబడినది. ఏనుగు ఆమెవైపుచూచి, ఆమెను తన శత్రువని భావించి ఆ వైపునకు వాయు వేగముగా వెళ్ళనది.

"అయ్యో, పొన్నలా !" అని యరచుచూ పద్మలాదేవి కుమార్తె చేయిపట్టి ప్రక్క కీడ్వ బ్రియత్నించినది. కాని, అప్పటికే ఆ మద గజ మచ్చటికి వచ్చినది. తాను వెనుక నిలచిన దాని కాళ్ళక్రిందబడి మరణించవలసి యుండునని తెలిసియూ పద్మలాదేవి కుమార్తె ప్రాణ రక్షణకయి వెనుక నిలువబడి, ఏనుగ బారినుండి ఆమెను రక్షించుటకు చేతనైనంత ప్రయత్నము చేసినది. కాని, ప్రయోజనము లేకపోయినది. దాని తొండమును జూచి భీతిల్లి, పద్మలాదేవి నేలగూలినది.

కాని, ఆపదను గ్రహించలేక విగ్రహమువలె నిలబడియున్న పొన్నలాదేవి దాని తుండమునకు బలియైనది. క్షణార్ధములో యిక అది యామెను పైకెత్తి క్రిందపడవేయవలయు ననుకొనుచున్నంతలో, దానిని వెన్నంటివచ్చిన ప్రౌఢదేవరాయలు శరవేగముగా దూసుకొని వచ్చి, తన ఖడ్గముతో తొండమునకు గురి చూచి ఒకదెబ్బ గొట్టినాడు.

ఏనుగు బాధగా అరచి, పొన్నలాదేవి నెత్తి ఒక వైపునకు విసరి కొట్టి, తనను చంపుటకై వచ్చిన ప్రౌఢదేవరాయలమీద పడినది. అతడు ప్రాణములమీద యాశ వదలి, దాని తుండమును తన బలమైన ముష్టితో బిగించిపట్టి మూపుపై కెక్కుటకు ప్రయత్నించుచున్నాడు. ఏనుగు బాధతో అరచుచూ అతని నప్పళించుటకై తుండమును పైకెత్తి విసరుచున్నది. ప్రౌఢదేవరాయలు మెరపువలె దాని మూపుపై కెగసి చెవులను పట్టుకొని, కత్తితో దాని తలను అంకుశమువలె కొట్టినాడు. బాధతో ఘీంకరించుచూ అది పిచ్చి కోపములో చిందులు త్రొక్కసాగినది.

ఇంతసేపటికి సార్వభౌమునికి సాయపడవచ్చిన మావటివాండ్రు పెద్ద పెద్ద వెదురు కొయ్యల సాయముతోనూ, పగ్గముల సహాయము తోడను పెంపుడు ఏనుగులమీద వచ్చి, నాలుగువైపులనుండి మదించిన ఏనుగును చుట్టుముట్టి, అది తప్పించుకొనుటకు వీలులేకుండా దిగ్బంధనము చేసినారు.

సామ్రాట్ ప్రౌఢదేవరాయలు అపాయమునుండి తప్పించుకొని- ఆ మదపుటేనుగును బలమైన గొలుసులతో బంధించి, దానికై నిర్మింపబడిన శిబిరమునకు దానిని పంపినాడు. అనంతరము పద్మలాదేవి, పొన్నలాదేవులను విచారించుటకయి వారున్న వైపునకు వచ్చినాడు.

పద్మలాదేవి ఏనుగబారినుండి తప్పించుకొనిననూ పొన్నలాదేవి మాత్రము దానికి పట్టుబడినది. ప్రౌఢదేవరాయ లచ్చటికి సకాలములో వచ్చి ఆమెను రక్షించినాడు. దాని దృష్టి ప్రౌఢదేవరాయలమీద కేంద్రీకరింపబడి, పొన్నలాదేవిని దూరముగా విసరికొట్టినది. ఆమె అదృష్టము మంచిదగుటచే ఏనుగుల కొరకయి సేకరించి వేయబడిన జంబు కుప్పపై బడి క్రిందికి దొర్లినది. తలకు గాయమగుటచే మూర్ఛిల్లినది.

పద్మలాదేవి పరుగున వెళ్ళి కుమార్తెనెత్తుకొని వచ్చి, తన శిబిరములో నున్న తల్పముపై పరుండజేసి, శైత్యోపచారములు జేసినది. పొన్నలాదేవి కొంతసేపటి తరువాత మెల్లగా కనులు తెరచినది. ఆమె

కనులకు అనేకములైన చిత్రవిచిత్ర వస్తువులువచ్చి తనను ముట్టడించు చున్నట్టుగా భ్రాంతి కలిగినది. భీతితో కేకపెట్టి, మరల నామె కనులు మూసుకొనినది.

చాల సేపటి తరువాత మరల ఆమెకు స్పృహ కలిగినది. అప్పుడు కూడా ఆమె "అయ్యో, ఏనుగు....ఏనుగు!....వచ్చుచున్నది" అని కల వర పడసాగినది.

ఒకసారి గాలి తాకిడికల్లాడుచున్న శిబిరములోని తెరగుడ్డను చూచి ఏనుగు తుండమని భ్రమించి, భయంకరముగా అరచినది. "అయ్యో, ఏనుగు వచ్చినది ఏనుగు!....పైబడి త్రొక్కుచున్నది....అయ్యో, నేను చచ్చితిని...." అని కేకలిడుచూ భీతితో తల్లడిల్లినది. అచ్చటనేయున్న పద్మలాదేవి "అమ్మా, పొన్నలా! ఏనుగు యిచ్చట లేదు తల్లీ! సామ్రాట్టు దానిని పట్టి బంధించినారు." అని సమాధాన పరచినది. కాని ఆమాట లను చెవిని వేసుకొనక, పొన్నల మరల:

"అదిగో ఏనుగు !— ఆ తుండమును నావైపునకే త్రిప్పు చున్నది" అని తెర వస్త్రమును వ్రేలితో చూపినది.

ఆ తెర వస్త్రమును తొలగించిన తరువాత, ఆమెకు కలిగిన భీతి నివారణ యైనది.

ఆమె ధైర్యమును తెచ్చుకొని చుట్టునూ పరికించినది. తొలి సారిగా ఆమె తన తల్లి పద్మలాదేవిని గుర్తించినది. అదృష్టవశమున ఏనుగు విసరికొట్టిన దెబ్బవలన మరల నామెకు తన పూర్వస్మృతి కలిగి నది.

ఆమె తల్లిని గుర్తించినది.

"అమ్మా!....నే నెచ్చట నున్నాను? దుష్టుడగు ఆ ముమ్మయ నాయకుని చెరసాలలో నున్నానా?" అని ఉద్వేగముతో ప్రశ్నించినది.

"లేదు, తల్లీ! సామ్రాట్ ప్రౌఢదేవరాయల అనుగ్రహముచే మన మా దుర్మార్గుడగు ముమ్మయనాయకుని బారినుండి తప్పించుకొని, సురక్షితమైన ప్రదేశమున నున్నాము. నీ వీ విషయమై చింతించకుము"

అని పద్మలాదేవి కుమార్తెను సమాధాన పరచినది.

"ప్రౌఢదేవరాయ అనగా నెవరు?....విజయనగర సామ్రాట్టులా?" కుతూహలముగా ప్రశ్నించినది పొన్నల.

"ఔను తల్లీ! ఆ మహాపురుషులే మనలను రక్షించినది. వారి ఋణమును మన మీ జన్మలో తీర్చలేము."

"అయినచో, మనమిపు డెచటనున్నాము?"

"సామ్రాట్టుల శిబిరములో నున్నాము తల్లీ!"

"అప్పాజీ గారెచ్చట? కనబడలేదే?" తన తండ్రియగు త్రియంబకదేవుని తలచుకొని పొన్నలాదేవి ప్రశ్నించినది.

"వారు భగవత్సాన్నిధ్యమునకు వెళ్ళినారు తల్లీ!" పద్మలాదేవి గద్గద కంఠయై అనినది.

"వారు భగవత్సాన్నిధ్యమున కెందులకు వెళ్ళినారు?" ముగ్ధవలె ప్రశ్నించినది పొన్నల.

"వారికీ లోకపు ఋణము తీరిపోయినదమ్మా!"

"వారు మనలనెందుకు దేవునివద్దకు దీసికొని వెళ్ళలేదు?"

"మనకింకనూ ఆ భాగ్య మబ్బలేదు తల్లీ!"

ఈ మాటలు పొన్నలాదేవి కర్థమైనవో లేదో? ఆమె పసిబిడ్డవలె "అప్పాజీగారు దేవునివద్దకు వెళ్ళియున్నారు. దేవునివద్దకు వెళ్ళియున్నారు...." అని యనుకొనుచూ పడుకొన్నది.

ఆమె కన్లే కనుకుపట్టినది. నిద్రలో తను దేవలోకములోనున్న తండ్రిగారి వద్దకు వెళ్ళినట్లు కలగన్నది.కాని మరుక్షణమే చంద్రగుత్తిలో జరిగిన హత్యాకాండ తలుపునకు వచ్చినది. తాము మున్మయనాయకుని చేతికి పట్టుబడుట, అతడు తమను తన సంగడికాండ్రతో తన దుర్గమునకు పంపుట....ఇవన్నియునూ స్మృతిపథములో దుస్వప్నములుగా కనబడినవి. పొన్నలాదేవి బిగ్గరగా కేకపెట్టినది. ఆమెకు నిద్రాభంగమైనది. కంపితస్వరముతో అనసాగినది :

"అయ్యో, నన్నానీచులు చంపుచున్నారు-పాతాళమున బడవేయు చున్నారు. ఎవరైననూ నన్ను రక్షించరాదా ? నేను చచ్చితిని !"

పద్మలాదేవి పరుగున వచ్చి కుమార్తెను సమాధానపరచినది.

"తల్లీ, పొన్నలా ! ఆ నీచుల బారినుండి మనము తప్పించుకొని నాము. కనులువిప్పి చూడుము. నేను నీ తల్లిని-పద్మలాదేవిని. ఇచ్చట మనము సురక్షితముగా నున్నాము. నీవు భీతిల్లకుము"

పొన్నల కనులుదెరచి నలువైపులా పరికించినది.

"అయినచో, దుష్టుడగు ఆ ముమ్మయనాయకు డెచ్చటికి వెళ్ళి నాడు ? ఆ నీచుని గతి ఏమైనది ?"

"అత డెలుకవలె బోలెయ దుర్గములో అడగియున్నాడు తల్లీ ! ఇక మనకు అతనివలన ఏ యాపదయునూ కలుగదు. నీవు నిశ్చింతగా నుండుము"

"అయినచో, అప్పాజీ గారెచ్చట ?"

"వారు దేవునివద్దకు వెళ్ళినారు తల్లీ !"

"అయ్యో ! అప్పాజీగారిని ఆ నీచులు హత్యజేసినారా ?" అని బాధగా నిట్టూర్చి శోకించినది పొన్నల.

"నేను చావక ఎందులకు బ్రతికియున్నాను ? నన్ను గాపాడిన వారెవరు ?" అని పరితపించినది.

"కుమారీ, నిన్ను ముకుందపెద్ద యను విప్రోత్తములు రక్షించి నారు. వారికి మన మాజన్మాంతమూ కృతజ్ఞులమై యుండవలయును" అని యచ్చటనే పొన్నలాదేవి సేవలో నిరతులైయున్న ముకుందపెద్ద దంపతులను పరిచయము చేసినది.

"అమ్మా, పొన్నలా! వీరే నీకు పునర్జన్మ మిచ్చిన తలిదండ్రులు !" అని యభిమానముతో ననినది.

వారిని చూచి మరల —

"ఔను, తల్లీ ! వారు నీ పూర్వజన్మలో తలిదండ్రులై యుండ వలయును. ఈ జన్మలో నీ ఋణ మిచ్చుటకి వారిని తీసుకొని వచ్చినది" అనినది పద్మలాదేవి.

పొన్నల, ముకుందపెద్ద దంపతులకు చేతులు జోడించి నమస్కరించినది.

"అమ్మా ! నీ వీ పుణ్యదంపతుల సహవాసములో-వారి ఆశ్రియములో రెండు మాసముల కాలము గడపినావు.వారే నీ తలిదండ్రులు. నీవు వారి అభిమాన పుత్రికవు" అని యనినది పద్మలాదేవి.

ఈ మాటలు విని ముకుందపెద్ద కను లశ్రుపూరితములైనవి.

"తల్లీ ! ఈమె మా బిడ్డకాదు-భగవంతుని బిడ్డ ! మేము చేసిన సహాయమునకంటెనూ పరమాత్ముని దయ గొప్పది ! ఆతని యిచ్ఛప్రకారమే అన్నియునూ జరుగగలవు. ఇంతవరకునూ మీ జీవితములో నుండిన చీకటిరోజులు గడచిపోయినవి. ఇక మీ జీవితమునకు భగవంతుడు సుప్రభాతమును బ్రసాదించుగాక !"

అని ముకుందపెద్ద అనినాడు.

ఇంతలో అచ్చటికి ప్రౌఢదేవరాయ లరుదెంచినాడు.

అతనిని పొన్నలకు పరిచయము చేయుచూ ఆమె తల్లి యనినది:

"కుమారీ, వీరే మనల నీ యాపదనుండి రక్షించిన మనపాలిటి భాగ్యదేవతలు- సామ్రాట్ ప్రౌఢదేవరాయలు !" అని చెప్పి నమస్కరించి కృతజ్ఞతాశ్రువుల నర్పించినది. పొన్నలకూడ ఆతనికి చేతులు జోడించి నమస్కరించినది.

"అంతయునూ భగవదేచ్ఛ ! మనము కేవల మతని ఇచ్ఛానువర్తులము !" అని పల్కి మరల :

"రాజకుమారీ ! ప్రస్తుతము నీ దేహస్థితి యెట్లున్నది ? నీ తల మీది గాయము బాధించుచున్నదా ?" అని ఆత్మీయముగా విచారించినాడు.

రాజకుమారి పొన్నల లజ్జావనత యైనది. ఆమె ముఖములో ముందెన్నడూలేని ముగ్ధశోభ వెల్లివిరిసినది.

సామ్రాట్ ప్రౌఢదేవరాయలు పద్మలాదేవి ముఖ మవలోకించి, తృప్తిగా నవ్వుకొనినాడు.

పద్మలాదేవి,పొన్నలాదేవిని—ప్రౌఢదేవరాయలనూ చూచి అర్థగర్భితముగా నవ్వినది.

# 10

# స్వామి కార్యము

ముమ్మయనాయకుని పట్టి బంధించి తెచ్చునట్లుగా చెప్పి వెళ్ళిన వీరననాయకుడు ఊరక కూర్చొనలేదు. అతడు ముమ్మయనాయకుని స్వేచ్ఛగా విడచిపెట్టుట, తన పాదములకు తానే గొడ్డలి పెట్టు పెట్టుకొనిన నట్టయినది. త్రియంబక దేవుని మీద అతడు జరిపిన దురాక్రమణ—దండ యాత్ర—సార్వభౌమునికి వ్యతిరేకముగా జరిపిన దండయాత్రగా ఊహింపబడినది. దీని కవకాశమిచ్చి నందువలన సామ్రాట్టు తనను రాజద్రోహి యని భావించుట కాస్పద మైనది. అందులకు వీరననాయ కుడు చాల వ్యధ జెందినాడు.

ఇప్పు డే విధముగా నైననూ తనకు వచ్చిన యపవాదునుపొగొట్టు కొనవలయును. తన సామ్రాజ్య సేవను లోకమునకు ప్రకటించ వల యును. లేనిచో సామ్రాట్టులు తన మాటను విశ్వసించరు. తనపై సార్వ భౌములకు నమ్మిక, విశ్వాసములు లేని పిమ్మట బ్రతికి ప్రయోజన మేమి ? అపకీర్తి భాజనుడై బ్రతుకుట కంటెనూ మరణించుటయే మేలు ! అందువలననే అతడు ముమ్మయనాయకుని వలన జరిగిన అన్యాయమునకు అతనిమీద పగదీర్చుకొనుటకు నిశ్చయించినాడు. ఇది తన సామ్రాట్య నిష్ఠను ఒరపెట్టి చూచు అగ్నిపరీక్ష యైనది.

వీరననాయకుడు లింగనామాత్యులను రావించుకొని, అతనితో మంత్రాలోచన జరిపి, తను చేబూన వలసిన మార్గమును నిర్ణయించుకొని నాడు.

అమాత్యుని సలహా మేరకు అతడు తన రాజ్యములోని సంస్థానా ధీశ్వరులనూ, గ్రామాధికారులనూ అందరినీ సముఖమునకు రప్పించు కొని, వారికి అరగరాజ్యమునకు ముమ్మయనాయకుని వలన వచ్చిన అప

వాదపు కథను వివరించి, దానిని తుడచివేయుటకు ప్రతియొక్క స్వామి భక్తి పరాయణుడూ త్రికరణ పూర్వకముగా కష్టించవలయునని విన్న వించినాడు.

"సంస్థానాధీశ్వరులారా ! యిప్పుడు మన అరగ రాజ్యపు కీర్తి ప్రతిష్ఠలు మీ మీద ఆధారపడి యున్నవి. ఆ ద్రోహి యగు ముమ్మయ నాయకుని ఎట్లయిననూ బట్టితెచ్చి, అప్పగించునట్లుగా సామ్రాట్టులకు మాట యిచ్చినాను. ఈ వాగ్దానమును మనము ప్రాణము లొడ్డియైననూ కాపాడుకొనవలయును. అందులకు మీ సాయ మత్యంతావశ్యకము.మన రాజ్యమునకు ఆపాదింపబడిన యీ కళంకము మీవలన తొలగి పోవల యును. ఈ సంఘటనను మీరు మీ ధైర్య సాహసములనూ, స్వామి నిష్ఠనూ, సామ్రాజ్య నిష్ఠనూ ఒరపెట్టి చూపునంతటి ఒక అగ్నిపరీక్ష యని తెలుసుకొనుడు. ఈ మహత్కార్యమునకు మీరందరునూకంకణము కట్టుకొన వలయును. అంతటి ధీరులు మీలో నెవరైననూ వున్నచో వారు అగ్రి తాంబూలమును—యుద్ధ తాంబూలమును-స్వీకరించుటకు ముందుకు రండు !"

అని అచ్చట చేరియున్న సంస్థానాధీశ్వరులను జూచి, వీరన నాయకు డనినాడు.

ఈ మాటలు విని సంస్థానాధీశ్వరు లందరూ ఒకరి ముఖము లొకరు చూచుకొన్నారు. వారిలో ఎవరికినీ ముమ్మయనాయకునితో వైరము కట్టుకొని బ్రతకగలమను ధైర్యము లేదు. అందరూ మౌన ముగా నుండుట జూచి, అనెవరినాడు పాలకుడగు తిరకి నాయకునకు ఆవేశము కలిగినది. అతడు తనకంటెనూ వీరులూ, సమర్థులూ,పెద్దవారూ నగు వారెవరైననూ యీ అగ్రితాంబూలమును స్వీకరించి, తమ మాతృ భూమి కేర్పడిన కళంకమును తుడిచి వేయుటకు ప్రయత్నించ వచ్చునని భావించినాడు. కాని ఎవరునూ పెదవి కదుపక పోవుటను జూచి—

"ప్రభూ ! తమ కేర్పడిన కళంకమును తుడిచివేయుటకు నేను కంకణము గట్టుకొనుచున్నాను. మీరు నాకు అగ్రితాంబూలము నొసగుడు. ఆ ద్రోహిని చెరబట్టి తెచ్చు భారము నాయది."

—అని విన్నవించినాడు.

ఈ నిర్ణయమును విని తక్కిన నాయకులు చకితులైనారు. కాని తిరకి నాయకుడు ఎంతటి వీరుడు—స్వామి నిష్ఠాగరిష్ఠుడనునది తెలిసిన వీరననాయకు డాశ్చర్యపడలేదు. అతడు అనేవరినాడు తిరకి నాయకుని వీరభాషణమును విని సంతోషపడినాడు.

"భలే! తిరకినాయకులూ, మీరు వీరోచితముగా మాట్లాడినారు. మీ మాటలు విని మాకు చాల సంతోషమైనది. మీరే యీ మలెనాడు నందలి నిజమైన వీరపుత్రులు" అని చెప్పి, అతనికి అగ్రతాంబూలము నిచ్చి, ముమ్మయనాయకుని బట్టితెచ్చు బాధ్యత నప్పగించినాడు. తిరకి నాయకుడు అరగ రాజ్యమందలి పదునేడు సంస్థానముల సైన్యము నొక టిగా చేర్చుకొని బోలెయ దుర్గము మీద దండెత్తి వెళ్ళినాడు.

బోలెయ దుర్గము సహ్యాద్రి యందలి ఒక ఎత్తైన పర్వత శిఖ రముమీద నున్నది. అచ్చట ప్రజలకు కావలసిన నీరు, ధనధాన్యముల సేకరణ, ఆయుధ సంగ్రహణము అన్నియునూ సక్రమముగా నున్నవి. దానిని మానవ మాత్రులు చొర వీలుగాని ఒక కోట రక్షించుచున్నది. కోట మహాద్వారములు గల మార్గము చాల యిరుకుగాను, ఎక్కువమంది ఒకే పర్యాయము వచ్చుటకు వీలు లేనట్లుగాను యున్నది. ఇటువంటి దుర్గమ దుర్గములో తలదాచుకొని యున్న ముమ్మయనాయకుని పట్టి బం ధించుటనిన, అది అతి సాహసముతో కూడిన కార్యము.

తిరకి నాయకుడు బోలెయ దుర్గమును ముట్టడించుటకు పూర్వ మొక పరి ముమ్మయనాయకునకు బుద్ధిజెప్పి దారికి తీసుకొని వచ్చుటకై, అతనికొక లేఖ వ్రాసి పంపినాడు.

ఆ లేఖలో తిరకి నాయకు డీ విధముగా వ్రాసినాడు:

"ముమ్మయనాయకులూ! మీరు అరగ రాజ్యమందలి యొక సుప్రసిద్ధులగు పాళెగారులని ఈ మాటలు వ్రాయుచున్నాను. మీరు సామ్రాట్టుల మిత్రులగు చంద్రగుత్తి త్రియంబక దేవులను చంపి, వారి సోదరినీ, సోదరి పుత్రికనూ అమానుష రీతిని జూచినారు. ఈ మహాప

రాధము జరుగుట కవకాశమిచ్చి నందులకు మా ప్రభువులు మీ కొరకై సామ్రాట్టులముందు తలొగ్గవలసి వచ్చినది. ఇప్పుడైననూ మీరు మీ యకృత్యమునకయి పశ్చాత్తాప పడి, సామ్రాట్టుల సన్నిధిని తప్పు నొప్పు కొని క్షమాపణ కోరుచూ, అపరాధ కానుకలు సమర్పించు నట్టయినచో, సార్వభౌములు మిమ్ములను ఔదార్యముతో క్షమించవచ్చును. ఈనాడు తొందరపడిన, రేపు పశ్చాత్తాప పడవలసి యుండును. కనుక బాగుగా ఆలోచించగలరు. మీ ప్రత్యుత్తరమునకై నిరీక్షించు,

మీ మిత్రుడు,

తిరికి నాయకుడు"

ఈ లేఖనుజూచి ముమ్మయనాయకునకు ఆందోళన కలిగినది. తను చేసిన ఒక అత్యాచారము సామ్రాట్టులకు ఆగ్రహమును కలిగించగలదని అత డనుకొనలేదు. ఇప్పు డీ విషయమునుండి ఉపాయముగా తప్పించు కొనవలయునని తలచినా డా ధూర్తుడు. అతడు స్నేహమును నటిం చుచూ, తిరికి నాయకుని కొక లేఖ వ్రాసినాడు. అది యీ విధముగా నున్నది:

"సన్మాన్య మిత్రులగు అనెవరినాడు తిరికి నాయకులకు. బోలెయ దుర్గపు ముమ్మయనాయకుడు చేయు విజ్ఞాపనములు ...

నిరపరాధి నగు నామీద తమరు దండెత్తి వచ్చుటను జూచి, మోద మునూ-ఖేదమునూ రెండూ ఏక కాలములో జనించినవి. మన ప్రభువు లగు పీరనాయకులు స్వార్థపరుల మాట లాలించి నా విషయములో దురభిప్రాయ పడినట్టు తెలయుచున్నది. సార్వభౌములకు కూడ నాపై ఎవరో నీచులు కల్లబొల్లి మాటలుచెప్పి, వారి మనసును విరచినట్టు తెలియుచున్నది. ఈ దురాగ్రహమునకూ, శిక్షకూ నేను సర్వదా బాధ్యు డను గానని వినమ్రుడనై తెలుపుకొను చున్నాను.

నే నింతవరకూ సామ్రాట్టులకు గాని, అరగసీమ సామంత రాజు లకుగాని త్రికరణ పూర్వకముగా ద్రోహము దలచినవాడను కాను. సామ్రాజ్యమునూ, సామంతమునూ నిష్ఠతో సేవించుటయేగాక, చెల్లించ

వలసిన కప్పములను—కానుకలను తప్పక చెల్లించుచూ వచ్చుచున్నాను. ఇట్లుండగా నన్ను రాజద్రోహివలె భావించి, శిక్షించుటకయి తాము వచ్చి యుండుటను జూచి చాల ఆశ్చర్యముగా నున్నది.

నావలన చంద్రగుత్తి త్రియంబకదేవునికి అన్యాయము జరిగి యున్నచో, అది మా ఉభయుల వైయక్తిక కుటుంబ విషయము. నాకు ద్రోహము తలపెట్టిన ఆ పాపిని నేను దండెత్తివెళ్ళి—యుద్ధములో సంహరించినాను. అతడు పొన్నలాదేవిని నా కొసగి వివాహ మొనరించెదనని చెప్పి, నన్ను మోసగించినది మాత్రమే గాక, అవమాన పరచి పట్టి బంధించి, సామ్రాట్టుల కప్పగించుటకు కుట్రపన్నినాడు. అటువంటి నీచుని నేను సరియైన రీతిని విచారించినాను. ఇందున నా యపరాధమేమియునూ లేదు.

ఎందుకనగా, పొన్నలాదేవి బారకూరు ప్రభువులచే నా కేర్పరుప బడిన వధువు ; ఆమెను నా కివ్వక పోవుటకు త్రియంబకదేవున కే యధికారమునూ లేదు. ఆమెను నా కివ్వక వంచించినదే గాక, నన్ను బంధించి నా స్వాతంత్ర్యమునుకూడ హరించుటకయి ప్రయత్నించినాడనియే నే నతనిమీద వీరోచితమైన పగ దీర్చుకొనినాను. ఇందులో నా తప్పేమియునూ లేదు. దీనిని ప్రాజ్ఞులగు వీరనాయకులు గ్రహించియునూ, నా సామ్రాట్టులను సమాధాన పరచకుండుట మా దౌర్భాగ్యము ; ఇప్పుడైనను మీరు యథార్థమును సార్వభౌముల కెరిగించి, వారి క్షమను నాకు లభింప జేయగలరని నమ్ముచున్నాను.

ఇట్లు,
మీ విశ్వాసనీయుడు,
బోలెము ముమ్మయనాయకుడు."

ఈ లేఖను జూచి తిరకి నాయకునకు ఆశ్చర్యమైనది. ముమ్మయ నాయకుడు నిరపరాధి వేషము వేసి తనను వంచించుచున్నాడేమోనను అనుమానముకూడా కలిగినది.

అతడు ముమ్మయనాయకుని అంతర్యము నెరుగుటకయి, పత్రి వాహకుడగు కమ్మానాయకు నుద్దేశించి;

"కమ్మానాయకులూ ! మీ ప్రభువులు తాము నిరపరాధులమని వ్రాసియున్నారు. నిరపరాధులైనచో వారు నావెంట వచ్చి యెందులకు సామ్రాట్టుల దర్శనము చేయరాదు? జరిగిన విషయములన్నియును తెలిపినచో, వారిని సామ్రాట్టులు క్షమించవచ్చునుగదా!" అనినాడు.

ఈ మాటలకు కమ్మానాయకు డనినాడు :

"తిరకినాయకులూ ! సామ్రాట్టులను దర్శించుటకు మా నాయకులు వెనుకాడుటలేదు. కాని సామ్రాట్టులు వారిని మోసముతో పట్టి బంధించుట లేదనియూ, పూర్వాగ్రహముతో శిక్షించుట లేదనియూ మాట యిచ్చినచో.వారు సార్వభౌముల వద్దకు వచ్చుటకు సంతోషముగా సమ్మతించగలరు."

"ఆ విషయము నే నెట్లు చెప్పగలను? నేను సామ్రాట్టుల ఆజ్ఞాను వర్తిని—వారి యాజ్ఞను కార్యగతముచేయు రాజ కర్మచారిని."

"అయినచో, మా నాయకులు సామ్రాట్టుల వద్దకు వచ్చుట యను మానము. తనప్రాణమును రక్షించగలమను మాట యివ్వనిదే వారు కోట విడచిరారు."

"అయినచో ఇప్పుడు సంధి మా టెందులకు ?"

"సంధికి ప్రయత్నించిన వారు మీరేకాని, మేముకాము."

"మేము యుద్ధమునకు సిద్ధమై వచ్చి యున్నాము."

"మేముకూడ సిద్ధముగా నున్నాము. కాని మాకు సార్వభౌములు నిష్కారణముగా అన్యాయమును దలపెట్టు చున్నారుగదా యని మేము మీవద్ద మా హృదయమును విప్పి చెప్పవలసి వచ్చినది"

"మీకు సామ్రాట్టులవద్ద క్షమాభిక్ష కావలయు ననినచో, మీ నాయకులు నాకు శరణాగతులు కావలయును. వారి సిగ పూవు వాడకుండా నేను చూచుకొనగలను."

"మా నాయకులకు యీ విషయముపట్ల సామ్రాట్టుల నుండియే వాగ్దానము కావలయును."

"వారు ధర్మావతారులు. వారివలన ఎవరికినీ అన్యాయము ఘటిం

చదు. మీరు వహించినది న్యాయపక్షమైనచో, మీ నాయకులెందుకు వచ్చి సామ్రాట్టులను న్యాయదాన మర్థించరాదు?"

"ఈ న్యాయదానములో మాకు అన్యాయమే జరుగవచ్చునను భీతి గలదు. ఆ ధూర్త స్త్రీ పద్మలాదేవి మాటలువిని, సామ్రాట్టులు మమ్ము లను శిక్షించవచ్చును. సామ్రాట్టులనుండి మాకీ విషయముపట్ల సరియైన నమ్మకము కావలయును"

"అది సామ్రాట్టులు మాత్రమే యివ్వగలరు"

"ఔను. వారు మమ్మయనాయకుల తలపై మోపియున్న భార మును దింపుకొని,మా నాయకులకు క్షమాపణ విచ్చునట్లు బహిరంగముగా వెల్లడించిననే మాత్రము వారు మీవెంట సార్వభౌముల దర్శనమునకు రాగలరు. ఈ షరతుకు సమ్మతించనిచో వారు బోలెయ దుర్గమునుండి వెలుపలకి తలజూపరు"

"అట్లయినచో, యీ విషయములో యుద్ధ మనివార్యమని మేము భావింపవచ్చునా ?"

"మీ రా విధముగా భావించి, మామీద దండెత్తి వచ్చునట్టయినచో మేమేమి చేయగలము ? నిరపరాధులు కూడ శిక్ష ననుభవించవలయు ననునది లోకనియమమైనచో, యిక ఎవరేమి చేయగలరు ?"

"కమ్మ నాయకులూ ! మీవాద మాశ్చర్యముగా నున్నది. త్రియం బక దేవులను క్రూరముగా జంపియునూ, నిరపరాధుల ముసుగు ధరిం చుట జూచిన పరమాశ్చర్యకర మగుచున్నది"

"మే మొనరించిన యపరాధ మేమి ? బారకూరు ప్రభువుల మాట లాలించి, మా నాయకులు పొన్నలాదేవిని వివాహమాడ గోరు టప రాధమా ; అది అపరాధమైనచో మా నాయకులు శిక్షార్హులే !"

"అది తప్పుకాదు-కాని త్రియంబక దేవుల నీ విషయమై వత్తిడి జేయ ప్రయత్నించినది అపరాధము"

"మేము వత్తిడి చేయలేదు. ఆ త్రియంబక దేవుడే బిడ్డ నిచ్చెద నని జెప్పి మమ్మలను మోసముతో పట్టి బంధించ బ్రయత్నించినాడు.

దీనితో కుపితులైన మా నాయకు లా ద్రోహిని యుద్ధములో జంపి పగ దీర్చుకొన్నారు"

"అయినచో, పొన్నలాదేవి-పద్మాలాదేవులను బలాత్కరించి బంధించి తీసుకొని పో బ్రయత్నించిన దెందులకు ?"

"వారిని మేము బలవంతముగా బంధించి తీసుకొని వెళ్ళలేదు పొన్నలను బారకూరు ప్రభువులు మాకు వధువుగా సమర్పించినారు. తమ వధువును కోరినారేగాని మా నాయకు లన్యులను గోరలేదు"

"పొన్నలను మీ నాయకులకు వధువుగా సమర్పించుట కా బారకూరు ప్రభువుల కే యధికారమునూ లేదు"

"లేకేమి ? పొన్నల బారకూరు వంశపు రాజపుత్రిక యను విషయమును మీరు మరచినట్లున్నారు !"

"ఆ విషయమును నిర్ణయించి తీర్పు జెప్పవలసినది మీరుకాదు- పద్మలాదేవిగారు. వారికి తమ కుమార్తెను మీ నాయకుల కిచ్చుట కిష్టము లేదు. వారి యసమ్మతిపై జరిగిన యీ బలాత్కారము-హత్యలు - దోపిడీలు అన్నియునూ తీవ్రమైన యపరాధములేనని సామ్రాట్టుల శాసన"

"తిరకి నాయకులూ ! మీరేమి చెప్పిననూ పొన్నలాదేవి మా నాయకుల వధువను మాటను మాత్ర మబద్ధము చేయలేవు. ఆ పద్మలాదేవి మీ సామ్రాట్టుల మనసు చెరిపి, మా నాయకులను పట్టి శిక్షించుటకీ దండయాత్రా నాటక మాడుచున్నది. కనుక సార్వభౌములనుండి మా నాయకుల కభయహస్తము లభించనిచో వారు దుర్గమునుండి వెలికిరారు"

"అయినచో, యుద్ధమునకు సిద్ధముగా నుండుమని వారికి తెలుపుము !"

"మేమింత చెప్పిన తరువాత కూడ దండయాత్రి జరుపునట్లయినచో, మా దురదృష్టమని భావించి మేమునూ యుద్ధము చేయవలసి రాగలదు నాయకులూ !"

"వెళ్ళి మీ నాయకులకు తెలుపుడు. ఇటువంటి మాటలతో మమ్మ

లనుగాని, వీరననాయకులనుగాని, సార్వభౌములనుగాని మోసగించుటకు వలనుపడదు. మీవలన చంద్రగుత్తి రాజగు తిర్యంబక దేవునకూ, ఆ రాజ్య వాసులకూ జరిగిన అన్యాయ పరంపరలకు మీరు విచారణకు లోబడి శిక్ష ననుభవించియే తీరవలయును. పశ్చాత్తాపము తప్ప - వేరెవరునూ సామ్రాట్టుల కోపము నుపశమింప జేయలేరు. ఆపైన మీయిష్టము వచ్చినట్టు చేసుకొనుడు"

ఈ మాటలువిని కిమ్మానాయకుడు దుర్దానము స్వీకరించిన వాని వలె అచ్చటనుండి వెళ్ళినాడు.

చివరకు తిరకి నాయకుడు ముమ్మయనాయకునిమీద యుద్ధ మనివార్యమని గ్రహించినాడు. అందువలన అతనికి చాల వ్యథ కలిగిననూ, యుద్ధ మొనరించకుండుటకు వేరు మార్గము గోచరించలేదు.

అతడు బోలెయ దుర్గమును ముట్టడించుటకు సిద్ధముగా నుండ మని తన సైన్యముల కాజ్ఞాపించుద మనుకొనుచుండగా, ముమ్మయనాయకుని వద్దనుండి ఒక లేఖ వచ్చినది.

ఆ లేఖలో ముమ్మయనాయకుడు :

"తిరకి నాయకులూ! మీ సలహా మేరకు నేను మీకు శరణాగతుడనై, సామ్రాట్టులను క్షమాపణ కోరుటకు సమ్మతించినాను. మీ వెంట సార్వభౌముల శిబిరమునకు వచ్చుటకు సిద్ధముగా నున్నాను మీరు మా పూర్వవైరమును మరచి, మా యాతిథ్యమును స్వీకరించి, యిచ్చటి నుండి బయలుదేర వలయునని మా వినమ్ర వినతి. వెంటనే తమరు అంతఃపురమునకు రాగలరని నమ్ముచున్నాను" అని వ్రాసి యున్నాడు.

ఈ లేఖ జూచి తిరకి నాయకు డాశ్చర్యపడినాడు. "కానిమ్ము, ఆలోచించి మీ నాయకులకు జవాబివ్వగలము" అని చెప్పి, పత్రవాహకుని పంపివేసి, తన ఆప్తమిత్రులగు నాయకులను సముఖమునకు బిలిపించుకొని ముమ్మయనాయకుని లేఖావిషయములు వారికి తెలియజేసినాడు.

ఇది విని రంగయ్య నాయకుడు :

"తిరకి నాయకులూ! ఇందులో నేదియో మోసముగలదు. ఈ

లేఖను నమ్మి మీరు బోలెయ దుర్గమునకు వెళ్ళకుడు. ఆ ధూర్తుని గోముఖ వ్యాఘ్రిత్వ మిందున దాగియున్నది" అనినాడు.

"నాయకులూ ! మీరనిన మాటలు సత్యములు. కాని మన సలహాను బాగుగా పర్యాలోచించి, అతడెందులకు అనిర్బంధముగా మనకు శరణాగతుడగుటకు నిశ్చయించి యుండరాదు ?"

"ఆ ధూర్తుడింత సులభముగా మనకు పట్టుబడగలడని భావించినారా ? అసంభవము ! అతడు మనలను మోసగించుటకై యీ నాటకమాడుచున్నాడని నాకు దోచుచున్నది. మీ రీ విషయములో చాల జాగ్రత్తగా నుండుట మంచిది"

"అయినచో, మీరు చెప్పునదేమి ?"

"మనము యుద్ధమునకై బయలుదేరి వచ్చియున్నాము. కాబట్టి యుద్ధమునరించియే ఆ ద్రోహిని పట్టుకొందము"

"ఒకవేళ దుర్గము వశమగుటకు మునుపే అత డాత్మహత్య చేసుకొని మనలను వంచించినచో నేమి చేయవలయును ? నే నతనిని బంధించి తీసుకొని వచ్చెదనని ప్రభువులకు మాట యిచ్చినాను. ఈ కార్యమును మన ముపాయముగా సాధించవలయును"

"అయినచో, మీరిప్పుడు చెప్పునదేమి ?"

"మన మిప్పుడు ధైర్య మవలంబించవలయును. ఆ ధూర్తుని యధార్థ స్వరూపము నెరిగి వచ్చుటకు నే నతని కోరిక మేరకు మితపరివారముతో అతని యంతఃపురమునకు వెళ్ళ నిశ్చయించినాను"

"ఏమీ ! తెలిసి తెలిసీ సింహపు గుహలోనికి జారబడవలయునని యున్నారా ?"

"ఔను. ఆ సింహము నిజమైనదో లేక నా రూపములోనున్న ప్రతిమయో తెలుసుకొనుటకై అచ్చటికి వెళ్ళవలయును"

"అతనివలన మీ కపాయము సంభవించినచో ?"

"అంత సులభముగా నన్నతడు మోసగించలేడు. ఒకవేళ మోసగించిననూ, నా రక్షణకై మీరున్నారు"

ఈమాటలకు బదులు పలుకుటకు మార్గములేక యితర నాయకులు మౌనముప దాల్చినారు.

కాని తిరకినాయకుడు మాత్రము భీతిల్లలేదు. అతడు సింహము యొక్క శక్తిని కనుగొనుటకయి దాని గుహలోనికి వెళ్ళ నిశ్చయించి నాడు.

ఆ నిశ్చయము మేరకు తనరాకను గురించి ముమ్మయనాయకునకు లేఖామూలముగా దెలిపి,మితపరివారముతో బోలెయి దుర్గమునకు బయలు దేరినాడు

ముమ్మయనాయకుడు తిరకినాయకునకు విశ్వాసముతో స్వాగత మిచ్చి. అంతఃపురమునకు దోడ్కొనివెళ్ళి ఉపచర్యలు చేసినాడు.

అనంతర మతనిని చూచి నవ్వుచూ— అచ్చటనున్న అంగరక్షణా బలాధిపతియగు కమ్మానాయకున కేదియో సంజ్ఞ చేసినాడు.

అతడు తన యనుచరులతో హఠాత్తుగావచ్చి, తిరకినాయకుడు జాగ్రత్త పడకమునుపే అతనిమీద పడి నిరాయుధునిగా జేసి. బంధించి నాడు. అతని పరివారమునకు సైత మిదియే గతి బట్టినది.

ఏది జరుగగూడదని తిరకినాయకుడు భావించెనో అదియే జరిగి నది. ధూర్తుడగు ముమ్మయనాయకుడు ఉపాయముగా తిరకినాయకుని తన వజ్రముష్టిలో చిక్కించుకొనినాడు.

సైనికులు తిరకినాయకుని బంధించి తీసుకొనివెళ్ళి, ముమ్మయ నాయకునిముందు నిలువబెట్టినారు.

అతనిని చురచుర జూచి, ముమ్మయనాయకుడు వికటముగా నవ్వి నాడు,

"నన్ను బంధించి సామ్రాట్టుల వద్దకు తోడ్కొని పోవుటకయి వచ్చినారు కదా మీరు? తిరకినాయకులూ! ఇప్పుడైననూ తెలిసినదా మీ కి ముమ్మయనాయకుని మోసగించుటకు సాధ్యము కాదని? నన్ను బంధింప వచ్చిన మీకు పడనున్న శిక్ష ఏదియో తెలియునా?"

ఈ మాటలు విని తిరస్కార భావముతో అనినాడు తిరకి నాయ కుడు :

"నీచా ! దూరము తొలగుము. నాకు నీ ముఖమును చూపకుము. నీవంటి కుక్కతో మాటాడుటకు నాకు సిగ్గగుచున్నది."

"ఎవరుకుక్క? జాగ్రత్తగా మాట్లాడుడు నాయకులూ ! మిమ్ము లను నేను గౌరవముగా చూచినాను. కాని అందులకు మీ రర్హులుకారు. ఇప్పుడు చెప్పుడు, నన్ను మోసగించి సామ్రాట్టుల వద్దకు బంధించి తోడ్కొని వెళ్ళ జూచిన నీవా ? నేనా ? ద్రోహిని. ఇకనైననూ మీ సామ్రాట్టులకు తా మాశ్రియమిచ్చిన ఆ పొన్నలను నా కప్పగించుమని చెప్పుడు. లేనిచో మీరు నా చేతినుండి ప్రాణములతో తప్పించుకొని బయటపడలేరు."

"ఓరీ పిరికిపందా ! నీవు వీరుడవైనచో నా చేతికి ఖడ్గము నొసగి పరికించుము. నీకు సరియైన జవాబు చెప్పెదను"

అని తిరస్కారముగా అనినాడు తిరకినాయకుడు.

"అయినచో,మీరు మంచి మాటలతో దారికి వచ్చునట్టు కనబడుట లేదు ?"

"లేదు ! ఈ శరీరము నశించిపోయిననూ సరియే, ప్రాణాశచే నీవు చెప్పినట్టుగా సామ్రాట్టులకు లేఖ వ్రాయను"

"అయినచో, నీకు మా యాతిథ్యపు రుచి చూపకతప్పదు....ఎవ రక్కడ ? ఈ నీచుని కంబమునకు బిగించికట్టి, కమ్చీతో నాలుగు దెబ్బలు కొట్టుడు" అని యాజ్ఞాపించినాడు.

వెంటనే కమ్మానాయకుడు తిరకినాయకుని సరసర యీడ్చుకొని వెళ్ళి, అచ్చటనున్న కంబమునకు బిగించికట్టి, వస్త్రవిహీనునిగా జేసి నాలుగైదు కమ్చీ దెబ్బలు కొట్టినాడు. ఆ దెబ్బలకు అతని చర్మము పగిలి రక్తము కాలువలు గట్టినది.

అయిననూ వీరుడగు తిరకి నాయకుడు ముమ్మయనాయకుడు కోరి నట్టుగా, సామ్రాట్టులకు లేఖ వ్రాయుట కొప్పుకొనలేదు. ప్రాణము

పోయిననూ సరియే, ఈ నీచుని పన్నుగడ ఫలించరాదని నిశ్చయించు కొనినాడు.

ముమ్మయనాయకుడు తిరకి నాయకుని మనస్థైర్యమును జూచి, నిశ్చేష్టుడైనాడు. అతనికేమని తోచినదో, కొట్టుచున్న కమ్మానాయకుని వెనుకకు పిలచి—

"అన్యాయముగా ఎందులకు చచ్చెదవు నాయకా ? నా మాట ప్రకారము నడచుకొని, సామ్రాట్టులకు లేఖ వ్రాసి యిమ్ము. పొన్నలా దేవిని నాకై వసమొనర్పుము. నీకు విముక్తి లభించగలదు"

"నీచా ! నీవు నన్ను ముక్కలు ముక్కలుగా నరికిననూ, సామ్రాట్టులకు ద్రోహము తలపెట్టలేను" అని పొడుగరచి, రోషముతో అనినాడు తిరకినాయకుడు,

ఈ మాటలతో విసుగుజెందిన ముమ్మయనాయకుడు తన చెఱసాలయే అతనికి తగిన బుద్ధి గరపగలదని భావించి, తిరకినాయకుని భూగర్భ చెఱసాల యందలి చీకటి గదిలో బంధించుడని యాజ్ఞాపించి, అచ్చటి నుండినిష్క్రమించినాడు,

ఆ చెఱసాల చాల భీతిని గొలుపుచున్నది. అచ్చట భయంకరమైన సర్పములూ, విషజంతువులూ నివసించుచున్నవి. గాలిలేక అచ్చట తన వలెనే పడవేయబడిన ఖైదీలు కృంగి కృశించి మరణించగా వారిశవాలు కుళ్ళి దుర్వాసన వేయుచున్నవి. అతనికి మొదటి మూడురోజులు అన్నపానీయము లివ్వక కృశింపజేసినారు. ఆ తరువాత మట్టికలిపిన రొట్టెనూ, కొంత నీరునూ తెచ్చిపెట్టి వెళ్ళినారు.

తిరకి నాయకుడు ఆ రొట్టెలను తినుచూ ఎట్లో ఒకవారము రోజులు గడపినాడు. అప్పటి కతని యారోగ్యము చెడి, రక్తభేది ప్రారంభమైనది.

ఈ విషయము తెలిసి ముమ్మయనాయకుడే అచటికి వచ్చినాడు.

"తిరకి నాయకా ! ఇప్పుడైననూ నామాట వినుము వృథగా ఎందులకు మరణించెదవు ?" అని అనునయముగా పల్కినాడు.

తిరకి నాయకుడు మారుపలుకక మౌనము ధరించినాడు.

"మంచి మాటలతో నీవు మీ సైనికులకు శరణాగతులు కమ్మని చెప్పుము. సామాన్రిట్టులకు పొన్నలాదేవిని తెచ్చి అప్పగించుటకయి లేఖ వ్రాసియిమ్ము. నిన్ను విముక్తుని జేసెదను."

తిరకి నాయకుడు క్షణకాల మాలోచించుచూ కూర్చున్నాడు. అతని కొక ఉపాయము తట్టినది. తానీ ధూర్తుని మోసగించి యిచ్చటినుండి ఎందులకు తప్పించుకొనరాదు? అనుకొన్నాడు. తరువాత—

"ముమ్మయనాయకులూ! చెఱసాలలో నున్న నే నెట్లు నా సైనికులకు శరణాగతులు కమ్మని చెప్పను? చెప్పిననూ వారు నా మాటలను నమ్మగలరా?"

"ఒకలేఖ వ్రాసి, తెలియజేయుము."

"ఆ లేఖను వారు నమ్మనిచో?"

"అట్లయినచో మీరు కోట కొమ్మమీద నిలబడి, మీ సైనికులకు శరణాగతులగుటకు ఆజ్ఞయిమ్ము"

"సరే, కానిమ్ము!" అనిచెప్పి, తిరకి నాయకు డీ కార్యమునకు సమ్మతించినాడు.

ఆ ప్రకారమే తిరకినాయకుని బంధించి తగిన కావలితో నతనిని కోట గోడమీద నిలువబెట్టి, అతని సైనికులకు శరణాగతులగుట కాజ్ఞ యిమ్మని చెప్పినాడు.

తిరకి నాయకు డీ సమయమును జారవిడచుకొనక, ఆవేశముతో అనినాడు: "ప్రియమైన యోధులారా! ఈ ధూర్తుని మాటలు విని మోసపోకుడు. వెంటనే కోటను ముట్టడించి వశపరచుకొనుడు. నాకొరకై మీ రీ యుద్ధమును మానివేయకుడు. ధీరులవలె పోరాడి స్వామికార్యమునకై మీ తనువు లర్పించుడు."

తిరకినాయకుని వీరభాషణమువిని అతని సైనికులకు రోమాంచితమైనది. వారు తమ చేతులలో నున్న ఆయుధములను శబ్దముచేసి, 'తిరకి నాయకునకు జయమగుగాక!' యని రణగర్జన గావించి, దైత్యావేశముతో కోటను ముట్టడించినారు.

తిరకి నాయకుడు చివరకు తనను వంచించిన వారిని వంచించినాడు. ఇది జూచి ముమ్మయనాయకునకు విపరీతమైన కోపమువచ్చినది—అతడు చేత ఖడ్గము ధరించి:

"ఆ నీచుని ఖండతుండెములుగా నరుకుడు!" అని గర్జించి, అతని మీద తానే వెళ్ళి పడినాడు.

ఇటువంటి పరిస్థితి సంభవించి నప్పుడేమి చేయవలసినదీ, తిరకి నాయకుడు మునుపే నిర్ణయించు కొనినాడు. అతడు సమీపములోనున్న ఒక యోధునిమీద పడి, అతని చేతిలోనున్న ఖడ్గమును లాగుకొని, కాల భైరవునివలె ముమ్మయనాయకుని మీదికి లంఘించినాడు.

ముమ్మయనాయకు డీ విధముగా జరుగగలదని భావించి యుండ లేదు. అతడు తన పక్షపు యోధులను జూచి:

"ఈ నీచుని చంపుడు!" అని యాజ్ఞాపించి, వారికి నాయకుడుగా తానే వెళ్ళినాడు.

తిరకినాయకు డొక్కడైననూ అసంఖ్యాకమగు శత్రుసైనికుల దెబ్బలను నేర్పుగా తప్పించుకొనుచూ, లెక్కకు మీరిన అరివీరులను హతమార్చినాడు. ముమ్మయనాయకుని మీదపడి అతని దేహమంతయును గాయపరచినాడు.

కాని, అధిక సంఖ్యలోనున్న శత్రుసైన్యములతో ఎంతసేపని పోరాడగలడు? క్రమేణా తిరకి నాయకుని శక్తి సన్నగిల్లుచూ వచ్చినది. అతని దేహమంతయూ పూచిన మోదుగ చెట్టువలెనున్నది. అతడలసి యున్నాడని గ్రహించి, ముమ్మయనాయకుని పక్షపు సైనికు డొకడు అతని కుడి భుజమును తెగవేసినాడు. అయిననూ తిరకినాయకుడు భీతిల్ల లేదు. వామహస్తము తోడనే యుద్ధమొనరించ సాగినాడు. కాని అతని పోరాటమెక్కువసేపు జరుగలేదు. శత్రుసైనికులలో ఎవడో ఒక నీచుడు బల్లెము నతని హృదయములో నాటినాడు. ఆ దెబ్బకు రక్తము ప్రవాహముగట్టినది. తిరకినాయకుడు బాధగా మూర్ఛి నేల గూలినాడు. నేల గూలిననూ అతని ముఖములో ఆనందము నిండియున్నది. తన అంతిమ శ్వాసను సామ్రాట్టుల సేవలో విడచి, తన దేహమును

సామ్రాజ్య రక్షణకయి బలియిచ్చినందుకు సంతోషపడినాడు. నవ్వుచూ వీరమరణమునందినాడు.

ఈ దారుణ వార్తను విని తిరకినాయకుని సైనికులకు పిడుగు పడి నట్లయినది. వారు క్షణకాలము నివ్వెరపోయి, మరల తమనాయకునకు ఆ ద్రోహి వలన గలిగిన అన్యాయమునకు పగదీర్చుకొన దలచి, ద్విగుణీకృతోత్సాహముతో కోటను ముట్టడించినారు.

దీర్ఘకాల పోరాటానంతరము కోట శత్రువుల వశమైనది.

తిరకినాయకుని మిత్రుడు రంగయ్య నాయకుడు రౌద్రావేశముతో దుర్గములోనికి చొచ్చి, ముమ్మయనాయకుని చెరబట్టుటకయి అంతఃపుర ములో ప్రవేశించినాడు. దుర్గములోని ఆయకట్టు ప్రదేశములన్నియునూ అతని వశమైనవి.

స్వల్పపోరాటానంతరము అంతఃపురముకూడ రంగయ్యనాయకుని వశమైనది. ముమ్మయనాయకుని పట్టి బంధించుటకయి అతని యంతః పురము నంతయునూ పరిశోధించినాడు. కాని ఎచ్చటనూ ఆ ద్రోహి జాడ కనబడలేదు. ఆ దుష్టుడు యుద్ధములో పోరాడి మరణించి యుండ వచ్చునేమో నను యనుమానము కలిగినది.

కాని అచ్చట క్షత గాత్రుడై పడియున్న ఒక వృద్ధ సైనికుని వలన జరిగిన సంగతి తెలిసినది.

ముమ్మయనాయకుడు దుర్గము శత్రువుల వశమైనదను వార్త విన గనే, యిక తానచ్చట నుండినచో శత్రువులకు పట్టుబడుట తథ్యమని భీతిల్లి రాజభాండాగారములో నున్న విలువగల వస్తువుల నన్నింటినీ నాశ మొనర్చినాడు. కొన్నింటిని బావిలో పడవేసినాడు. తన అంతఃపుర స్త్రీల నందరినీ నిర్దయుడై చంపినాడు. తనతో తీసుకొని పోవుటకు వీలైనంత సంపదనూ, పరివారమునూ తీసుకొని, రహస్య మార్గమునుండి బయట పడి అంతఃపురము శత్రుహస్తగతము కాకమునుపే తప్పించుకొని పారి పోయినాడు.

ఈ విషయము తెలియగా రంగయ్య నాయకుడు చాల వ్యధ జెందినాడు.

అతడు తిరకినాయకునకు వీరోచితమైన అంత్యక్రియలు జరిపి, దుర్గమును తన స్వాధీనము చేసుకొని, దానిని చూచుకొనుటకయి తన నమ్మికకు పాత్రుడైన ఒక దళపతిని నియమించి, గజవేట శిబిరమునకు వెనుదిరిగినాడు.

గజవేట శిబిరములో వీరననాయకుని సందర్శించి, రంగయ్య నాయకుడు జరిగిన విషయములన్నియునూ వివరించి, తిరకినాయకుని అప్రతిమ పరాక్రమమునూ, బలిదానమునూ, ముమ్మయనాయకుని పలాయనపు కథనూ తెలియజేసినాడు. ఇది విని వీరననాయకుడు సమాధానముగా ఒక నిట్టూర్పు విడచినాడు.

# 11

# కన్యాదానము

కాని ఈ విజయవార్త వలన సామ్రాట్ ప్రౌఢదేవరాయలకు తా నూహించినంత సంతసము కలుగలేదు. తిరకి నాయకునివంటి స్వామి నిష్ఠాగరిష్ఠుడగు సేవకుని ధైర్య, సాహస, బలిదానముల కథను విని, గర్వముగా నతనిని ప్రస్తుతించిననూ ముమ్మయనాయకుని పట్టి బంధించక తప్పించుకొనుట కవకాశమిచ్చినందులకు చాల విషాదము కలిగినది. ఈ విధముగా నగుటచే అతడు పద్మలాదేవి కిచ్చిన వాగ్దానము నెరవేరక పోయినది. చేతికి చిక్కియూ తప్పించుకొని పారిపోయిన ఆ నీచుని గురించి చాల వ్యథపడినాడు. వీరననాయకుని సముఖమునకు రావించుకొని —

"వీరననాయకులూ! బోలెయ దుర్గము మన వశమైనదని విని సంతోషమైనది. తిరకినాయకు లంతటి ప్రభుభక్తి పరాయణులు చూపిన

అప్రతిమ శౌర్య-సాహస-బలిదానములను విని చాల గర్వపడినాను. అయిననూ మీరు చేసిన ప్రతిన నెరవేరలేదు. ఆ దుష్టుడు తప్పించుకొనుటకు మీ సైనికు లవకాశ మిచ్చినందుకు చాల విషాదపడుచున్నాను. అతడు బ్రతికి యున్నంతవరకూ నాకు మనశ్శాంతిలేదు. త్రియంబక దేవునికి జరిగిన అన్యాయమున కా నీచునిమీద తగిన పగ సాధించనిచో వారి యాత్మకు శాంతి లభించదు. నా మనస్సునకు కూడ సమాధానము కలుగదు" అని విషాదముగా అనినాడు.

ఈ మాటలకు వీరననాయకుడు చాల ఆందోళన జెందినాడు.

"ప్రభూ ! నావలన అపచారము జరిగియుండిన క్షమించ వలయును. తిరకి నాయకునకు నేనా దుష్టుడగు ముమ్మయనాయకుని బంధించి తీసుకొని రావలసినదని యాజ్ఞాపించినాను.ఆ వీరు డీ కార్యములో తననే బలిగావించుకొనినాడు గాని, అతనిని పట్టుకొనలేదు. అయిననూ కార్యము మించిపోలేదు. ఇప్పుడుకూడ సన్నిధానమున కా ద్రోహివలన జరిగిన యపరాధమున కతనిని శిక్షించుటకు, అతడెచ్చట దాగి యున్ననూ బట్టి తెచ్చి, తమ పాదములమీద పడవేయుదును. నాకు మరికొన్నిరోజుల గడువు దయచేయుడు" అని వినయముగా ప్రార్థించినాడు.

"వీరననాయకులూ! మీరు జన్మించినది స్వామిభక్తి పరాయణుల వంశము. పూజ్యులగు హరిహరుల కాలమునుండియూ ఆ వంశము సామ్రాజ్య సేవకు పేరుగాంచినది. మీరు మీ పెద్దలవలె కీర్తిశాలులు కావలయు ననునదియే మా యాశయము-ముమ్మయనాయకుడు తప్పించుకొని నంత మాత్రమున మీ బాధ్యత తీరిపోలేదు. అతడెచ్చట దాగి యున్ననూ పట్టితెచ్చి మా కప్పగించుట మీ ధర్మము కర్తవ్యమూనై యున్నది. ఈ విషయమును మరొక పర్యాయము మీకు హెచ్చరించు నవసరము కలుగదని మేము భావించుచున్నాము" అని ప్రౌఢదేవ రాయలు విషాదమును వ్యక్తపరచినాడు.

"ప్రభూ ! ఇదివరకే నేను చతురులగు వేగులవారి నీ కార్యమునకు వియోగించినాను. వా రా ద్రోహి ఎచ్చట దాగియున్ననూ పట్టితెచ్చి

తమ కప్పగించగలరు. బహూశః అతడు బ్రతికి యుండ దనుకొందును. బ్రతికి యున్నచో తప్పక మనకు పట్టుబడగలడు"

"అతడు మరణించి యుండునని మీ భావనయా?"

"ఔను, అతనియంతఃపురము భస్మమైనప్పుడు దానితో బాటతడు కూడ దగ్ధుడై యుండవలెయును"

"అతడు చావలేదు, వీరననాయకులూ! ఆ ప్రాణభీతిగలవాని కింతటి ధైర్యమెచ్చటినుండి రాగలదు? నిక్కువముగా అతడు తప్పించుకొని యున్నాడు—మీ రిప్పుడే మంగుళూరు, బారకూరు, ముళువాయి, అరగము, తేకలనాడు, చిమ్మతూరు, ఘనగిరి, ఉదయగిరి, కొండవీడు రాజ్యములకు దూతలను బంపి, పరిశోధించవలయును."

"ఆజ్ఞ ప్రభూ!"

ప్రౌఢదేవరాయలు లక్కనామాత్యునివైపు తిరిగి, "సచివోత్తమా! ఈ కార్యము మీ నేతృత్వముక్రింద జరుగవలయునని నా యాశ. ఆ ద్రోహిని చెరబట్టుటకు మీరే సమర్థులు. అతడు రాజద్రోహియని దండోరా వేయించుడు. అతని కాశ్రయ మిచ్చువా రెవరైననూ సరియే, వారుకూడ శిక్షార్హులని తెలుపుడు. ప్రాణములతో అతనిని బట్టి తెచ్చిన వారికి వేయివరహాలు బహుమానమని చాటింపుడు."

"ఆజ్ఞ ప్రభూ!" అని లక్కనామాత్యుడు సామ్రాట్టుల వద్ద సెలవు గైకొని వెళ్ళినాడు. ఖిన్నుడై వీరన నాయకుడు కూడ అతనిని వెన్నంటినాడు.

వారు వెళ్ళిన తరువాత ప్రౌఢదేవరాయలు చాల సేపటివరకునూ ఆ విషయమునే ఆలోచించుచూ కూర్చున్నాడు.

ముమ్మడినాయకుడు తప్పించుకొని పారిపోవుట తనకి చాల నిరాశను కలిగించినది. అతనిని బంధించి తెచ్చి పద్మలాదేవి కప్పగించి ఆ మూలముగా త్రియంబకదేవునికి జరిగిన అన్యాయమునకు తగిన పరిహార మేర్పరుప దలచినాడు. కాని అది నెరవేరలేదు. అత డపరాధి ముఖమును దాల్చి, జరిగిన విషయములన్నియునూ పద్మలాదేవికి చెప్పినాడు.

అంతయూ విని పద్మలాదేవి-"ప్రభూ! తమ రీ యల్పవిషయము నకై యింతగా విచారించ బనిలేదు. మన సంకల్పము భగవదేచ్ఛకు రాలేదు. ఆ ద్రోహి ఆయువింకనూ ముగియలేదు. తప్పించుకొనినాడు. ఇందుకయి మీరు వ్యథజెందకుడు" అని యామె సమాధాన పరచినది.

"మహారాణిగారూ, త్రియంబకదేవులు సామ్రాజ్య నిష్ఠాగరిష్ఠులలో పెద్దవారు మాత్రమే కాదు — నా మిత్రులు అభిమానులు కూడ నైనారు. వారికి జరిగిన అన్యాయమునకు నేనేమి చేసిన తీరును?"

"ప్రభూ! ఈ విషయములో మీరు చేయవలసిన దంతయూ చేసి ముగించినారు. ఆ ద్రోహి చేతినుండి నన్నునూ, పొన్నలాదేవినీ కాపాడినారు. మా రాజ్యమును మరల మాకు సంపాదించి యిచ్చినారు. ఆ దుష్టునిమీద దండెత్తివెళ్ళి శిక్షించి వచ్చినారు. ఇంతకంటెనూ ఎక్కువేమియునూ మేము కోరలేదు. తమ యీ ఉపకృతికి మేమెట్లు కృతజ్ఞత అర్పించవలయునో తెలియక యున్నది" అనినది.

ఈ మాటలకు ప్రౌఢదేవరాయలు ప్రత్యుత్తర మివ్వలేదు.

"ప్రభూ! నాదొక కోరిక గలదు....దానిని తమతో నెట్లు చెప్పుకొనవలయునో తెలియక యున్నది....తమరన్యథా భావించనిచో...."

సంకోచ పడుచూ అనినది పద్మలాదేవి.

"తల్లీ! అదే విషయమో సంకోచపడక తెలుపుము!"

"మీరు ఒకదాని మీద యొకటిగా మమ్ములను కృతజ్ఞతా భారముతో కృంగింపజేయుచున్నారు. మీ ఋణము నీ జన్మలో తీర్చుకొనలేము. యావజ్జీవమూ మేము దానిని స్మరించవలసి యున్నది. అయిననూ మా సహోదరుల ఆశయము మేరకు, మీరు మా కొనరించిన సహాయమునూ, ఉపకృతినీ దలచి, కృతజ్ఞతతో పొన్నలను తమకు వధువుగా సమర్పించవలయునని యున్నాను. తా మీ కన్యా రత్నమును స్వీకరించి మమ్ముద్ధరించ వలయును."

ఈ మాట పద్మలాదేవి నోటివెంట రాగలదని ప్రౌఢదేవరాయలు నిరీక్షించి యుండలేదు. అందుచే అతడు చకితుడై కూర్చున్నాడు.

ఒక్క క్షణకాలమతడు భావజీవియైనాడు. తొలిసారిగా తాను పొన్నలాదేవిని జూచినపుడు తనకు కలిగిన మధురానుభూతిని మరల నొకపరి సింహావలోకనము చేసుకొన్నాడు.

వాస్తవముగా సామ్రాట్ ప్రౌఢదేవరాయలు పొన్నలాదేవిని చూచిన ప్రథమ వీక్షణములోననే ఆమెపై యనురక్తుడైనాడు.

అంతదిదివరకే పద్మలాదేవి ముఖతః పొన్నల గుణ రూప లావణ్యాదులను గురించి విని, ముగ్ధుడైనాడు. ఇప్పుడామెను చూచిన తరువాత ఆ పొగడ్త అబద్ధమని దోపలేదు. అందుకు మా రతనిహామె పట్ల అభిమానము జనించినది.

ఆనాడు లక్కనామాత్యులు తెచ్చి అప్పగించిన ముగ్ధయగు పొన్నలను జూచి సార్వభౌముడు నివ్వెరపోయినాడు. అతని కామె యొక దంతపు బొమ్మవోలెనూ, పాలరాతిలో చతురుడైన శిల్పియొకడు చెక్కిన సుందర విగ్రహము వలెనూ కనబడినది. ఆమె సముద్రపు నురగవంటి శ్వేత దుకూలములను ధరించియున్నది. ముఖములో చంద్రుని శీతల కాంతి నిండియున్నది. ఆ సోగకనులు స్వప్నలోకములో విహరించు చున్నట్లు తోచుచున్నవి. మృదువగు ఆమె స్నిగ్ధనాసికము సంపెగ మొగ్గ వలె నున్నది. కనుబొమలు ఎక్కువెట్టిన మన్మథ బాణములవలెనున్నవి. గులాబీలవంటి రక్త రంజితములైన యధరములు, నున్నటి చెక్కులు, విశాల ఫాలభాగము, దానిపై నయ్యాట లాడుచున్న ముంగురులు, యీ భువనమోహన సౌందర్యావయవములతో కూడిన ఆ పొన్నల నొకమారు చూచిన ఎవరునూ మరువలేరు. ఆమెను చూచి సార్వభౌముడు తను కలలోగన్న స్వప్నసుందరి ఆమెయేనని భావించినాడు. బ్రహ్మ యామెను తన జీవిత భాగస్వామినిగా లిఖించి యున్నచో తానెంత యదృష్టవంతుడని పరితపించినాడు.

కాని ఆ సౌందర్యమునకు బట్టిన కళంకమనునట్లు ఆమె మూగి యను పేరందినది. మర్త్యలోకముతో సంబంధము గల స్మృతి నామె గోల్పోయినది. ఆమె కేవలము మాటలురాని సజీవ ప్రతిమయైనది.

తా నామెను ప్రేమించవచ్చునా? ఆమె తనకు లభించగలదా? తా నామెను చేబట్టుటకు లక్కనామాత్యులవంటి ప్రభుభక్తి పరాయణులూ, పెద్దలూ సమ్మతించగలరా? ఈ పుత్త్రిని తనకు వధువుగా సమర్పించుటకు పద్మలా దేవి సమ్మతించ గలదా ? అను యనుమాన మతనిని సంశయమను కోటలో బంధించినది. ఆశయను అశ్వమునకు కళ్ళెము వేసినది.

కాని, ఆ రోజు సామ్రాట్టు ఏనుగుబారినుండి పొన్నలాదేవిని రక్షించినప్పుడు....

విధి వారిరువురనూ దగ్గరకు చేర్చినది. ఆమెను ప్రౌఢదేవరాయల హృదయమునకు సమీప వర్తినిగా జేసినది. ఆమెను చేబట్టుటకుగల యొక పెద్ద ప్రతిబంధకము — పూర్వస్మృతి లేకుండుటనునది — దైవానుగ్రహము వలన తొలగి పోయినది. భగవంతు డామెపై విశేషానుగ్రహము జూపుటకయి నేర్పరచిన విఘ్నమువలె, ఏనుగుచే విసరి వేయ బడినపు డామె మరల తన పూర్వస్మృతిని బడసినది.

ఇపుడామె ప్రౌఢదేవరాయల పాలిటికి నిజమైన యప్సరసయైనది. ఈ నడుమ యామె అతని స్వప్న మానసములందంతయూ నిండిపోయి నది. ఆమెను తాను వధువుగా స్వీకరించుటకు లక్కనామాత్యులు మొద లగు పెద్దల ప్రతిబంధక మేమియునూ లేదని పరోక్షముగా తెలిసినది. ఈ విషయమై పద్మలాదేవి అభిప్రాయమేమియో? ఆమె హృదయాంత రాళపు భావనను అర్థము చేసుకొనక, పొన్నలను వధువుగా కోరుట తొందరపాటు కాగలదని తలచినాడు. అట్లుచేసిన ఆమెదృష్టిలో తాను నీచుడుగా పరిగణింప బడవచ్చునని భీతిల్లినాడు.

ఆమె యీ విషయములో తనను అపార్థము చేసుకొనుట కవ కాశము గలదు. ముమ్మయనాయకుని బారినుండి రక్షించి, తానే ఆమెను వివాహమాడ గోరుటను తెలిసి, తన విషయములో ననేకాదు — పురుష సమాజము మీదనే ఆమె ఏవగించుకొను పరిస్థితి యేర్పడగలదు. తాను సార్వభౌముడగుటచే, ప్రజాకోటి కన్నివిధముల ఆదర్శ ప్రభువుగాను, మార్గదర్శకుడుగాను నుండవలయునని అతడు తన ప్రణయ భావమును

తనలోనే యిముడ్చుకొన్నాడు. ఈ విషయములో అతడెంత జాగ్రత్త పడె
ననగా, తన మనోగతమైన ఈ భావనను తనకు తప్ప యుతరుల కెవ్వ
రికినీ తెలుపలేదు.

అందువలన ఈ విషయమై పద్మలాదేవి తానే స్వయముగా
ప్రస్తావించవలసి వచ్చినది.

ఆమె యిదివరకే తన కుమార్తెకు ప్రౌఢదేవరాయ లన్నివిధముల
ఆదర్శపతి యని భావించినది. కాని తన యభిప్రాయమును ధైర్యముగా
వెల్లడించలేక పోయినది. త్రియంబకదేవు డంతటివాడు సార్వభౌమునికి
బిడ్డనిచ్చుట కధైర్య పడినాడనిన, యిక పద్మలాదేవి కాధైర్యము ఎచ్చట
నుండి రాగలదు? అయిననూ, ఆరోజు పొన్నలను మమ్మయనాయకుని
బారినుండి తప్పించి కాపాడినరోజు....ఆమదపుటేనుగు బారినుండి రక్షిం
చిన దినము....పద్మలాదేవి కూడ ఈ విషయమై కలలు గనినది.
పొన్నల ప్రౌఢదేవరాయలు రూపించిన విగ్రహము. అతడు స్వీక
రించనీ, విడువనీ, ఆమె నతని కర్పించుటేసరి! ఆమె అతని సతియని
(పద్మలాదేవి) నిశ్చయించినది.

కాని, యీ సంగతి సామ్రాట్టుల కెరిగించుటకు తగిన సమయ
మిదివరకునూ రాలేదు__

ఈనాడు చిరకాలముగా నామె నిరీక్షించుచూ యుండిన సదవకాశ
మేర్పడినది.

పద్మలాదేవి మాటలను విని ప్రౌఢదేవరాయలు, దాని కేమని
జవాబు చెప్పవలయునో తెలియక, క్షణకాలము మౌనముగా కూర్చు
న్నాడు. ఆమె మాటల వైఖరిని చూచి, మధుర భావ సమాధిలో మైమ
రచినాడు.

సార్వభౌముని మౌనమును జూచి పద్మలాదేవికి వేయివృశ్చికము
లొక్కసారిగా కుట్టినంత బాధకలిగినది. అతని ముఖభావ భంగిమలను
జూచి, తనకోరిక ప్రియకరము కాలేదేమో నని చింతించినది. ఆమె

నిర్మించుకొనిన స్వర్ణమందిరము మరల ఆమె కనుల యెదుటనే కూల బడుటయా ?

"ప్రభూ ! ఎందులకు మౌన మవలంబించినారు ? ఈ నిర్భాగ్య రాలి మొర తమకు వినబడలేదా ? లేక నా ప్రార్థన నెరవేర్చలేని ప్రార్థ నయా ? మా పొన్నలకు తమను చేబట్టు యదృష్టము లేదా ? తమను భర్తగా పొందగల భాగ్య మా నిర్భాగ్యురాలికి లేదా ? తమ యభిప్రాయ మును స్పష్టముగా తెలుపుడు. తమరు సమ్మతించిననూ, సమ్మతించక పోయిననూ, ఈ కన్య మీయది. మీరు కాపాడిన ప్రాణము-మీరు తీర్చి దిద్దిన విగ్రహము. ఈ కుసుమము మీ కంఠహారము నలంక రించక పోయిననూ, మీ పాదపూజకై ప్రత్యేకింపబడినది. దయయుంచి దీనిని మట్టిలో త్రోసివేయకుడు ! అట్లొనరించిన ఆమెతో బాటు నేనునూ మరణించగలను" అని యావేశముతో చెప్పినది పద్మలాదేవి.

ఈ మాటలు కొరడా దెబ్బలవలె తగిలి, ప్రౌఢదేవరాయలను భావసమాధి నుండి మేల్కొల్పినవి.

"తల్లీ ! మీరు నా మౌనము నన్యథా భావింపకుడు. నేను మీ కోరికను నిరాకరించు చున్నానని యనుకొనకుడు. కాని ఈ విషయమును గురించి మీ కుమార్తె యభిప్రాయమేమియో, దివంగతులైన త్రియంబక దేవుల అభిప్రాయ మేమియో తెలియనిదే నే నేమని జవాబు చెప్ప గలను ?"

సార్వభౌముని పలుకులు విని, పద్మలాదేవి తృప్తిగా ఒక నిట్టూర్పు విడచినది.

"ప్రభూ ! యథార్థము చెప్పవలయుననినచో, దుష్టుడగు ఆ ముమ్మయనాయకుని బారినుండి రక్షించిన దాదిగా పొన్నల మిమ్ములనే పతిగా భావించిఆరాధించుచూ వచ్చుచున్నది.దానికి మునుపే త్రియంబక దేవులు కూడ ఆమెను మీకర్పించ వలయునని సంకల్పించియుండిరి,కాని ఈవిషయమై తమతో ప్రస్తావించుటకువారు వెనుకాడినారు—మా యంత స్థునూమీయంతస్థును తలచుకొని భీతిల్లినారు. అయిననూ విధిసంకల్పము

యీ సంబంధమును ఒకటిగా కలిపినది. ఈ వివాహము జరుగుటవలన వారి యాత్మకు శాంతి—సంతసములు కలుగ గలవని నాకు నమ్మిక గలదు. కాని మా యాశలు మీ నిర్ణయము మీద ఆధారపడి యున్నవి" అనినది.

ఈ మాటలకు సామ్రాట్ దేవరాయలు చిరునవ్వును ప్రకటించుచూ అనినాడు :

"తల్లీ ! మాతృస్థానములో నున్న మీ రీ మాటను తెలుపుట కింత భీతిల్లవలయునా ? ఇది మీ ప్రార్థన కాదు—త్రియంబక దేవుల యాజ్ఞ యని దెలుపుడు."

అని సంతోషమును వ్యక్త పరచినాడు.

"అట్లు కాదు ప్రభూ ! తమ రామెను ప్రేమతో స్వీకరించవలయును. ప్రేమలేని పెండ్లి ఎవరికినీ సుఖమివ్వదు"

"తల్లీ, మీ రీ విషయమై చింతించకుడు—ఆమెను చూచిన దినమే ఆమె నాదియని అనుకొన్నాను. దైవము మా ఉభయులనూ ఏనాడో సతిపతులనుగా జేసినది. కాని యిప్పుడు మేము వివాహవేదిక మీద దంపతులు కావలయు నంతియే !"

అని ప్రౌఢ దేవరాయ లనిన తరువాత పద్మలాదేవికి తృప్తి గలిగినది. ఆ ఘడియలో నామెకు తనకంటెనూ అదృష్టవంతు లెవరునూ ఈ పృధ్విలో నుండరని దోచినది.

"ప్రభూ ! తమను పతిగా పొందు పొన్నల ధన్యురాలు !" అనినది సంతోషాతిరేకములో.

"ధన్యత గాంచినది మీరుకాదు—నేను!" అనినాడు దేవరాయలు నవ్వుచూ.

"అదెట్లు ప్రభూ?—మీరు మమ్ముద్ధరించినారు."

"కాదు, పొన్నలను నాకు వధువుగా సమర్పించి త్రియంబక దేవులు మనలనందరనూ ఉద్ధరించినారు" అని సార్వభౌముడు అర్ధగర్భితముగా నవ్వినాడు.

ఆనాడే రాజ పురోహితులను రావించి, ఇరువురి జాతకములనూ గుణించి, వివాహమునకు ప్రశస్తమైన ముహూర్తమును నిర్ణయించినారు. నాడే వారు పరస్పరము ప్రమాణములు చేసి—సతీ పతులైనారు.

సామ్రాట్ ప్రౌఢదేవరాయల కిపుడు జీవనము నిండుగా దోచినది. అతడు అరగసీమకు వచ్చిన కార్యములన్నియునూ నెరవేరినవి. త్రియంబకదేవ, వీరననాయకుల స్వామిభక్తిని పరీక్షించడమైనది. గజవేటలో రెండువందల కంటెనూ ఎక్కుడగు ఏనుగులు పట్టుబడినవి. అన్నింటికంటెనూ ఎక్కుడుగా పొన్నలాదేవివంటి అపూర్వ కన్యారత్నమతనికి లభించినది. తాను యీ త్రివేణీ సంగమముతో పునీతుడైనట్టుగా భావించినాడు.



## 12

# లేఖాద్వయము

ప్రౌఢదేవరాయలు గజవేట శిబిరములో మరికొన్ని రోజులు నిలచి, యింకనూ ఎక్కువ ఏనుగులను పట్టుకొని రాజధానికి వెనుదిరుగవలయుననీ, తానచ్చట నుండగనే ముమ్మయనాయకుని బంధించితెచ్చి శిక్షించవలయుననీ అనుకొన్నాడు. కాని అతనికి రాజధానినుండి త్వరితంపు లేఖ వచ్చినది. సార్వభౌముడు రాజధానిలో లేని సమయమున, అతని పరముగా పరిపాలనా క్రమమును చూచుకొనుచున్న లక్కనామాత్యుల జ్యేష్ఠ భ్రాతయగు మహామాత్యుడు జక్కనాచార్యుడు ఒక త్వరితంపు లేఖ వ్రాసి సామ్రాట్టులనూ, లక్కనామాత్యులనూ వెంటనే రాజధానికి తోడ్కొని వచ్చుటకయి తన సహోదరుడైన సింగనను బంపినాడు.

సింగన దండనాయకుడు గజవేట శిబిరమునకు వచ్చునప్పటికి

సామ్రాట్ ప్రౌఢదేవరాయలు గజ శిక్షణలో జరిగిన ప్రగతిని చూచుట కయి గజశాలకు వెళ్ళినాడు.

అచ్చట ఒకవైపు విస్తీర్ణమగు నొక శిబిరమును క్రొత్తగా పట్టు కొనిన ఏనుగులకొరకయి నిర్మించబడి యున్నది. నూరారుమంది సైని కులూ, మావటివాండ్రూ పట్టుబడిన ఏనుగులకు శిక్షణ నిచ్చుచున్నారు. వారికి భరమన మావటీడు నాయకుడుగా నున్నాడు.

ఆ ప్రదేశములో నొకచోట గజములకు కావలసిన ఆహార వస్తు వులను హెరాళముగా సంగ్రహించి పెట్టి యున్నారు. పెంపుడు కరుల సాయముతో అడవి యేనుగులను లొంగదీసుకొను ప్రయత్నము సంతత ముగా జరుగుచున్నది.

వేరొకవైపు అగ్నిభీతి కలిగించి ఇంకొక కరీంద్రమును స్వాధీన పరచుకొను ప్రయత్నము జరుగుచున్నది. అది తనను సమీపించుచున్న వారిమీద పగదీర్చు కొనవలయునను నట్లు తుండమును పైకెత్తి ఘీంకార ము చేయుచూ ముందుకు దూకి వచ్చుచున్నది. దానిని సమీపించుటకు ధైర్యములేక, దివిటీల సాయముతో దారికి తెచ్చుచున్నారు.

ఇంకొకచోట పెద్ద గజరాజమొకటి తన పారతంత్ర్యమునకయి కృంగి, కృశించి నిద్రాహారములను మాని, ప్రాయోపవేశము చేయు దానివలె కాళ్ళు చాచి పడుకొన్నది. దాని కాళ్ళను బలమైన గొలుసుతో బిగించి, దానినొక మ్రాని మొదటికి కట్టివేయబడి యున్నది. అది తన బంధనమును విడిపించుకొనుటకయి మిక్కిలిగా బ్రయత్నించి, చివరకు స్వాతంత్ర్యములేని పిమ్మట బ్రతుకు వ్యర్థమని భావించి, ఉపవాసము చేయుచున్నది. దానికనులలో అశ్రువాహిని ఎడతెరిపిలేక ప్రవహించు చున్నది.దాని నాహారము సేవింపజేయుటకయి భరమన మావటీడు చేసిన ప్రయత్నములన్నియునూ వ్యర్థములైనవి. అతడు సార్వభౌము దచటికి రాగా ఆ ఏనుగును పైకి లేపుట కుద్యుక్తుడైనాడు.

సార్వభౌముడు చడి చప్పుడు లేక వచ్చి, ఆ ఏనుగుపద్ద నిలబడి నాడు. అప్పుడు భరమన మావటీడు దానికి గజ భాషలో, లేచినిలబడి

సామ్రాట్టులకు గౌరవమును సూచింపుమని యాజ్ఞాపించినాడు. కాని అది లేచి నిలువలేదు. అందుపై నతనికి కోపమువచ్చి బెత్తముతో నాలుగు దెబ్బలు కొట్టినాడు. ఏనుగు బాధగా మూల్గి మరల మౌనముగా పడుకొని నది. సార్వభౌమునికి దాని దయార్ద్ర దృష్టిని జూచి మనసు కరగినది.

"భగవనా! ఈ గజరాజమును జూచిన నాకు చాల వ్యధ గలుగు చున్నది. ఈ బంధనమునుండి తనను విడిపింపుమని ప్రార్థించు చున్న ట్టుగా దైన్యముగా జూచుచున్నది" అన్నాడు.

"ప్రభూ! ఇది చాల హఠమారి. నాలుగైదు దినములుగా యిది ఏ యాహారమునూ స్వీకరించక హఠము చేయుచున్నది. దీనిని దారికి తెచ్చుటకు అంకుశ మొక్కటే ఔషధమని తెలియుచున్నది. మీ యనుజ్ఞ యైనచో...." అనినాడు మావటీడు.

మావటివాని మాటలకు సార్వభౌముడు విషాదముగా నవ్వి అని నాడు:

"నీకింకనూ గజహృదయము తెలిసినట్టు లేదు. ఏనుగులు చాల సూక్ష్మజీవులు. అవి చూచుటకు కొండంత పెద్దవిగా కనబడినను, పసి పాపలవలె చాల సునిశిత హృదయముగలవి. ఎటువంటి పరిస్థితిలో నైననూ మనము వాటిపై అంకుశమును ప్రయోగించరాదు. చిన్న బిడ్డలకు బెత్తము జూచి బెదరునట్టుజేసి వారిని దారికి తెచ్చునట్లుగా, మన మీ ఏనుగులకు అంకుశ భయము కలిగించి, వాటిని స్వాధీన పరచుకొన వలయునుగాని, అంకుశ ప్రయోగమున కవకాశ మివ్వరాదు. అట్లు జేసిన నవి చక్కబడుట యటుంచి మరింత మొండివి గావచ్చును. హఠము చేయుచున్నవని వాటిపై కోపించిన ప్రయోజనములేదు. మెల్లగా స్వాధీన పరచుకొనవలయును. మనము వాటి శత్రువులముగాము, మిత్రులమను భావన వాటికి కలుగునట్లు ప్రవర్తించ వలయును. దీనికోసనే మన గొప్పతన మిమిడి యున్నది. తెలిసినవారు దీనినే గజశిక్షా రహస్య మని చెప్పుదురు" అని బుద్ధి గరపినాడు.

సార్వభౌముని మాటలకు సిగ్గుజెంది, భరమన మావటీడు తలవంచు కొన్నాడు.

ప్రౌఢదేవరాయలు మరినాలు గడుగులు ముందుకు వెళ్ళి వేరొక ఏనుగుల గుంపు వద్దకు వచ్చినాడు.

అచ్చట ఏవిధమైన శిక్షణయూ లేక తిని క్రొవ్విన గున్న ఏనుగులను చూచి, సార్వభౌము డనినాడు :

"భరమనా ! ఈ ఏనుగులకు బాగుగా తిని మదమెక్కినట్టున్నది. చెప్పిన మాట వినుటలేదు. వీటిని మనము దయతో చూడవలసినది నిజమే కాని, మన మంచితనము నవి దురుపయోగ పరచుకొనరాదు. ఈ విషయమై మనము కొంత జాగ్రత్త వహించ వలయును. వాటి మద మణచుటకు ఉపవాసము పాలుజేయుటయే చక్కని మార్గము. కొన్నిరోజులు వాటికి ఆహారము — నీరు పెట్టకుడు. అప్పుడు తమంతట తామే దారికి రాగలవు. వాటిని నాగరిక జీవనమున కభ్యాస పడజేయుటకునూ, వాటి పిల్లచేష్ట లరికట్టుటకునూ మనకుగల దారి అది ఒక్కటే. వాటిగర్వభంగమైన తరువాత చెప్పినట్లు వినగలవు. ఇపుడు వాటిమీద మనము ఎక్కుడుగా దయ జూపిన చెడిపోగలవు" అనినాడు.

ఈ విధముగా ప్రౌఢదేవరాయలు గజశిక్షణలో నిమగ్నుడై యుండగా లక్కనామాత్యుడు వచ్చి :

"ప్రభూ ! నావలన సన్నిధానమున కపచారము గలిగియుండినచో క్షమించవలయును. రాజధానినుండి ముఖ్యమైన వార్త వచ్చియున్నది. మా సింగన సన్నిధానమున కొక ముఖ్యమగు లేఖ తెచ్చియున్నాడు. దానిని పరామర్శించుటకు శిబిరమునకు వెనుదిరిగిరావలయునని ప్రార్థన!" అని వినమ్రుడై సెలవిచ్చినాడు.

ఈ వార్త విని చకితుడై :

"విషయమేమి, లక్కనామాత్యులా ! అంతటి త్వరితంపువార్త ఏమి వచ్చినది?" అని యడిగినాడు దేవరాయలు.

"ప్రభూ ! మహాప్రధానులగు లక్కనాచార్యులు తమను వెంట

తోడ్కొని రావలసినదని మా సింగనను బంపియున్నారు. సింగన ఇప్పుడే యిచ్చటికి వచ్చి, తమ రాకకై ఎదురు చూచుచున్నాడు."

"అదియా సంగతి?" అని సార్వభౌముడు తొందరగా శిబిరమునకు వెనుదిరిగినాడు.

అచ్చట తనరాక నెదురుచూచుచూ కూర్చొనియున్న సింగనను జూచి—"సింగననాయకులూ! మీ రిచ్చటి కెపుడు వచ్చితిరి? మీ అన్నగారు, అంతఃపుర వాసులూ అందరూ క్షేమమేకదా?" యని ప్రశ్నించినాడు.

"తమ అనుగ్రహమువలన అందరునూ క్షేమముగనే యున్నారు ప్రభూ!" అని యతడు వెంట తెచ్చిన లేఖను వెలికి తీసినాడు.

"ప్రభూ! తమకు మహామాత్యులగు లక్కనాచార్యు లీ లేఖను బంపినారు. పరికించుడు" అని చెప్పి, చుట్టగా చుట్టి ముద్రవేసియున్న లేఖను సార్వభౌముని చేతి కందించినాడు.

దాని ముద్ర నూడదీసి, దేవరాయ లొక క్షణమవలోకించి, తరువాత, చదువుడని లక్కనామాత్యుని చేతికిచ్చినాడు.

అది బహమనీ సుల్తాను అహమద్‌షా ప్రౌఢదేవరాయలకు వ్రాసిన లేఖ.

అందులో అత డీ విధముగా వ్రాసి యున్నాడు.

"శ్రీమన్మహారాజ రాజ రాజపరమేశ్వరేత్యాది బిరుదాంకితులూ, విజయనగర సార్వభౌములూ నగు ప్రౌఢదేవరాయలకు—

బహమనీ సుల్తాను అహమద్‌షా వ్రాసిన లేఖాంశము లేమనగా?

మీ తీర్థరూపులగు వీర విజయ సార్వభౌముల కాలములో మాతో చేసుకొనిన ఒప్పందము ప్రకారము ఓరుగల్లును మా కప్పగించి, దానిని మన ఉభయరాజ్యముల గడిప్రదేశముగా ఒప్పుకొనినది సత్యము. ఇప్పుడు మరల మీరు దానిని మా నుండి పొందుటకు యుద్ధప్రయత్నములు చాల గొప్పగా చేయుచున్నారని వార్త వచ్చినది. ఈ వార్త విని మాకు సఖేదాశ్చర్యము గలిగినది.

ఆదినుండియూ శాంతిప్రియులైన బహమనీ సుల్తానులు దుర దేశముతో కాలుదువ్వి కయ్యమునకు బిలుచు నలవాటు విజయనగర రాజులకు గలదు. వారిలో నుత్తమోత్తములను నట్లు మీరునూ, మీ తీర్థరూపులునూ మాతో చేసుకొనిన సంధి షరతుల నుల్లంఘించి, మరల యుద్ధ ప్రియత్నములు చేసుకొనుట చాల విచారకరమగు విషయము.

ఈ విధముగా వ్రాసినంత మాత్రమున మేముమీకు భీతిల్లినామని మీరు భావించరాదు. అల్లా దయవలన మా బాహువులకు మీ గర్వమణచ గల శక్తి యున్నది. కాని ఒక హెచ్చరిక విచ్చుటకయి ఈ లేఖ వ్రాయుచున్నాను.

బహుశః మీ పితామహులగు మొదటి దేవరాయలకు మా ఫిరోజ్‌షాగారి వలన జరిగిన అవమానమును తాము మరచి యుందరు. ఆ రాయ పరాభవము నింత త్వరలో మరచి యుండినచో, దాని దుష్పరిణామము ననుభవించగలరు! మీరు తొందరపడి, యిటువంటి పిచ్చి పనులకు పూనుకొను నట్టయినచో మా జోలికి రండు! నెమ్మదిగా జీవించవలయునను కొన్నచో మా జోలికి రాకుడు.

ఈ పర్యాయము యుద్ధము జరిగినచో, మీ హిందూ రాజ్యము దక్షిణా పథమునుండి పూర్తిగా నామావశిష్ట మగు పరిస్థితి యేర్పడవచ్చును. జాగ్రత్త! ఇకనైననూ యుద్ధమును అవిచారమును మాని, మాతో చేసుకొనిన శాంతియుత మగు సంధి షరతులను పాలించుకొనిరాగలరని నమ్ముచున్నాను.

ఇట్లు,
మీ స్నేహకాంక్షి,
సుల్తాను అహమద్‌షా"

ఈ లేఖ అత్యంత మహత్తరమైన దగుటచే దానిని యితరుల చేతి కీయక, తన సహోదరుని చేతికిచ్చి, వెంటనే సామ్రాట్టుల కందజేయుటకు మహాప్రధానియగు ఒక్కనాచార్యుడు సింగనను బంపినాడు.

ఆ లేఖను చదువగా విని, దేవరాయలు—"ఇంకనూ విశేషము లేమైననూ గలవా, సింగన దండనాయకులూ?"

—అని లోలోపలనే నవ్వుకొనుచూ ప్రశ్నించినాడు.

"ప్రభూ! మహామాత్యులు తమ కీ లేఖనుకూడ యిమ్మని చెప్పి నారు" అని అంగరఖాలో నిడుకొని వుంచిన మరొక రహస్య లేఖను తీసి సార్వభౌముని చేతి కందించినాడు.

దానిని తీసుకొని చిరునవ్వు నవ్వుచూ, చదువుటని దేవరాయలు లక్కనామాత్యుని చేతి కిచ్చినాడు.

అందులో మహామాత్యుడు జక్కనాచార్యు లీ విధముగా వ్రాసి యున్నాడు:

"స్వస్తి॥ మహాస్వామివారి దివ్య సన్నిధికి. జక్కనాచార్యులు చేయు వందనా పూర్వక విజ్ఞాపనములు.

ప్రభువుల సన్నిధికి అహమద్‌షా నుండి వచ్చిన లేఖను బంపి యున్నాను. సావధానముగా దానిని పరామర్శించ గలరు.

తమకు, ఆగర్భ వైరులగు బహమనీ సుల్తానులు మన మీద దండెత్తి వచ్చుటకై యాలోచించుచున్న సంగతి యిదివరకే వేద్యమై యుండవచ్చును. దీనికి తోడు గుల్బర్గాకు వెళ్ళియుండిన మన గూఢ చారులు యింకనూ అనేక రహస్య విషయములను సంగ్రహించుకొని వచ్చియున్నారు.

తాము గజవేటకయి రాజధానిని విడచి వెళ్ళియుండుట బహమనీ రాజ్యములో అనేక ఊహాపోహలకు ఆస్కార మిచ్చినదట. ఈ సమయ మును జారవిడచుకొనక, మీరు వచ్చునంత లోగా మన రాజధానిమీద దండెత్తి వచ్చి, దాని నాక్రమించుకొన వలయునని ఆలోచించి యున్నా రట. దీని కంతయునూ మనము భీతిల్లవలసిన పని లేదు. అటువంటి పరి స్థితి యేర్పడినచో, రాజధాని రక్షణకయి మన సైనికులు సిద్ధముగా నున్నారు.

మన విషయములో యిప్పటికే బహమనీ సుల్తానులు జాగ్రత్త పడి యున్నారు. తాము సైన్యమునకు కావలసిన ఏనుగులను పట్టుకొను టకు సహ్యాద్రి కాననములకు వెళ్ళియున్న విషయ మెట్లో వారికి తెలిసి నట్లున్నది. అంతియగాక మంగుళూరు, భట్కళ్, హొన్నావరము, గోవా

మొదలగు ప్రదేశములనుండి మనకు సరఫరా యగుచున్న అధిక సంఖ్యలోగల అశ్వములు వారి సంశయమునకు కారణమైనవి. కాబట్టి వారు మన ముట్టడి నెదిరించుటకు యిప్పటినుండియే అన్నిఏర్పాటులనూ చేసుకొని యున్నారనినచో ఆశ్చర్యపడవలసిన పనిలేదు.

ఇటువంటి పరిస్థితిలో తాము చాలరోజులు రాజధానిని వదలి యుండుట ప్రజలకు చింతా కళవళములకు మూలకారణమైనది. దీనికి తోడు, రాజధానిలో గోపరాజుల ప్రవర్తన ప్రజా కోటి మానసమును కల్లోలపరచినది. ఈ విషయమును గురించి యింకనూ ఎక్కువ వివరములు మీకు సింగన తెలుపగలడు.

రాజధాని యందలి పరిస్థితి యీ విధముగా విషమముగా నున్నప్పుడుతాము ఎక్కువరోజులు మలెరాజ్యములో నుండుట మంచిదికాదు. ఈ విషయమై లక్కన అభిప్రాయమేమియో తెలియదు. నా అభిప్రాయమేమనగా, తమ రీ లేఖను చూచిన వెంటనే రాజధానికి వచ్చుట సామ్రాజ్య క్షేమదృష్ట్యా అత్యంతావశ్యకము. ఇంకనూ ఎక్కువ విషయములను మీరు సింగన ద్వారా తెలుసుకొన వచ్చును.

ఇట్లు,
తమ పాదసేవకుడు,
జక్కనాచార్య"

ఈ లేఖాంశములు వినగనే ప్రౌఢదేవరాయల ముఖము గంభీరమైనది. రాజధానియందలి పరిస్థితి విషమించకుండినచో మహామాత్యుడగు జక్కనాచార్యు డీ విధముగా వ్రాసి యుండడు. అయినచో, తాను రాజధానిలో లేనపుడు, ప్రజల మానసిక శాంతిని—ధైర్యమునూ భంగపరచునట్టి సంఘటన లేవియో ఘటించి యుండవలయును. అవి యాలోచించి సింగన దండనాయకుని ప్రశ్నించినాడు :

"సింగన దండనాయకులూ! జక్కనాచార్యులు గోపరాజుల విషయమును మీ ద్వారా తెలుసుకొన వచ్చునని వ్రాసియున్నారు. ఆ విషయమేదియో మీరు నిస్సంకోచముగా దెలుపుడు."

ఈ మాటలకు మారు పలుకక, సింగన లక్కనామాత్యుని ముఖ
మును చూచినాడు.

అతని చూపులోని యర్థము గ్రహించి, "జరిగిన విషయము
చెప్పుము సింగన్నా ! ఇచ్చట యితరు లెవరునూ లేరు — నీవు నిర్భయ
ముగా చెప్పవచ్చును" అన్నాడు లక్కనామాత్యుడు.

సింగననాయకుడు రాజధానిలో జరిగిన గోపరాజు ప్రకరణమును
సవిస్తరముగా తెలియజేసినాడు. అది సామ్రాట్ దేవరాయలు భావించిన
దానికంటెనూ ఎక్కు డపాయ కరమైన విషయము.

# 13

## వైషమ్యావాదము

సాళ్వ గోపరాజు సామ్రాట్ ప్రౌఢదేవరాయల సోదరి కుమారు
డునూ, సామ్రాజ్యమందలి ఉన్నతో ద్యోగియూ నైనవాడు.

విజయనగరమును పరిపాలించిన వీర విజయ మహారాజులకు
మహారాణి నారాయణాంబిక గర్భమందు ముప్పురు కుమారులూ, ఒక
కుమార్తెయూ జన్మించినారు. వారిలో ప్రౌఢదేవరాయలు, అభినవ వీర
దేవరాయలు మొదలగు నామధేయము లున్ననూ అతడు ప్రౌఢదేవరాయ
లను అభిధానముతో సింహాసన మెక్కినాడు.

ప్రౌఢదేవరాయలకు ప్రతాప దేవరాయ, వీరపార్వతి రాయలను
మరి యిద్దరు సోదరులు గలరు. ప్రతాప దేవరాయలు శ్రీగిరిలో మల్లి
కార్జున స్వామి పరమభక్తుడుగా నుండుటచే యతనికి శ్రీగిరి రాయలను
మరొక నామధేయముకూడ గలదు. ఇతడు ఘనగిరి-పెనుకొండ-రాజ్యము
నకు మాండలీకుడుగా నున్నాడు. పెనుగొండ యాతని రాజధాని. కనిష్ఠ

దగు వీరపార్వతి రాయలు తెరకణాంబిక రాజ్యమునకు సామంతరాజుగా నియమింపబడినాడు.

వీరుగాక ప్రౌఢదేవరాయలకు హరియాలదేవి లేక హరియమ్మ యను సహోదరి కూడ నున్నది. ఆమెను ప్రాచీన రాజకుటుంబములలో నొకటియగు సాళ్వ వంశపు తిప్పరాయలకొసగి వివాహము చేసినారు. ఈ దంపతుల కుమారుడే సాళ్వ గోపరాజు.

సాళ్వ కుటుంబము కర్ణాటమందలి రాజవంశములలో నొకటి. సాళువ మనిన డేగ. అదియే వారి వంశపు చిహ్నమైనది. వారి శుభో దయమునకు డేగయే మూలకారణము. హోయిసలులు సింహమును, సేవుణులు సువర్ణ గరుడుని, తమ తమ రాజ లాంఛనములుగా నుంచు కొనిన విధముగనే, సాళ్వులు డేగను తమ కుటుంబ చిహ్నముగా స్వీక రించినారు.

డేగ వారి కుటుంబ చిహ్నమైనది ఒక సాహస గాథ; సాళ్వ వంశపు వంకీదేవుడు చాలుక్య సత్యాశ్రయ కుల తిలకుడగు త్రిభువన దేవ విక్రమాదిత్యుని సైన్యమందొక సామాన్య దండనాయకుడుగా నుండెను.

కళింగ దేశపు ముట్టడిలో వంకీదేవుని కొక డేగ చాల సహా యము చేసినది.

విక్రమాదిత్య ప్రభువు కళింగ దండయాత్రలో మునిగియుండగా నొక పావురమతనిమీద పిష్టమును విసర్జించి, అతని వస్త్రములను మలిన పరచి పారిపోయినది. విక్రమాదిత్యుడు పావురముయొక్క ఈ ప్రవర్త నకు కోపపడి, దానిని పట్టుకొనుడని యాజ్ఞాపించెను. ఈ కార్యములో ఎవరునూ యశస్సు బొందకుండగా వంకీదేవుడు తన డేగ సాయముతో ఆ పావురమును పట్టి, రాజు కప్పగించినాడు.

ఆ పావురమును సూక్ష్మముగా పరిశీలించగా, దాని కాలికొక రహస్య లేఖ కట్టబడి యుండుట కనబడినది. ఆ లేఖయే కళింగముట్టడి యశోవంతమగుటకు కారణమైనది.

విక్రమాదిత్యుడు తన దండయాత్ర ముగిసిన తరువాయి తనకు సాయము చేసిన వంకిదేవుని ప్రధాన దండనాయక పదవిలో నియమించి గౌరవించినాడు. ఆ నాటినుండి సాళువము వారి కుటుంబ లాంఛన మైనది.

వంకిదేవుని వంశములో జన్మించిన వీరు లనేకులు తమ ధైర్య సాహసములతో చాలుక్య, సేవుణ, కాకతీయ ప్రభువులవద్ద దండనాయ కులుగానూ, కవులుగానూ కీర్తి వడసినారు.

వీరిలో సాళువ తిక్కముడు, సేవుణ ప్రభువులు మాధవ రామ చంద్ర భూపాలురవద్ద మహా సేనాధిపతిగా నుండెను. అతను హొయిస లుల మీద దండెత్తివెళ్ళి ద్వారసముద్రమునుండి అమితమైన సంపదను కొల్లగొట్టుకొని వచ్చి తన ప్రభువుకు సమర్పించినాడు.

సాళువ మంగరసు (లేక మంగరాజు)కంపరాయల మహా సైన్యా ధ్యక్షుడై మధురను మహమ్మదీయులనుండి ఆక్రమించుకొనుటకు సాయ పడినాడు. ఇతడు పరపక్షి సాళ్వ వంశీదేవుని మనుమడు. ఇతని కీర్తి దిగంత విశ్రాంతమైనదని మహా పురాణములో చెప్పబడినది.

ఇతని కుమారుడు గుండరాజు సపర ప్రభువునుండి రామదుర్గ మును గెల్చి, కల్యాణి పట్టణము నేలినాడు.

ఈ గుండరాజు కార్గురు కుమారులు గలరు. వారిలో ఇమ్మడి గుండరాజు వంశములో తిప్పరాజు పుట్టినాడు. అతడు తన ధైర్య సాహ సములతోడనూ, శక్తి సామర్థ్యములతోడనూ క్రమక్రమముగా ఉన్నతి నంది, సామ్రాట్ వీరవిజయుల అనుగ్రహమునకు పాత్రుడై హరి యాలదేవి నుద్వాహమైనాడు. అంతఃపురమునందునూ,ఆస్థానమునందునూ సుప్రతిష్ఠిత అధికారియైనాడు. తండ్రి యనంతర మా యధికారమునకు వచ్చిన సాళ్వ గోపరాజు తండ్రివలెనే సామ్రాజ్యములో మిక్కిలి ప్రభావయుతుడైన వ్యక్తియైనాడు.

సాళువ గోపరాజు సామ్రాట్ ప్రౌఢదేవరాయల మేనయల్లు డైననూ అతని విశ్వాసమునకు పాత్రుడు కాలేకపోయినాడు. అతడొక

మహత్త్వాకాంక్షగల యువకుడని గ్రహించి, సామ్రాట్ ప్రౌఢదేవ రాయ లతనిని దూరముగా నుంచినాడు. అతనితో ద్వేషము కట్టుకొనక పోయిననూ, తన అంతరంగిక మిత్రులలో నొకనినిగా చేర్చుకొనలేక పోయినాడు.

ఇది స్వాభిమానియగు గోపరాజుకు భరింపరాని యవమానముగా దోచినది. తనకంటెనూ హెగ్గడదేవుని కుమారులూ, హొయిసల వంశ జులూ, శైవులూనగు లక్కనామాత్య సోదరులకు సార్యభౌము డిచ్చు చున్న గౌరవము, సన్మానము, వారియందుగల నమ్మిక యివి యన్ని యునూ జూచి లోలోపలనే అసహనముతో కృంగి-కృశించి పోసాగి నాడు. అందుననూ వైష్ణవుడగు గోపరాజునకు, సార్వభౌముడు వీరశైవు లగు లక్కనామాత్య, జక్కనాచార్యుల ప్రభావమునకు లోనై శివభక్తుడు గాను, శైవుడుగను యగుట యిష్టములేదు. అతడు తన ద్వేషమును వెలి గ్రక్కుటకు తగిన సమయముకొరకై నిరీక్షించసాగినాడు.

ప్రౌఢదేవరాయలు తన పూర్వుల పరంపర నాదర్శముగా గొని సకల ధర్మములనూ సమాన గౌరవముతో చూడసాగినాడు అతడు కాలా ముఖ కాశ్మీర శైవపంథలోనివారగు శ్రీమద్రాజగురు మహా మండలా చార్య, శ్రీ పద్మభూషణ క్రియాశక్తి దేవుల శిష్యుడు. ఈ గురుపీఠము నకు సంబంధించిన శ్రీకాశీవిలాస క్రియాశక్తి పండితులు విద్యారణ్యుల సమకాలీనులై యుండి, విజయనగర సామ్రాజ్య స్థాపనలో మహత్తర పాత్ర వహించినారు. శ్రీ పద్మభూషణ క్రియాశక్తి గురువుల శిష్యు డైన సామ్రాట్ ప్రౌఢదేవరాయల గౌరవాదరములకు పాత్రులైన లక్కనామాత్య, జక్కనాచార్యుల చేతిలో సామ్రాజ్య పాలనాసూత్ర ములు భద్రతరమై యుండుట వైష్ణవుడగు గోపరాజుకు సహింప వీలు గాక పోయినది. వారు సార్వభౌముని శైవ మతాభిమానినిగా జేసి, సామ్రాజ్య ప్రజమీద శైవధర్మమును మోపి, సర్వధర్మముల సంగమ క్షేత్రమగు విజయనగరమును శైవధర్మ క్షేత్రముగ చేయిగలరని యూరో పించినాడు. ఈ అసహనము లోలోపలనే రగులుకొనుచుండి, హరిహర పుర ప్రకరణములో కార్చిచ్చువలె జ్వాల లెగజిమ్మినది.

హరిహరపురము విజయనగరమునకు సంబంధించిన ఒక యగ్రహారము. దానిని సంగమ వంశజుడగు హరిహరసార్వభౌముడు నిర్మించి, వృత్తులను కల్పించి, కాశ్మీరము-శ్రీరంగము - మధుర, కంచి, జగన్నాథము, ద్వారక మొదలగు పట్టణములనుండి వచ్చిన సదాచార సంపన్నులూ, విద్వాంసులూ నగు బ్రాహ్మణులకు దానము చేసినాడు. ప్రశాంతమగు తుంగభద్రా తీరమున నది విద్యాకేంద్రమై విలసిల్లుచున్నది.

హరిహరుని కాలములో నీ యగ్రహారము వేదాధ్యయన సంపన్నులగు పండితులతోడనూ, సాత్వికులగు బ్రాహ్మణులతోడనూ నిండి, సదా శాంతి-నెమ్మదులకు పుట్టినిల్లయి యుండెడిది. అచ్చట ఎల్లవేళలా వినబడు బ్రాహ్మణుల వేదఘోషయునూ, వారు జరిపెడి యజ్ఞయాగాదులు-హోమములు మున్నగువాని ధూమములునూ వీనులకింపుగా, చూడ నొంపుగా నుండును. అచ్చటగల పండితులగు గురువుల పదసన్నిధిని గూర్చొని లౌకిక, ఆగమ, పర-అవర విద్యలను నేర్చుకొనుటకు భారత దేశమందలి నలుమూలలనుండియూ విద్యార్థులు వచ్చెడివారు. అచ్చట వైదిక వాఙ్మయము జీవన స్రవంతివలె ప్రవహించుచుండును. వైదిక ధర్మము సచేతనముగా నుండును. ద్వైతాద్వైత, విశిష్టాద్వైత, శక్తి మతముల క్షుణ్ణముగా నెరింగిన పండితులూ, విద్వాంసులూ అచ్చట అనేకులున్నారు. త్రిమతస్థులునూ విద్యార్జన చేయుట కచ్చట యవకాశము గలదు. ప్రజలలో ధర్మశ్రద్ధను పెంపొందింపజేసి, సద్ధర్మమును బోధించుటకు శైవ గురుపీఠములూ, వైష్ణవమఠములూ అచ్చట గలవు. విద్యార్థుల కీ గురుపీఠములందునూ, మఠములందునూ ఉచిత వసతి, వస్త్ర, భోజన సదుపాయము లేర్పరుపబడినవి. రాజు లీ గురుపీఠములనూ, మఠములనూ చూచుకొనుట తమ కర్తవ్యమని భావించెడివారు. ఈ విధముగా హరిహరపురము సామ్రాజ్యమందలి సాంస్కృతిక కేంద్రములలో ప్రథమస్థానము నలంకరించినది.

ప్రౌఢదేవరాయలు కవియూ, ధీశాలియూనైనట్టే, భక్తుడుకూడ యైనాడు. అతనిలో ధర్మప్రజ్ఞ జాగృతముగా నున్నది. ప్రజలకు జీవనాడియైన ధర్మమార్గములో ఏ లోపమునూ కలుగకుండునట్లు, అతడు తన

కర్తవ్యమును నిర్వహించసాగినాడు. అతడు వీరశైవ పక్షపాతియైననూ సర్వధర్మములను సమన్వయదృష్టితో జూచుకొనువాడు.

ఇదివరకే సామ్రాజ్యములో ధర్మముపట్ల మునుపటి శ్రద్ధాసక్తులు తగ్గుచూ వచ్చినవి. వర్ణాశ్రమ ధర్మములలో ప్రజలకు శిథిలత యేర్పడి నది. సంకుచిత స్వభావులగు ప్రజలు తమ ధర్మముయొక్క మూలతత్త్వ మునూ, ఉన్నతాదర్శమునూ మరచి, తమ యాచార విచారములే శ్రేష్ఠ మైనవని భావించి, పరమతముపట్ల ద్వేషమును వెలిగ్రక్కుచూ వచ్చి వారు. వారికి మార్గదర్శకులుగా నుండవలసిన గురువులూ, గురుపీఠములూ సరిగా నడచుకొనక, తమ మతీయులను వక్రమార్గమును బట్టించినారు. దీని ధాటి సుఖ-శాంతులకు పుట్టినిల్లయిన హరిహరపురమునకు కూడ తగలక తప్పినదికాదు.

హరిహరపురములో మూడు ముఖ్యమైన మఠములున్నవి.వాటిలో ఉడిపి అద్వైత మతమునకు సంబంధించినదొకటియునూ, అద్వైతమత శారదాపీఠముయొక్క ఒక శాఖయునూ, విశిష్టాద్వైతమునకు సంబంధిం చిన శ్రీరంగము గురుపీఠమునందలి ఒక శాఖయునూ గలవు.అవి యింత వరకునూ ప్రజలకు భక్తి, జ్ఞాన, వైరాగ్యములను బోధించుచూ, వారిని ధర్మమార్గమున నడిపించుచూ ఒకేవృక్షమందలి వేరువేరు శాఖలవలె పరస్పరము కలసి మెలసి పనిచేయు చుండెడివి. ప్రజలు హరిహరులలో భేదమును గల్పించక, సామ్రాజ్యక్షేమమును తమ క్షేమముగ భావించెడు వారు.

కాని దేశమందేర్పడిన ధర్మగ్లాని కనుగుణముగా ఈ నడుమ హరిహరపురములో సైతము ధార్మిక జీవనములో విషవాయువు వీవ వారంభించినది.

పూజ్యులగు విద్యారణ్య మునీంద్రులు భగవతీ భువనేశ్వరీదేవి నుపాసించి, ఏ ధర్మరక్షణకై విజయనగరమును స్థాపించినారో ఆ ధర్మ వృక్షమున కీనాడు వేరు పురుగులు చేరినవి. హిందూధర్మ, సంస్కృతి, నాగరికతల రక్షణకై జన్మ ధరించిన యీ సామ్రాజ్యము యవనుల భీతి

నుండి దక్షిణాపథమును విముక్తపరచి, స్థిరముగా నిలచిన దనకొను నంతలో,ప్రజల ముందున్న ఉన్నతాదర్శములు నశించి,వారు స్వార్థులూ, ధర్మపాషండులూ, అజ్ఞానులూ, అంధశ్రద్ధ గలవారూ యగుచూ వచ్చి వారు.

ప్రజల ప్రశాంత జీవితమును జాతిమత వైషమ్యము బలిగొన్నది. సదా వేదఘోష వినబడుచూ నుండిన అగ్రహారములలో యీనాడు జాతి మతముల నడుమ జరుగు దూషణ వినబడసాగినది. గురుకులములు పాడుబడి, ధార్మిక విద్యను చెనెడివారే లేకపోయినారు. గురుపీఠములు, మఠములు-స్వార్థసాధకులు విషయ లంపటుల విలాస మందిరములైనవి.

ప్రజలలో ఆదిశేషుని పడగవలె లేచిన యీ భ్రష్టాచారమును జూచి, బాధపడిన శక్తి, విశిష్టాద్వైత మతాభిమానులు వీరశైవమత ప్రచారమునకు పూనుకొనినారు. వెయ్యీ్యారుమంది భక్తులు-విరక్తులు ఒక సంస్థగా కలసి, ప్రజాజీవితములో కిల్బిషమువలె కలసియున్న ధర్మ పాషండతనూ, ద్వేషాసూయలనూ, అంధశ్రద్ధనూ బోనడచి, ప్రవృత్తి మార్గమునుండి నివృత్తి మార్గము వైపునకు వారిని త్రిప్పుటకు దేశసంచారము, ధార్మికచర్చ, ధర్మబోధ, గ్రంథరచన, గ్రంథపఠనముల దారి ననుసరించినారు.

సామ్రాజ్యమందలి ఉన్నతాధికారులునూ, శ్రీ చంద్రభూషణ క్రియాశక్తి దేవుల శిష్యులునూ నగు లక్కణామాత్య, జక్కణాచార్యులు వారికి స్ఫూర్తి కేంద్రమైనారు. ఈ సోదరులు అధికారములో నున్ననూ, పదవీ వ్యామోహమునకు బలిగాక, ఐహిక సుఖములకు విముఖులై, విరక్తులవలె జీవితమును గడుపుచూ, ధర్మశ్రద్ధను పెంపొందజేసి,బ్రతుకును చరితార్థ మొనరించగల వ్రతమును చేబూనినారు.

వారేర్పరచిన విరక్తుల సంస్థకూడా ప్రజాకోటిలో లుప్తమైన ధర్మ శ్రద్ధనూ, దేశాభిమానమునూ జాగృతమొనర్చి,శరీరము యొక్క గొప్పను తెలుపుటకు కృషిచేసినది. వారు పామరుల కర్థమగు భాషలో-వచనము లలో దేహతత్త్వములను బోధించినారు. ఉన్నతాదర్శములను ప్రజల ముందుంచి, ఒకచోట నిలువక దేశసంచారము చేయసాగినారు.

ఈ పరివ్రాజక జంగమయ్యలు తమ విరామకాలములో పూర్వుల వచనకృతులను సంగ్రహించుచూ, పరిష్కరించుచూ, ప్రచారమునకు తీసుకొని వచ్చుచూ వచన సాహిత్యమున కొక స్థానము నేర్పరుచుటకు ప్రయత్నించసాగినారు.

వారి నిరంతర ప్రయత్నమువలన అంతవరకునూ మూలబడిన పురాతన వచనము లెన్నియో గ్రంథస్థమై, వచన వాఙ్మయము అభివృద్ధి నందినది. పామరుల పాలిటి కవి వచనవేదములని కీర్తి గాంచినవి.

ఈ ధార్మిక క్రాంతి కార్యములో లక్కణామాత్య జక్కణాచార్యుల పాత్ర మహత్తరమైనది. వారి ధార్మిక చర్యల వెనుక నేదియో స్వార్థము దాగియున్నదని నిరూపింప బ్రయత్నించుచూ నుండిన సాళ్వ గోపరాజునకు, హరిహరపురములో జరిగిన ఒక సంఘటన తన ద్వేషమును వెలి గ్రక్కుట కవకాశ మిచ్చినది.

హరిహరపురములో కొన్ని సంవత్సరముల క్రిందట ఒక వీర శైవ పరివ్రాజకుడు వచ్చి స్థిరపడినాడు. అతడు జక్కణాచార్యుని ఆదేశమువలననో లేక స్వయంప్రేరితముగనో, ప్రజలను ధర్మమార్గానుగాములను జేయు కార్యమును చేబూనినాడు. ఈ నడుమ కొలది దినముల నుండి అతడు తన పరివ్రాజక వృత్తిని విడచి, హరిహరపురములో నివాస మేర్పరచుకొనినాడు. అచ్చటి ప్రశాంత వాతావరణ మతని కా ప్రదేశమున నిలచుటకు ప్రేరేపించి యుండవచ్చును. అచ్చట నిలచిన స్వల్పకాలములోనే అతడు తన సద్గుణములతో ప్రజల ప్రీతి విశ్వాసములకు పాత్రుడైనాడు. వా రాతనిని 'శివయోగి' యని పిలచెడివారు.

ఆ యగ్రహారమునకు చుట్టుపట్లగల గ్రామ ప్రజల కాతడు కష్ట కార్పణ్యములలో బంధువైనాడు. అతని కీర్తిని విని చాలమంది వచ్చి దర్శనము చేసుకొని వెళ్ళసాగినారు. బీదల బంధువైన ఆ శివయోగి శ్రీమంతులు తనకు సమర్పించెడి ధనకనకముల నంతయునూ బీదలకు పంచిపెట్టి వారి ప్రీత్యాదరములకు పాత్రుడైనాడు.

అతని ప్రియభాషణము, కలసి మెలగగల స్నేహతత్త్వము, సరసత్వములు ప్రజల కతనిమీద చనువును, ఆత్మీయతను కలిగించినవి.

అతని పాండితీ ప్రతిభ ప్రజలలో భక్తి గౌరవముల నేర్పరచినది. ప్రజ లతనిని వీరశైవ ధర్మము నుద్ధరించుటకై పుట్టిన పరివ్రాజక శ్రేష్ఠులలో నొకడని భావించి, అతని మాటను వేదవాక్యముగా పాలించసాగినారు.

హరిహరపురములో నున్న తక్కిన ధర్మబోధకుల కిది సహింప రానిదైనది. క్రొత్తగా వచ్చి నిలచి, తమకంటెనూ యెక్కుడు గౌరవ మును సంపాదించిన యీ శివయోగిపై వారి కసూయ జనించినది. తమకు లేని సన్మాన మా పరివ్రాజకునకు జరుగుచుండుట జూచి,వారు లోలోపల అతనిని ద్వేషించసాగినారు. ఎట్లయిననూ అతనికి నగరోద్వాసన చేయిం చనిదే తమకు ప్రశస్తి కలుగదని గ్రామపెద్దలలో నొకరగు తిరుమల తాతాచార్యులునూ, శంకరానందులునూ కలసి చాల దినములు దీర్ఘముగా చర్చించి, చివరకొక నిర్ణయమునకు వచ్చినారు —

శివయోగి మఠము ఊరివెలుపల ప్రశాంతమైన తుంగభద్రానదీ తీరమున నున్నది. ప్రజలు దానిని శివపురమని పిలిచెడివారు. అతనికా యాశ్రమమును ప్రజలే నిర్మించి యిచ్చినారు. పరివ్రాజక పరివార మెక్కువైన కొలది శివయోగి కుటీరము చుట్టునూ క్రమక్రమముగా మరి కొన్ని ఆశ్రమములు బయలుదేరినవి. అతని వద్దకు విద్య నభ్యసించు టకై చాతుర్వర్ణ్యముల విద్యార్థులనూ రాసాగినారు. ఈ సకలవర్ణముల విద్యార్థుల సౌకర్యార్థమై ఒక ఉచిత భోజన వసతి గృహమును, మఠాభి మానులు కట్టించినారు. దానితోబాటు సదా అచ్చటికి వచ్చి వెళ్ళెడి భక్తా దులకొరకై విడిది గృహములు, పాఠశాల, గోశాల, ఉగ్రాణములు నిర్మించినారు. ఈ గృహములన్నియునూ పూరితోనే నిర్మింపబడినవి.

శివయోగి మఠమునందు ప్రతి సంవత్సరమూ బసవజయంతి చాల విజృంభణగా జరుపబడెడిది. ఈ ఉత్సవమునకు దూరదేశముల నుండియూ ప్రజలు తండోపతండములుగా వచ్చి, శివయోగి ఉపదేశ మును పొంది, వారి యనుగ్రహమునకు పాత్రులై తిరిగి వెళ్ళుచుండెడి వారు.

ఈ పర్యాయము బసవ జయంత్యోత్సవము నతివైభవముగా జరుపవలయునని అతని అభిమానులు నిశ్చయించినారు. ఉత్సవమునకు

వచ్చెడి అతిథులకొరకై పెద్ద శిబిరమొకటి నిర్మింపబడినది. బసవేశ్వరుని చిత్రపటము నూరేగించుట, వారి తత్త్వములను గురించి ఉపన్యాస మిచ్చుట మొదలగు కార్యములకొరకై ఒక పెద్ద మంటపము భవ్యముగా నిర్మింపబడినది. ప్రజలు వేలసంఖ్యలో శివయోగి ఉపదేశా మృతమును పానము చేయుటకై వచ్చి యున్నారు.

ఇటువంటి సమయములో స్వార్థసాధకు లెవరో శివయోగి మఠ మును అగ్నికాహుతిచేయ నిశ్చయించినారు. ధర్మాంధులగు కొందరు నీచులు జంగములవలె వేషము వేసుకొని, శివయోగి మఠమునకు వెళ్ళి జయంత్యుత్సవములలో పాల్గొనుటకై వచ్చిన వారివలెనటించి,సమయము జూచి, మఠమును తగులబెట్టినారు. ఆ సమయములో బసవన జీవితమును గురించి శివయోగి ఉపన్యసించుచున్నాడు. ప్రజల దృష్టి అతని ఉపన్యా సము మీదనే కేంద్రీకృతమై యున్నది. ఉన్నట్టుండి హఠాత్తుగా మఠము వైపునుండి పెడబొబ్బలు వినబడినవి. "అయ్యో, అగ్నిజ్వాలలు ! మఠము తగులబడినది ! దాని నార్పుటకు రండు ! త్వరితముగా రండు!"

ఈ కేకలను విని ప్రజలు వెలుపలికి వచ్చునంతలో, శివయోగి నివసించుచూ నుండిన మఠము వీతిహోత్రుని కాహుతియైనది. దాని నార్పుటకై ప్రజలు దైత్యావేశముతో ముందుకు దూకినారు. కాని కార్యము మించిపోయినది. ఎండుగడ్డితో నిర్మింపబడిన ఆ కుటీరము జన సహాయము వచ్చునంతలో కాలి భస్మమైపోయినది. దాని జ్వాలలు ఇతర కుటీరములకు కూడ ప్రాకనాగినవి. ఇంతలో ప్రజలు నదిలోని నీరును తెచ్చి అధిక శ్రమానంతరము జ్వాలలను చల్లార్చినారు.

ఈ అగ్నివలన ప్రజలకు ప్రాణాపాయములు కలుగక పోయి ననూ, శివయోగి వద్దనుండిన అమూల్య గ్రంథ సామగ్రియునూ,పూజా ద్రవ్యములునూ, ఆహార పదార్థములునూ దగ్ధమైపోయినవి.

ఇదంతయూ చూచి శివయోగి ఏమియునూ మాట్లాడక మౌనముగా కూర్చున్నాడు.

ఇది ఎవరో నీచులు చేసిన బుద్ధిలేని పనియని తెలిసినది. ఈ నీచకార్యమునకు పూనుకొనిన ఒక వ్యక్తికూడా వారికి పట్టుబడినాడు.

అతని మాటలనుబట్టి చూచిన హరిహరపురము నందలి అన్యమత నాయకు లీ నీచకృత్యమునకు ప్రేరకులని అందరకునూ తెలిసినది. ప్రజలీ విష యము తెలియగానే కోపించి, ఆ నాయకుల గృహములను దహింపగోరి, శివయోగి యనుమతికై నిరీక్షించసాగినారు.

కాని, శివయోగి మాత్ర మంతటి ప్రతీకారమున కవకాశ మీయ లేదు. అత డుద్రేక పూరితులైన ప్రజలను శాంతము వహింపుడని ఆదే శించినాడు. అతని ప్రశాంత వదనమును జూచి ప్రజల యాక్రోశము-ప్రతీకారవాంఛ-చల్లబడిననూ, ఆ నీచులకు తగిన శిక్ష విధించక విడువ రాదని ప్రతినబూని అచ్చటనుండి మరలినారు.

శివయోగి మఠమునకు చిచ్చు పడినవార్త కర్ణాకర్ణికగా ప్రాకి, రాజధానిలోనున్న జక్కనాచార్యుల చెవినిహూడ పడినది. ఇది విని అత నికి భీతి గలిగినది. చూచుట కీ విషయము సామాన్యమైనదిగా దోచి ననూ,దాని వెనుక ప్రబలశక్తుల హస్తకౌశలము దాగియున్నదని అతడు గ్రహించకపోలేదు. ఈ విషయమును విచారించుటకొరకై స్వయముగా తానే హరిహరపురమునకు వెళ్ళవలయుననుకొనుచూ నుండగా, అచ్చటి నుండి వచ్చిన భక్తులు శివయోగి మఠమునకు జరిగిన అన్యాయమును తెలియజేసినారు.

"స్వామీ ! తమరు పదవిలో నుండియునూ పరివ్రాజకులవలె జీవనమును సాగించుచున్నారు. తమ పరివ్రాజక బంధువున కొకనికి నిష్కారణముగా ఎవరో నీచులవలన అన్యాయము సంభవించినది. తమ రీ సంఘటనయొక్క పూర్వాపరములను విచారించి, దానికి కారకులైన వారి నందరనూ శిక్షించవలయును.తమవలన యీ పని సాధ్యముగానిచో చెప్పుడు, మేమే ఆ ధూర్తులను శిక్షించి వచ్చెదము"

అని వారి నాయకు డనినాడు.

అంతయునూ విని, జక్కనాచార్యుడు కోపోద్రేకులైన వారినిఉచిత రీతిసి సమాధానపరచి పంపివేసి, జరిగిన దుండగమును విచారించుటకు తానే హరిహరపురమునకు వెళ్ళినాడు.

అచ్చటికి వెళ్ళి గ్రామపెద్దలను పిలిచి, విచారించగా వారు తమకీ విషయము లేమియునూ తెలియవనీ, తాము నిరపరాధులనీ చెప్పినారు. కాని పట్టుబడిన వ్యక్తిని సముఖమునకు రప్పించి, యడుగగా అతడు జరిగిన విషయములన్నియునూ వివరించినాడు.

"ప్రభూ ! నే నేమియునూ తెలియని అజ్ఞుడను. తాతాచార్యుల మఠములో సేవకుని పని చేసుకొనువాడను. వారు నాకు ధనాశజూపి ఈ కార్యమునకు ప్రేరేపించినారు. ధనప్రలోభముచే నే నీ హేయకృత్యమునకు పూనుకొనినది నిజమే. ఈ పనిలో నా కితరులుకూడా సాయపడినారు" అని అతడు యథార్థము నెరిగించినాడు.

అతని మాటల ప్రకార మా మఠాధిపతులను బిలిపించి యడుగగా వారునూ గ్రామపెద్దలు చెప్పినట్లే చెప్పినారు.

"అట్లయినచో, యితని నీ హేయకృత్యమునకు నియమించిన దెవరు ?" అని పట్టుబడిన వ్యక్తి నచ్చటికి పిలిపించగా, అతనిని చూచి తాతాచార్యుల వదనము కళావిహీనమైనది. అయిననూ తాతాచార్యు లధైర్య పడక సమయస్ఫూర్తిగా చెప్పినారు :

"ప్రభూ ! యితనికినీ మాకునూ ఏ సంబంధమూలేదు. ఇతడు మా మఠమునందలి శిష్యుడుకాదు. మావద్ద ఊడిగము చేసుకొనుచున్న ఒక జీతగాడు. అతడీ పనిని స్వప్రేరణతో చేసినాడు. మా మఠము యొక్క కీర్తికి కళంకము తెచ్చుటకు ప్రయత్నించుచున్నాడు. తమ రతని మాట లాలించకుడు" అని దైన్యముగా ప్రార్థించినాడు.

"మీమీద అతడెందులకు పగబూనవలయును ? మీ మఠము యొక్క కీర్తికి కళంక మాపాదించెడు ప్రయత్నమెందులకు చేయును? ఇది అబద్ధము. అతనిని మీరే యీ నీచకృత్యమునకు ప్రేరేపించి యుండవచ్చును. ధనప్రలోభ మొడ్డి వశపరచుకొని యుండవచ్చును" నిష్ఠురముగా అనినాడు జక్కనాచార్యులు.

"ప్రభూ ! సత్యము పలికిననూ, అబద్ధము పలికిననూ తమరు వినగలరు. ఈ నీచుని బుద్ధి మంచిదికాదు. మేము బీదవాని పొట్టపై కొట్ట

రాదని, యింతకాలముగా అతనిని పోషించుకొనుచూ వచ్చినాను. దేవుని సొమ్ములు దొంగిలించిన పిమ్మట నెమ్మని వహించుటకు మావలన కాక పోయినది. పనినుండి తొలగించి వెళ్ళిపొమ్మని చెప్పినాను. నామీది పగతో అతడీ నీచకార్య మొనరించి, దాని బాధ్యతను మాతలకు చుట్టి పెట్టుటకు ప్రయత్నించినాడు. తనకు జరిగిన అన్యాయమున కత డీ విధముగా మామీద పగ దీర్చుకొన జూచినాడు" అని తాతాచార్యులు తమ మాటలను సమర్థించుకొనినారు.

జక్కనాచార్యు లిప్పుడు ధర్మసంకటములో చిక్కుకొనినాడు. ఈ కార్యములో అన్యమతీయులగు మఠాధిపతుల హస్తకౌశల మున్నదనుటకు ఆ నౌకరునకు తప్ప, యితర సాక్ష్యముకాని, ప్రమాణము కాని ఏమియునూ లేవు. ఈ విషయమై అతడేనిర్ణయమునకునూ రాలేక పరివ్రాజక మఠాధిపతియగు శివయోగి నడిగినాడు.

"మహామాత్య శేఖరులూ ! తెలియనివారు అజ్ఞానముతో చేసిన యీ కార్యమును కృపజూపి క్షమింపుడు. దీనితో వారేమియునూ సాధించలేరు. నా యాశ్రయము దగ్ధమైనది నిజమే! కాని ప్రజల ధర్మ శ్రద్ధను నాశమొనర్చుటకు వారివలన సాధ్యము కాలేదు. ఈ హేయ కృత్యముతో విసుగుజెందిన ప్రజలింకనూ హెచ్చుగా మన మత మవలంబించుచున్నారు. తమ రీ స్వల్పకార్యమునకై ఎవరిమీదనూ కఠినచర్య తీసుకొనకుడు" అని ప్రార్థించినాడు.

జక్కనాచార్యు లీ మాటలకు విషాదముగా నవ్వినాడు.

ప్రజలు మాత్రము 'అన్యాయము చేసిన వారెవరైననూసరిమే. వారిని శిక్షించి తీరవలయును' అని ఘోషించినారు ఈ దహనకాండలో అన్య మతస్థులు కలుగజేసుకొని యుండుట నిజమేయైననూ వారు మాత్రము తమ యపరాధము నంగీకరించలేదు.

దీనితో కుపితులైన జక్కనాచార్యుడు పూర్వరాజులు లా మఠమునకిచ్చిన మాన్యములనూడదీసినదేగాక, దాని యాస్తినికూడా వశపరచుకొనుటకు ఆజ్ఞాపించినారు.

ఈ యాజ్ఞను విని తాతాచార్యులూ, శంకరానందులూ బొదుగరచు కొనినారు. వారీ సమయమున ఏమి చేయుటకునూ దోచక, తమ అభిమానియైన సాళ్వ గోపరాజును శరణుజొచ్చినారు.

సాళ్వ వంశజులలో కొందరు శైవభక్తులైననూ చాలమంది వైష్ణవ మతాభిమానులు. తిప్పరాజు తిరుపతి యందునూ, శ్రీరంగము నందునూ అనేక పుణ్యకార్యము లాచరించినాడు. అచ్చటి దైవములకు సొమ్ములు చేయించి యిచ్చినాడు. గోపరాజు తన జీవితములో నెక్కువపాలు వైష్ణవ క్షేత్రమైన ముళువాయియందు గడపుటవలన అతడు వైష్ణవ మతాభిమాని యైనాడు.

అతడు తాతాచార్యుల మాటలను నమ్మి, వైష్ణవులకు జక్కనాచార్యుని వలన జరిగిన యన్యాయమునకు కోపించినాడు. శైవుడగు నాతనిని తను ప్రతిఘటించనిచో అన్యాయముగా నతనివలన వైష్ణవులు యిడుమలు గుడువగలరని భావించినాడు గనుక యీ విషయమును గురించి జక్కనాచార్యునితో స్వయముగా మాటలాడ నిశ్చయించినాడు.

నిశ్చయించుకొనినదే తడవుగా జక్కనాచార్యుల సౌధమునకు వచ్చి, వారి సందర్శనమును కోరినాడు.

ఆ సమయములో జక్కనాచార్యుడు శ్రీశైలమునుండి వచ్చిన శివభక్తులకు ఆతిథ్యమిచ్చుచున్నాడు. అది ముగిసిన తరువాత గోపరాజును కలుసుకొన గలననియునూ, అంతదనుక అన్యధా భావింపక నిరీక్షించ వలసినదనియునూ సేవకునితో చెప్పి పంపినాడు.

గోపరాజీ మాటలకు కోపగించుకొనినాడు. తనకంటెనూ ఆ జంగమయ్యల ఆతిథ్య మెక్కువైనదా ? యని రోష కషాయితుడైనాడు. మరల తా నిప్పుడు కోపగించుకొని వెనుకకు మరలినచో, కార్యము చెడగలదని శాంతించి జక్కనాచార్యుని శివభక్తుల యాతిథ్యము ముగియువరకునూ కాచుకొని కూర్చున్నాడు.

శివభక్తుల యాతిథ్యము ముగిసిన తరువాత జక్కనాచార్యుడు గోపరాజును సందర్శింప వచ్చినాడు.

"గోపరాజుగారూ! తమరిని నేను చాలసేపు కాచియుంఁడ జేసినాను. దయయుంచి క్షమించుడు. శ్రీశైలమునుండి కొందరు శివభక్తులు వచ్చి యుండిరి. వారి కాతిథ్య మిచ్చుచుంటిని. వచ్చుటకు కొంత తడవైనది" అని క్షమాపణ గోరుచున్నట్లుగా యనినాడు.

ఈ మాటలు విని గోపరాజుకు పుండుమీద కారము జల్లినట్లయినది. తనవంటి సుప్రతిష్ఠిత వ్యక్తి కంటెనూ ఆ జోగి జంగమయ్యలే జక్కనాచార్యుని కెక్కువైనారా? అతని మానసము వ్యగ్రమైనది. దానిని వెలిగ్రక్కుచున్న వానివలె:

"అధికారములోనున్న వారేమిచేసిననూ అది ఒప్పు కాగలదు అమాత్యులూ!" అని వ్యంగ్యముగా నవ్వి, మరల —

"నారాక మీ యాతిథ్యమునకు విఘ్నమును కలిగించి యుండినచో దయయుంచి క్షమించుడు మీ సమయా సమయము లెరుగక వచ్చుటపరాధమైనది"

—విషాదమును వ్యక్తపరచుచూ అనినాడు గోపరాజులు.

"అటువంటి విఘ్నమేమియునూ జరుగలేదు. తమరు వచ్చిన కార్యము సెలవిండు. గోపరాజులు నా గృహమునకు కారణము లేనిదే వచ్చువారుకారు"

అని జక్కనాచార్యుడు నవ్వుటకు బ్రయత్నించినాడు.

గోపరాజు తాను వచ్చిన పని తెలియజేసినాడు:

"అమాత్యులూ! తమవలన హరిహరపుర నివాసులకు, అందుననూ వైష్ణవులకు చాల యన్యాయము జరిగినది. తాము శ్రీవైష్ణవ మతమునకు సంబంధించిన మాన్యములను, ఆస్తిపాస్తులను వశపరచుకొనుటకు ఆజ్ఞాపించి యున్నారని విన్నాను"

"ఔను!"

"కారణ మరయవచ్చునా?"

"ఈ విషయములన్నియునూ తెలిసిన మీకు దాని కారణముకూడా తెలిసి యుండవలయును కదా?"

"మీరు శైవమతస్థుల పక్షమవలంబించి, అన్యమతస్థులకు విధమైన అన్యాయావమానములు చేయగలరని నేను స్వప్నమున నైతము భావించి యుండలేదు. తమరొక ధర్మమునకు మాత్రమే సంబంధించిన వారు కారు. సామ్రాజ్యమునకు మహామాత్యులు. స్వార్థపరులైన ఆ పరివ్రాజక మతాభిమానుల మాటలు విని తాము యింతటి దుడుకుతనముతో ఆ యాజ్ఞను జారీచేయక యుండవలసినది" విషాదమును వ్యక్తపరచినాడు గోపరాజు.

"నా యాజ్ఞను అన్యాయమనిజెప్పు మీకు, అన్యమతస్థులవలన ఆ పరివ్రాజక మఠమునకు జరిగిన యన్యాయ స్వరూపము తెలిసియుండవలయును కదా ?"

"ఇందులకు నేను చాల విషాదపడుచున్నాను. ఎవరో తెలివిలేని మూర్ఖుడు చేసిన ఆ కార్యమునకు ఒక గురుపీఠముమీద నేరము మోపుటేమి న్యాయము ? ఆ మఠాధిపతులకు తామింతటి కఠినశిక్ష విధించుటయా ? వారిని విచారించనిదే తామీ తీర్మానమునకు వచ్చుట నాకు చాల ఖేదమును కలిగించుచున్నది"

"అయినచో మీకీ ప్రకరణములో వైష్ణవ మఠాధిపతుల జోక్యము లేదని చెప్పుచున్నారా ?"

"ఔను !"

"కాని యీ మాటలకు విరుద్ధమైన ప్రమాణము మాకు లభించి యున్నది"

"మీకు లభించియున్న ప్రమాణము మఠములో దొంగతనముజేసి ఉద్యోగమును పోగొట్టుకొనిన ఒక సేవకుని మాటలు. అతడు ప్రతీకారము చేయుటకొరకై ఈ అకార్యమును పూనుకొని యుండవచ్చునని తామొకసారియైనను భావించినారా ?"

"అతడు దొంగతనము చేయనూలేదు — అందులకై ఉద్యోగము పోగొట్టుకొననూలేదు. ఇదంతయూ తాతాచార్యులు మమ్ము మోసగించుటకై పన్నిన పన్నాగము. వారు మమ్ములను వంచించుటకీ నాటకమాడినారు. వారికి సహాయులుగా శంకరానందులు కూడా నున్నారని తెలిసినది,

కాని వారిమీద ప్రత్యక్షారోపణ మోపుటకు తగిన యాధారము లభింప మిచే మేమీ విషయమై ఏ క్రమచర్యనూ తీసుకొనలేదు"

"ఈ స్వల్ప సందేహము నాధారముగాగొని మీరు శ్రీ మఠమున కెంతటి అవమానమును చేయుచున్నారో తెలియునా ? మీ యపరాధము యొక్క స్వరూపము మీకు తెలిసినదా ?"

"అది మీరు చెప్పవలసిలేదు. మీ బాధ్యతను మీరు గుర్తింపుడు !"

"నా బాధ్యతను గురించి నాకు బాగుగా తెలియును. తమరొక అల్ప విషయమునకై, శ్రీమఠమునకు హరిహర మహారాజుల కాలము నుండియూ జరుగుచూ వచ్చిన గౌరవ సన్మానములనూ, దేవమాన్య మునూ స్వాధీనము చేసుకొనుటకై యాజ్ఞాపించినారు. అంతియగాక మఠముయొక్క ఆస్తిపాస్తులనుకూడా వశపరచుకొనుడని సెలవిచ్చినారు. వీటి పరిణామమెంత ఘోరముగా నుండునో బహుశః మీ రాలోచించి యుండరు. ఇప్పుడైననూ తమ రీ విషయమై బాగుగా విచారించి, తీర్మా నించుట సామ్రాజ్య క్షేమదృష్ట్యా యోగ్యముగా నుండగలదు"

"అన్నియునూ ఆలోచించియే యీ తీర్మానమునకు వచ్చినాము"

"మీరు తొందరపడినారని నా భావము. అమాత్యులుగానుండి మీరు రాష్ట్ర హితమును సాధించుటలేదు. కేవలమొక మత పక్షపాతము వహించి, పరమతస్థులను నిష్కారణముగా బాధించుటకునూ, శిక్షించు టకునూ పూనుకొనినారు. దీనిని సామ్రాజ్య నిష్ఠగల ప్రభుసేవా పరా యణులు ప్రతిఘటించుచున్నారు"

"మీరు నా యాజ్ఞను ప్రతిఘటించుచున్నారా ?"

"ఔను ! ఇటువంటి అన్యాయ ప్రవర్తనను-ఆజ్ఞను — అమాత్యులై అగు మీనుండి నేను నిరీక్షించలేదు. మీరు పూర్వాగ్రహ పీడితులై యిట్లు వర్తించుచున్నారు. రాష్ట్ర ఐక్యతా దృష్టితోడనూ, సామ్రాట్టుల క్షేమ చింతనా దృష్టితోడనూ నేను మి యీ దుడుకుతనపు యాజ్ఞను సార్వ భౌములు వచ్చునంతవరకునూ ప్రతిఘటించవలసియున్నది"

"సామ్రాజ్య క్షేమదృష్టితోడనూ, సామ్రాట్టుల క్షేమచింతనా

దృష్టితోడనూ, న్యాయ పరిపాలనా దృష్టితోడనూ నేనీ యాజ్ఞను కార్య గతము చేయవలయుననునది తమరు మరువకుడు।"

"మీరు రాష్ట్ర క్షేమమునకంటెనూ మీ ధర్మ చింతనమునే దలచుచున్నారు. సార్వభౌముల హితమునకంటెనూ మీ వైయక్తిక ప్రతీకారమున కాతురత జెందుచున్నారు"

"నాకు సర్వధర్మములూ సమానములే। నేను సామ్రాజ్య సేవకుడనూ, సామ్రాట్టుల పాదసేవకుడనూ గనుక వారి క్షేమమునుగోరి ఈ తీర్మానమును చేయూనవలసి వచ్చినది"

"ఇది ధర్మము పేరున మీరు ప్రదర్శించుచున్న నిరంకుశాధికారము"

"అది మిథ్యారోపణము। నన్నునూ, రాజ సత్వమునూ మీరు నిందించుచున్నారు"

"నేనుకాదు। అన్య ధర్మమును నిందించుచున్నది మీరే। మీరు వీరశైవులుగా నుండుటచే ఆ మతేతరులను మీ మత స్వీకారమునకై హింసించుచున్నారు. ఇది ధర్మద్రోహము। రాష్ట్ర ద్రోహము। సార్వభౌములు రాజధానికి వచ్చువరకును యిటువంటి రాజాజ్ఞలను నేను ధిక్కరించుచున్నాను"

"ఇది నా వైయక్తికా కాంక్షకాదు—న్యాయపరిపాలనా దృష్టితో చేసిన తీర్పు. పరివ్రాజక మఠమున కేర్పడిన అన్యాయమునకు తగిన పరిహారము చెల్లించవలయుననినచో, ద్రోహులకు శిక్ష వచుటకు రాజాజ్ఞ కార్యగతముకాక తప్పదు.ఈ యాజ్ఞను ధిక్కరించువారు రాజశాసనమును ధిక్కరించగలరు. అటువంటి వారెవరైననూ సరియే, వారు శిక్షార్హులను విషయమును మిరు మరువరాదు"

"అది నాకు తెలియును అమాత్యులుగారూ। నాకు కర్తవ్యబోధ చేసెడి మీరు,ఈ శాసనమును కార్యగత మొనరించుటకు పూర్వము మరల నొకపరి బాగుగా నాలోచించి చూడుడు. ఏమి జరిగిననూ ఆ బాధ్యత మీయదే। సార్వభౌముల పేరున చేయబడుచున్న యీ యాజ్ఞ అన్యాయముగనూ, అవమానకరముగానూ నున్నది. దీనివలన సామ్రాజ్యమందలి ధర్మేతరుల హృదయములలో లేని భీతిని కలిగించినట్లు కాగలదు. మీరు

మీ వైయక్తిక ప్రతీకారకాంక్షతో చేయు నీ కార్యమునకు మున్ముందు సామ్రాట్టులు తగిన పరిహారము చెల్లించవలసిన పరిస్థితి యేర్పడవచ్చును. సామ్రాజ్య భద్రతకు మీరు పెట్టుచున్న గొడ్డలిపెట్టు, రేపు సామ్రాజ్య వృక్షమునే కూలద్రోయ వచ్చును। బాగుగా నాలోచించి, ఈ యాజ్ఞను కార్యగత మొనరించుడు. మీ వ్యక్తి పరమైన ఆశ - ఆకాంక్షల కొరకునూ, గౌరవ ప్రతిష్ఠల కొరకునూ సామ్రాజ్య మందిరము పతనమగుట వివేకముకాదు. సార్వభౌములు రాజధానిలో లేని తరుణమున, వారు మీ యందు గలిగియున్న నమ్మిక నీ విధముగా దురుపయోగ సరచుకొనుట తమ ఘనతకు తగిన కార్యముకాదు।"

గోపరాజు మాటలు విని, జక్కనా చార్యుడు క్షణకాలము మౌన ముగా కూర్చొని యాలోచించినాడు. 'ఔను। తన యీ యాజ్ఞవలన మున్ముందు సామ్రాజ్యైక్యతా మందిరము బీటలు వారినచో? తన తీర్మా నమునకు సార్వభౌములు పరిహారము చెల్లించవలసి వచ్చినచో?' అని తనలోతానే భావించుకొన సాగినాడు.

"ఇప్పుడు మీరు చెప్పునదేమి?"

"సార్వభౌములు రాజధానికి వచ్చువరకునూ మీరీ నిర్ణయమును కార్యగత మొనరించరాదు. ప్రభువులే వచ్చి స్వయముగా, హరిహర పుర ములో జరిగిన దహన కాండమున నిజమైన అపరాధు లెవరనునది నిర్ణ యించి, తీర్పు నిచ్చువరకునూ మీ నిర్ణయము రాజశాసనముగా అమలు జరుగుటను ఆపవలయును."

"సామ్రాట్టులు నా నిర్ణయమును సమ్మతించినచో?"

"సార్వభౌములు మీచేతి కీలుబొమ్మలై, అన్యాయమగు మీ తీర్మా నమును బలపరచినచో, దాని విపత్పరిణామమును వారనుభవింపగలరు" అని నిశ్చయ కంఠముతో గోపరాజనినాడు.

జక్కనా చార్యులతని మాటలువిని నిశ్చేష్టుడైనాడు. గోపరాజు వంటి రాజబంధువు నుండి - సామ్రాజ్యపు ఉన్నతాధి కారినుండి - ఇంతటి మాటలు రాగలవని అతడు భావింపలేదు.

ఈ విషయములో గోపరాజుయొక్క ప్రతిఘటన తెలియగానే జక్కనా చార్యుడు తొందరపడక, తన యాజనములు జరుపక, ఈ సంగతులన్నియుసు సామ్రాట్టుల కెరిగించి, వారిని రాజధానికి దోడ్కొని వచ్చుటకై తన సహోదరుడైన సింగన దండనాయకుని వెంటనే బంపి నాడు.

# 14

# న్యాయ విచారణము

ప్రౌఢ దేవరాయలకు సింగన దండనాయకుని ద్వారా రాజధాని యందలి పరిస్థితి నెరిగిన పిమ్మట గజపేట శిబిరములో ఎక్కువకాలము నిలచు టకు మనస్కరించలేదు.

అతడు వీరన నాయకుని రావించి, తన శిబిరముల నూడదీయుటకై వలయు ఏర్పాటులను జేయుమని యాజ్ఞాపించినాడు. ఈ సమయమున అతని పట్ల విశ్వాసము కనబరచి, అతిని యాతిధ్యమునకు తన కృతజ్ఞత లర్పించినాడు.

"వీరన నాయకులూ! మీరు నిజముగా సామ్రాజ్య మందలి స్వామి నిష్ఠా గరిష్టులగు పెద్దలలో నొకరిని నాకు దెలిసినది. ముమ్మయనాయకుని విషయమున నేను మీమనస్సును నొప్పించి యుండినచో, క్షంతవ్యుడను" అని చెప్పి, అతనిని సమాధాన పరచి పంపివేసినాడు.

శిబిరమునందు గజపేటలో తనకు సాయపడిన వ్యక్తులందరికినీ ఉచిత రీతిని బహుమతులిచ్చి సంతోషపరచినాడు.

ఈ సమయమున చంద్రగుత్తి రాజ్యమును పద్మలాదేవి కర్పించి, త్రియంబక దేవునికి జరిగిన యన్యాయమును చక్కదిద్ద వలయు నను

కొన్నాడు. కాని, పొన్నలాదేవి ప్రౌఢ దేవరాయల పత్నికాగా, పద్మలా దేవి కుమార్తెను విడచి యుండలేక, దానిని తన యభిమానమునకు పాత్రుడగు హంపీరాయలను వానికిప్పించినది.

హంపీ రాయలు వీరవిజయుల కాలములో రాజభాండాగారాధిపతియై యుండి, ప్రౌఢదేవరాయల ప్రీత్యాదరములకు పాత్రుడైనవాడు. అతడునూ, అతని తండ్రియగు అరసప్రభువునూ సామ్రాజ్యమునకు నిష్ఠతో సేవజేసినారు. అరసప్రభువు త్రియంబకదేవ, పద్మలాదేవులకు చాల కావలసిన వాడగుటచే, ప్రౌఢదేవరాయ లతనిని చంద్రగుత్తి మండలాధికారిగా నియమించినాడు.

ఖాళీ ఏర్పడిన రాజభాండాగారాధిపతి స్థానమునకు కరణీక శ్రేష్ఠుడగు గురురాయలను నతనిని లక్కనామాత్యుల సలహా మేరకు నియమించినాడు.

ఈ గురురాయలను నియమించునపుడు, దేవరాయలు: "అమాత్యులా! మనలను సరిగా యర్థము చేసికొనక ప్రజలు శైవ పక్షపాతులని యనుకొనుచున్నారు. కాని ధర్మము నా భావనప్రకారము హృదయంగతమైనది. నేను శైవమతాభిమాని నైననూ, సామ్రాజ్యభారమును మోసుకొనియున్న ప్రభువను విషయమును మరువలేను. నా ప్రజలలో అన్ని మతములవారునూ యున్నారు. ఇట్లుండగా నేను ఒక మతదృష్టితో ఆలోచించగలనను మాటయూ, ఒక ధర్మమునకు ప్రోత్సాహ మిచ్చుచున్నానను మాటయూ అర్థశూన్యమైనది. ఇటువంటి పరిస్థితిలో మా గోపరాజు నన్ను శైవధర్మాభిమానియని యనుకొనుట నా దురదృష్టము" అనినాడు.

సామ్రాట్ ప్రౌఢదేవరాయలు విజయనగరమునకు తిరిగివచ్చిన తరువాత చేసిన మొదటి కార్యమేమనగా, పొన్నలాదేవిని శాస్త్రోక్తముగా వివాహ మాడుట. ఈ సందర్భముననే లక్కనామాత్యుల సలహా నంగీకరించి, మంగయ నాయకుని పుత్రియగు భీమలాదేవిని వధువుగా స్వీకరించి, ఒకే పీటమీద వారిరువురనూ వివాహమై, తాను జాత్యతీత సామ్రాట్టని లోకమునకు ప్రకటము చేసినాడు.

ప్రౌఢ దేవరాయలు శైవుడైననూ పొన్నలాదేవి రూపలావణ్యాదులను జూచి మనసు గలిగి. వైష్ణవ వంశజ యగు నామెను వివాహమైనాడు ఇపుడు లక్కనామాత్యుని సలహాను త్రోసిపుచ్చక జైనకులజ యగు భీమలాదేవిని పరిగ్రహించినాడు. ఈ విధముగా నతని జీవితము సామ్రాజ్యమందలి జైన, శైవ, వైష్ణవ ధర్మముల త్రివేణీ సంగమమైనది. అతడు సర్వధర్మ సమన్వయుడగు బుక్కరాయ సార్వభౌముల దివ్యాదర్శమును తన కార్యములకు నూతగా గొనినాడు.

ఇంతయైననూ సాళ్వ గోపరాజువంటివారికి. ఈ ధర్మ సమన్వయ దృష్టి తమను వంచించుటకై సార్వభౌము డాడుచున్న నాటకమని దోవ సాగినది. వారు ప్రౌఢ దేవరాయలను గోముఖ వ్యాఘ్రమని భావించినారు. లోలోపల శైవ పక్షపాతిగా నుంటూ, పైకి తమను మోసగించుట కొరకే యీ విధముగా జేయుచున్నాడని వారనుకొన సాగినారు.

ప్రౌఢ దేవరాయలు రాజధానిని చేరుకొనగనే గోపరాజునూ, వైష్ణవాచార్యుడగు తాతాచార్యులనూ, అద్వైత మత శంకరానందులనూ సముఖమునకు రప్పించుకొని. పూర్వాగ్రహము లేక వారి మాటలను సావధానముగా వినినాడు.

ప్రతిపక్షము వారగు పరివ్రాజక మత శివయోగియునూ, జక్కనాచార్యుడునూ తమ యభిప్రాయములను వెల్లడించినారు.

విష్పక్షపాత విచారణ చేయుటకొరకయి ప్రౌఢ దేవరాయలు న్యాయమూర్తిగా ధర్మపీఠము నలంకరించినాడు.

సార్వభౌముల కోరిక మేరకు మొదట తిరుమల తాతాచార్యులు లేచి నిలిచి తమ వాదమును ప్రభుముందుంచినారు.

"ప్రభూ ! విజయనగర సార్వభౌములగు హరిహర రాయలు హరిహరులలో నే భేదమునూ గానక. హరిహర పురాగ్రహారమును అన్ని ధర్మముల బ్రాహ్మణులకునూ దానముగానిచ్చి.వృత్తులను కల్పించినారు. జైన, వైష్ణవ మత గురువులకు వివాద మేర్పడిన సమయమున బుక్కరాయ లా ఉభయ మతములునూ రాష్ట్రముయొక్క జీవనాడులని సెలవిచ్చి. జైనులు వైష్ణవ గురుపీఠముల పునరుద్ధరణకూ, వైష్ణవులు

జైనమఠములు జీర్ణోద్ధరణకూ పన్ను చెల్లించవలసినదని శాసనములు వ్రాయించి స్థాపించినారు. భగవతీ భువనేశ్వరీ దేవి కృపాకటాక్షముతో, పూజ్యులగు విద్యారణ్య మహర్షులచే స్థాపింపబడిన యీ ధర్మ సామ్రాజ్యము సర్వ ధర్మ సమన్వయమను దివ్యాదర్శము నూతగా గొనినది. ఈ ధర్మ సింహాసన మధిష్ఠించిన సార్వభౌము లందరునూ సకల వర్ణాశ్రమ ధర్మ ప్రతిపాలకులను బిరుదును దాల్చినారు. ఈ దివ్య పరంపరను తమరుకూడ ఆచరించగలరని మేమనుకొనినాము.

కాని, ఈ నడుమ సామ్రాజ్యములో సమాజ సంస్కరణ మను పేరుననూ, ధర్మక్రాంతి యను పేరుననూ జరిగిన పరివ్రాజకుల చర్యలను గమనించినచో, ఎందులకో నాకు భీతి గలుగుచున్నది. మా ధర్మములకీ చర్యలవలన గొడ్డలిపెట్టు పడగలదని తోచుచున్నది. ఈ యథార్థమును తమ సన్నిధిని విన్నవించు కొనుచున్నాను సావధానులరై ఆలించవలయునని ప్రార్థన!

ఇపుడు వీరశైవ మతమునకు సంబంధించిన కొందరు సామ్రాజ్యమందున్నతాధికారులుగా నున్నారు. వారు తమ మతాభిమానముతో ఇతర మతముల నుపేక్షించుటకూ, ఖండించుటకూ సిద్ధపడినారు. వీరశైవులగు జంగములు తాము పరివ్రాజకులమని చెప్పుకొనుచూ ప్రజలను తప్పుదారి బట్టించుచున్నారు.

సామ్రాజ్యమందెచ్చట గన్ననూ యీనాడు పరివ్రాజక మఠము లేర్పడి, రాజాదరణను పొంది, ప్రజలలో వర్ణసంకర మేర్పరచి, వర్ణాశ్రమ ధర్మములకు తీవ్రమైన నష్టమును గలిగించుచున్నవి. వేదాధికారము లేనివారికి సైత మిప్పుడు వేదాధ్యయనమును జేయించుటకు శివపురములూ-జంగమ నాడులూ ముందుకు వచ్చుచున్నవి. అంతటితో తృప్తి జెందక యీ పరివ్రాజకులు ప్రజలను మోసగించి, తమ జనప్రియతను వృద్ధిజేసుకొనుటకయి జయంత్యుత్సవముల నాచరింప మొదలిడి, యితర మతములను న్యూనత పరచుచున్నారు.

ఈ కార్యములతో విసుగుజెందిన వారెవరో, ఏదియో స్వార్థమును సాధించుటకొరకయి హరిహర పురమందలి పరివ్రాజకుల మఠ

మున కగ్నిస్పర్శ జేసినారు. యెవరు చేసిననూ యిది నీచకార్యమేనని మేము ఘంటాపథముగా చెప్పగలము. తమరీ విషయమును కూలంకషముగా విచారించి, అపరాధులెవరైననూ సరియే, వారిని శిక్షించుడు."

అద్వైత మత బోధకుడగు శ్రీ శంకరానందులు లేచినిలచి "ప్రభూ, విజయనగర సామ్రాజ్యము యవనుల దురాక్రమణనుండి హిందూ ధర్మ సంస్కృతులకు మనుగడను గలిగించుటకయి నేర్పడిన ధర్మ సామ్రాజ్యము. దీని యాదర్శము, ధర్మసమన్వయము, ఇదివరకూ నీ రాజ్యమును పాలించిన సామ్రాట్టులందరునూ, సర్వమతములనూ సమాన గౌరవముతో చూచుకొనినది గాక,వర్ణాశ్రమ ధర్మములనుకాపాడి కీర్తి భాజనులైనారు.

భరత ఖండమందలి ధర్మములన్నియునూ చూచుటకు వేరువేరుగా కనబడిననూ, ఒక గమ్యస్థానమును చేరుటకై బయలుదేరిన వివిధ మార్గములు. అన్ని మతములునూ యీ సందేశమునే చాటుచున్నవి. సామ్రాజ్యమందలి జైన - బౌద్ధమతములు గూడ యీ నిత్య సత్యమునే తెలుపుచున్నవి. ఇందులకు హోయిసల విష్ణువర్ధన మహారాజులశాసనమే సాక్ష్యము. మతధర్మములట్లుండగా, హరిహర పురములో జరిగిన సంఘటనను జూచినచో, వివిధ ధర్మముల వెనుకనున్న విశాలభావములెంతటివో తెలియగలవు. ఈ మత భేదములవలన, ద్వేషాసూయలు తలఋాపి యుండుట స్పష్టపడగలదు.

ఈ సంఘటన జరుగరానిది. దీని నెవరునూ సమర్థించరు. ఇది వివేకవంతులు తల యొగ్గవలసిన హేయకృత్యము. తమ భేదాభిప్రాయమును వెలిబుచ్చు మార్గ మిదికాదు. ఎవరో బుద్ధిహీనులు, ధర్మపాషండులు తమ స్వార్థమును సాధించుకొనుటకై చేసిన నీచకృత్య మీయది. చక్రనాచార్యు లీ సంఘటనను వైష్ణవ-ద్వైతమత బోధకుల కంటగట్టి, మా కిచ్చిన మడులనూ,మాన్యములనూ వశపరచుకొన వలసినదని చేసిన యాజ్ఞ అన్యాయమునూ, అధర్మమునూ నైనది.ధర్మమూర్తులైన ప్రభువు లీ సంఘటన యందలి సత్యమును గ్రహించి,పరివ్రాజక మాతాభిమానుల

వలన మాకు జరిగిన యన్యాయమును చక్కబరచవలయునని వినమ్రి డనై ప్రార్థించుచున్నాను" అని కూర్చున్నాడు.

ప్రౌఢదేవరాయలు శివయోగివైపు చూచినాడు.

శివయోగి లేచి నిలబడి :

"ప్రభూ ! మేము పరివ్రాజకులము. మాకీ ప్రాపంచిక పదవీ- యధికారముల వ్యామోహములేదు. మేము పరమత దూషణమునుగాని, విడంబనగాని చేయలేదు.

అన్ని ధర్మములనూ బోధించునది ఋజు జీవనమునే. సదాచార సంపన్నులూ, పూజ్యులూనగు బసవేశ్వరు లిటువంటి జీవితము గడపి కాయమే కైలాసమని చాటినారు. మే మాచరించు చున్నదియునూ ఆ మహాత్ముని కార్యమునే। వారి యడుగుజాడలలో మేము నడచుచున్నాము. దీనివలన యితర మతములవారు వర్ణ సంకరమైనదనియునూ, వర్ణాశ్రమ ధర్మములు శిథిలములైన వనియునూ మామీద నేరము మోపుచున్నారు. అందులకు మేమేమి చేయగలము।

ప్రజలుదాత్తులుగా-సత్య నిరతులుగా పరివర్తితులు కావలయు ననునదియే మా యీ పరివ్రాజకుల ఘనోద్దేశము. ఇది రాజకీయముగా ప్రేరితమైనదికాదు-సమాజ సంస్కరణ దృష్టితో ప్రేరితమైనది. దాని కార్యక్షేత్రము సమాజము-దాని కార్యనీతి ధర్మబోధ।

ఈ కార్యకలాపములు శివభక్తులగు జక్కనాచార్య, లక్కనా మాత్యుల వంటి విభూతి పురుషుల నిర్దేశనమున సాగుచున్నవనినచో, నిక యిందులో రాష్ట్ర ఘాతుకమైన లేదా హింసాయుతమైన కృత్యము లకు మన్నన ఎట్లు లభించగలదు ? అజ్ఞానులగు వారు మా యీ చర్యల యొక్క యుద్దేశము నపార్థము జేసికొని,మమ్ములను ధర్మద్వేషులనుచూ అపనిందను మోపుచున్నారు.

ఇటువంటి యారోపణలు సత్య దూరములైన వనియునూ, మాకు పరమత ధర్మములపట్ల చులకన భావము, దూషణజేయుట మొదలగు దురుద్దేశములు లేనవనియునూ. సర్వ ధర్మములనూ సమాన గౌరవముతో

చూచు చున్నామనియునూ యీ సందర్భమున నొక్కి వక్కాణించు చున్నాము.

ఇక హరిహర పుర విషయము గురించి యొకమాట.

మా యాశ్రమమునకు చిచ్చుపెట్టిన వారెవరో యీ హేయ కృత్య మును నీచాభిప్రాయముతో నాచరించినారు. మా మఠమును దహించుట తోడనే మా పరివ్రాజకుల యాదర్శమును భస్మము జేసినట్టు కాలేదు. ఈ నీచకార్య మొనరించి, వారు తమ యజ్ఞానమును ప్రదర్శించుకొని నారంతియే।

వ్యక్తిగతముగా నా కెవరిమీదనూ ద్వేషములేదు. ఈ దహన కాండమునకు బాధ్యులనుగా నే నెవరినీ నిర్ణయించుటలేదు. తమ యకృత్యమునకై వారి కిదివరకే పశ్చాత్తాపము కలిగియుండిన జాలును. అప రాధులను తమ రుదారభావముతో క్షమించవలయును. హరిహరపుర వైష్ణవ పీఠమునుండి తీసుకొనిన దేవమాన్యములనూ, తదితరములనూ వాటికి మరల నిప్పించి, ఆ పీఠములను సమానగౌరవముతో చూచుకొన వలసినదని నేను సన్నిధానమున ప్రార్థించుచున్నాను" అని కూర్చున్నారు.

ఈ పలుకు లాలించి ప్రౌఢదేవరాయలు చకితుడైనాడు. పరివ్రాజక మఠాధిపతులగు శివయోగుల మాటలు విని సభలో జయజయ ధ్వానములు చెలరేగినవి. అందరునూ యతనిని బ్రస్తుతించినారు.

సభా కౌతుకమును జూచి సామ్రాట్టులు లేచి నిలచినారు.

"మాన్య సభాసదులారా! తా మిదివరకునూ పక్ష ప్రతిపక్షుల వాద ప్రతివాదములను వినినారు. హరిహరపురాగ్రహారమున జరిగిన సంఘటన కేవల మీర్ష్యతో ఘటించినదని నాకు దోచుచున్నది.

దేశమున మునుపటికంటెనూ యిప్పుడు అధర్మము హెచ్చు చున్నది. ప్రజలలో ధర్మగ్గాని కూడా ఎక్కువగుచున్నది. వారు సదా చార, ఋజు జీవనములను విడచి స్వార్థమునకు, ద్వేషాసూయలకు వశులై సంఘజీవనమును కలుషిత మొనరించుచున్నారు. దీనిచే సమాజాస్థిత్వము భంగమగుచున్నది. ఇటువంటి సమాజముచే సామ్రాజ్యము కూడా పతనమగుట తథ్యము।

కాబట్టి, సామ్రాజ్యములో తలజూపిన ధర్మగ్లానిని బోనడంచుట కై పూజ్యులగు శ్రీ బసవేశ్వరులు చేబూనిన కార్యమునిప్పుడు శివభక్తులు పూర్తిగావించుచూ వచ్చుచున్నారు. వారి నూతన విచారములానాడుకూడ దురభిప్రాయమును పుట్టించి, బిజ్జలువిహత్యయు, బసవేశ్వరుల అధికార నివృత్తియు గలిగి, సంగమ క్షేత్రములో చివరకు వారైక్యత నందినట్టే, యీనాడుకూడ సనాతనధర్మపరాయణులవలన తీవ్రమైన ప్రతిఘటన జరిగినది.

ఈ పరివ్రాజకుల చర్యలవలన వారికి తమ సనాతనధర్మములు క్షీణించ వచ్చునన్న భావన కలిగినట్టున్నది. కాని పరివ్రాజకుల కార్యము లలో భాగము వహించి, సామ్రాజ్య మందత్యుత్తమ స్వామినిష్ఠా సేవ కులుగా సేవజేయుచున్న మహామాత్యులు జక్కనార్యులునూ, లక్కనా మాత్యులునూ యిటువంటి భీతికి చోటులేదని తమభక్త జీవనము ద్వారా చూపుచూ వచ్చుచున్నారు.

ఇటువంటి భీతి కవకాశములేదు. మేము మా వైయక్తిక జీవిత ములో సర్వధర్మములనూ సమాన గౌరవాదరములతో చూచుచున్నామను విషయ మీ సందర్భమున తమ కవగాహన చేయవలసి యున్నది. మేమీ ధర్మసామ్రాజ్యాధికార సూత్రములను చేబట్టి, 'సకల వర్ణా శ్రమ ధర్మ ప్రతిపాలకు' అను బిరుదును దాల్చినాము. అంతియకాదు. సామ్రాజ్యపాలన మందుననూ జాతీయతకవకాశ మివ్వక, అన్నిమతము లకునూ సంబంధించిన దక్షులగు యధికారుల సేవను సామ్రాజ్యమునకు కల్పించినాము. ఇందులకు మేము గురురాయలను భాండాగారాధిపతినిగా నియమించుటే నిదర్శనము. వారు వైష్ణవులుగా నుండి చంద్రికవి యను స్మార్తునిచే శ్రీ విరూపాక్ష స్థానమను కావ్యమును వ్రాయించి, మా కర్పించినారు. దీనిని పఠించినచో సామ్రాజ్య సేవలో ధర్మపరిభావము నశించినదని తెలియగలదు.

మేము శ్రీ పద్మభూషణ క్రియాశక్తి పండితులను గురువులుగా నెన్నుకొనిననూ, శ్రీరంగక్షేత్రపు శ్రీ తాతాచార్యులను కూడ గురువు

లుగా భావించి గౌరవించుచూ వచ్చినాము. వ్యక్తిగత జీవితములో నెంతయో నదే విధముగ సామ్రాజ్య సేవలోకూడ ఏ ధర్మము వైపు నకునూ మొగ్గక, ఏ మతబోధకుల దాసులమునూ గాక, సామ్రాజ్య మందలి ప్రజాకోటి నంతయునూ సత్యధర్మములతో పోషించుచూ వచ్చి నాము. ఇకముందుకూడ నిదే విధముగా నడచుకొనగలమని మాట యిచ్చు చున్నాము.

హరిహర పురమందు జరిగిన సంఘటనకు మన మెల్లరునూ అప రాధులమే ! అభిప్రాయ భేదములవలన జరిగిన యీ యపరాధమునకు ఏ వ్యక్తినీ-ఏ మతమునూ నేరమారోపించి శిక్షించుట సరికాదు. పరివ్రా జక మతాధిపతులగు శ్రీ శివయోగిగారు సెలవిచ్చినట్లు ఈ యకృత్యము నకై అపరాధులకు పశ్చాత్తాపము కలిగియుండిన జాలును. ఇకముందు హరిహరులలో భేదమును మరచి, అభేదానందమూర్తులై సర్వధర్మ సమన్వయ సాధనలో సామ్రాజ్య ప్రజకు మార్గదర్శకు లగుదురుగాక !" యని ఆనాటి సభ చాలించినాడు.

సార్వభౌముని వాక్కులు గోపరాజుకు సంతోషమును కలిగించి ననూ, ఎందులకో జక్కనాచార్యులకు మాత్రము సమాధానము కలుగ లేదు.

# 15

# జైత్రయాత్ర.

గోపరాజు విషయము యథోచితముగా పరిసమాప్తి నందిన పిమ్మట సామ్రాట్ ప్రౌఢదేవరాయలు తన దృష్టిని యింతకంటెనూ ముఖ్య విషయమగు బహమనీ సుల్తానుల సమరాహ్వానము వైపునకు మరలించి నాడు.

ప్రౌఢదేవరాయలు స్వభావత, శాంతిప్రియ సామ్రాట్టయిననూ యుద్ధమునకు సన్నద్ధుడు కావలసియే వచ్చినది. బహమనీ సుల్తానులు కాలు దువ్వి కయ్యమునకు వచ్చుచుండగా వారి నెదుర్కొనకపోయినచో రాష్ట్ర ఘాతుకము కాగలదు. అయిననూ అతనికి యుద్ధమువలన సంభవించు ధన-ప్రాణనష్టము లెంతటివో తెలియును. యుద్ధము వినాశమునకు దారి యనియూ, దానివలన శాంతి సుభిక్షములు నిలువవనియూ, ఇరుగు-పొరుగు రాష్ట్రముల భిన్నాభిప్రాయములను తుదముట్టించుటకు సమరమునకన్ననూ శాంతియుత సంధికార్యములే యోగ్యములగు పరిహార మార్గములనియూ వీరవిజయ సార్వభౌములు చెప్పెడివారు.

అది వారు మొదటి దేవరాయల కాలములో జరిగిన రాయ పరాభవము వలన గ్రహించిన పాఠము.అందులకనియే వారు తాము జీవించి యుండిన స్వల్పకాలములో శత్రువులగు బహమనీ సుల్తానులతో ఏ పోరాటమునకూ తలపడలేదు. వారితో మైత్రిని గలిగి యుండుటకై యిష్టములేక పోయిననూ ఓరుగల్లు ప్రదేశమును వారికప్పగించి దానిని తమ ఉభయరాజ్యముల ఎల్లయని ఒప్పుకొనినారు.

ప్రౌఢ దేవరాయలు శాంతిప్రియుడగుటచే యీ యొడంబడికను త్రోసి పుచ్చక పాలించుకొనుచూ వచ్చినాడు. కాని, యతని సత్త్వపరీక్ష యేమోనను నట్లు, బహమనీ సుల్తానుడగు అహమద్‌షా మరల యీనాడు విజయనగరము జోలికి వచ్చినాడు.

ఇతర ప్రభువుల వలె తొందరపడక ప్రౌఢదేవరాయలు చరిత్ర యొక్క యథార్థపాఠ మెరింగినాడు. దక్షిణాపథము నుండి యవనులను మూలోత్పాటనము జేసిననేగాని హిందూ సామ్రాజ్యమునకు మనుగడ లేదని భావించి, పూర్వరాయలు బహమనీ రాజ్య వాశనమునకై శాయశక్తులా ప్రయత్నించి, ఈ వ్యర్థ సాహసములో విఫలులైనారు. విజయనగర సామ్రాజ్యము స్థాపనమై ఒక స్థితికెట్లు వచ్చినదో యదేవిధముగ అదివరకే యవన సామ్రాజ్యమైన బహమనీ రాజ్యముకూడ దక్షిణాపథమున నొక స్థితికి వచ్చి నిలచినది. అదిబలముగా వ్రేళ్ళాని నిలచినదే గాక, ఉపేక్షించరానంత బలిష్ఠమైనది. విజయనగర రాజుల సామ్రాజ్య

విస్తరణకది ప్రబలమైన అడ్డుగా నేర్పడినది. ఈ సత్యమును గ్రహించలేక పూర్వ సార్వభౌములు చాలమంది బహమనీ సుల్తానులతో వైరమును సాధించుచూ వచ్చినారు. బహమనీ సుల్తానులూ, విజయనగర రాజులూ ఆగర్భ శత్రువులైనారు.

విజయనగర రాజులకునూ - బహమనీ సుల్తానులకునూ నడుమ జరిగిన పోరాటపు కథ దీనికి ప్రమాణమైనది. ఒక పర్యాయమువారునూ మరొక పర్యాయము వీరునూ యుద్ధములలో విజయులయ్యేడివారు. కాని ఎవరినెవరునూ పూర్తిగా జయించుటకుగాని, ఓడించుటకుగాని సమర్థులు కాలేకపోయినారు. ఈ విధముగా జరిగిన అంతఃకలహ, శత్రుత్వములతో ఆ ఉభయ రాజ్యయముల శాంతి సుభిక్షములకు భంగము వాటిల్లుచూ వచ్చినది.

బహమనీ రాజ్యము కేవలము చూపులకు భీకరముగా కనబడు యవనసామ్రాజ్యముకాదు. హసన్‌గంగు బహమనీచే స్థాపింపబడిన యా రాజ్యము దినదినమునకూ ప్రవర్థమానము కాసాగినది. గడచిన ఎనుబది యైదు సంవత్సరముల చరిత్రలో సమర్థులగు సుల్తానులెందరో దానిని పాలించినారు. వారిలో అల్లాయుద్దీన్ హసన్‌వంటి దక్షుడూ - దూరదర్శియూనగు సుల్తానునూ, మహమద్‌షావంటి వీరుడునూ, ఫిరోజ్‌షా వంటి రణరసికుడునూ గలరు. వీరందరునూ తమ సామ్రాజ్యమును తమత్యాగ, ధైర్య, సాహసములను భద్ర పునాదిమీద నిలువబెట్టినారు. అటువంటి సుస్థిరమైన సామ్రాజ్యము నొక్క దెబ్బతో గూలద్రోయుట సాధ్యము కానిపని.

తొలుదొల్త యవనులు విధ్వంసకులై దక్షిణా పథమునకు వచ్చినారు. ఇప్పుడు వారచ్చట ఒక సామ్రాజ్యమునే నిర్మించుకొనినారు. అల్లాయుద్దీను ఖిల్జీవలె కేవలము కొల్లగొట్టుకొని పోవుటకై వచ్చినవారు గాక, స్థిరముగా యచ్చటనే నెలకొనినారు. విజయనగర సామ్రాట్టులవలె సమర్థవంతమగు సైన్యమును సమీకరించి, సామ్రాజ్యమును విస్తరించినారు. వారిలో కొందరు ప్రజానురంజక పరిపాలకులైనారు.

ఇదంతయునూ గ్రహించిన ప్రౌఢదేవరాయలు యవనులనూ, వారి సామ్రాజ్యమునూ ఉపేక్షించు స్థితిలోలేడు.

ప్రౌఢదేవరాయలు వీరుడైననూ, రాజర్షివలె జీవించసాగినాడు. ఇస్లాము మతమును సమాన గౌరవముతో చూచునంత విశాల హృదయ మతనికి గలదు. దానిని తన ధర్మమునకు సోదర ధర్మమని భావించినాడు. వారు నిరాకార బ్రహ్మమును 'అల్లా' యని పూజించుచున్నారు; తాము సాకార బ్రహ్మమును 'సర్వాంతర్యామి' యని పూజించుచున్నాము. వారి మతధర్మమునకునూ, తమ మతధర్మమునకునూ గల భేదమింతియే! యని భావించినాడు. అవకాశము లభించినపు డంతయునూ యవనులను పురస్కరించసాగినాడు. తన సైన్యములో ముస్లిం విలుకాండ్ర నెంద రనో నియమించుకొనినాడు. వారికొరకై యొక ప్రార్థనా మందిరము— మసీదును కట్టించి యీయ వలయునను యాలోచన మతనికి గలదు. ఈ విధమైన సౌహార్ద్ర నీతి భావముతో ఉభయ రాజ్యములకునూ చిరంతన మైన శాంతి నెలకొనగలదని భావించినాడు.

ఇటువంటి సమయములో సుల్తాను అహమద్‌షా మరణించినాడు. అతడు విజయనగర రాజులమీద దండెత్తి వెళ్ళవలయునని సమర సన్నాహములు చేసుకొనుచూనే అస్వస్థతతో మంచ[illegible]ట్టి హఠాత్తుగా మర ణించినాడు. అతని కుమారుడగు అల్లాయుద్దీనుడు రెండవ అల్లాయుద్దీన్ పాదుషా యను అభిదానమున యిప్పుడు సింహాసన మధిష్ఠించినాడు. అతడు తన తండ్రి సంకల్పమును నెరవేర్చుటకై సమరదీక్షను గైకొని నాడు.

పూర్వమునుండియూ విజయనగర సామ్రాట్టుల వైభవమునూ, వారి సంపదయునూ బహమనీ సుల్తానులకు కంటగింపైనవి.

సుల్తాను మహమద్‌షా కాలము నందతడు తనను సంతోష పర చిన గాయకులకు తలకొక వేయి స్వర్ణవరహాల నీయవలసినదని విజయ నగర సామ్రాట్టులకు హుండీ లేఖ వ్రాసి, వారిచే యవమానితుడైనట్టుగా యిప్పు డల్లావుద్దీన్ పాదుషా అవమానము పొందదలచి, ప్రౌఢదేవ రాయల పశ్చిమ ఘట్టములనుండి అసంఖ్యాకములగు ఏనుగులను బట్టి

తెచ్చినాడను వార్త విని యతనికొక లేఖ వ్రాసి పంపినాడు. అందులో విజయనగర సామ్రాట్టులు తమతో యుద్ధమును తప్పించుకొనివలయు ననినచో. ఒక వేయి ఏనుగులను బహుమానముగా బంపవలయునని తెలియజేసినాడు.

ఇది విని ప్రౌఢదేవరాయలు నిప్పులు గ్రక్కినాడు. ఉన్మత్తుడైన ఆ యవనునకు-అల్లావుద్దీనుకు తగిన బుద్ధి జెప్పవలయునని నిశ్చయించి లక్కనామాత్యుల ముఖ మవలోకించినాడు.

"ప్రభూ ! మదోన్మత్తులగు నా సుల్తానులు, వారి పూర్వులగు మహమద్ షా సుల్తానులకు బుక్కరాయలవలన గలిగిన దుస్థితిని మరచి నట్లు తెలియుచున్నది. మన మా విషయము నెరుక పఱచుచూ కమ్మ వ్రాయుట మంచిది. దానికి వారేమి ప్రత్యుత్తర మీయగలరో చూచి, తదనంతరము వారిమీద యుద్ధమును ప్రకటించవచ్చును" అని తన యభి ప్రాయమును వెలిబుచ్చినాడు.

అమాత్యుల యభిప్రాయ మందఱకునూ ప్రియకరమైనది.

ఆ విధముగనే ప్రౌఢదేవరాయలు అల్లావుద్దీనునకు ఒక లేఖ వ్రాసి భటులచే పంపినాడు.

ఆ లేఖలో సార్వభౌముడు బుక్కరాయలవలన బహమనీ సుల్తానులకు జరిగిన పరాభవ కథను మనోజ్ఞముగా వర్ణించి—

"తాముకూడా యింతటి పరాభవమును నిరీక్షించుచున్నచో, విజయ నగరము జోలికి రండు !" అని హెచ్చరించినాడు.

ఈ ఉత్తరమునకు పిరికిపందయూ, మూర్ఖుడూ నగు అల్లావుద్దీను డదే విధమైన ప్రత్యుత్తరమును వ్రాసి పంపినాడు.

"మీరు మా పూర్వులకు జరిగిన యవమానమును జ్ఞప్తికి దెచ్చు నుత్సాహములో మీ పితామహులగు దేవరాయలకు, మా సుల్తానులగు ఫిరోజ్‌షా వలన కలిగిన రాయపరాభవ కథను మరచినారు కాబోలును ! ప్రాణమును కాపాడుకొనుటకై వారు తమ కుమార్తెనే మా వారికి విజయ వధువుగా సమర్పించవలసి వచ్చినది. ఈ విషయమును మీరింత త్వర లోనే మఱచిపోయినారా ? ఇప్పుడు పైతము మీ రాజ్యము జోలికి మేము రాకూడదనినచో మా యీ షరతులను మీరు సమ్మతించిన జాలును.

ఒకటి : మీరు నూతనముగా పట్టుకొనిన ఏనుగులలో ఒక వేయిం టిని బాగుగా అలంకరించి, మా పట్టాభిషేక కానుకగా సమర్పించ వల యును.

రెండు : మీ యాస్థానమున నున్న ఉత్తమ నర్తకీమణులను రెండువందల మందిని మా వద్దకు పంపవలయును.

మూడు : పట్టాభిషేక నిమిత్తమై పదివేలవరహాలను మీరు మాకు నజరానా నప్పగించి, మాతో మైత్రిని గలిగి యుండుటకై సంధిచేసుకొన వలయును.

ఈ పై షరతులకు మీరు సమ్మతించనిచో బహమనీ సుల్తానుల సైన్యములొక మాసము రోజులలో విజయనగరము నందు దండు విడ యుటను చూడగలరు."

ఈ పంక్తులు చదివి సాత్త్వికుడైన సామ్రాట్టునకుకూడ రక్తము వేడిక్కినది. అతడు బొడుగరచి నుడివినాడు :

"అక్కనామాత్యులుగారూ! ఈ ద్రోహి మనల నవమానించ వలయుననియే ఈ విధముగా లేఖ వ్రాసినాడని దోచుచున్నది. ఈ మదో న్మత్తునికి తగిన బుద్ధి గరపనిచో నేను ప్రౌఢదేవరాయలను గాను — ఈ వాహకునికి, చీరనుకట్టబెట్టి సుల్తానుని వద్దకు బంపుడు. అతని లేఖకు మన మిచ్చు ప్రత్యుత్తర మదియని తెలియజేయుడు" అని యాజ్ఞాపించి నాడు.

సార్వభౌముని యాజ్ఞమేర కా పత్రవాహకునకు చీరనుకట్టి వెను కకు బంపబడినది.

అల్లావుద్దీనుడిది జూచి కోపముతో పిచ్చివాడైనాడు.

"ఆ కాఫరుని పట్టి బంధించి, అతనికి దుర్గతిని కలిగించనిచో నే నల్లావుద్దీనుడనుగాను" అని ప్రతినబూని, విజయనగరము మీద దండెత్తి వెళ్ళుటకు తనసోదరుడగు మహమద్ ఖాన్ అనునతని కాజ్ఞాపించినాడు.

మహమద్ ఖాన్ అపార సైన్యములతో బయలుదేరి విజయనగ రము వద్దకువచ్చి విడిసినాడు.

అతని యాగమనమును గ్రహించిన సామ్రాట్ ప్రౌఢదేవరాయలీ దండయాత్రవలన విచలితుడుకాక, అతని నెదిరించుటకు తగిన సైన్యమును లక్కనామాత్యుల నేతృత్వము క్రింద పంపినాడు.

మహమద్ ఖాన్ రాకమునుపే లక్కనామాత్యుడు సైన్య సమేతుడై వచ్చి అతనికొరకయి నిరీక్షించసాగినాడు. ఇదిజూచి మహమద్ ఖానున కాశ్చర్యమైనది. సింగన దండనాయకుడు లక్కనామాత్యుల ఆజ్ఞ మేరకొక రహస్య లేఖనుతెచ్చి మహమద్ ఖానుకు సమర్పించినాడు.

దానిని మొహమద్ ఖానుడు త్వరత్వరగా జదువుకొనినాడు. అమాత్యులా ఉత్తరములో నీ విధముగ వ్రాసియున్నారు.

"మహా సైన్యాధిపతులగు మహమద్ ఖాన్ బహద్దరు గారికి,

లక్కనామాత్యుడు చేయువందనములు — నా యీ లేఖనుజూచి మీరు చకితులు కాగలరని నాకు దెలియును. కాని యిందున ఆశ్చర్యమేమియునూలేదు. ప్రస్తుత రాజకీయ పరిస్థితిలో మన ఉభయరాజ్యముల చిర స్నేహమున కేదియవసరమో దానిని గురించి నేనిపుడు మీకు తెలియజేయుచున్నాను.

మా సామ్రాట్టులు మీ తీర్థ రూపులవలెనే శాంతి ప్రియులనునది తెలిసియుండవచ్చును. మరియునూ యవన రాజ్యముల నడుమ ఏ పోరాటమునూలేక, మన రాజ్యములు మైత్రినిగలిగి యుండవలయునని కోరుచున్న విషయముకూడ తెలిసియుండునేమో!

సార్వభౌముల కోరికమేరకు యిపుడే రాయబారము జరుపుటలోని యుద్దేశ మేమనిన, మీసహోదరుని వలన మీకు కలిగిన అన్యాయమును చక్కబరచుటయె.

మీ యన్నయగు అల్లాయుద్దీన్ బహద్దరుగారు రాజ్యపాలనమునకే విధముగనూ తగినవారుకారు. వారు భీరువులూ, విలాస పురుషులూనైనారు. మిమ్ముల నీ యుద్ధమునకు పంపుటలోని రహస్యము మీకు దెలిసియుండదు. ఒకవేళ మాకు జయము లభించినచో, మా చేతినుండి తప్పించుకొని వెళ్ళి బ్రతుకవచ్చునని వారూహించియున్నారు. ఇటువంటి భీరువు పక్షమువహించి, అతని మాటలను నమ్మి మీరు మామీద దండెత్తి వచ్చినందుకు మాకు చాల ఖేదముగ నున్నది.

మేము బహమనీసుల్తానులతో పూర్వమునుండియూ మైత్రిని గలిగియున్నాము. మీ యన్నగారు కామినీ కాంచనములకొరకై యిపుడు కాలుదువ్వి కయ్యమునకు వచ్చియున్నారు. ఇటువంటి దుర్బలుడగు సుల్తానును మూలకు తోసి మీరు యవనసింహాసనము నధిష్ఠించవలయుననునదే మా యాశయము. మీ యన్నగారిని సింహాసన చ్యుతునిగా జేసి, దానిని మీరాక్రమించుకొనునట్లయినచో, మేము మీకు సాయపడగలము. మమ్ములను మీరు మిత్రులని నమ్మి, ఈ విషయమై మీ యాంతర్యమును తెలియజేయవచ్చును"

ఈ ఉత్తరమును చదువుకొని అతడు తన కనులను తానే నమ్మలేక పోయినాడు.

ఆ ఉత్తరములో నే యుత్ప్రేక్షయునూ లేదు. అది రాజధానిలో జరిగిన సంగతినే తెలియజేసినది.

మహమద్ ఖాన్ గుల్బర్గను విడచి వచ్చునపుడు అనుమానపడుచూ వచ్చినాడు. అతని మిత్రులగు యాస్థాన వజీరులూ, సైన్యాధిపతులూ అతనిని రాజధానియందే నిలుప బ్రయత్నించినారు. కాని సుల్తానుడు ఉద్దేశపూర్వకముగనే అతనిని రాజధానినుండి దూరముగా బంపినాడు. రాజధానిలో నుండినచో అతనివలన తన సింహాసనమునకు భంగము కలుగగలదని భావించి, యుద్ధపు నెపముతో విజయనగరముమీదకు పంపినాడు.

అహమద్ ఖానుని మరణానంతరము జ్యేష్ఠపుత్రుడను కారణముతో అల్లావుద్దీనుడు సింహాసన మెక్కిననూ, దానిని శత్రు హస్తగతము కాకుండా కాపాడుకొను శక్తి యతనికిలేదు. అతనికంటెనూ కనిష్ఠుడగు మహమద్ ఖానుడే సుల్తానగుటకు యోగ్యుడని ఆస్థాన వజీరులూ, సైన్యాధిపతులూ అభిప్రాయ పడినారు. కాని అహమద్ షా హఠాన్మరణమువలన సింహాసనము సులభముగా జ్యేష్ఠుడైన అల్లావుద్దీనునకు లభించినది.

దానిని భద్రతరము చేసుకొనుటకై ప్రయత్నించక అతడు తన కాలము నంతయునూ భోగవిలాసములలో గడుప నారంభించినాడు. మద్యపాయియూ, స్త్రీ లోలుడునూ నగు నతనికి రాజ్యపాలనమునం దాసక్తి

లేదు. అతని విషయములో వజీరులకూ, యితరోద్యోగులకూ గౌరవ భావము లేదు.

అందుచే తరుణము జూచి మహమద్ ఖానుడు తానే సింహాసనము నాక్రమించుకొన వలయునని యాలోచించసాగినాడు. అతనికి సైనికులు కూడా సహాయులై యున్నారు. కొంతమంది ఉన్నతోద్యోగులు కూడ అనుకూలురై యున్నారు.

కాని అతడు రాజధానిలో నిలచి, రాజ్యక్రాంతి నారంభించుటకు మునుపే అల్లావుద్దీను డతనిని విజయనగరముమీదికి బంపినాడు. శత్రువులు వచ్చిన ఈ సమయములో తమ యంతరంగపు వైషమ్యమును కొంతకాలము వరకునూ మరచి యుండవచ్చుననున దతని ఉద్దేశము. ఈ విషయము లన్నియునూ వేగులవారి వలన గ్రహించిన లక్కనామాత్యు డతి చాతుర్యముతో మహమద్ ఖానుని వశపరచుకొనుట కీ తంత్రము పన్నినాడు.

మహమద్ ఖాన్ స్వార్థపరుడునూ, దూరదర్శియూ నగుటచే తనకు లభించిన యీ సదవకాశమును తన పాలిటి భాగ్యోదయముగా నేర్పరచుకొనుటకు నిశ్చయించుకొనినాడు.

అతడు తన ఆంతరంగిక మిత్రులతో నాలోచించి, లక్కనామాత్యుల సలహా ప్రకారము నడచుకొనిన తన వాంఛితము నెరవేర గలదని గ్రహించినాడు.

కాని శత్రువులు తనను మోసగించి, బంధించుట కీ నాటక మాడుటలేదని దృఢపరచుకొనుటకై అతడు లక్కనామాత్యులను జూడ గోరినాడు.

"ఈ లేఖను మీ చేతి కెవరిచ్చినారు దండనాయకులూ ?"

"లక్కనామాత్యులే స్వయముగా వ్రాసి యిచ్చినారు ఖాన్‌సాహేబు గారూ !" అనినాడు సింగన.

"ఈ ఉత్తరము వ్రాయుటకు వారికేమి యధికారము గలదు?"

"సామ్రాట్టులు వారి కీ విషయములో సర్వాధికారముల నొసగి

వారి నిచ్చుటకు బంపియున్నారు ఖాన్‌సాహేబులూ ! ఈ యుద్ధ మల్ప విషయమునకై యల్పులు జరుపుచున్నారనీ, దీనినెట్లయిననూ తప్పించ వలయుననీ మా సామాన్తులు నిశ్చయించి, సింహాసనమునకు తగిన యర్హతగల మీతో నీ విషయమై సమాలోచించి, ఒక నిర్ణయమునకు వచ్చుటకై లక్కనామాత్యులకు సార్వభౌము లధికార మిచ్చినారు"

"ఈ విషయము మాకు దృఢపడవలయును"

"మీరు మా సైన్యాధ్యక్షులగు లక్కనామాత్యులను జూడగోరు చున్నచో వారిని మీరు నిర్దేశించిన స్థలమునకు దోడ్కొని రాగలను"

"అట్లే కానిమ్ము; వారిచ్చుటికి బహిరంగముగా వచ్చినచో మా సైనికుల సంశయమునకు కూడ కారణము కావచ్చును. రేపు సాయం కాలము మీ దండనాథులను ఈ శిబిరమున కావలనున్న శిథిల మంటపము వద్దకు ఛద్మవేషముతో గొనిరండు. నేను వారితో మాటాడి, నా నిర్ణయ మును తెలిపెదను"

"అట్లే కానిండ"ని సింగన దండనాయకుడు మహమద్‌ఖాన్‌వద్ద సెలవు గైకొని వెళ్ళినాడు.తన శిబిరమును చేరుకొనగనే యతడు లక్కనా మాత్యునితో జరిగిన విషయములన్నియూ నాద్యంతముగా వివరించినాడు.

# 16

# యుద్ధతంత్రము

లక్కనామాత్యుడు సింగన దండనాయకుని రాయబారము యశో వంతమైనందులకు సంతసించినాడు.

మరునాటి సాయంకాల మతడు మహమద్‌ఖానుడు నిర్దేశించిన శిథిల మంటపమునకు ఛద్మవేషధారియై వెళ్ళి,అతనికొరకై నిరీక్షించుచూ

కూర్చున్నాడు. సూర్యాస్తమయమైననూ మహమద్ ఖానుడుగాని, అతని యనుచరులుగాని అచ్చటికి రాలేదు. అందుచే లక్కనామాత్యుని కాందోళన జనించినది. బహుశః తననూ, సింగన దండనాధునీ మహమద్ ఖానుడు మోసగించి యుండవచ్చునా ? లేక మరల తమ మాటలను సందేహించినాడా ?

ఈ విధమైన యాలోచనలతో ఏమియునూ తోచక అతడు మహమద్ ఖానుని కొరకై నిరీక్షించుచూ కూర్చొనినాడు.

సంజచీకటు లలుముకొనుచుండగా ఎవరో ఒక ఫకీరు డచ్చటికి వచ్చుచున్నట్లు దోచినది. లక్కనామాత్యుడు రెప్పవేయక అతనినే చూడసాగినాడు. కాని గురుతుపట్టుటకు సాధ్యము గాకపోయినది. మహమద్ ఖానుకు మారుగా ఎవరో దారినవెళ్ళు ఫకీరు డచ్చట విశ్రమించుకొనుటకై వచ్చుచున్నాడేమోనను యనుమానము కలిగినది.

లక్కనామాత్యు డతనిని పరీక్షించి చూడగా, నతని చూపులలోని భావమును గ్రహించిన వానివలె ఫకీరు అనినాడు :

"సలాం ఆలేకుం !"

మంత్రముగ్ధునివలె లక్కనామాత్యు డా ఫకీరునకు ప్రతిసలాము జేసినాడు. తరువాత ఫకీ రచ్చటనున్న శిథిల కుడ్యముపై గూర్చొనుచూ-

"నన్ను మీ రీ వేషములో నిరీక్షించలేదు కదూ, దండనాయకులూ !" అని బిగ్గరగా నవ్వినాడు.

"ఎవరు, మహమద్ ఖానులా ?" లక్కనామాత్యు డాశ్చర్యమును ప్రకటించినాడు.

అతనికి హఠాత్తుగా మహమద్ ఖానుడు పరిచయమైనాడు. నిజమైన వేషములో వచ్చినచో తన సైనికులు గుర్తుపట్టగలరని అతడీ ఛద్మవేషములో వచ్చినాడు.

"తమవద్దకు వచ్చుట కాలస్యమైనది. ఉద్దేశ పూర్వకముగనే యాలస్య మొనరించితిని, ఈ వేషములో నన్నెవరునూ గుర్తించరాదని. ఎందుకనగా మన కార్యభార మంతటిది. ఈ గుట్టు రట్టయినచో ప్రమాద మేర్పడగలదు. మా సైన్యములో యింకనూ అల్లావుద్దీనుని పక్షపు దళ

పతులు చాలమంది యున్నారు. నేను వారి కనులుగప్పి రావలసి వచ్చినది" అని మహమద్‌ఖాన్ వివరించినాడు.

"అంతటి యాలస్యమేమియునూ కాలేదు ఖాన్‌సాహేబులూ! నావలన మీ కిబ్బంది కలిగియుండును; క్షమించుడు" అని లక్కనామాత్యుదనినాడు.

"తొందర కలిగినది మీకుగాని, నాకుకాదు. నేను మీ కోరికమేరకు సూటిగా మీ వద్దకు వచ్చుటకు సమ్మతించక, మిమ్ములనిచ్చటికి రమ్మనినాను"

"చింతలేదు-యిచ్చట మన మిరువురమే యున్నాము. హృదయము విప్పి మిత్రులవలె మాటలాడుకొన వచ్చును. అందులకీ ప్రదేశము ప్రశస్తముగా నున్నది"

వారుభయులూ మిత్రులవలె కూర్చొని అనేక విషయములను గురించి చర్చించినారు.

మొదట మహమద్‌ఖానుడు లక్కనామాత్యు నుద్దేశించి, సింహాసనమునకై జరిగిన రహస్య చర్చా విషయ మతనికెట్లు తెలిసినదని యడిగినాడు.

జవాబుగా లక్కనామాత్యుడు నవ్వి వూరుకున్నాడు.

"యుద్ధమునకై బయలుదేరి వచ్చిన నన్ను తమవైపుకు త్రిప్పుకొన వచ్చునని తమకెట్లు ధైర్యము వచ్చినది? నన్ను మీ రింతవరకునూ చూడకపోయిననూ, నావద్దకు మీరు స్నేహ రాయబారమును బంపుటకు కారణమేమి?"

"మీ పరిచయ మేర్పడుట నాకిదియే ప్రథమ పర్యాయమైననూ, మీమైత్రి, పౌరుషము, కార్యదక్షత, దూరదర్శిత్వములను గురించి నేను తెలిసినవారి నడిగి గ్రహించినాను. మీరు మా మిత్రులు కావచ్చునని ఊహించినాను. నా ఊహ అబద్ధము కాలేదు"

"మీరు నా ప్రశ్నకు జవాబు చెప్పలేదు"

"చెప్పవలసిన యవుసరములేదు. అది మీకే తెలియును. మా విషయమును మీరు తెలుసుకొనినట్టె, మీ విషయమునూ మేము గ్రహించి

నాము. ఇప్పుడు మనము వచ్చిన కార్యమును గురించి యాలోచించ వచ్చునా ?"

"యుద్ధమునకై వచ్చి, మీరు మాతో శాంతి మాటలెందులకు మాట్లాడుచున్నారు ?"

"మా సామ్రాట్టులకు యుద్ధమునకంటెనూ శాంతియే ప్రియ కరముగా నున్నది. వారు స్వభావతః శాంతిప్రియులు. మన ఉభయ రాజ్యముల అభ్యుదయము యీ శాంతిమీద ఆధారపడియున్నదని వారి భావన"

"అయినచో,మీరెందుల కిచ్చటికి సమర సన్నద్ధులై వచ్చినారు?"

"మీ సహోదరులు కేవలము కొన్ని ఏనుగులకొరకునూ, కొంత మంది విలాసినుల కొరకునూనై క్రిందటి శాంతియుత ఒప్పందము నుల్లంఘించి మామీదికి దండెత్తి వచ్చినారు.ఇప్పుడు వారికి మేము శాంతి మాటలు చెప్పినచో, యుద్ధమునకు భీతిల్లి చెప్పుచున్నామని భావించుట కాస్పద మేర్పడగలదు. వారి యహంకారము మరింత పెరగవచ్చును. అందువలననే అటువంటి పరిస్థితి యేర్పడినపుడు అక్కరకు రానిమ్మని యుద్ధసన్నద్ధులమై వచ్చినాము"

"మేము మీ మైత్రిని నిరాకరించినచో, పోరునకు సిద్ధముగా నున్నారా ?"

"ఖండితముగా ! ఎందుల కనుమానము ?"

"అనుమానమేమియునూలేదు, ఊరక యడిగితిని. నా శిబిరమునకు మీ సహోదరులను ధైర్యముగా బంపిన మీరిపుడు యుద్ధమునకు భీతిల్ల రని ఏనాడో గ్రహించితిని. అందులకనియే మీ మాటలకు గౌరవమిచ్చి, స్నేహసంధిని గురించి చర్చించుట కిచ్చటికి నిర్భయుడనై వచ్చితిని"

"మా మాటలకు మన్ననవిచ్చి, మిమ్ములను మీరు గౌరవించుకొని నారు"

"లేదు —నాపై నమ్మకముంచి, మీరు నన్ను మిత్రులని గౌర వించినారు"

"మనము వచ్చిన కార్యమును మరచి పరస్పరము పొగడుకొనుచూ కాలము గడుపుచున్నాము కదా !"

లక్కనామాత్యుడు విసుగుజెంది యనినాడు.

"అది మీ ప్రభావము !" అని ఖానుడు నవ్వినాడు. క్షణకాలము తరువాత మరల—

"బహమనీ సింహాసనమును లభింపజేయుట కెందుల కింత యుత్సాహమును కనబరచుచున్నారు ? నాలో మీరే సద్గుణమును కను కొనినారు ? తెలియవచ్చునా ?"

"వీరుడుగా నున్నవానికి వేరొక వీరుని గుర్తించుటంత కష్టతరము కానేరదు. అతడెప్పుడునూ పిరికిపంద సహవాసమును గోరడు. వారిలో మైత్రీభావమును గురించిన ప్రసక్తేరాదు"

"మా యందు మీకంత నమ్మికయా ?"

"ఔను ! మీలో యంతటిశక్తి లేనిచో, మీ తండ్రిగారు బహమనీ రాజ్య భారమును మీమీద మోపి వెళ్ళగలరా ?"

ఈ మాటలువిని మహమద్ ఖానుడు నిర్విణ్ణుడైనాడు. ఇంతవరకూ అత్యంత రహస్యముగా నుంచబడిన యీ విషయము లక్కనామాత్యుల కెట్లు తెలిసినది ? భూతభవిష్య ద్వర్తమానము లెరుంగు విద్య యతనికి దెలియునేమో ?

వాస్తవ విషయముకూడ లక్కనామాత్యులు చెప్పిన విధముగనే యున్నది. అహమద్ షా హఠాత్తుగా నస్వస్థుడై మరణశయ్యమీద నున్న పుడు మహమద్ ఖానును పిలిచి—

"బేటా ! ఈ బహమనీ రాజ్యమును అల్లావుదీనుని కప్పగించి వెళ్ళుచున్ననూ, దాని రక్షణాభారమును నీపై మోపి పోవుచున్నాను. ఆ భీరువు దీనిని రక్షించుట కసమర్థుడని ఏనాడో తెలిసిపోయినది. కాని జ్యేష్ఠపుత్రుడను కారణముతో సింహాసనమునకై అంతఃకలహములు జరుగరాదని—నేను దాని నతని కప్పగించినాను. అయిననూ దానిని రక్షిం చుట-నాశమొనర్చుట నీకు సంబంధించి యున్నది" అని చెప్పి, కుమా రుని నుండి వాగ్దానమును పొంది, అల్లా పాదములను చేరుకొనినాడు.

ఇదంతయూ తెలిసినవానివలె లక్కనామాత్యుడు చెప్పిన మాటలు విని మహమద్ ఖానుని కాశ్చర్యమైనది.

"దండనాయకులూ ! మీ గ్రిహణశక్తి యపూర్వముగా నున్నది. మీరు త్రికాలజ్ఞులవలె మాటలాడుచున్నారు. నామీద బహమనీ రాజ్య రక్షణా బాధ్యత గలదని మీకెట్లు తెలిసినది ?"

"ప్రజ లా విధముగా ననుకొనుట వినినాను—ఈ రాజ్యము మని నచో మీ బాహుబలము వలననే మనవలయును"

"ఓ! మీరు నన్నతిగా పొగడుచున్నారు"

"లేదు; యదార్థమునే చెప్పుచున్నాను"

"ఉండనిమ్ము. నేను మీకు స్నేహహస్త మిచ్చినచో, నాకు కలి గెడి లాభమేమి ?"

"బహమనీ సింహాసనము మీవశము కాగలదు"

"అది ఎప్పటికైననూ నావశము కావలసినదే కదా !"

"ఇప్పుడు మీ యధీనమున లేదుకదా ?"

"లేకపోయిననేమి ? తలచుకొనినచో దానిని నా స్వాధీనము చేసు కొనగలను"

"ఆమాట సత్యమే ! మీ బాహువుల కంతటి బలముగలదు—నాకు తెలియును. కాని ఈ కార్యమును సాధించుటకు మీరు మీనమేషములను లెక్కించుచున్నారు. ఎందులకో వెనుకాడుచున్నారు. మీకు కావలసిన సహాయము నేను చేయగలను. మీరు ధైర్యముగా సింహాసనమును స్వాధీనపరచు కొనవచ్చును"

"మీరు నిజమునే పలికినారు. సింహాసనమును నే నల్లావుద్దీను నుండి లాగుకొనుటకు వెనుకాడుచున్న దెందులకనగా, మా యంతః కల హములలో యీ రాజ్యము విజయనగరరాజుల పాలుకాగూడదని"

"ఆ విషయమును మేము గ్రిహించి యుండుటవలననే మీకు సాయపడుట కుత్సుకులై యుండుట"

"దీనివలన మీకు కలుగులాభమేమి ?"

"మిమ్మలను మేము నమ్మినట్టుగా, మీ సహోదరులను నమ్ముటకు వీలులేదు. వారు భీరువులు. స్వార్థమునకై రాష్ట్ర క్షేమమును మరువగల విషయ లంపటులు. అటువంటి వారితో మేము చేసుకొను ఏ స్నేహపు దొడంబడికగాని, శాంతి ఒప్పందముగాని దీర్ఘకాలము మనజాలదు"

"నానుండి మీరంతటి విశ్వాసమును వాంఛించుచున్నారా ?"

"ఔను ! మీతో మేము చేసుకొను శాంతియుతమైన సంధి మన ఉభయ రాజ్యముల సుఖమునకు పునాది కాగలదని నేనునూ, మా సామ్రాట్టులునూ నమ్మియున్నాము"

"పొరుగు రాష్ట్రమగు విజయనగర రాజులతో నాకునూ యుద్ధము చేయవలెననిలేదు"

"ఎందులకు ?"

"నేను విజయనగరము హిందూరాజ్యమను కారణముతో యుద్ధము చేయవలయునను రాజనీతిజ్ఞుల తెగకు చెందినవాడనుకాను. విజయనగరము కేవలము హిందూరాజ్యముకాదు—దానిలో అన్ని మతములవారునూ యున్నారు. వారి సైన్యమందునూ, రాజధానియందునూ ముస్లిములుకూడ నున్నారని తెలియును. అదే విధముగా మా రాజ్యమందుకూడ హిందువు లనేకు లున్నారు. మా యాస్థానమందలి పదవులలో చాలభాగము హిందువులే యలంకరించి యున్నారు. వారే నాడునూ మా నమ్మికను వమ్ము చేయలేదు. వారి సామ్రాజ్య నిష్ఠ ఏ మహమ్మదీయునికీ తక్కువైనది కాదని మాకు నికరముగా తెలిసినది. కేవలము జాతిమత దృష్టితో రాష్ట్రా రాష్ట్రముల సమస్యను చూచుట సరికాదని నా భావన. అట్లుచేయుట మన ఉభయరాజ్యములకు క్షేమకరము కానేరదు"

"మా సామ్రాట్టులుకూడ యీ విధమైన యభిప్రాయమును గలిగినవారే. వారి శాంతియుత సంధిని గురించి మీరు సరిగా అర్థము చేసుకొని యుండవచ్చునని నమ్మియున్నాను"

"ఔను. నేను వారిని బాగుగా అర్థము చేసికొనినాను - వారివలెనే నేనుకూడ యీ యుద్ధమువలన సుఖసంతృప్తులు, శాంతి జీవనము లభింపదని గ్రహించితిని"

"అయినచో, మీరెందులకు మీ తండ్రిగారి కీ శాంతిబోధ చేయలేదు ? స్వల్పవిషయములకై జరుగనున్న యీ యుద్ధము నెందుకు తప్పింప బ్రయత్నించలేదు?"

"ఇది ముఖ్యమైన ప్రశ్నయే ! నేనా విధముగా చేసియుండినచో మా తండ్రిగారు సమ్మతించెడివారుకారు. వారు సనాతనులు. విజయనగర-బహమనీ రాజ్యములు శత్రురాజ్యములనియునూ, హిందూ ముస్లిములాజన్మవైరులనియునూ భావించినవారు. ఆ భావనలోనే పెరిగి పెద్దవారైనారు. వారి యీ నమ్మికమీద వారి జీవనసౌధము నిలచియున్నది. ఆ సౌధమును నాశనమొనర్చుటకు నాకిష్టములేదు-ఒకవేళ ప్రయత్నించిననూ యీ కార్యము సఫలమయ్యేడిదికాదు. మా తండ్రిగారు నన్ను జాతిభ్రష్టుడైన కాఫరుడని భావించుట కవకాశ మేర్పడియుండెడిది. అందువలననే నేను ఊరకుంటిని."

"మీరెందులకు మీ యన్నగారి కీ విషయమై సలహా చెప్పలేదు?"

"వారు నా సలహాను పాటించగలరని యనుకొన్నారా ? నా ప్రతి మాటమీదనూ వారి కపనమ్మకమునూ-సందేహమునూ గలదు. హిందూ రాజ్యమగు విజయనగరము పరముగా ఏ మాట చెప్పిననూ అది వారి కపార్థమును కలిగించుట ఖండితము. అందువలననే నేను వారి యాజ్ఞను వర్తినై యిచ్చటికి వచ్చినాను"

"ఇప్పుడు మీ ప్రతిక్రియ ఏమి ?"

"ప్రతిక్రియ ఏ విషయముపట్ల యనెదరు ?"

"బహమనీ సింహాసనమును లభింపజేయుటకు మేము మీకు సాయపడినచో, మీరు మాతో శాశ్వతమైన శాంతియుత ఒప్పందమునకు భద్రపునాదిని వేయగలరా ?"

"తప్పక వేయగలను. సాయపడిన మిత్రులను మరచినచో కృతఘ్నుడను కాగలను"

"మీ మాటలు సత్యములా ?"

"అల్లాసాక్షిగా సత్యములు।"

"అయినచో, మీరు సమయము చూచి, మీ సహోదరులమీద దండెత్తి స్వతంత్రులని చాటించుకొనుడు. మీకు సాయముగా మేముండ గలము. మా మాటలను మీరు నమ్మవచ్చును."

"కానిమ్ము. ఈ విషయమై నేను నా ఆంతరంగిక మిత్రులతో సమాలోచించి, ముందటి కార్యనీతిని నిర్ణయించగలను. మీవలన కావల సిన సాయమును తెలుపగలను"

ఈ విధమగు దీర్ఘచర్చ జరిగిన తరువాత వారు ప్రాణమిత్రుల వలె ఒకరినొకరు కౌగిలించుకొని, అచ్చటినుండి తమ తమ శిబిరములకు వెనుదిరిగినారు.

అటు పిమ్మట మహమద్‌ఖానుడు తన యాంతరంగిక మిత్రులతో ఈ విషయమై దీర్ఘముగా సమాలోచించి, ఒక కార్యక్రమమును సిద్ధ పరచినాడు.

ఆ కార్యక్రమము మేర కతడు తన భ్రాతయగు అల్లాయుద్దీనున కొక లేఖవ్రాసి, బహమనీ సింహాసనము తనకు చెందవలయుననియూ, దానిని తీర్థరూపులగు తండ్రిగారు బ్రతికిపుండగా తన కప్పగించిరనియూ తెలియజేసినాడు. తన కోరిక మేరకు అతడు సింహాసనమును తన కప్ప గించనిచో, తాను బలాత్కారముగా దానిని స్వాధీనపరచుకొనునట్లు స్పష్ట ముగా వ్రాసినాడు.

ఈ లేఖ జూడగానే అల్లాయుద్దీనునకు పిడుగుపడినట్లయినది. ఇప్పు డతనికేమి చేయవలెనో తోచలేదు. మునుపే ఆస్థానోద్యోగులు, వజీ రులూ మహమద్‌ఖాన్ పక్ష మవలంబించివున్నారు. సైనికులందరూ అతని అభిమానులేయైనారు. తండ్రికూడా అతని విషయములో పక్షపాతము వహించి ఈ విధముగా చేసినాడు. పరిస్థితి యిట్లుండగా యిక అతని నుండి సింహాసనమును దక్కించుకొనుటెట్లు ?

పరిస్థితియొక్క గభీర స్వరూపము తెలియగనే అతడు గడగడ వణికినాడు. ఇప్పుడతనికి సింహాసనమును గాకపోయిననూ, తన విలాస

జీవితమును దక్కించుకొనుటకు ఒకే ఒక మార్గము గలదు. అది తన సహోదరుని ఏ విధముగానైననూ వశపరచుకొని, అతని విశ్వాసమున పాత్రుడగుట. ఈపని అనుకొనునంత సులభతరమైనదికాదు.

అత డీ విషయమై దీర్ఘముగా నాలోచించినాడు. ఇపుడు లక్కనామాత్యుని పన్నుగడను విఫలము జేయుటకు తాను ప్రౌఢదేవరాయలకు లేఖ వ్రాసి, అతని కృపాభిక్ష నర్థించు టొక్కటే తన సింహాసనమును, పదవిని, అధికారమును దక్కించుకొనుటకుగల దారియని గ్రహించి నాడు. వెంటనే ఒక లేఖవ్రాసి, విజయనగరమునకు బంపినాడు.

ఆ లేఖలో యీ మాటలు వ్రాసినాడు :

"సార్వభౌములూ ! తెలియకచేసిన నా యపరాధమును దయ యుంచి క్షమింపుడు. మా వజీరుల మాట లాలించి నేను చెడితిని. మా సహోదరుడగు మహమద్ ఖానుని పలుకులకు చెవియొగ్గి, మీపై కాలు దువ్వి కయ్యమునకు వచ్చినాను. దాని ప్రత్యక్ష ఫలితమును నే నిపు డను భవింపవలసి వచ్చినది.

ఇప్పుడు నాకుగల ఏకైక బంధువులు మీరొక్కరే ! మీరు నాకు సాయపడవలయును. మీసాయము లేనిచో నా రాజ్యమును మహదాకాంక్షియూ, సమర ధురంధురుడునూ నగు మహమద్ ఖాను దపహరించి, సింహాసన మధిష్ఠించగలడు. ఈ యుద్ధము నతడు కొనసాగించుట తథ్యము ! మన ఉభయరాజ్యముల శాంతిని-అభ్యుదయమునూ కోరి నేను మీస్నేహ హస్తమును యాచించుచున్నాను. ఈ ఆపత్సమయమున, నా సహోదరుని దురాలోచనమునకు విరుద్ధముగా మీరు నాకు సాయపడవలయును. శాంతికొరకయి మీరు విధించుషరతులప్రకారము నడచుకొనుటకు నేను సర్వదా సిద్ధముగా నున్నాను"

ఈ లేఖను జూచి ప్రౌఢదేవరాయలు తనలోనే నవ్వుకొనినాడు. తన హృదయమును బహిర్గతము చేయక, పత్రివాహకునితో —

"మీ సుల్తానుల కీ బుద్ధి యిదివరలో కలిగియుండిన బాగుండెడిది. ఇప్పుడేమి చేయుటకునూ కార్యము మించిపోయినది. మేము వారి కేవిధముగనూ సాయపడజాలమని చెప్పుటకు విషాదపడుచున్నాము" అనినాడు.

"హుజూర్ ! మీరే యీ విధముగా ననినచో, నిక మా సుల్తాను లను కాపాడువారెవరు ? ఇపుడు మీరు మా సుల్తానులను చేయి విడచి నచో, వారికి మరణమే శరణ్యము !"

హతాశుడై యనినాడా పత్రి వాహకుడు.

పత్రి వాహకుని మాటలకు ప్రౌఢదేవరాయల మానస మార్ద్రి మైనది. తన అప్రపర్యోగమున కది తగిన సమయమని గ్రహించి యని నాడు :

"వార్తాహరులూ ! ఇప్పు డీ విషయము మాచేయి మీరిపోయినది. మా లక్కనామాత్యులకు, మహమద్‌ఖానులకు సాయపడుమని ఆదేశించ దమైనది. ఈ యాజ్ఞను మేము మీ సుల్తానులకొరకై ఉపసంహరించు కొనుటకు వీలులేదు. అట్లు గావించినచో మేము వచన భ్రిష్టుల మగు దుము. మహమద్‌ఖానుల దృష్టిలో పిరికిపందలము కాగలము. దైవము కూడ యీ కార్యమును మెచ్చదు. కాబట్టి మేమొక సలహా చెప్పెదము. దానికి సమ్మతించునట్టయినచో, మేము మీ సుల్తానులకు ఒక్కింత సాయ పడవచ్చును.

"మేమిపుడు మహమద్‌ఖానులకు సింహాసనమును లభింపజేయి దుమని వాగ్దాన మిచ్చినాము. ప్రాణము పోయిననూ మేమీ మాటను నిల బెట్టుకొనవలయును. కాబట్టి, మీ సుల్తానులు మా సలహా ప్రకారము నడువనిమ్ము. మహమద్‌ఖానులకు వారు రాయచూరు ప్రాంత్యమును అప్పగించుమనుము. దానిని ఖానులు స్వతంత్రముగా పరిపాలించనిమ్ము. అన్నదమ్ములు భ్రాతృవాత్సల్యమును గలిగి, మన ఉభయరాజ్యముల చిర మైత్రికి భద్రపునాది నిర్మించుటకు మీరు తోడ్పడుడు"

సుల్తాను నీ సలహాకు సమ్మతింపజేసెదనని చెప్పి, ఆ రాయబారి యచటినుండి కాలు తీసినాడు.

రాజధానిని చేరుకొనగనే అతడు సుల్తాను అల్లాయుద్దీనునితో జరి గిన విషయములన్నియునూ జెప్పినాడు.

అల్లావుద్దీనున కిక అంతకంటెనూ గత్యంతరము లేకపోయినది.

ఏమైననూ కానిమ్ము. తగులనున్న దెబ్బను తప్పించుకొనినచో జాలునని యతడు సంతోషముగా ప్రౌఢదేవరాయల సలహాను స్వీకరించినాడు.

ప్రౌఢదేవరాయల కీ సంగతి తెలియగనే యతడు లక్కనామాత్యుని సముఖమునకు రావించుకొని. జరిగిన విషయములను వివరించి. అమాత్యుని సలహా కోరినాడు"

"ప్రభూ ! తమ సలహా సరియైనదే కాని. ఆ సహోదరు లిరువురునూ ఒక్కటై రే పొకనాడు మనమీదకు దండెత్తి వచ్చినచో మన యాశలు-ఆకాంక్షలు అన్నియునూ వమ్మగుటలేదా ? వారు మనతో శాశ్వత స్నేహసంధి జేసుకొని. ఆ ప్రకారము వరమకొనగలరను నమ్మిక యేమున్నది ?"

"ఆ విషయమై వ్యథజెంద బనిలేదు. మనభావము కేవలము సదుద్దేశ ప్రేరితమైనది. దీనిలో మనకే స్వార్థమునూలేదు. భగవదేచ్ఛయైనచో మన ఉభయరాజ్యములకునూ చిరంతనమైన శాంతి లభించగలదు. ఇది దైవేచ్ఛకురానిచో, యుద్ధము జరుగుట నెవరునూ తప్పింపలేరు"

—అని ప్రౌఢదేవరాయలు చెప్పగా. లక్కనామాత్యుడు విరుత్తరుడైనాడు.

తరువాత అతడు మహమద్ ఖానుని వద్దకు వెళ్ళి యీ సంగతు లన్నియునూ దెలుపగా నత డసమ్మతిని వ్యక్తపరచుచూ యనినాడు :

"దండనాయకులూ ! మీరు నన్ను సుల్తానునిగా జేయుదుమని మాటయిచ్చి. యిపుడు నడుదారిలో చేయి విడచెదరా ?"

"లేదు. ఖానుసాహేబులూ ! మేము మీ హితమునే కోరుచున్నాము. మీ తండ్రిగారికి మీరిచ్చిన వచనము పరిపాలన యగుట కీ యవకాశము కల్పించుచున్నాము. మీ రన్నదమ్ము లన్యోన్యులై. స్వతంత్ర రాజులుగా నుండినచో మన ఉభయరాజ్యములకు క్షేమ మేర్పడగలదు"

అని చెప్పగా మహమద్ ఖానుడు మారుపలుకలేదు. అయిననూ అతని కీ సలహావలన సంతృప్తి కలుగలేదని యతని వదనమే తెలుపుచున్నది.

ఇది గ్రహించిన లక్కనామాత్యు డతనిని సమాధాన పరచుట కై మరియొక మార్గ మవలంబించినాడు. అతడు సుల్తాను అల్లావుద్దీనును సముఖమునకు రప్పించుకొని, అతనికి జెప్పవలసిన బుద్ధి మాటలన్ని యునూ జెప్పి వశపరచుకొనినాడు.

లక్కనామాత్యుని సలహా ప్రకారము అల్లావుద్దీనుడు మహమద్ ఖానుని సముఖమునకు బిలిచి—

"తమ్ముడూ! నీవెంతటి ప్రతాపశాలి వనునది నాకు దెలియును. తీర్థరూపులైన తండ్రిగారు నీమీద ఎంతటి ప్రీతి-ఆదరమును గలిగి యుండిరో నెఱుంగుదును. నీ విషయమై యస్థానమందలి అధికారుల యొక్కయూ, ప్రజలయొక్కయూ అభిప్రాయమును సైతము గ్రహించి నాను. కాని నా యనంతరము నీ యధీనమగు యీ సింహాసనముకొరకై నీవు నాపై-నీ యన్నగారిపై కత్తిగట్టి, నిరపరాధుల రక్తమును ప్రవ హింప జేయుదువా? అట్లు చేయుటచే పూజ్యులగు తండ్రిగారి యాత్మకు శాంతి లభించగలదని భావించితివా? నీవు నా మాటను వినుము. నాపై కత్తిగట్టి సింహాసనమునకై పోరు సలుపకుము. ఎప్పటికైననూ అది నీదియేగదా! కావలయుననినచో యిపుడే దానిని నీకు సమర్పించుటకు సిద్ధముగా నున్నాను. ఆపై ఫకీరుడనై మక్కాయాత్రకు బయలుదేరె దను" అని చెప్పినాడు.

ఈ మాటలకు మహమద్ ఖానుని కను లశ్రుపూరితములైనవి. అత డన్నగారిని కౌగిలించుకొని, తన యపరాధమునకు క్షమాపణ గోరినాడు. అల్లావుద్దీనుడు సంతోషముగా నిచ్చిన రాయచూరు ప్రాంత్యమును తృప్తిగా గైకొని, దానికి మాండలీకుడైనాడు.

ఈ విధముగా ప్రౌఢదేవరాయలు లక్కనామాత్యుల బుద్ధి సూక్ష్మత, రాజకీయ తంత్రజ్ఞతల వలన, శత్రువులుగా వచ్చిన బహమనీ సుల్తానులను, మిత్రులనుగా మార్చివేసినాడు.

తాను రక్తమును ప్రవహింపజేయక సంపాదించిన యీ విజయ మును భద్రపరచుకొనుట కతడు నిశ్చయించినాడు. అందులకై యతడు తన సైన్యములో మరికొందర మహమ్మదీయ విలుకాండ్రను నియమించు

కొని. వారి కున్నతోద్యోగము లనుగ్రహించినాడు. వారికొరకై రాజ ధానిలో నొక సుందరమైన మసీదును నిర్మించి యిచ్చి. హిందువులవలెనే వారుకూడ తన విశ్వాసమునకు పాత్రులైనారని దానిమూలముగా వ్యక్తము చేసినాడు.

మహమ్మదీయ సరదారు లాస్థానమునకు వచ్చినపుడు సార్వభౌము డగు తనకు వారు శిరమువంచి నమస్కరించుటకు వెనుకాడుటను జూచి. వారి మనస్సంతోషమునకునూ, తన సర్వధర్మ సమన్వయదృష్టియొక్క నిదర్శనమునకునూ సువర్ణ పత్రములలో లభించిన పవిత్ర గ్రంథమగు ఖురానును తన సింహాసనము ముందుంచుకొనినాడు. దానికి నమస్క రించువారు సార్వభౌమునికి కూడ నమస్కరించినట్లయి, ఆస్థాన శిష్టా చారమునకు భంగము కలుగుట తప్పినది.

ఈ కార్యమువలన మహమ్మదీయులు సామ్రాట్టులపట్ల గౌరవాదర ములు కనబరచునట్లయిననూ, సంకుచిత స్వభావులగు కొందరు హిందు వుల కిదియంతయునూ వ్యతిరేకముగా దోచినది. ప్రౌఢదేవరాయలు బహమనీ సుల్తానులను వశపరచుటకై నొనర్చిన యీ కృత్యములను వారు తప్పుగా భావించి, సార్వభౌముడు చపలచిత్తుడని యనుకొనసాగినారు.

# 17

# డోలాయమానము

అటువంటి వారిలో సాళ్వ గోపరాజు కూడ యొకడు—

సామ్రాట్ ప్రౌఢదేవరాయలు బహమనీ సుల్తానులతో పీరుని వలె ప్రవర్తించి. రాయపరాభవమును తుడిచివేయుటకు మారుగా. లక్కనామాత్య, జక్కనాచార్యుల పలుకు లాలించి, యతనితో సంధి

జేసికొని, పిరికిపందవలెయై సామ్రాజ్యమునకు కళంక మాపాదించినా డని యత డనుకొనినాడు. ప్రౌఢదేవరాయలు సాధింప జూచుచున్న హిందూ-ముస్లిముల సఖ్యము గోపరాజు గగన కుసుమమని భావించి నాడు. బాహుబలముతో, శస్త్రాస్త్రముల సాయముతో తాము యవనులకు నేర్పుటకు వీలుగాని పాఠమును, శాంతి-సంధికార్యములతో సాధింప బ్రయత్నించు టతని దృష్టిలో స్వార్థసాధకుల మాటలువిని మోసపోయి, తన కర్తవ్యమును విస్మరించిన ప్రౌఢదేవరాయలు, వివేక శూన్యుడగు పిరికి సామ్రాట్టువలె దోచినాడు. ఇటువంటి సార్వభౌమునివలన తమ ధర్మ సంస్కృతుల మాట యటుండనిచ్చి — స్వదేశ, స్వాతంత్ర్యరక్షణ కూడ జరుగదని భావించినాడు.

ప్రౌఢదేవరాయల యీ విధమైన ప్రవర్తనను జూచి, మనసు విరచుకొనిన సాళువ గోపరాజునకు సార్వభౌముడు చేబూనిన వేరొక నిర్ణయ మతని మానసమును మరింత ప్రక్షుబ్ధ పరచినది.

లక్కనామాత్యుడు, గోపరాజువంటి నిస్పృహోయవ్యక్తి రాజధానిలో నుండుట సామ్రాజ్య భద్రతకు క్షేమకరముకాదని భావించి, యతనిని రాజధానినుండి దూరముగా నుంచుటకై యాలోచించినాడు. ఆలోచించి చివర కతనిని ముళువాయి రాజ్యమునకు సామంతునిగా చేయుటకు సార్వ భౌమునకు సలహా నిచ్చినాడు.

సామ్రాట్టు లందులకు సమ్మతించి, గోపరాజును రహస్యముగా పిలిపించి, అతని నిష్ఠాగరిష్ఠతకు మెచ్చి యతనికి ముళువాయి రాజ్య సామంత పదవి ననుగ్రహింపదలచినట్టు చెప్పగా, విని గోపరాజునకు కలిగిన సంతోషమునకు మేరలేకపోయినది.

సార్వభౌముల యభిప్రాయముపై నత డే ప్రతిక్రియయునూ వ్యక్తపరచక, నేరుగా తన యంతఃపురమునకు వచ్చి అన్ని విషయముల లోనూ తన కండదండగా నుండి, మంత్రివలె సలహా లిచ్చెడి సంగడి కాడగు సింగరాజున కీ సంగతిని తెలియజేసినాడు.

అంతయునూ విని సింగరాజు "మిత్రమా! ఇదియంతయునూ ఆ లక్కనామాత్య-జక్కన కుట్రవలె కనబడుచున్నది. రాజధానిలో నుండినచో మనవలన అపాయమేదైననూ సంభవించవచ్చునని భావించి, సామ్రాజ్య సేవానెపముతో మనలను వారు దూరముగా నుంచుటకు జూచుచున్నారు" అని పలికినాడు.

"మనము రాజధానిలో నుండినచో వారికేమపాయము రాగలదు?" గోపరాజు ప్రశ్నించినాడు.

"మనమున్నచో తమ మహదాశయము సఫలము కానేరదని ఆ సోదరులు భావించియున్నట్టు తెలియుచున్నది. తమ రాజ్యాపహరణపు యజ్ఞమును నిర్విఘ్నముగా నిర్వహించుటకొరకే వారు మనల నిచ్చటి నుండి దూరముగా బంప బ్రయత్నించుచున్నారు"

"ఏమీ! ఆ హెగ్గడదేవుని కుమారులు రాజ్యాపహార బ్రయత్నము జేయుచున్నారా?"

"ఔను, గోపరాజా! ఇదంతయునూ ఆ లక్కనామాత్య సోదరుల కుట్ర.ఆ హెగ్గడిదేవుని పుత్రులీ విజయనగర సింహాసనమును ఉపాయముగా కైవశమొనర్చుకొని, నూతన హొయిసల సామ్రాజ్య మొకటి స్థాపించి, దానికి తామే మూలపురుషులగుట కాలోచించుచున్నారు"

"ఏమీ, నష్టచేతనమైన హొయిసల సామ్రాజ్య పునర్నిర్మాణమా? ఆశ్చర్యము! పరమాశ్చర్యము!!"

"ఇందులో ఆశ్చర్యమేమియునూలేదు గోపరాజా! వారి హృదయాకాంక్ష నెరిగినవారి కిదియంతయునూ సువిదితమే! ఆ ద్రోహులు పైకి కనబడునంత మంచివారుకారు. కార్యసాధనకొరకై విరక్తుల వేషము ధరించి అధికారముననున్న స్వార్థపరులు! వారు హొయిసల విష్ణువర్ధనుని వంశజులను మాట మనము మరువరాదు. హొయిసల సామ్రాజ్య పతనముమీద నిర్మింపబడిన యీ విజయనగర సింహాసనమునకు మరల వారు హొయిసల వంశజులను తెచ్చు కుట్రలు పన్నుచున్నారు. మన మిప్పుడే యీ విషయముపట్ల జాగ్రత్త వహింపనిచో, సార్వభౌములకు

ప్రాణగండము సంభవించగలదు. పూజ్యులగు విద్యారణ్య మునీంద్రులు నిర్మించిన యీ సామ్రాజ్యము నాశమై, మరల అన్యులపాలు కాగలదు"

"సింగరాజా! ఏమి నీ మాటలు? హొయిసల రాజ్య పునర్నిర్మాణమా? అది కలలోని వార్త. హొయిసల ప్రభువు ముమ్మడి భళ్ళాణుడు మధురవద్ద యవనులపై దండెత్తి, సమరాంగణమున అసువులను గోల్పోయిననాడే హొయిసల సామ్రాజ్యము పతనమై, అపుడే విజయనగర సామ్రాజ్యము తలయెత్తినది. హొయిసల సామ్రాజ్యము దక్షిణాపథేతిహాసమునుండి నామావశేషమై, వారి సామ్రాజ్య లక్ష్మి విజయనగర రాజులను వరించినది. వారి స్వాతంత్ర్యభానుడు నూతన రాజ్యోదయముతో యస్తంగతుడైనాడు. హొయిసల వంశపు విరూపాక్షరాయలు విజయనగర సామ్రాట్టుల సామంతరాజై హొసపట్టణమున తన జీవిత శేషమును గడపు టెవరికి తెలియని విషయము? ఇట్లుండగా మరల విజయనగర సింహాసనముమీద హొయిసల సామ్రాజ్యలక్ష్మి యొక్క వైభవమా? అసంభవము! సింగరాజా, నీవు కేవలము పూర్వాభిప్రాయుడవై లక్కనామాత్యునిపట్ల యీ విధముగా భీతిని జెందియున్నావు. ఇందున నేమాత్రమునూ సత్యములేదు. ఇటువంటి కుట్రలకు మనము భీతిల్ల పనిలేదు"

"ఒకవేళ విజయనగర సింహాసనముమీద హొయిసల రాజులు గూర్చొనుట సంభవమైననూ, హొయిసల గోత్రజులైన ఈ లక్కనామాత్యుడే ప్రౌఢదేవరాయలను మూలకుద్రోసి, సింహాసనము నాక్రమించుకొన వచ్చునుకదా? ఇది యసంభవమని చెప్పుటెట్లు? వారిపుడు మన విషయములో సార్వభౌముని మనసును విరచినారు. లేని భీతిని కలిగించినారు. అపనిందలను మోపి, రాజధానినుండి మనలను దూరముగ నుంచుటకు బ్రయత్నించుచున్నారు. వారేదో ఘనోద్దేశమును మనసున నిడుకొనియే యీ ప్రయత్నములన్నియునూ జేయుచున్నారని నాకు దోచుచున్నది. తెలిసిన విషయము జెప్పినాను. ఆపైన నీయిష్టము" అని తన యసమ్మతిని వ్యక్తపరచుచూ నుడివినాడు సింగన.

"లక్కనామాత్య-జక్కనాచార్యు లెంతటి స్వార్థపరులైననూ, తమ నుద్ధరించి సామ్రాజ్యపాలనా సూత్రముల నప్పగించిన సామ్రాట్ ప్రౌఢదేవరాయలకు ద్రోహము దలచుచున్నారనిన, ఎందులకో నా మనస్సు ఒప్పుకొనకున్నది"

"అయినచో వారివలన సామ్రాజ్యమున కే యపాయమునూ లేద నియా నీ భావన ?"

"బహుశః వారు మహదాకాంక్షులైననూ, అన్నముబెట్టిన సార్వ భౌముల కన్యాయము దలచునంతటి ద్రోహులూ, స్వార్థపరులూ కారని నా విశ్వాసము"

"అయినచో, నీవు హరిహరపుర సంఘటన వింత త్వరలో మర చితివా ? ఆ లక్కన-జక్కన సోదరులు సంఘసంస్కరణ పేరుతో, పరివ్రాజక పరివారముతో కలసి వీరశైవ మతప్రచారమునకు బూనుకొని యున్న విషయమును మరచినావేమి? వారి మతప్రచారముతో సామ్రాజ్య మందలి యితర మతములకు గొడ్డలిదెబ్బ పడుచున్నది. అందుననూ వైష్ణవ ధర్మమునకు వారివలన నెక్కు డన్యాయము జరుగుచున్నదను సంగతి నీవు పూర్తిగా విస్మరించినావని దెలియుచున్నది"

"ఔను ! ఈ విరక్తుల చర్యలవలన వీరశైవ మతప్రచారము హెచ్చుగుచున్నది. ఇతర మతములు పగటి దీపములవలె శక్తి క్షీణము లగుచున్నవి"

"వారంతటితో తృప్తిజెందక, శాంతిప్రియ సామ్రాట్టులగు ప్రౌఢ దేవరాయలను తమ మతమవలంబింపజేసి, వారిని వెయ్యారుమంది విర క్తుల చర్యలకు నాయకులనుగా జేయవలయుననియునూ, యీ సామ్రాజ్య మును శైవ సామ్రాజ్యముగా రూపొంద జేయవలయుననియునూ సంక ల్పించి యున్నట్లు తోచుచున్నది. దీనిని మనమిపుడే అడ్డుకొనక పోయి నచో సామ్రాజ్యము పతనమగుట తప్పదు"

ఈ మాటలకు గోపరాజు కోపించినాడు.

"సింగరాజా ! నేను బ్రతికియున్నంతవరకునూ సామ్రాట్టులకూ, సామ్రాజ్యమునకూ వ్యతిరేకముగా జరుగు విద్రోహకర చర్యలను గమ

నించుచూ వూరకుండను. ఈ ధర్మ సింహాసనము వారి హస్తగతమగుట కవకాశ మీయను"

"ఆ ద్రోహు లీ విషయమును గ్రహించి యుండుటచేతనే మనల నుపాయముగ రాజధానినుండి బంపివేసి, తాము స్వార్థమును సాధింప నున్నారు"

"అయినచో, నేనీ సామంత పదవిని స్వీకరించను"

"సామ్రాట్టుల యాజ్ఞను ధిక్కరించెదవా ?"

"ఔను !"

"అట్లుచేసినచో, వారి విద్రోహమునకు ముందు మనము బలికా గలము. వారు మనలను మూలోత్పాటనము చేయవచ్చును—కాబట్టి మన మిపుడు ఉపాయముగా కార్యమును సాధించవలయును. అతిజాగరూకులై యుండవలయును. మన యీ యాలోచనలేవియునూ వెలికి చూపక, వారి విద్రోహ సంచాలకత్వము మనకేమియునూ తెలియనట్లు ప్రవర్తించి యిచ్చటినుండి నిష్క్రమించుదము. ముళువాయి రాజ్యమందు స్థిరపడిన పిమ్మట, వారి విద్రోహమునుండి సామ్రాజ్యమును రక్షించుటకు తగిన ఏర్పాటులను గావించుకొందము"

"ఔను, యిది తగిన సలహాయే !" అని గోపరాజు తల నాడించి నాడు.

"మనము ముళువాయి పట్టణములో నున్నచో, ఈ లక్కనామాత్యుల వేటకుక్కలనుండి తప్పించుకొనుట కష్టము. కాబట్టి తేకలు నగరమును మన రాజధానిగా జేసుకొని, అచటినుండి సామ్రాజ్యమున జరుగు చర్య ములను కనిపెట్టుదము !"

ఈ సలహా గోపరాజునకు ప్రియకరమైనది. ప్రౌఢ దేవరాయలకు లక్కనామాత్యులవంటి స్వార్థపరుల విద్రోహకర చర్యలింకనూ ఎందు లకు తెలియలేదు ? ఈ విషయములో సార్వభౌము డెందులకు జాగరూ కుడు కాలేదు ? అను సంశయములింకనూ అతనిని బాధించుచునే వున్నవి. ఈ సంశయములను సింగరాజువద్ద వెలిబుచ్చగా అతడందులకు మార్మిక మైన జవాబు నిచ్చినాడు.

"ఇందులో సంశయాస్పదమైన దేమియునూలేదు గోపరాజా! ఉన్మత్తునికి ప్రాపంచిక విషయము లేమియునూ తెలియవు. అతడు సదా స్వప్నజీవిగా నుండును. విషామిష సురభూత ధర్మములపట్ల వ్యక్తిలో తీవ్రనిష్ఠ యేర్పడినచో, అతడు వాటికి దాసుడునూ, ఉన్మత్తుడునూ కాగలడు. సామ్రాట్టులకు కూడ నిదియే దుర్గతిబట్టినట్టున్నది. పూర్వము కళ్యాణ పట్టణమునందు బసవేశ్వరులు సాధించిన ధర్మక్రాంతిని తాము కూడ యీ పరివ్రాజక పరివారముతో సాధించి, అజరామర కీర్తి భాజను లగుటకు వారు కోరివున్నారు. అచ్చట జరిగిన విధముగనే యిచ్చటకూడ ఒక అనుభవ మంటపమును నిర్మించి, ఆ శూన్యసామ్రాజ్య గద్దెనెక్కుట కాలోచించుచున్నారు"

"అయినచో, సామ్రాట్టులు శూన్య సామ్రాజ్య సింహాసన మధి ష్ఠించవలయునను పిచ్చి యాలోచనను మనసున నిడుకొని, విజయనగర సామ్రాజ్యమును వినాశమార్గమున ముందుకు గొంపోవుచున్నారనెదవా?"

"ఔను! సామ్రాట్టుల మేనయల్లుడునూ, సామ్రాజ్యమందలి గణ్యవ్యక్తియునూ, స్వామి నిష్ఠాసేవకుడునూ నగు నీవు యీ దుష్కృ త్యములను చూచుకొనుచూ వూరకుండరాదు. సామ్రాజ్య నౌకను యీ పెనుతుఫానునుండి తప్పించు ప్రయత్నము చేయవలయును. ఇది సామ్రాజ్యమందలి స్వామిభక్తి పరాయణు లందరి ప్రథమ కర్తవ్యము" అని సింగరాజు అర్ధగర్భితముగా నవ్వినాడు.

"సింగరాజా! అంతటి విషమ పరిస్థితి సంభవించినచో, నేను బలియై, ఈ సామ్రాజ్య వినాశనమును తప్పించుటకు ప్రయత్నించెదను" అని గోపరాజు ప్రతిజ్ఞ గావించినాడు.

అనంతర మతడు సార్వభౌముని సందర్శించి, తాను వారి యాజ్ఞ మేరకు ముళవాయి రాజ్యమునకు సామంతరాజుగా వెళ్లుటకు సంతోష ముగా సమ్మతించుచున్నట్టు తెలియజేసినాడు.

అతని సమ్మతిని విని ప్రౌఢదేవరాయలు సంతసించినాడు. ఎందుల కనగా, గోపరాజు ఆ పదవికి తన యసమ్మతిని వ్యక్తపరుచునేమోయని

అనుమానించి వుండెను గనుక యిప్పుడు నెమ్మదిగా నిట్టూర్పు విడచి నాడు.

అయిననూ వీడ్కోలిచ్చునపుడు ప్రౌఢదేవరాయలు గోపరాజా నేకాంతమునకు బిలిచి చెప్పినాడు :

"నాయనా, గోపరాజా ! నీతో హృదయము విప్పి మాటలాడ వలయునని చాలకాలముగా యనుకొనుచున్నాను. కాని అవకాశము లభిం చలేదు. ఇప్పుడు నీవు ఒక పెద్దరాజ్యమునకు సామంతుడవై వెళ్లు చున్నావు. నీవు నాకు చాల కావలసినవాడునూ, దగ్గర బంధువునూ యగు టచే యీ మాటలను చెప్పుచున్నాను. అన్యథా భావించకుము.

మా తీర్థరూపులు నీ తండ్రియగు సాళ్వ తిప్పరాజుయొక్క స్వామి భక్తిని చూచి, తమ పుత్రికనిచ్చి రక్తసంబంధమును చేసుకొనినారు. వారి జీవితకాలమంతయునూ చాల నిష్ఠతో సామ్రాజ్య సేవజేసినారు. నీవు వారికి తగిన పుత్రుడని పేరు గాంచవలయుననునదియే నా కోరిక !

బాల్యమునుండియునూ నాకు నీపై యభిమానము గలదు. దానికి కారణము; నీవు బాల్యమందే తలిదండ్రులను పోగొట్టుకొనిన అనాథ ఎనునది ఒకకైనచో, నీవు హరియాలదేవి-తిప్పరాజుల కుమారు డను నది వేరొకటి. నీవు సాళ్వవంశపు సింహకిశోరమను విషయముకూడ నాకుతెలియును. పైగా వీరుడునూ,సాహసియునూ, ధర్మ పక్షపాతియునూ నైనావు. నీలోగల ఏకైక యవగుణమేదనగా, దాపరికములేని హృద యము. ఇది కేవలము దుర్గుణము మాత్రమేకాదు — సద్గుణముకూడా కాగలదు. కాని యిది తెలిసిన స్వార్థపరులు కొందరు విన్ను తమ స్వార్థ మున కుపయోగించుకొనగలరు. అటువంటి వారిపట్ల నీవు యించుక జాగ్రత్త వహించవలయును. నీనుండి సామ్రాజ్యమునకు మహత్తర మైన సేవ లభించగలదని నేను భావించుచున్నాను. దానిని నీవు వ్యర్థము చేయవను నమ్మిక నాకుగలదు. వెళ్ళిరా నాయనా ! భగవంతుడు నీకు మేలు చేయుగాక !"

ఈ మాటలువిని గోపరాజునకు మేను పులకరించినది. అతడు

కూడ అదే విధమైన నిర్మల హృదయముతో సార్వభౌమునకు కృతజ్ఞత లర్పించుచూ ననినాడు :

"ప్రభూ ! తమ ఉపదేశమునకు నేను కృతజ్ఞుడను. మీకు నాయందుగల విశ్వాసమును సార్థకపరచుకొను శక్తిని భగవంతుడు నా కనుగ్రహించుగాక !" యని సామ్రాట్టులను తీక్ష్ణముగా చూచుచూ నుడివి నాడు.

"ప్రభూ ! తమరు నాపై పుత్రవాత్సల్యమునిడి బుద్ధిగరపినట్టే, నేనుకూడ నా యంతరంగమును తమముందు బయలుపరచుట కాశించు చున్నాను. అన్యథా తలచకుడు"

"లేదు, లేదు. నీ మనసునగల విషయమేదియో సంకోచపడక తెలుపుము"

"ప్రభూ ! తాము నన్ను ముళువాయి రాజ్యమునకు మండలాధి పతినిగా నియమించుటకు నిజమైన కారణమేమి ?"

ఈ ప్రశ్నవిని ప్రౌఢదేవరాయలు నవ్వినాడు.

"ఎందులకు ప్రభూ, నవ్వుచున్నారు ? నా ప్రశ్న అంతటి హేళ నగా నున్నదా ?"

"అయ్యో, పిచ్చివాడా ! కానిచో నేను నిన్ను 'నాయనా !' యని సంబోధించెడివాడనా ? నీవు వయసు వచ్చినవాడవైననూ కొన్ని విషయ ములలో యింకనూ బాలకుడవే ! నీ అభ్యుదయము నాకు సంబంధించి నది కాదా ? నీతండ్రి తిప్పరాజునకు నే నిచ్చిన వాగ్దానమును చెల్లించ నక్కరలేదా ? రాజ్యపాలనానుభవమును కలిగించిన పిమ్మట నిన్ను మండలేశ్వరునిగా నియమించుట నాకు భూషణము. నీవంటి ప్రభుభక్తి పరాయణుల సేవ కవకాశము కల్పించినట్టగునని, నిన్ను ముళువాయి రాజ్యాధిపతినిగా జేసితిని. ఇందున నే స్వార్థమునూలేదు-తెలిసినదా !" యని అతని వదనమును తీక్షణముగా నవలోకించి,మరల యించుక నవ్వి నాడు.

ఈ మాటలతో గోపరాజు తృప్తుడైనట్టు కనబడలేదు.

"ప్రభూ ! ఈ మాటలకు విశేషార్థమును కల్పించకపోయిననూ, నాకొక సంశయము పొడగట్టుచున్నది. ఈ ముళువాయి రాజ్యము లక్కనామాత్యుల మండలము. దానిని ప్రస్తుతము మాదన దండనాయకుడు పరిపాలించుచున్నాడు. అతని చేతినుండి దానిని తప్పించి, తెరకణాంబి కతనిని బంపి, ఆతని స్థానమున నన్ను నియమించుట కత దేమపరాధము చేసినాడో తెలియవచ్చునా ?"

"గోపరాజా ! దీనిలో నే దురుద్దేశమునూలేదు. నామాట నమ్ముము. ప్రస్తుతము తెంకణాంబి (తెంకణము ?) మండలమందు విద్రోహ వాయువు వీచుచున్నది. దాని నణచుటకు సమర్థులైన ముద్దన దండనాయకులను బంపివున్నాము. ఇది రాజకీయ కారణములకొరకై జరిగిన మార్పు అంతియే ! దీనిని నీవు అన్యథా భావింపకుము"

"అయినచో ఈ సలహా నిచ్చినవారు లక్కనామాత్యులా ?"

"ఔను ! ఎందులకు ?"

"ఊరక యడిగితిని-అంతియే !"

గోపరాజు వాగ్ధోరణికి ప్రౌఢదేవరాయలు చకితుడైనాడు. అతిదేమైననూ తనను సందేహించుచున్నాడా ?

"ఎందుకు నాయనా ? నీ మనసుననున్న విషయమేదియో స్పష్టముగా చెప్పుము"

"ప్రభూ ! వేరు విధముగా భావించకుడు. ఈ పదవి లక్కనామాత్యుల అనుగ్రహమో, శిక్షయో తెలియక అడిగితిని"

"ఎందులకట్లు అడుగుచున్నావు గోపరాజా !"

"నేను రాజధానిలో నున్నచో, తమ కడ్డంకిగా నుండవచ్చునని నన్ను అధికారమను పేరుతో దూరముగా నుంచుచున్నారను సంశయము కలిగినది-అందువలన యడిగితిని"

"నాయనా, గోపరాజా ! నీ మాటలు చాల విచిత్రములుగా నున్నవి"

"సత్యమెప్పుడునూ విచిత్రముగనే వుండును ప్రభూ। ఈ విరక్తు లందరునూ గలసి, మీ కండ్లలలో దుమ్ముకొట్టి ఏదియో స్వార్థమును సాధించుచున్నారని రాజధానిలో వార్త పుట్టినది. నా యభిప్రాయము సరి గానిచో సవరింపుడు"

నమత్రను నటించుచూ గోపరాజు అనినాడు.

"ఏమీ, విరక్త సన్యాసులవలన నాకు తొందరయా ? అబద్ధ మబద్ధము ! ! వారికీ రాజకీయములకూ ఏ సంబంధమునూలేదు. అదొక ధార్మికచర్య। ఆ విరక్తులు సర్వసంగ పరిత్యాగులు.వారి కే స్వార్థమునూ లేదు. ప్రజాకళ్యాణమే వారి పరమార్థము ! సమాజోద్ధరణమే వారి యాదర్శము !"

"ఈ విషయమై తామొక నిర్ణయమునకు రాకమునుపే ఈ విరక్త పంథకు సంబంధించిన వ్యక్తుల యధార్థ స్వరూప మరయు టగత్యము ప్రభూ ! ఈనాడు వారిని నమ్మి, రేపు పశ్చాత్తాపపడినచో ప్రయోజన ముండదు"

"గోపరాజా ! నీకు లక్కణామాత్య, జక్కణాచార్యులమీద ఎందు లకో సందేహము గలిగినట్లు తోచుచున్నది. నీ మనమున నున్నది దాచక స్పష్టపరచుము"

"మీరడుగుచున్నారు గనుక నేను వినిన విషయమును తమ చిత్తమునకు తెచ్చుచున్నాను. లేనిచో కర్తవ్యలోపము కలుగగలదు. ప్రభూ ! ఈ లక్కణామాత్యుడు మొదలగువారు విరక్తుల వేషములో స్వార్థమును సాధించుటకై ప్రయత్నించుచున్నారని రాజధానిలో ప్రజ లనుకొనుటను విన్నాను. తమ రీ విషయములో జాగ్రత్త వహించు టుత్తమము"

"వారు ఏ స్వార్థమును సాధింప బ్రయత్నించుచున్నారని నీవు చెప్పుట ?"

"నేను చెప్పుటకాదు ప్రభూ ! ఆ విధముగా ప్రజలనుకొనుటను విన్నాను. వారు విజయనగర సింహాసనముమీద.మరల హొయిసల వంశ మును స్థాపించు నాలోచన గలిగివున్నారని తెలిసినది. గనుక తమ రప్రమత్తులై యుండుట క్షేమము"

"గోపరాజా! నీ మాటలు చాల విచిత్రములుగా నున్నవి. ఒక్కటి యునూ నా కర్థమగుటలేదు. ఆ విషయమేదియో స్పష్టముగా తెలియ జెప్పుము. విజయనగర సింహాసనముమీద హొయిసల వంశజులను నిలుపుటకై లక్కనామాత్యులు ప్రయత్నించుచున్నారని నీకెవరు చెప్పినారు? ఇది నీ భావనకాదా?"

"ప్రభూ! లక్కనామాత్యులు హొయిసల విష్ణువర్ధనుని గోత్రజులని ప్రజలనుకొనుటను విన్నాను. విజయనగర రాజ్యము హొయిసల సామ్రాజ్యమును నాశమొనర్చి, దాని సమాధిమీద సౌధమై నిలచినదట. అందులకనియే ఈ సింహాసనముమీద హొయిసలులను నిలుపు ప్రయత్నము మీ కనులముందే సాగుచున్నదని విన్నాను. ఇది సత్యమో-అసత్యమో తెలియదు. వినిన విషయమును తమ కెరుకపరచితిని అంతియే"

"హొయిసల రాజవంశ మేనాడో అంతరించిపోయినది"

"మీరునూ, ప్రజలునూ అట్లే యనుకొనినారు. కాని అంతటి విద్రోహచింతన మింకనూ అండము రూపమున నుండగనే మీరు జాగ్రత్తపడుట మంచిదని కటువుగానున్ననూ యీ మాటలు తమకు తెలుపవలసి వచ్చినది"

"అయినచో లక్కనామాత్యులూ, మహామాత్యులగు జక్కనాచార్యులూ ద్రోహులని నీ యారోపణయా?"

"వారిమీద నేను నేరమును మోపుటలేదు ప్రభూ! ప్రజ లావిధముగా యనుకొనుటను విని వారి యభిప్రాయమునే మీ ముందుంచినాను"

ప్రౌఢదేవరాయలు గోపరాజును జూచి తిరస్కారభావముతో ననినాడు.

"చాలింపుము గోపరాజా! నీ వ్యర్థప్రలాపము లిక వినలేను. పరమ స్వామిభక్తి పరాయణులమీద నీవు లేని నిందను మోపుచున్నావు. ఎవరో స్వార్థపరు లీ సంశయమును నీకు కలిగించి యుండవచ్చును. ఇకపై ఆస్వామి నిష్ఠాగరిష్ఠులమీద యంతటి దుర్భాషలాడకుము. అట్లు చేయుటవలన నాకు చాల బాధ కలుగగలదు"

—అని పలికి గోపరాజును బంపివేసినాడు. గోపరాజు తనరొట్టె విరిగి నేతిలో బడినదని సంతోషించుచూ అచ్చటినుండి వెళ్ళిపోయినాడు.

180

# 18

# సంశయ బీజము

సాళ్వ గోపరాజు వచ్చి వెళ్ళిన తరువాత సామ్రాట్ ప్రౌఢదేవ రాయల మానసిక శాంతి నశించినది. అతని సందర్శనము సామ్రాట్టుల మీద ఊహించిన పరిణామమునే కలిగించినది. అతడు నాటిన సంశయ బీజము మొలకెత్తి, మోసులు తొడిగి విషఫలములను ప్రసాదించుట కెక్కువకాలము పట్టలేదు.

ప్రౌఢదేవరాయలు గోపరాజు చెప్పిన విషయములను గురించి చింతించి. సందేహస్పదుడైనాడు. ప్రశాంతమైన ఆతని మానసము సంశ యమను ప్రచండ మారుతము వీచి ప్రక్షుబ్దమునూ, అల్లకల్లోలమునూ యైనది.

అతడు తనలోతాను చింతించుచూ కూర్చున్నాడు. లక్కనామాత్యు డునూ, అతని భ్రాతయగు జక్కనాచార్యుడునూ తన ఉప్పతిని. తనకే ద్రోహము దలచుచున్నారా? విరక్తుల వేషము ధరించి వారు తనను మోసగించుచున్నారా? నయగారపు మాటలతో తనను వంచించి, సామ్రాజ్య సేవజేయు స్వామిభక్తి పరాయణులవలె నటించుచూ వారే స్వార్థమును సాధించుచున్నట్టు? గోపరాజనినట్టు వారు సింహాసనముమీద కన్నువేసి వున్నారేమో? హొయిసల వంశమును మరల విజయనగర ములో నెలకొల్పుట కాశించుచున్నారేమో? తనను మూలకుద్రోసి యీ సింహాసనమును తా మాక్రమించుకొనుటకై ప్రయత్నించుచున్నారేమో?

ఇటువంటి ప్రశ్నలు పుంఖాను పుంఖముగా ఆతని మానసాభ్ర మున తారకలవలె తళుక్కుమని మాయము కాసాగినవి. వీటికి సమంజస మైన సమాధానములు లభించలేమ. ఎంత యాలోచించిననూ లక్కనా మాత్య-జక్కనాచార్యులు తనను మోసగించిన సందర్భమేదియునూ

పొడకట్టలేదు. తనకు ద్రోహము తలపెట్టిన సంఘటనకూడ ఏదియునూ లేదు. వారి విరపరాధిత్వము తలపునకు రాగానే. అంతటి ప్రభుభక్తి పరాయణులను తాను నిష్కారణముగా సందేహించు చున్నందుల కతనికి పశ్చాత్తాపము కలిగినది.

కాని యివన్నియునూ కేవలమొక క్షణకాలము మాత్రమే। మరు క్షణములో మానసాకాశమున మరల సంశయ మేఘములు క్రమ్ముకొన సాగినవి. వారు నిజముగా విరక్తులునూ, పరివ్రాజకులునూ యైనచో, ఈ లౌకిక జీవనమ్ముయొక్క పదవీ వ్యామోహ మెందులకు? సర్వసంగ పరిత్యాగులగు సన్యాసులవలె వారెందులకు నిష్కామ కర్మ మాచరించ రాదు? తనను వారి కపటాచరణతో మోసగించుచున్నారేమో? ఏదియో అవ్యక్త స్వార్థమును దలపెట్టినారేమో?

ఉండవచ్చును. హోయిసల గోత్రజులైన వారి హృదయాంత రాళములో నున్న భావనలేవియో ఎరిగినవారెవరు? స్వార్థమునకై వారీ విరక్త జీవితమును గడపుచుండవచ్చునేమో? ఈ పరివ్రాజక చర్యలతో తనను సింహాసన చ్యుతునిగాజేసి, తామే దానిని వేదపీఠమును పేరున— అధిష్ఠించుటకై ఎత్తులు వేయుచున్నారేమో?

ఈ విధముగా ఆలోచించిన కొలది ఎందులకో వారిమీద సంశయము హెచ్చుతూ పోయినది.

వారు నిష్కాములైనచో, తన హితాకాంక్షియూ, మేనయల్లుడునూ నగు గోపరాజు నెందులకు రాజధానినుండి దూరముగా బంపుటను సలహా నిచ్చెదివారు? మాదనకు బదులుగా వారతనినే తెంకణాంబికి బంపి యుండవచ్చును. కాని తమదియగు ముళువాయి రాజ్యమున కతనిని మాండలీకునిగా చూచించుటలో వారిస్వార్థమేదియో దాగియుండవచ్చును. తెంకణాంబి మండలములో జరిగినదను క్షోభ కేవలమొక నెపమై వుండ వచ్చునేమో? తనను మోసగించిపట్టే వారు గోపరాజును కూడ మోస గించుచున్నారేమో? ప్రౌఢదేవరాయలు శరీరమంతయునూ కనులు జేసుకొని ఆ యమాత్య సోదరుల చర్యలను చాల జాగ్రత్తగా గమనించి

చూచినాడు. కాని వారి ప్రవర్తనలో-పలుకులలో అతనికి ద్రోహముగాని మోసముగాని ఏమియునూ కనబడలేదు.

అందువలన ప్రౌఢదేవరాయలు తాను వారిని నిష్కారణముగా శంకించుచున్నాడేమోనని యనుకొన్నాడు. 'ఈ విషయమై వారితో మాట్లాడవలయును. తన సంశయము నంతయునూ వారిముందు వెలిగ్రక్కవలయును. అప్పుడు మాత్రమే తనకు మనశ్శాంతి లభించగలదు' అని భావించినాడు.

వెంటనే యతడు లక్కనామాత్యునీ, జక్కనాచార్యునీనూ తోడ్కొని రమ్మని యాజ్ఞాపించినాడు. వారు వచ్చునంతవరకునూ అచ్చట గల గ్రంథాలయమునకు వెళ్ళి, గ్రంథములను జూచుచూ కూర్చొనినాడు.

అచ్చట పురాతనములగు తాళపత్ర గ్రంథములను పెక్కింటి నొకటిగా కట్టి గూళ్ళలో పెట్టివున్నారు. వాటిలో సంస్కృతము, తెలుగు, కర్ణాటము మొదలగు భాషలలో లిఖింపబడిన గ్రంథము లెక్కుడుగా నున్నవి. అన్ని మతముల పవిత్ర గ్రంథముల ప్రతులుసైత మచ్చట గలవు. ప్రౌఢదేవరాయల మనసు పురాణేతిహాస ధర్మములవైపు మొగ్గుటచే నతడు వాటికి సంబంధించిన అమూల్య గ్రంథముల నన్నింటినీ సంగ్రహించి వుంచినాడు. ఈ గ్రంథములను భద్రముగా జూచుకొనుటకై సమర్థుడగు నొక పుస్తక భాండాగారాధిపతి నియమితుడైనాడు.

ప్రౌఢదేవరాయ లచ్చటికి రాగానే, శైవసాహిత్యమునకు సంబంధించిన ఉత్తమ గ్రంథములున్న గదిలోనికి వెళ్ళినాడు. అతని చేతికి శైవకవుల కృతులనేకము చిక్కినవి. ఒక్కొక్క పుస్తకమునే వరుసగా తీసి చూచినాడు. వాటిలో కొన్ని విరక్తుల కృతులుగూడ నున్నవి. సార్వభౌముడు వాటిని నిర్లక్ష్యపరచి, లక్కనామాత్య విరచితమైన 'శివతత్త్వ చింతామణి'ని, జక్కనాచార్య రచితమగు 'ఏకోత్తర శతతీర్థము'ను గ్రంథమునూ చేతికి తీసుకొనినాడు. వాటి నా సోదరుల ప్రతినిధులనునట్టుగా, చురచుర జూచినాడు.

అతని భావనా మానసమునకు లక్కనామాత్యు డెదుటకు వచ్చి నవ్వుచూ నిలబడివున్నట్టు గోచరించినది.

సామార్థ్యము లేమియని యడుగగా, లక్కణామాత్య డాకసము వైపు చేయి జూపినాడు.

ప్రౌఢదేవరాయలు తలపైకెత్తి చూచినాడు. అచట సప్తర్షి మండలము దృగ్గోచరమగుచున్నది. ఆ మండలమును రెప్పవేయక జూచినాడు. వాటి తేజోరాశి హెచ్చుచూ వచ్చినది. ముక్తి జీవనులెందరో అచట ధ్యానమగ్నులై కూర్చొనియున్నారు. వారిలో కొందరు ధర్మధేనువునుండి పాలు పితుకుతున్నారు.

ఆ పాలు పితుకువారిలో జక్కణాచార్యుడు కూడ నున్నాడు. అతడు ధర్మధేనువు స్తనములను పితికి, దానినుండి వెలువడిన వీర శైవామృతమును అచ్చట చేరిన భక్తకోటికి పానము చేయించుచున్నాడు. ఇది చూచి ప్రౌఢదేవరాయల కాశ్చర్యమైనది. అతడు వారిని మీరెవరని యడుగగా, వారు తాము ఏకోత్తర శతసంఖ్యలగు పరివ్రాజకులనీ, లోక ప్రజ కళ్యాణమున కావశ్యకమగు వీరశైవామృతమును సంగ్రహించు కార్యములో మునిగియున్నామనీ తెలిపినారు. వారు నిలబడిన చోటునుండి భువిమీదికి అమృతవాహిని ప్రవహించుచున్నట్టు దోచినది. అతనికి తాను కూడ నా యమృత వాహినిలో మునిగి, పునీతుడైనట్టుగా భావన కలిగినది.

ఇంతలో ఎవరో వచ్చి తట్టిలేపి, అతని భావసమాధిని భంగపరచినారు.

"ప్రభూ ! తమ యాజ్ఞ ప్రకారము సన్నిధికి సత్వరమే వచ్చినాము. విషయమేమియో ఆనతిండు"

లక్కణామాత్య—జక్కణాచార్యులు వినమ్రులై నిలబడి ప్రార్థించినారు.

వారి స్నిగ్ధవదనములను జూచి ప్రౌఢదేవరాయలకు వారి ననుమానించిన తాను అపరాధియని తలచి, అవమానభావముతో తలను క్రిందకి వంచి, ఏదియో ఆలోచించుచూ కూర్చున్నాడు.

"ప్రభూ ! సన్నిధానపు యాజ్ఞయైనది. ఎందులకో త్వరితముగా పిలుపంద జేయబడినది" అని మరల ప్రశ్నించినాడు లక్కణామాత్యుడు.

"ఓ. ఔను ! నేను మిమ్ములను గురించియే ఆలోచించుచుంటిని. కలలో మిమ్ములనే జూచుచుంటిని. ఇంతలో మీరే వచ్చినారు"

"అంతటి విషయమేమి ప్రభూ!" ఆతురతతో అడిగినాడు లక్కనామాత్యుడు.

"అమాత్యులూ ! ఆసీనులు కండు. నేను మిమ్ములను కొన్ని దినములనుండి సరిగా గమనించలేకపోయితిని. అందులకు తమను క్షమాపణ గోరుచున్నాను"

"తమవలన యంతటి అపచారమేదియునూ జరిగి వుండలేదు ప్రభూ! జరిగివున్నచో మా వలననే జరిగివుండవలయును. సన్నిధానమునకు అసంగతమును దలచివున్నచో, దానిని మాకెరిగించి పాదసేవకుల నుద్ధరించవలయును"

—జక్కనాచార్యు డనినాడు.

"జక్కనాచార్యులూ ! మీవలన అంతటి యపచారమేదియునూ జరుగలేదు. అపరాధమేమి జరిగివున్ననూ అది నాయిది. నేను గోపరాజు దుర్బోధలను విని, మిమ్ములను నిష్కారణముగా సందేహించి, వ్యథ జెందినాను. మీకునూ బాధ కలిగించినాను. నావలన జరిగిన యీ యకృత్యమునకు క్షమాపణ వేడుచున్నాను"

—అని గోపరాజు తనతో చెప్పిన మాటలన్నియునూ సంక్షిప్తముగా వివరించినాడు.

అంతయునూ విని, వారు మౌనమూర్తులైనారు.

"ఎందుల కమాత్యులూ, మారుపలుకరు ? నా ప్రవర్తనవలన విసుగు జనించినదా ?"

"మాకు విసుగుపుట్టలేదు ప్రభూ ! కాని ప్రాజ్ఞులైన తాము సామాన్య మానవులవలె వ్యథగా సంశయమునకు చిక్కి కొట్టుమిట్టాడు చుండుటను జూచినచో ఆశ్చర్యమగుచున్నది. తమవంటి వారికి కూడ మాపట్ల సంశయ మేర్పడినదనుచో.నిది యాశ్చర్యకర విషయముకాదా?"

"లక్కనామాత్యులూ ! తెలియక జరిగిన నా యపరాధమును క్షమింపుడు. నా ప్రశ్న కిపుడు సమాధానము జెప్పుడు. మీరు చూపిన

సప్తర్షి మండలములో నేను కనిన దృశ్యముయొక్క భావమేమి ? దాని సంకేతార్థమును వివరించుడు"

"ప్రభూ ! మీరు జూచిన దృశ్యమొక విధముగా నపూర్వమైనది. ఈ లోకమును తన లీలలకొరకై సృష్టించినఆ చిత్‌శక్తియొక్క ప్రణవ స్వరూపుడగు జగదీశ్వరుని యనుగ్రహ విశేషమే అమృతము. దాని నిచ్చెడు ధేనువులే ప్రపంచమందలి వివిధ ధర్మములు. ఆ మత ధర్మములను పితుకుచుండిన వారే ప్రపంచమున పుట్టిపోయిన మతగురువులు-మహర్షులు. వారు తమ ధర్మధేనువునుండి పితికిన దివ్యామృతమును తమ అనుయాయులకు పంచుచున్న దృశ్యమును తాము జూచినారు. ధేనువులు తాము తినెడి ఆహార భేదమువలననో, త్రాగెడి నీటివలననో లేక స్వభావ జన్య గుణవిశేషముల వలననో ఒక్కొక్క ప్రమాణములో ఒక్కొక్క విధముగా క్షీరము నీయవచ్చును. కాని అన్ని క్షీరములయొక్క గుణమునూ ఒకటే ! రుచి యందించుక భేదముండవచ్చును-అది దేశకాల పరిస్థితులనుబట్టి యుండును. కాని క్షీర వర్ణమెట్లు శ్వేతమైనదో, యట్లే సర్వమతములు బోధించు యమృతము - ధర్మామృతము ఒకే విధముగా నుండును. దానిని పానముజేసిన వారు, నిజమైన ధర్మస్వరూపము నెరుగగలరు. అంతటివారు భగవంతుని కరుణ నెరిగి, ధర్మముపేరున వృథగా ఘర్షణ పడరు. మీరు మా యందునూ, వీరశైవ మతధర్మ విషయమందునూ వ్యక్తపరచిన సందేహములకు మీ స్వప్నమే సమాధాన రూపమున నున్నది ప్రభూ !" అనినాడు.

"మిమ్ముల నపార్థము జేసుకొని, నేను చాల యపరాధము గావించినాను అమాత్యులూ !" ప్రౌఢదేవరాయలు పశ్చాత్తాపముతో అనినాడు.

"ఎందులకు ప్రభూ ! ఇపు డటువంటిదేమి జరిగినది ?"

"మీ నిష్ఠను నే ననుమానించితిని"

లక్కనామాత్యు డాశ్చర్య చకితుడై యనినాడు—

"ప్రభూ ! ఇంకనూ తమకు మా నిష్ఠలో యనుమానమున్నచో

దెలుపుడు. ఈ కంఠము నుత్తరించి, తమ పాదములపై బడవేయుదును" అని ఒరనుండి ఖడ్గమును సరాలున లాగినాడు.

"లక్కణామాత్యులూ ! ఇప్పుడు మీ నిష్ఠను పరీక్షించు నావశ్య కతలేదు. మీనిష్ఠ ఎంతటిదో నాకిపు దర్థమైనది. మీ ఖడ్గ ప్రయోగ మే మున్ననూ ద్రోహులపైననేగాని, మీమీదకాదు. దానిని మీరు ఒరలో జేర్చుడు" అని చెప్పి, సమాధాన పరచినాడు.

"ప్రభూ ! మేము విష్ణువర్ధనుని గోత్రజులమై పుట్టినది తప్పా ? వీరశైవ మతమును స్వీకరించు టపరాధమా ? శివభక్తులవలె జీవనము సాగించుచుండుట నేరమా ? వీటియందు మా యపరాధ మేమున్ననూ తెలుపుడు. మీరు విధించెడి శిక్షను సంతోషముగా యనుభవింపగలము"

"మీరు ఆ సాళ్వ గోపరాజుయొక్క మిథ్యాపవాదు వలన వ్యథ జెందకుడు. నాకు మీరెంతటివారో, మీనిష్ఠ ఎంతటిదో తెలియును. దీని కితరుల సాక్ష్య-ప్రమాణము లక్కరలేదు"

"అయినచో మీరెందులకు గోపరాజు మాటలను విశ్వసించినారు? మమ్ముల నా దినమే పిలిచి, యీ విషయమై ఎందులకు ప్రశ్నించలేక పోయినారు ?"

"సత్యము. ఈ విషయములో నే నపరాధమునే చేసితిని. అన్ని విషయములనూ మీతో చర్చించి, సమాలోచన చేయుచుండిన నే నిప్పట్టున తప్పుదారి త్రొక్కితిననియే చెప్పవలయును"

"పోనిండు ప్రభూ ! ఇప్పుడైననూ మీకు మా నిష్ఠపై నమ్మిక కలిగినది కదా; సంతోషము !"

—అనినాడు జక్కణాచార్యుడు.

ప్రౌఢదేవరాయలు తృప్తిగా నవ్వినాడు. ఆ మందహాసములో వారికి కావలసిన జవాబు లభించినది.

# 19

# పండితపరిషత్తు

ముళువాయి రాజ్యము విజయనగర సామ్రాజ్యమందలి సంపద్భరితమగు రాజ్యములలో నొకటి. దాని రాజధాని ముళువాయియైననూ, తేకల్ పట్టణ మా రాజ్యమునకు సంస్కృతీ కేంద్రముగా నున్నది. దాని పరిపాలకు లచ్చట నొక యంతఃపురమును నిర్మించుకొని వైభవముగా రాజ్యపాలనము చేయసాగినారు. ఏకోత్తర శతసంఖ్యలో దేవాలయము లచట కనువిందును కలుగజేయుచున్నవి. ఆ నగరము శిల్పకళకు పుట్టినిల్లు. దాని కిరువైపులా కోట ప్రాకారము లుండుటచే నది శతృదుర్భేద్యముగా నున్నది.

నగరముయొక్క ధార్మిక-సాంస్కృతిక జీవనమునకు నేత్రప్రియమైన శ్రీ వరదరాజస్వామి దేవాలయము పట్టణ మధ్యమున గలదు. దాని సమీపమున నున్న పూలపేట నగరమందలి విలాసినీ విలాసుల సంగమ స్థానముగ నున్నది. దేవాలయమున కిరువైపులా సంతపేట గలదు దానికావల శ్రీమంతుల విస్తరణలో నగరమందలి భాగ్యవంతులూ, రాజోద్యోగులూ, గణ్యవ్యక్తులూ తమతమ విలాస జీవితములను గడుపుచున్నారు.

దాని సమీపముననే గజాశ్వశాలలు, సైనిక శిక్షణాకేంద్రములూ, రాజుగారి యంతఃపురమూ, దాని నానుకొని ఉపవనమూ నున్నవి. అంతఃపురమునుండి చూచినచో శ్రీ వరదరాజస్వామి దేవాలయ కలశ గోపురములు కానబడును.

సాళ్వ గోపరాజు ముళువాయి రాజ్యమునకు సామంతరాజై రాగానే, తన రాజధానిని తేకల్ పట్టణమునకు మార్చినాడు. సింగరాజు అతనికి మంత్రిగా పదవీస్వీకారము చేసినాడు.

క్రొత్త రాజధానికి వచ్చిన వెంటనే గోపరాజు నగర శృంగారము నకు పూనుకొనినాడు. తన విద్రోహాచరణ గూఢచారులు గ్రహించ రాదని, వారి దృష్టిని వేరొక వైపునకు మరలించుటయే దీని యుద్దేశము. అంతియకాదు, తాను లక్కన సోదరులకు ప్రతికక్షిగా చేబూనబోవు విద్రోహాచరణలో బలాఢ్యు డగుటకూడ యత్యంతావశ్యకము. అందుల కనియే ఈ విధములైన కార్యములకు గడంగినాడు.

అతడు తేకల్ కోటను నూతనముగా విస్తరింప జేసినాడు. పేట లను, రాజమార్గములను విపలీకరించినాడు. దేవాలయమువద్ద నూతనముగా నొక పుష్కరిణిని నిర్మించి, దానికి గోపసాగరమని పేరిడినాడు. తన వైభవమునకు తగిన రీతిని వేరొక యంతఃపురమును కట్టించినాడు శ్రీ వరదరాజస్వామి దేవాలయ ముఖ మంటపమునూ, గోపురమునూ పున రుద్ధరించినాడు. పాలనాడు మార్కండేయుని కట్ట యందుండిన గండ భేరుండ స్తంభమును దెచ్చి ఆలయ ప్రాంగణములో స్థాపించినాడు. దాని సమీపమందు రాజ గంభీరమను కొత్త శమును కట్టించినాడు. పెద్ద పులులను తెప్పించి, పారువేట కనుకూల పరచినాడు.

పూర్వమునుండియునూ తేకల్ పట్టణమున జరుగు పారువేట — పులివేటా ప్రదర్శనము ఆ రాజ్య ప్రజల కొక యమృతవినోదము. శ్రీ వరదరాజస్వామి ఉత్సవ సమయమున ప్రభువులు, సమీపారణ్యమునుండి ఉపద్రవములు పెట్టుచున్న బెబ్బులులను పట్టితెచ్చి, ప్రజల సముఖమున వేటాడి చంపెడివారు. ఇది ప్రజలకెంతటి వినోదకరమైనదో, ప్రభువు లకు తమ బాహుబలమును ప్రదర్శించుట కంతటి యవకాశమును కలిగిం చెడిది. ఈ ప్రాచీన క్రీడా సాంప్రదాయము నాపుచేయక, గోపరాజు కూడ పారువేటను సాగించినాడు. అతడు తేకల్ పట్టణమునకు మండ లేశ్వరుడుగా వెళ్ళిన తరుణముననే ఒక బెబ్బులిని వేటాడి చంపి, పులి వేటకాడను బిరుదును ధరించినాడు.

గోపరాజుయొక్క ఈ ప్రజారంజక కార్యములనూ, పరిపాలన మునూ గూఢచారులవలన గ్రహించి, ప్రౌఢదేవరాయలు సంతోషపడి నాడు. లక్కనామాత్యుని ఎన్నిక సరియైనదని భావించి సమాధాన పడి నాడు.

"ప్రభూ ! గోపరాజులు తమ రక్తబంధువులు. అంతియగాక సామ్రాజ్య నిష్ఠలో ఎవరికినీ తీసిపోరు. కాని వారు స్వార్థసాధకుల చేతిలో కీలుబొమ్మలై, తమశక్తి సామర్థ్యములను వ్యర్థము చేసుకొని, తప్పుదారి త్రొక్కగల పరిస్థితి సంభవింపవచ్చును వారిని మనము సరిగా ఉపయోగించుకొనవలయుననినచో, సామ్రాజ్యమందలి నేదో యొక మండలమును పరిపాలించు బాధ్యత నప్పగించవలయును. ముళువాయి ప్రాంత్యపు రాజ్యము నప్పగించుదము. అచ్చటి పరిపాలనా వ్యవస్థ ఒక స్థితికి వచ్చియున్నందున గోపరాజుల కే తొందరయునూ కలుగనేరదు" అని గోపరాజును బంపుచున్నప్పుడు లక్కనామాత్యుడు చెప్పిన మాట లిపుడు సత్యములైనవి.

గోపరాజు తేకల్ పట్టణమునకు వచ్చిన యత్యల్ప కాలములోననే మిక్కిలి జనప్రియతను గాంచినాడు. ఈవార్త తన గూఢచారులవలన విని, యతని విద్రోహమను విషపుకోర లూడిసవని సామ్రాట్ ప్రౌఢ దేవరాయలు హర్షించినాడు.

ఈ విషయమై లక్కనామాత్యులతో ప్రస్తావించుచూ "అమాత్యులూ ! ముళువాయి రాజ్యమునకు వెళ్ళిన తరువాత గోపరాజు తన విద్రోహ చింతను మరచి,ప్రజోపకరకార్యములలో నిమగ్నుడై యున్నాడని విన్నాను తుంటరి ఏనుగులను వశపరచుకొనుటలో నిపుణులమైన మనము ఈ చిన్న రాజపుత్రుని బాగుగా వశపరచుకొనినాము. ఇక అతని వలన మనకే భయమునూలేదు. చివరకు గోపరాజు మా తిప్పరాజు పుత్రుడే యైనాడు" అనినాడు.

సార్వభౌముని పలుకులకు లక్కనామాత్యుడు నవ్వినాడు.

"ప్రభూ ! మనమిప్పుడే ఆ నిర్ణయమునకు వచ్చుటకు వీలులేదు. ఎందుకనగా, కొన్ని ప్రాణులకు వాలములందు విషముండును. పాముకు కోరలలో విషముండును. కాని మనుష్య డొకమారు ద్రోహియైనచో, అతని శరీరమంతనూ విషపూరితము కాగలదు. మనము గోపరాజు విషయములో జాగ్రత్తను వహించి వుండవలయును. అత డా సింగరాజు సహవాసములో నున్నంతవరకునూ, మన మతనిని నమ్మి నిశ్చింతగా

నుండుటకు సాధ్యముకాదు. నీటిపాము వల్మీకమును జొచ్చిననూ, తెలియనివారు దానిని త్రాచుపామని భావించి భీతిల్లగలరు. ఇక కోడెత్రాచే పుట్టను జొచ్చినచో, దానివలన అపాయము లేదా? దానిని దూరము నుండి జూచుచూ, మన జాగ్రత్తలో మనముండుట మంచిది" అనినాడు లక్కనామాత్యుడు.

ఈమాట విని ప్రౌఢదేవరాయలు "అమాత్యులూ! మీకు పుట్ట దగ్గరనున్న పగ్గముకూడా పామువలెనే కనబడుచున్నది" అని హసించినాడు.

"ప్రభూ! ఒక పర్యాయము పాముపడగను పూలహారమని పట్టుకొనగా అది త్రాచుపామని తెలిసినది. మేము గండమునుండి తప్పించుకొనినాము. ఇక నిజమైన పామును పగ్గమని భ్రమించుటెట్లు సాధ్యమగును?"

"మన మీ కృష్ణ సర్పమునకు భీతిజెంద పనిలేదు. పాము విషమును హరించెడి గరుడమణి మనవద్ద నున్నది. అతని విద్రోహమునకు మనము బలికానేరము"

—అని, ఆత్మవిశ్వాసముతో ప్రౌఢదేవరాయ లనినాడు.

"ప్రభూ! కొన్ని విషసర్పము లీ గరుడమణికి కూడా లొంగవని వినివున్నాను. వాటిని దారికి తెచ్చుటకు గరుడుడే రావలసివచ్చును"

"సామ్రాజ్య లక్ష్మిని మీరు గరుడునివలె రక్షించుచూ కూర్చొనియుండగా, యిక యీ నిధి జోలికి వచ్చు ద్రోహు లెవరున్నారు?"

"సర్పభీతిగల మనుష్యుడు నిశ్చింతగా నిద్రించలేడట. మన మీ సాధ్వనికి బెదరుటలేదు. నిజమే! కాని మనము జాగ్రత్త వహించి వుండుట మంచిది. ఒకవేళ గోపరాజు మనమీద దండెత్తి వచ్చినచో, మేము గండభేరుండములై పోరాడగలము" అని లక్కనామాత్యు డుగ్గడించినాడు.

అటుపై వారి ప్రసక్తి రానున్న శరన్నవరాత్రోత్సవములపై మరలినది.

నవరాత్రి విజయనగర రాజుల పాలిటికొక పర్వకాలము. అది వారికి సంతోష-సంభ్రమముల నిచ్చు పండుగ. ఆశ్వీజ మాసములో వచ్చెడి ఈ పండుగ తొమ్మిది దినములవరకూ వరుసగా నిత్యమునూ జరిగెడిది. రాజధానిలోనూ-సామ్రాజ్యమందలి మూల మూలలలోనూ నవరాత్రోత్సవములను ప్రజలు వైభముగా జరుపుకొనెదరు.

విజయనగర సామ్రాజ్యము స్థాపన యగుటకు పూర్వ మానెగొంది నుండి యవనులను తరిమివేయుటకై హక్క-రాయ-బుక్క-రాయ సోదరులు రణదీక్షను స్వీకరించిన దీ నవరాత్రి సమయముననే। విజయదశమి నాడు వారికి వైరులపై అఖండ విజయము లభించినది.

ఆ పర్వదినమున దేశమున కేర్పడి యుండిన దాస్య శృంఖలములు తెగిపడి, ఆంధ్ర సామ్రాజ్యలక్ష్మి మరల సామ్రాజ్ఞిగా వెలసినది. యవనులవలన సంభవించిన గండమునుండి, దక్షిణాపథము విముక్తి నందినది. ఈ కారణములచే విజయనగర సామ్రాట్టు లీ నవరాత్రిని తమ రాజ్యముయొక్క బంధవిమోచనా దినముగనూ, స్వాతంత్ర్యోదయ దినముగనూ పరిగణించి, వైభవముగా నాచరించుచూ వచ్చినారు. దీనిని వారు తమ సామ్రాజ్యవైభవమును చాటునట్టి విశేషోత్సవముగా జరిపెడువారు.

నవరాత్రి ఆశ్వయుజ శుద్ధ పాడ్యమినుండి ప్రారంభమై విజయదశమి వరకునూ-పదిదినములు సామ్రాజ్యమందలి మూలమూలలలోనూ ప్రజలు పండుగ చేసుకొనెదరు. రాజధానిలో మాత్ర మీ పదిదినములొక పర్వకాలము. ఆ దినములలో ప్రతి దేవాలయమందునూ విశేషార్చనలు, ఉత్సవములు, అన్నదాన వస్త్రదానములు జరిగెడివి. సార్వభౌములు సరస్వతి, లక్ష్మి, కాళికలను విధ్యుక్తముగా బూజించి, విజయదశమినాడు ప్రజలకు శాంతి సుభిక్షముల సందేశ మిచ్చెడివారు. ఒక్కొక్క-సారి రణదీక్ష నిచ్చుటయునూ గలదు. ఈ నవరాత్రి సమయమున వారు ప్రజల కొరకై యనేక వినోదకృత్యముల నేర్పరచుచుందురు. దేశపు నలుమూలలనుండి వచ్చెడి చతురులగు యోధులచే గుఱ్ఱపుస్వారి, విలువిద్య, ఖడ్గవిద్యా ప్రదర్శనములూ, మల్లయుద్ధమూ తదితర మనోల్లాసకర కృత్య

ములూ జరుగుచుండెడివి. అదే విధముగా రాజధానికి వచ్చు పండితులూ, గాయకులూ, నర్తకీమణులు తమతమ ప్రతిభను ప్రదర్శించి, సార్వభౌముని నుండి సన్మానము పొంది వెనుదిరుగుచుందురు.

ఈ పర్యాయము లక్కనామాత్యుని సలహా మేరకు ప్రౌఢదేవరాయలు ఆంధ్ర కర్ణాట సాహిత్య గ్రంథములను రచించిన కర్తలను ఆస్థానమునకు బిలిపించి, వారిలో నుత్తమ కవులని తీర్మానించబడు వారికి కనకాభిషేకము చేసి, సన్మానించవలయునని నిశ్చయించినాడు.

ఉత్తమకవి నెన్నుకొనుటంత సులభతరము కాలేదు. ఈ కార్యమునకు ప్రౌఢదేవరాయలు ఆస్థాన పండితులచే నొక పరిషత్తును నియమించి, కనకాభిషేకమున కర్హులైన కర్ణాటాంధ్ర కవులలో నుత్తములగు వారి నెన్నుకొని, తనకు తెలియజేయవలసినదని యాజ్ఞాపించినాడు.

సామ్రాట్టుల యాజ్ఞమేరకు ఆస్థాన పండితులూ, విద్వాంసులూ అందరూ సభజేసి, శృంగార నైషధమును రచించిన శ్రీనాథుడే ఆంధ్రమున కవిశ్రేష్ఠుడని యందరునూ ఏకగ్రీవముగా తీర్మానించి, అతనిని కనకాభిషేకమునకు నెన్నుకొనినారు. కాని కన్నడ కవిశ్రేష్ఠు డెవరను విషయము పట్ల వారొక తీర్మానమునకు రాలేకపోయినారు, కన్నడ పండితులలో యీ విషయమై విపులచర్చ జరిగి, వాద వివాదములతో తుద కేదియునూ నిర్ణయము కాలేదు. ఇది తెలిసి ప్రౌఢదేవరాయలు లక్కనామాత్యులతో నొక దినము —

"అమాత్యులూ! కన్నడ సాహిత్యములో కనకాభిషేకమున కర్హుడగు మహాకవి యెన్నికను విద్వాంసు లింకనూ నిర్ణయించలేదా?" అని యడిగినాడు.

"లేదు ప్రభూ!" అని లక్కనామాత్యుడు బాధగా అనినాడు.

"ఎందులకు అమాత్యులూ! కర్ణాటమున కనకాభిషేకమున కర్హులగు కవిశ్రేష్ఠు లెవరునూ లేరా? అంతటి యుద్గ్రంథము లేవియూ నా భాషలో రచింపబడలేదా?"

— సార్వభౌము డుత్సుకతతో యడిగినాడు.

"ప్రభూ ! ఈ విషయమై విద్వత్సభలో అభిప్రాయభేదములు కలిగినవి. వారు రాజసన్మానమున కర్హుడగు కవి నెన్నుకొనుటలో ఒక నిశ్చితాభిప్రాయమునకు రాలేక వాగ్యుద్ధములతో కంఠశోషను కలిగించు కొనుచున్నారు"

"ఏమీ, మహాకావ్యము నెన్నుకొనుటంత కష్టతరమా ? ఆశ్చర్యము !" అని పలికి మరల —

"అమాత్యులా ! మహాకావ్యమనునది ఒక మహాకవి జీవిత మందలి తపస్సుయొక్క ఫలమని తెలిసిన వారు చెప్పుదురు. అది సమ కాలీన సాహిత్యమం దత్యుత్తమ కృతి. ఒక మహాకవి జన్మించుటకు ప్రజలు పుణ్యముచేసి యుండవలయును. ప్రజాకోటి పుణ్యగర్భమునుండి మహాకవి యవతరించును. ఆ యమరకవి కావ్య గంగా ప్రవాహములో మునిగి ప్రజలు సుసంస్కృతులు కాగలరు. అది ప్రజలను పునీతుల నుగా జేయును. ఈ విధముగా మహాకవి జగద్వంద్యుడగుచున్నాడు. ఇంతటి మహా కావ్యమును కుకవులు నిర్మించలేరు. 'నానృషిఃకురుతే కావ్యం' అనునట్లు, ఋషివంశ సంభూతుడు కానివాడు కవికాలేడు. మహర్షికాని వాడు మహాకవి కాలేడు. అది తన అంతస్సత్త్వ దీప్తిచే స్వయం ప్రకాశము గలిగివుండును. దానిని రచించిన కవి ధన్యుడు కాగలడు. ఆ కావ్యమును పొందిన జనత జన్మ తరించును. అంతటి సత్కృతి ప్రసూనము కన్నడ సాహిత్య నందనోద్యానమున యింకనూ వికసించలేదా ? లేక వికసించిననూ మందమతులు దానిని గుర్తించుటకు అసమర్థులై వున్నారా ?" విషాదముగా పలికినాడు ప్రౌఢదేవరాయలు.

"ప్రభూ ! తమ వాక్కు సత్యము. మహా కావ్యములను, మహా కావ్యముల తులామానముతోడనే తూచవలయును. మహాకవి జనుల యొక్క జీవనాడి. అతడు ప్రజాసాంస్కృతిక ప్రతినిధి. జాతిమతముల కృతక సంకెళ్ళతో నతనిని బంధించరాదు. కాని మన దురదృష్టముచే కన్నడ సాహిత్యములో జాతి మతముల సంకుచిత విమర్శతో ఒరపెట్టి

చూచి, మహాకావ్యములను పరీక్షించు ప్రయత్న మీనాడు జరిగినది. దీని వలన మహాకవికీ, ఆతని కావ్యమునకూ అన్యాయము జరుగగలదు."

"ప్రభూ! స్పష్టములగు నా వాక్కులను తమ రన్యథా భావింప కుడు. ఇది కేవలము నా వైయక్తికాభిప్రాయము కాదు. ఆ స్థానమందలి చాలమంది పండితుల అభిప్రాయము. అందువలననే యీ విషయమును తమతో విన్నవించుకొనుచున్నాను.

"ఆంధ్రకవి శ్రీనాథుని కవితా మాధుర్యముననూ, ప్రతిభ యందునూ సరితూగగల వేరొక కవి ఆ భాషయందు లేదని అందరునూ ఒప్పుకొనుచున్నారు. అతనిని మహాకవియని అంగీకరించి, కనకాభిషే కమునకు ఎన్నుకొనినారు. కాని మన దురదృష్టమువలన కన్నడకవిపట్ల యీ తీర్మానమునకు వచ్చుటకు మన పండితోత్తములకు సాధ్యముగాక పోయినది. ఎందువలన ననగా, వారిలో సాహిత్యకృతులకంటెనూ వాటిని రచించిన కవులయొక్క జాతిమతములు, నిర్ణయ విషయములుగా నున్నవి. ఈ దృష్టితో జూచినచో మన పండితులవలన కన్నడ సాహిత్యమునకు అన్యాయము జరుగుచున్నదని చెప్పవలసియున్నది"

"అంతటి అన్యాయమెవరికి జరిగినదో, స్పష్టముగా తెలుపుడు"

"ప్రభూ! పండిత పరిషత్తులో కొందరు కుకవులు వాగ్దేవికి జాతి-మతముల మైలను అంటగట్టుటకు ప్రయత్నించుచున్నారు"

"అంతటి వాణీద్రోహు లెవరు?"

"తమరు వేరుగా భావింపకుడు. విద్వత్సభలో చాలమంది సద స్యులు జక్కనాచార్యుల 'ఏకోత్తర శతతీర్థ'మను గ్రంథము కనకాభిషేక మున కర్హమగు కృతిరత్నమని తీర్మానించినారు. కాని వైష్ణవ పండితు లగు ముకుందపెద్ది, వృందాచార్య, చంద్రికవులు మొదలగు వారీ విష యమై భిన్నాభిప్రాయములను వ్యక్తపరచి, పదవిలో నున్నంత మాత్ర మున జక్కనాచార్యులు మహాకవియనీ, ఆతని గ్రంథము మహాకావ్య మనీ పరిగణించుట తగదని పట్టుబట్టినారు. ఈ విషయమై ఏ తీర్మానము నకునూ రాలేక, విద్వత్సభ దోలాందోళిత మానసయైనది. ఇక దీనిని తీర్మానించుటెట్లో ప్రాజ్ఞులైన తమరే సెలవీయవలెను"

"ఏమీ, ముకుందపెద్ద పండితులు-పొన్నలాదేవిని రక్షించిన సామ్రాజ్య నిష్ఠావంతులు, మీచే నుపకృతులైనవారు-ఇపుడీ విషయములో తమ ప్రతిఘటనను వ్యక్తము చేయుచున్నారా ? ఆశ్చర్యము ! పరమాశ్చర్యము !!"

"ఇందున ఆశ్చర్యమేమియునూ లేదు ప్రభూ! వా రుద్దండ పండితులే. సందేహములేదు ! కాని యిచ్చటికి వచ్చిన పిమ్మట వారికి సజ్జన మైత్రి లభించక వారి విద్వత్తంతయునూ అడ్డుదారి పట్టినదని తెలుపుటకు విచారించుచున్నాను. ఆ వృందాచార్యుడు వారిని నయగారపు మాటలతో వంచించి,అన్యాయముగా పాదొనరించుచున్నాడు" అని లక్కనామాత్యుడు విచారమును వ్యక్తపరచినాడు.

"ఆ వృందాచార్యునివలన యింతటి యనర్థము సంభవించినదా?"

"ఔను ప్రభూ ! ఈ వైష్ణవ బ్రాహ్మణుడే వాగ్దేవికి మతభేదము నంటగట్టు చున్నాడనిననూ తప్పులేదు. అతని నీచాభిప్రాయము నెరుంగుటకు తమ కీ సంఘటన యొకటిచాలును" అని యానాడు జరిగిన సంఘటను సవిస్తరముగా తెలియజెప్పినాడు.

కొన్ని దినముల క్రిందట ముకుందపెద్ద వృందాచార్యుని వెంట మహాకావ్య విషయమై చర్చించుటకు మహామాత్యులు జక్కనాచార్యుల మందిరమునకు వచ్చినారు.

ఆ సమయములో మహామాత్యులు తాను రచించిన ఏకోత్తరశత తీర్థమను గ్రంథమునందలి కొంతభాగమును శిష్యులకు చదివి చెప్పుచున్నారు. ఆ కావ్య పఠనానంతరము కొందరు భక్తులు సంతోషించి, ఆ పవిత్ర గ్రంథమును తలపై నిడుకొని ఊరేగించి, తమ హర్షమును వెలిబుచ్చినారు.

అప్పుడే అచటికి వచ్చిన ముకుందపెద్దయునూ-వృందాచార్యులునూ యీ కోలాహలమును జూచి అప్రతిభులై నిలబడినారు. భక్తుల కోలాహలము ముగిసిన పిమ్మట ముకుందపెద్ద మహామాత్యుల నుద్దేశించి "స్వామీ ! తమ మందిరముముందు ఏదియో కోలాహలము జరిగినట్టు

తోచుచున్నది. విషయమేమియో తెలియవచ్చునా?" యని చేతులు జోడించి అడిగినాడు.

"ఓ! అదియా? కొందరు భక్తులు మా ఏకోత్తరశత తీర్థ గ్రంథమును విని సంతసించి, నేను వద్దనుచున్ననూ నామాట వినక, ఆ గ్రంథమును తలపై నిడుకొని ఊరేగించినారు. ఇది ఏమి గొప్ప విషయమని అడుగుచున్నారు? అది యటుండనిండు, ప్రస్తుతము తాము వచ్చిన కార్యమేదియో సెలవిండు" అని జక్కనాచార్యు లనినాడు.

అతని మాటలను విని ముకుందపెద్ద :

"ఓ! నేను దానిని శివ సందోహమో లేక జన్మ కర్మోత్సవమో ననుకొన్నాను" అని వ్యంగ్యముగా నుడివినాడు.

ఈ మాటలకు సాధుస్వభావుడగు జక్కనాచార్యునకు కూడ కోపము వచ్చినది. అతడీ కటూక్తులకు మనసున బాధపడి—

"మీ భారత కథ చచ్చినవారి కథ, మా భక్తుల ఉత్సవముకాదు. ముక్తియను శిశువును భక్తకాంత ప్రసవించినది" అని అంతటి తిరస్కారము తోడనే జవాబిచ్చినాడు.

ఇది విని ముకుందపెద్ద మారుపలుకకపోయిననూ, వృందాచార్యునికి మాత్రము భారతము చచ్చినవారి కథ యని జక్కనాచార్యుడు దూషించు టవమానముగా దోచినది. అత డింటికి తిరిగివచ్చి, శివభక్తుడగు ప్రభుదేవుని వచనములను పరిహాసము చేయుటకొక నాటక మాడినాడు.

అతడునూ, అతని సంగడికాండ్రునూ కలసి, ఆస్థాన నట్టువరాండ్రగు మాలాదేవి, సీతాదేవి యను వారకాంతలచేత ప్రభుదేవుని వచనములను అందరికినీ వినబడునట్టు అభినయ పూర్వకముగా పాడించి, దానిని విని బిగ్గరగా నవ్వుటకు మొదలిడినారు.

నట్టువరాండ్రు అల్లమ ప్రభుదేవుని ఈ తత్త్వమును రాగయుక్తముగా పాడినారు :

"ద్విపాదపశు పదమస్తకమున ఏడువందలా దెబ్బదిమైదూ నాడు
లున్నవయ్యా.

ఆ నాడులలో నవరంధ్రిమ్ముల నాధుఁడున్నడయ్యా.

ఆ నాథుని హృదిరో నొక నాతిని గనుమయ్యా.

అనాతి కంఠమున పైజెప్పిన నాడుల భూషణగలవయ్యా.

గురు గుహేశ్వరా! నే కనిన సత్యమిది జనులకు చాటితి గను
మయ్యా!"

వృందాచార్యు డీ తత్త్వమునకు అశ్లీలమైన యర్థముజెప్పి శ్రోత
లను నవ్వించినాడు.

ఈ సమయము నందచటికి కార్యార్థమై వచ్చిన జక్కనాచార్యుని
సేవకు డొకడు యిది విని, 'శివ శివా' యని చెవులు మూసుకొని, వెను
దిరిగి వెళ్ళి విషయము లన్నియునూ తన యజమానికి తెలియజేసినాడు.

ఈ సంఘటనవలన జక్కనాచార్యుడు మిక్కిలిగా మనసు నొచ్చు
కొనినాడు. తమ సాయముతో పదవినిపొంది, సామ్రాట్టుల ఉప్పుతిని,
ఉన్నతిలోనికి వచ్చిన ముకుందపెద్దయూ, వృందాచార్యుడునూ యీ విధ
ముగ పరమత కవి గ్రంథము నవమాన పరచుటయా ? యని వ్యథజెంది
నాడు."

ఈకథ విని శివభక్తుడగు సామ్రాట్ ప్రౌఢదేవరాయలు "శివ
శివా !" యని చెవులు మూసుకొనినాడు. అనంతర మతడు, "పిషాక్కము
నికి మాయా మోహములను నింద యంటగట్టబడినది గదా !" యని
చింతించినాడు.

ఈ విషయ మంతటితో ఆగలేదు. సార్వభౌముడు శివభక్తుల నవ
హేళన జేసిన ముకుందపెద్ద,వృందాచార్యులను సముఖమునకు పిలిపించి
విచారించినాడు.

సామ్రాట్టుల మాటలకు వృందాచార్యుడు భీతిల్లక—

"ప్రభూ ! నాకు దోచిన యర్థమును జెప్పితిని. దానికి వేరు
గూఢార్థమున్నచో జక్కనాచార్యులను చెప్పమనుడు" అనినాడు.

ఇదివిని జక్కనాచార్యు డా అల్లమ ప్రభుదేవుని ఒక్క తత్త్వము

నకు రెండు ఘడియల కాలము, అష్టాదశమతముల వారునూ తల యూపునట్లు వ్యాఖ్యానమునేసి, అందరినీ సమాధాన పరచినాడు. ఈ వ్యాఖ్యానముతో శ్రోతలకు అల్లమ ప్రభు వెంతటి అనుభవజీవి యనున దర్థమై పశ్చాత్తాపపడినారు. ముకుందపెద్ద మాత్రము తన పట్టును విడువలేదు. దాని నతడు వైష్ణవ మతమునకు జరిగిన యపచారమని భావించినాడు. అందులకే యనినాడు.

"ప్రభూ ! నా భావము సరికాదనినారు. మీ పంపహరి యన పండితుల రగడలలో యీ భావమున్నది. అందుల కేమనెదరు ?"

ఈ మాటలకు జక్కనాచార్యుడు కోపపడక శాంతముగనే జవాబిచ్చినాడు.

"శివలింగము ధరించిన రుద్రాదులకునూ, శైవ కవులకునూ,హరి యజేంద్రాది మను, మునులకునూ వీరశైవ ప్రమథుల మహత్వము తెలియదు"

"మా భారతమును మరణించిన వారి గాథ యనినారు. పంపహరీశ్వర పండితుని పద్యమబద్ధ మనినారు. మరణించిన వారుగాక మరణము లేని వారి కథను, వీరశైవులు రచించిన మీ శివభక్తుల కథను తీసుకొని రండు" అని సవాలు చేసినాడు.

"కానిమ్మూ, తెచ్చెదను" అని జక్కనాచార్య డచటినుండి లేచి వెళ్ళినాడు.

ఇదంతయునూ జూచి ప్రౌఢదేవరాయలకు తాను కనకాభిషేకపు మాట ఎందులకు ప్రస్తాపించితినో యనునంత వ్యథ కలిగినది.

ఈ సంఘటన మింతటితో నిలుచునట్లులేదు. దీని పరిణామ మెంత ఘోరముగ నుండునో ! ఈ ఘటనతో సామ్రాజ్య ప్రజలలో మత సంబంధమగు వైషమ్యజ్వాల లెచ్చట ప్రజ్వరిల్లగలవోయని భీతిల్లినాడు.

అతడచటి నుండి బయలుదేరుచూ "ఈ మత వైషమ్యపు పిడుగు కేవలము రాజకీయములందే పడగలదని యనుకొన్నాడు. ఇపుడది సాహిత్య క్షేత్రమునకూడ బడినదని తెలిసినది. నిజముగా నిది సులక్షణము కాదు. రానున్న సమాజ పతనమునకు నాందీ సూచన !" అని నిట్టూర్చి నిష్క్రమించినాడు.

# 20

# కుమారవ్యాసుడు

కనకాభిషేకపు కావ్య నిర్ణయ విషయ మంతటితో ముగియలేదు. సామ్రాట్ ప్రౌఢదేవరాయ లనుకొని నట్టిది దైత్య స్వరూప మును దాల్చినది. ఈ విషయము నతడు మరచిననూ యితరులు మరువ లేదు. ఏమైననూ సరియే, తమ మతమువారి యొక మహాకావ్యమునకు కనకాభిషేకము జేయింపవలయునని శైవులునూ, తమ మతమందలి యొక సద్గ్రంథమునకు రాజ సన్మానము లభింపజేయవలయునని వైష్ణ వులునూ పట్టుబట్టినారు. మొదట యీ వివాదములో తాము జోక్యము కలుగజేసుకొనరాదని లక్కనామాత్యుడునూ, జక్కనాచార్యుడునూ నిశ్చ యించుకొనినారు. కాని ముకుందపెద్ద సవాలువలన తాము చావనివారగు- శివభక్తుల కథ యొకటి నవరాత్రి సమయమునకు తెచ్చి, సామ్రాట్టుల కప్పగించెదమని ప్రతినబూని నప్పడీ మత సంబంధమగు వివాదములో యిష్టములేక పోయిననూ వారునూ ప్రవేశించవలసి వచ్చినది.

నవరాత్రి వచ్చుట కిక మూడుమాసముల వ్యవధి మాత్రమే నున్నది. ఈ కాలవ్యవధిలో జక్కనాచార్యుడు తానొక శివకవిచే ఒక మహాకావ్యమును నిర్మింపజేసి తెచ్చి, సార్వభౌముల కప్పగించవలయును. ముకుందపెద్ద మొదలగు పండితుల సన్నిధిని చెప్పిన మాటను నిలబెట్టు కొన వలయును. లేనిచో సార్వభౌముని యెదుట అవమానభారముతో తలొంచవలసియుండును. శివభక్తులగు విరక్త- పరివ్రాజకుల విలువ ప్రజాదృష్టిలో పూర్తిగ నశింపు నందగలదు. దీని నే విధముగానైననూ తప్పింపవలయును-అని భావించి, జక్కనాచార్యుడు కనకాభిషేకమున కర్హమగు శైవకవుల కృతిరత్నము నొకదానిని వెతుకు ప్రయత్నములో నిమగ్నుడైనాడు.

ఇటు ముకుందపెద్ద, వృందాచార్యుడు మొదలగు వారూరక కూర్చొనలేదు. వారుకూడా తమ మతములోని యొక వైష్ణవకవిచే రచియింప బడిన ఉత్తమ కావ్యము నొకదానిని వెతుకు ప్రయత్నములో నున్నారు. ఈ సంఘటనను తమ వైయక్తికావమాన, పరాభవముల కంటెనూ, తమ మతమునకు జరిగిన యవమానమని వారునూ భావించినారు. తమ మత ప్రాశస్త్య మీ రాజ సన్మానముమీద నాధారపడి యున్నదని దలచినారు. అందులకై, తమ మానమును కాపాడగల మహాకవియొక్క కావ్యము నరయుటకు పూనుకొనినారు.

ఈ సమయములో వృందాచార్య దేదియో కార్యార్థమై గదగునకు వెళ్ళినవాడు, అచటనుండి తిరిగి వచ్చునపుడొక మహత్తర విషయమును సంగ్రహించుకొని వచ్చినాడు.

వృందాచార్యుడు శ్రీ వీరనారాయణస్వామి దర్శనార్థమై గుడికి వెళ్ళగా, నచట నొకవైపు ఒక భాగవత శిరోమణి కూర్చొని, ఆస్తిక మహాశయుల కొక గ్రంథమును చదివి చెప్పుచున్నాడు.

అతడు కుతూహలుడై అచటికివెళ్ళి, ఆ పఠించుచుండెడి కావ్యమేదియో యరయుటకై, ఒకచోట కూర్చొనినాడు. అది గదగు వీరనారాయణస్వామి భక్తుడని చెప్పబడు కుమార వ్యాసుడని ప్రసిద్ధి గాంచిన నారాయణయ్య యను నతడు రచించిన 'భారత కథా మంజరి' యని తెలిసినది. ఇది తెలియగనే వృందాచార్యుని మేను పులకలెత్తినది.అతడు శ్రద్ధగా యానాటి కావ్యభాగమును వినినాడు.

అది విదురుడు శ్రీకృష్ణునికి ఆతిథ్య మొసగు కథా భాగము. సహజముగా పరమ భాగవతోత్తముడగు నారాయణయ్య యీ కథా ఘట్టమును శ్రోతల మానసము ద్రవించునట్టుగా పారాయణము జేసినాడు. కావ్య పఠనానంతర మందరి కనులలోనూ భక్తి పారవశ్యముతో ఆనందాశ్రువులు చిందినవి.

వృందాచార్యుడు కావ్యపఠనము ముగిసిన పిమ్మట, నచటగల

యొక శ్రోత నుద్దేశించి, కావ్యమును గురించియూ తత్కర్తను గురించియూ విచారించినాడు. అతనివలన వృందావార్యుని కనేక వివరములు తెలిసినవి.

"స్వామీ! వారు కుమారవ్యాసులు! వారి నిజ నామధేయము నారాయణయ్య. కాని మేమెల్లరునూ అతనిని కుమార వ్యాసులనియే పిలుతుము. వారు వేదవ్యాసులవలె, కర్ణాట భాషయందు మహాభారత కథను హృద్యముగా రచించినారు. దానికి వారు 'భారత కథామంజరి' యని పేరిడిననూ అది శ్రీకృష్ణుని దివ్య చరితమునూ, ఆ మహాత్ముని లీలా మాహాత్మ్యములనూ కొనియాడునట్టి యొక పురాణగ్రంథము. దీనిని వినినవారు పునీతులగుట తథ్యము!" అని సంతోషముతో చెప్పినాడు.

"వీరెవరు? వీరి నివాసస్థల మెయ్యది?"

"వారిచ్చటికి సమీప గ్రామమగు కుక్కుటపురవాసులు. వారిది కరణీక వృత్తి. కాని వారికి బాల్యముననే వైరాగ్యము కలిగి సంసారమున తగులుకొనక, శ్రీకృష్ణుని పద సన్నిధికి తమ నర్పించుకొనినారు. శ్రీకృష్ణుని లీలామృతమును భక్తులకు పానము చేయించుటకై కంకణము గట్టుకొనినారు. అది మాభాగ్యము. వారి భక్తి అనుపమమైన కావ్య వాహినిగా ప్రవహించినది. ఈ కావ్య గంగా ప్రవాహములో మునిగినవారు పుణ్యాత్ములు కాగలరు" అని యతడు పలికినాడు.

"దీనిని రచించి యెంత కాలమైనది?"

"ఆ మహానుభావు లీ కావ్యమును రచించి యించుమించు రెండు సంవత్సరములగు చున్నది. వారు దీనిని రచియించుట కొక కారణము గలదు. ఒక పర్యాయము వారు వీరనారాయణస్వామి నర్చించుటకై తమ గ్రామమునుండి యిచ్చటికి వచ్చినారు. ఆనాడు దేవాలయములో ఏదియో విశేషోత్సవము జరుగుచున్నది. వారా నాటి బ్రాహ్మణ భోజన పంక్తిలో కూర్చొనగా, వారి ప్రక్కన కూర్చొన్న దరిద్ర బ్రాహ్మణునివలె గానుపించు నొక యతిథి నెవరో చాల అగౌరవముగా జూచినారట. తనకు జరిగిన యగౌరవమున కా వ్యక్తి కన్నీరుకార్చుచూ పంక్తిని విడచి లేచి

పోయినాడట. అతని పరివర్తన కాశ్చర్యపడి, నారాయణయ్యగా రతనిని వెన్నంటి వెళ్ళి సమాధాన పరచినారట. అపుడు వారి కాతడొక మహానుభావుడని తెలిసినది. అతడు మహాభారత మందలి అశ్వత్థామయట. మహాభారతము నతడు నిలుచున్నచోటనే అనర్గళముగా పఠించినాడట. దీనితో చకితుడైన నారాయణయ్యగారు వారిని గురువుగా భావించి, తమను శిష్యునిగా స్వీకరింపుడని ప్రార్థించినాడట. కానీ ఆత డందులకు సమ్మతించక అచటినుండి నిష్క్రమించినాడట.

"నారాయణగా రానాటి రాత్రి ఈ విషయమును గురించియే నాలోచించుచూ పరుండియుండగా వారికొక స్వప్నము వచ్చినదట. స్వప్నములో శ్రీ వీరనారాయణ స్వామియే ఆ బ్రాహ్మణుని రూపములో వచ్చి 'వత్సా! నీ భక్తికి మెచ్చితిని. నీవు నా యనుగ్రహమునకు పాత్రుడవైనావు. వేదవ్యాస రచితమగు మహాభారతమును నీవు పూజ్యులగు అశ్వత్థామ ముఖతః విన్నావు. దానిని నీవు కన్నడమున భామినీ షట్పదిలో రచియింపు'మని ఆజ్ఞాపించినాడట.

"స్వామీ! నేనెచ్చట? శ్రీ వేదవ్యాస మహర్షు లెచ్చట? వారి మహాకావ్యమును నేనెట్లు భాషాంతరీకరించగలను? నాకంతటి శక్తి గలదా? నే నెన్నడునూ కవిత్వము చెప్పినవాడనుకాను. అది నాచే నెట్లు సాధ్యమగును?" అని వారు బ్రాహ్మణ రూపములోనున్న వీరనారాయణస్వామి పాదములపైబడి ప్రార్థించిరట.

"ఈ మాటలకా బ్రాహ్మణుడు 'వత్సా! నీవు భయపడకుము. నీలో వ్యాసుల యంశమున్నది. వారి యనుగ్రహముకూడా గలదు. వారివలెనే నీవు పరిశుద్ధుడవు. నీవలన యీ కార్యము సాధ్యముకాగలదు. నీవు దలచినచో యీ యమర కావ్యమును భాషాతరీకరించ గలవు. నీవలన కన్నడ సాహిత్యదేవి తలయెత్తి నిలువగలదు. నీవు నూతన కావ్యసృష్టి కాదిపురుషుడవు కాగలవు. నీ వధైర్యపడక, కావ్యమునుకూడ నాకే సమర్పింపుము. నీ గంటము చివరన నిలచి నేనే యీ కృతిని రచియించెదను. నీవు కేవలము నా వ్రాయసకాడుగా నుండుము. తక్కిన

దంతయునూ నేను చూచుకొనగలను' అని అభయమిచ్చి తిరోగతుడయ్యె నట.

"నారాయణయ్యగారు కలవరపడి కనులుదెరచి చూచినారు. వారి కెవరునూ కనబడలేదు. తాము చూచినది కలయని తెలిసినది. అనంత రము నిద్రించుటకై ప్రయత్నించి, నిద్రించలేక నేరుగా ఆలయమునకు వచ్చి వీరనారాయణస్వామికి సాష్టాంగ నమస్కారము చేసినారు.అటుపై నచ్చటగల పుష్కరణిలో మునిగి, తడి వస్త్రములతోడనే స్వామి సన్ని ధిని గూర్చొని ఆ దేవదేవుని స్తోత్రము జేయుచూ, భక్త్యావేశములో గంటమును చేబూని కావ్యమును రచియించుటకు పూనుకొనినారు. ఈ విధముగా వారు ప్రతిదినమునూ పుష్కరణిలో స్నానముచేసి, తడిబట్ట లతో వచ్చి కూర్చొని కావ్య నిర్మాణము చేయసాగినారు. బట్టలు తడిగా నున్నంతవరకునూ వారికి కావ్యరచన నిరర్గళముగా సాగుచుండెడిది. అవి పొడిగా'గానే వారానాటి కావ్యరచన మంతటితో నిలిపి.మరల మరుదినము ప్రారంభించెడివారు. ఈ విధముగా నిర్మింపబడిన కావ్యమే యీ 'భారత కథామంజరి' అని తనకు తెలిసిన విషయమంతయునూ ఆభక్త శిరోమణి వివరించినాడు.

ఈ సంగతులన్నియునూ విని వృందాచార్యుడు తాము కనకాభి షేకమునకై యన్వేషించుచున్న మహాకవి లభించినాడను సంతోషముతో నేరుగా రాజధానికి వచ్చి, ఈ విషయమును ముకుందపెద్దకు తెలియజేసి నాడు.

ఈ వార్త విని ముకుందపెద్ద తన చెవులను తానే నమ్మలేకపోయి నాడు. గదగు నారాయణయ్యనూ, అతని కావ్యమునూ గురించి వృందా చార్యుని విచారించి, సాధ్యమైనచో నా మహాకవిని రాజధానికి తోడ్కొని వచ్చి కనకాభిషేకము జేయించవలయునని నిశ్చయించినాడు.

ఈ నిశ్చయమునకు వచ్చిన వెంటనే యతడు గదగునకు వెళ్ళి, దేవాలయ ప్రాంగణములో నొక కుటీరమును నిర్మించుకొని ఋషి జీవ నము గడపుచూ, తన మహాకావ్యమును ఆస్తిక మహాశయులకు చదివి

చెప్పుచూ.భగవత్సేవలో నిరతుడై యున్న మహాభారత కర్తయగు కుమార వ్యాసుని జూచినాడు.

చూచుటతోడనే వారికి వందనము లర్పించి, తాము వచ్చిన పనిని తెలియజేసినాడు.

"మహాత్మా ! తమరు పరమ భాగవత శిరోమణులు. భగవాన్ వేదవ్యాసుల యంశగలవారూ, శ్రీ వీరనారాయణస్వామి భక్తులూ, అశ్వత్థామ ప్రియశిష్యులూ నైనవారు. తమ యీ భారత కథామంజరి కన్నడ సాహిత్య మందాక మేరుగిరి. ఇది కర్ణాట సాహిత్యమునందు మకుట మణివలె శోభించగలదు. తమవంటి మహాకవు లరణ్య కుసుమములు కారాదు. తమరజ్ఞాతముగా నుండుట మంచిదికాదు. తమ కావ్యముతోబాటు రాజధానికి రండు. అచట సామ్రాట్ ప్రౌఢదేవరాయల యనుగ్రహము నకు పాత్రులై, వారిచే కనకాభిషేకము జేయించుకొనవలయునని మా యభిలాష. ఇంతటి మహాభాగవత శిరోమణిని-వరకవిని పొందిన మేము ధన్యులము. మీరు మమ్ములను పునీతులనుగా జేయవలయును" అని దైన్యముగా ప్రార్థించినాడు.

అతని మాటలకు కుమారవ్యాసులు నవ్వి ఊరుకున్నారు.

"ఎందులకు స్వామీ నవ్వుచున్నారు?"

"ముకుందపెద్దగారూ ! మీరు చెప్పెడి రాజాస్థాన మెచ్చట ? నే నెచ్చట ? నేనొక క్షుద్రజీవిని. శ్రీ వీరనారాయణుని సేవకుడను. ఆ స్వామి కృపాకటాక్షమువలన ఒక మనుష్యుడనైనాను. అతనిసేవయే నాకన్ని రాజాస్థాలములకంటెనూ ఎక్కువైనది. అతడు దేవదేవుడు.అత నిని విడచి నే నెచ్చటికినీ రాను. ఈ విషయమై నన్ను మీరు ఒత్తిడి చేయకుడు" అనినాడు.

"స్వామీ ! తమవంటి కవిశ్రేష్ఠులు వైష్ణవులని చెప్పుకొనుటకు మాకు గర్వముగా నున్నది. తాము...."

"నేను స్మార్తుడనో, వైష్ణవుడనో ఎవరైననేమి ? నేనొక భాగ వతుడను భగవంతుడగు శ్రీకృష్ణుని పదారవింద మధువును గ్రోలు

నొక భక్తిమరమును. జగదీశ్వరుడగు శ్రీకృష్ణ పరమాత్ముని లీలా వినోదములను పాడితిని అంతియే. ఇది కేవలము పాండవుల కథగాదు, శ్రీకృష్ణుని దివ్యగాథ ! అతనిని స్తుతించి, పునీతుడనగుటకై ఈ భారత కథామంజరిని రచియించితిని. కాదు — ఆ స్వామి వీరనారాయణుడే నా (లేఖిని)చే వ్రాయించినాడు. నేను కేవల మతని వ్రాయసకాడు మాత్రమే" అని భక్తితన్మయతతో కనులు మూసుకొన్నాడు.

ముకుందపెద్ద శరీరము పులకలెత్తినది. అతడు కుమారవ్యాసుని పాదములపైబడి —

"మహానుభావా : రాజసన్మానమునకొరకై మిమ్ములను రాజధానికి రమ్మనుటలేదు. మా మతమునకు శైవమతీయులవలన జరిగిన యవమానమునకు ప్రత్యుత్తరము జెప్పుటకై మీరు వచ్చి ఈ కావ్యమును రాజసభలో చదువవలయునని పిలుచుచున్నాము. అట్లుచేసినచో మతేతరులు మా మతమును దూషించుట మానగలరు. తమ రొక పర్యాయము రాజధానికి వేంచేసి, గండాంతరముననున్న వైష్ణవ మతమును తమ యనుపమ కృతితో నుద్ధరింపుడు" అని వేడుకొన్నాడు.

అందులకు కుమారవ్యాసుడు —

"నావంటి పామరునివలన వైష్ణవ మతోద్ధరణ జరుగగలదనుట కల్ల. మీరట్లు దలచకుడు. అది శ్రీకృష్ణపరమాత్ముని కృపాకటాక్షముతో నిలచియున్నది. నే నా ప్రభువునకు యీ జీవితము నర్పించివేసినాను. మర్త్యలోక ప్రభువులను నేను స్తుతించను. నాకిహ లోకమందలి పదవీ వ్యామోహములేమియునూ లేవు. మీరు దయయుంచి నన్ను నాపాటునకు వదలి వెళ్ళుడు" అని కొంత కటువుగా చెప్పినాడు.

"మహాత్మా ! అయినచో నాదొక కోర్కెగలదు. దానినైననూ మీరు దీర్పవలయును"

"ఏమికోర్కె ? సంకోచపడక తెల్పుడు !"

"మిమ్ములను రాజధానికి రమ్మనియునూ నే నొత్తిడి చేయుట లేదు. కాని ఈ మీ యమరకావ్యమునైననూ రాజధానికి తీసుకొని వెళ్ళ

టకు అనుమతించవలయును. దీనిని విద్వత్సభలో పఠించు భాగ్యమై ననూ మాకు కలుగనిండు. ఈ కృతివలన తమ కీర్తి అజరామరము కాగలదు. తా మీ మాత్రిపు యనుగ్రహమును తమ భక్తునిమీద జూపవలయును" అని చెప్పగా.వేరు దారి గానక కుమారవ్యాసుడు సమ్మతించి నాడు.

"శ్రీహరి చిత్తమెట్లున్నదో అట్లు జరుగనిమ్ము. దీనిని వ్రాసినవాడూ, వ్రాయించినవాడూ శ్రీ వీరనారాయణుడే యైయుండగా, ఈ కృతికర్తను నేనను యహంకారము నాకు లేదు. దీనిని జదువు నాస్తిక మహాశయులు శ్రీకృష్ణ పరమాత్ముని యనుగ్రహమునకు బాత్రులైనచో ప్రాయసకాడైనందుకు నేను సార్థకత నందినట్లే"నని చెప్పినాడు.

అనంతరము ముకుందపెద్ద కుమారవ్యాసునికి నమస్కరించి, ఆ కృతిని స్వీకరించి రాజధానికి తిరిగి వచ్చినాడు.

# 21

# చామరస కవి

ముకుందపెద్ద విజయనగరమునకు వచ్చినతోడనే గదగులో జరిగిన విషయములన్నియునూ పొన్నలాదేవి కెరిగించినాడు. ఆమె చాల సంతోషించినది. కుమారవ్యాసుని జూడవలయునని కోరినది. ఆమెచే నీ వార్తవిని సామ్రాట్ ప్రౌఢదేవరాయలు కూడ కుతూహలముజెంది, కుమారవ్యాసుని గురించి తెలుసుకొనుటకై ముకుందపెద్దను సముఖమునకు పిలిపించినాడు.

సామ్రాట్ ప్రౌఢదేవరాయలను దర్శించి, తానే యీ విషయములన్నియునూ.జెప్పవలయుననుకొనుచుండగా, యింతలో సార్వభౌముడే అతనిని బిలిపించినాడు.

అతడు తాను తెచ్చిన భారత కథామంజరిని సామ్రాట్టుల కప్ప గించి, గదగులో జరిగిన సంగతులన్నియునూ వివరించినాడు.

ఈ విషయములన్నియునూ విని ప్రౌఢదేవరాయల కాశ్చర్య మైనది. తన రాజ్యములో అంతటి మహాకవి యుండుట కతడు గర్వపడి నాడు. అనంతర మతడు ముకుందపెద్దచే నా కావ్యము నంతయునూ పఠింపజేసి, విని యానందించినాడు. దానిని కనుల కద్దుకొని భక్తిభావ ముతో ననినాడు :

"ముకుంద పండితులూ ! ఈ కావ్యమును చదువుగా వినిన తరు వాత కుమారవ్యాసుని జూడవలయునని కోరికగానున్నది. మీరే విధముగా నైననూ వారి నాస్థానమునకు తోడ్కొని రావలయును" అనినాడు.

ముకుంద పండితుడు కుమారవ్యాసుని యసమ్మతిని తెలియజేసి నాడు. "అయినచో వారు నిజముగా మహాత్ములే. వారివద్దకు మనమే వెళ్ళి వచ్చెదము"

"కానెందు ప్రభూ ! ముందు యీ నవరాత్రోత్సవ సంబరములు ముగియనిమ్ము. రాజసన్మాన సమారంభము కూడా పరిపూర్తి కానిండు. అనంతరము నేను తమను వారివద్దకు తోడ్కొని వెళ్ళి పరిచయము చేసె దను" అని చెప్పి ముకుంద పండితుడు సార్వభౌమునివద్ద వీడ్కోలు పుచ్చుకొన్నాడు.

ఈ విషయములన్నియునూ ముకుంద పండితుడు కుమారవ్యాసుల కృతిరత్నమగు భారత కథామంజరిని సామ్రాట్టులకు చదివి వినిపించుట ఎట్లో జక్కనాచార్యుల చెవినిబడి, అతనికి చాలా కళవళమును కలిగించి నది.

తాను విద్వత్సభలో చావనివారి కథను నిర్మించి తెచ్చి చూపు నట్లుగా ప్రతిజ్ఞ స్వీకరించి తిరిగి వచ్చిన తరువాత తన పంతమును చెల్లించుకొనక పోయినచో, తన పలుకు లబద్ధములై తమ మతము నిత ములు తేలికగా చూడగలరని దిగులు జెందినాడు.

ఈ చింతతో అతనికి నిద్రాహారములు పైతము సహించక పోయి

నవి. మనశ్శాంతి నశించినది. రాజకీయములందునూ, దైనందిన పరిపాలనా కృత్యములందనూ మునుపటి యాసక్తి లేకపోయినది.

ఇది గ్రహించిన లక్కనాచార్యు డతని వద్దకు వచ్చి,

"అన్నగారూ ! ఈ యల్ప విషయమునకై ప్రాజ్ఞులైన తమరింతగా చింతించుటయా ? తమ రాజ్ఞాపించినచో యీ పరివ్రాజకులలో నెవరైననూ యొక శైవ గ్రంథమును రచియించి తెచ్చి సమర్పించగలరు. ఇది ఏమి గొప్ప విషయమని యీ విధముగా కృంగిపోవుచున్నారు" అని సమాధాన పరచినాడు.

"లక్కనా ! ఇది నా ఒక్కనికి మాత్రమే సంబంధించిన ప్రశ్న కాదు —మన మఠపువారి ప్రశ్నయునూ కాదు. ఈ విరక్తులందరినీ గురించిన ప్రశ్న ! ఈ కావ్యములో నే నెందులకు తొందరపడితినో తెలియదు. నేను విరక్తుడనని చెప్పుకొనుచూ, ముకుందపెద్ది సవాలునకు ప్రత్యుత్తర మిచ్చితిని. అందులకై నే నిపుడు చాల పరితపించుచున్నాను. ఇపుడు నేను శైవకవు లెవరిచేతనైననూ శివభక్తులలో నొక మహాపురుషుని జీవితమును గురించి, ఒక మహాకావ్యమును వ్రాయించి తెచ్చి సామ్రాట్టుల కర్పించనిచో, అసూయాపరుడునూ-పరమత ద్వేషియునూ కాగలను. నా మాటలకు గద్యాణపు విలువ యుండదు. నాగతి యీ విధముగానైన పిమ్మట, ఇక నేనెట్లీ పరివ్రాజక సమూహమునకు సంచాలకుడుగా నుండి కార్యములను చక్కబరచగలను ? ఆశ్రియములేని లతవలె, మతేతరుల ద్వేషాగ్నికి వాడి వత్తియై పోవలసినదే ! మనము మన జీవితమందలి మహత్తర కార్యసాధనమని చేబూనిన ఈ పరివ్రాజక కార్యక్రమ వృక్షము బలముగా వేరూని నిలచుటకు చేతనైనంత ప్రయత్నము చేయవలయును. ఈ కార్యసాధనకై మన బలిదాన మావశ్యకమైనచో, దానికి కూడ వెనుకాడరాదు. ఇది మన బావుబ్రతుకుల పోరాటము" అని ఖిన్నుడై యనినాడు జక్కనాచార్యుడు.

దానికి తగినట్టుగా కుమారవ్యాసునియొక్క భారత కథామంజరిని చదివించి మెచ్చుకొనిన ప్రౌఢదేవరాయ లొక దినము కార్యార్థమై తన వద్దకు వచ్చిన జక్కనాచార్యునితో ప్రసంగవశమున ఆ కావ్యమును గురించి ప్రస్తావించినారు"

"జక్కనాచార్యులూ ! కనకాభిషేకమునకు యోగ్యమగు కన్నడ కావ్యము నొకదానిని తాము వెదకుచున్నారు. అంతటి మహాకావ్యమును మన కుమారవ్యాసులు వ్రాసియున్నారు. వారి భారత కథామంజరికి మన మెందుల కీ సన్మానము చేయరాదు ?" అనినాడు.

ఈ మాటవిని జక్కనాచార్యుల కాశ్చర్యమైనది. సామ్రాట్ ప్రౌఢదేవరాయల ముఖతః యింతటి మాట వెలువడగలదని అత డనుకో లేదు. అయినచో ముకుందపెద్ద మొదలగు సార్వభౌములను వశపరచు కొని,మత మత కవియగు కుమారవ్యాసునికి రాజసన్మానము లభింపజేయు టకు ప్రయత్నించినారను నది ఉచితమైనది. ఈ విషయమై యిప్పుడే తన ఉచితాభిప్రాయమును వ్యక్తము చేయనిచో సార్వభౌము డా గ్రంథ మునే కనకాభిషేకమునకు నిర్ణయించవచ్చునని దలచి అతడు —

"ప్రభూ ! కుమారవ్యాసులు రచియించిన కావ్యమొక ఉత్తమ సాహిత్య కృతియని విన్నాను. కాని యా భారత కథామంజరి కనకాభి షేకమున కర్హమైనదని నాకు తోచుటలేదు. ఎందువలన ననగా, మహా భారతము మరణించినవారి కథ. గనుక అంతకంటెనూ శ్రేష్ఠమైన శివ భక్తుల చారిత్ర్యము లభించినచో మనమెందులకు దానికి సన్మాన మాచ రించరాదు ?" అని ప్రశ్నించినాడు.

"మహాభారతము కురువంశ చరిత్రయైనంత మాత్రమున దానిని మనము చచ్చినవారి కథయని ఉపేక్షించుట సరికాదు. అది శ్రీకృష్ణ పర మాత్ముని మహిమలను వర్ణించు నొక ఉత్తమ పురాణగ్రంధము. అది సాహిత్య గుణములను కూడ కలిగియున్నదని విన్నాను. మీరు పూర్వాభి ప్రాయపరులుగాక యీ కృతిని చదివినచో తప్పక యానందించగలరు. సాధ్యమైనచో యీ కవిని సమ్మతింపజేసి నవరాత్రి సమయమునకు రాజసభకు దోడ్కొని రావలయును. శ్రీనాథ మహాకవితో బాటీ కర్ణాట మహాకవిని కూడ కనకాభిషేకము జేసి సంతోషించవలయునని యున్నాను"

జక్కనాచార్యుని కీ మాటలు యించుక విసుగును కలిగించినవి. అతని ప్రతి కక్షులగు ముకుందపెద్ది మొదలగువారు సామ్రాట్టులను తమ వైపునకు త్రిప్పుకొని నారనుటలో సంశయములేదు. అయిననూ అతడు తన పక్షమునే వహించుచూ అనినాడు "ప్రభూ! తాము భారతమున కీ సన్మానము చేయ నిశ్చయించి యున్నచో నా యాక్షేపణలేదు. కాని మహా భారత కథను పరివ్రాజకా చార్యులలో నొకడగు మా చామరసు కూడ వ్రాసియున్నాడని విన్నాను. తా మీ రెండు కృతులనూ తెప్పించి చదివి చూచి, ఉత్తమ కావ్యమునకు సన్మానము చేయవలయునని వేడుకొను చున్నాను"

ప్రౌఢదేవరాయ లీ మాటకు తన సమ్మతిని తెలియజేసినాడు.

"జక్కనాచార్యులూ! అయినచో చాల సంతోషము. మీరే స్వయముగా వెళ్ళియో, లేక ఎవరినైననూ పంపియో చామరసు కవిగారి మహా భారతమును తెప్పింపుడు. పండితు లీ రెండింటిలో నేది ఉత్తమమైనదని తీర్మానించెదరో దానికి మనము సన్మానము చేయుదము"

ఈ కార్యమునకు లక్కనామాత్యుడు తప్ప యితరులెవరునూ సమర్థులుకారని దలచి, జక్కనాచార్యు డతనిని బిలిచి జరిగిన విషయము లన్నియునూ చెప్పి—

"లక్కనా! ఇప్పుడు విరక్తుల యగ్నిపరీక్ష జరుగు సమయ మాసన్నమైనది. నేను పండితుల యెదుట ఆనాడట్టి ప్రతినబూని యప రాధ మొనరించితిని. ఇపుడు నా ప్రతిన నెరవేరవలయు నననచో మన మే శైవకవి చేతనైననూ ఒక మహాకావ్యమును రచింపజేసి, తీసుకొని రావలసి యున్నది. ఈ నడుమ సార్వభౌములు గదగు నివాసియగు కుమారవ్యాసుడని పేరందిన నారాయణయ్య యను కవి గ్రంథమునకు కనకాభిషేకము చేయవలయునని యాలోచించుచున్నారు. భారతమున కెందులకు మర్యాద చేయరాదని నేను ప్రభువులతో యనినాను. వారా కావ్యమును పరామర్శించుటకు సమ్మతించినారు. నీవు సత్వరమే గదగు నకు వెళ్ళి చామరస కవిగారి మహాభారతమును గొనిరమ్ము" అని యాజ్ఞా పించినాడు.

లక్కనామాత్యుడు వెంటనే ప్రయాణమైనాడు.

చామరసకవి గదగు సమీప గ్రామమగు నాగలాపురములో నొక కుటీరమును నిర్మించుకొని శివభక్తునివలె నివసించుచున్నాడు. ప్రజ లతనిని గురించి అనేక విధములైన కథ లల్లినారు.

తారుణ్యములో వైరాగ్యము కలుగుటచే నతడు గృహస్థుగాక పరివ్రాజకుడైనాడని చెప్పుదురు. ఎవరికినీ అతని తలిదండ్రులను గురించి యైననూ అతని బాల్య జీవనమును గురించియైననూ ఏ వివరములునూ తెలియవు అతడు ప్రజాకోటికి దూరముగా నుంటూ, శివయోగములో నిరతుడైనాడు.

ప్రజలకు దూరముగా నుంటూ, అజ్ఞాతముగా నివసించుచున్ననూ అతని పాండిత్య ప్రతిభ చాలదూరము వరకునూ పాకినది. అదివరకే అతడొక మహాకవి యను పేరును పొందినాడు. అత డేయే గ్రంథములను వ్రాసి యున్నాడనునది ఎవరికినీ తెలియకపోయిననూ, అతని భారతము మాత్రము కుమారవ్యాసుని భారతమువలెనే యుత్తమ కావ్యమని తెలిసిన వారన సాగినారు.

కాని అతని అంతరంగికులు కొంద రీ విషయమై యొక విషాద గాథను చెప్పెడివారు.

అతడు విరక్తుడైన పిమ్మట తన పూర్వాశ్రమ మందలి సాహిత్య గ్రంథముల నన్నింటినీ అగ్నిలో బడవైచినాడనియూ, భారతముకూడ వాటితో బాటా సమయమున నీతిహోత్రుని కాహుతియైనదనియూ చెప్పుకొందురు. ఆ సమయములో చామరసు కవి తానికముందు చచ్చినవారి కథ ఏదియునూ వ్రాయుటలేదని శపథము చేసెనందురు. కాని ఈ విషయమై ఎవరికినీ యథార్థము తెలియదు.

లక్కనామాత్యుడు నాగలాపురమునకు చాల యాశతోడనే వచ్చినాడు. చామరసకవి నివసించుచున్న కుటీరమునకు వెళ్ళి యతనిని సందర్శించి తనను పరిచయము చేసుకొన్నాడు.

తనను సందర్శించుటకై మహా శివభక్తుడునూ, సామ్రాజ్యము

నకు అమాత్యుడునూ, శివతత్త్వ చింతామణి కర్తయూనగు లక్కనా మాత్యుడు వచ్చినందులకు చామరసు చాల ముదముజెందినాడు.

"అన్నగారూ! ఎంతకాలము తరువాత మీ దర్శనము లభించినది! మీపాదధూళి వలన నా కుటీరము పావనమైనది" అని అతని కుపచర్యలు చేయుటకై తానే పూనుకొనినాడు.

లక్కనామాత్యుడు తా నచ్చటికి వచ్చిన కారణమును వివరముగా జెప్పినాడు.

"అన్నగారూ! ఈ యల్పవిషయమునకై మీరింతదూరము వచ్చుటయా? సేవకునితో జెప్పి పంపియున్ననూ నేనొక మహాకావ్యమును రచియించి తెచ్చి,జక్కనాచార్యుల శ్రీపాదముల కప్పగించి యుందును" అని భక్త్యావేశముతో పలికినాడు చామరసకవి.

"కవిగారూ! ఇపుడు రాజధానిలో వీరశైవ మతస్థుల కగ్నిపరీక్ష జరుగనున్నది. సరస్వతీ (వర)పుత్రులైన మీరు వారి మానము కాపాడవలయును. జక్కనాచార్యుని ప్రతిన చెల్లింపగలవారు మీరొక్కరే!"

"ఈశ్వరేచ్ఛయైనచో యిదియేమి గొప్ప విషయము? కాని నేను కావ్యరచనమును మాని యనేక సంవత్సరములైనది. ఇపుడు నా సమయమునంతయునూ శివయోగమునకై ప్రత్యేకించినాను" అని విచారముగా ననినాడు చామరసకవి.

"తాము క్రొత్తగా కావ్యరచనము చేయకున్ననూ చింతలేదు.తమ మహాభారతమును మా కనుగ్రహించిననూ జాలును"

"ఏమీ? చచ్చినవారి కథయగు ఆ మహాభారతమును రాజసభలో జదువుటయా? అన్నగారూ, అది వీలుగానిది. ఆ చామరసకవి ఏనాడో మరణించినాడు. అతనితో బాటతని పూర్వాశ్రమ వాసనగల కృతులన్నియునూ భస్మములైనవి. వాటితోబాటు ఆ మహాభారతము కూడ నాశనమైనది. ఇప్పుడు మీయెదుటనున్న చామరసకవి వేరు. యితడు విరాగి! శివభక్తుల బంధువు"

"ఏమీ, మీ యమూల్య గ్రంథరాజముల నన్నింటినీ కాల్చివేసినారా?" ఆశ్చర్యముతో యడిగినాడు లక్కనామాత్యుడు.

"ఔను ! ఆ గ్రంథములన్నింటినీ నా సహోదరిచేత భస్మము చేయింతిని"

"ఎందులకు ?"

"వాటివలన యీ ప్రపంచమున కే ప్రయోజనమునూ లేదని భావించి"

"అయినచో మీరు మమ్ములను వట్టేట ముంచెదరా ! నేను అన్న గారి యాదేశానుసార మిచ్చటికి చాల యాశతో వచ్చితిని. నా యాశను నిరాశ జేసెదరా ?"

"లేదు అన్నగారూ ! మీరు శివుని మహామందిరమునుండి వచ్చిన వారు. ఈశ్వరేచ్ఛను చేకొని వచ్చినారు. మిమ్ములను వట్టిచేతులతో పంపను. మీకొరకై నేనొక నూతన కావ్యమును రచియించి పంపెదను. ఈ విషయమును మీరన్నగారికి తెలిపి,వారిని నిశ్చింతగా నుండుమనుడు"

"నవరాత్రి కిక మూడుమాసముల వ్యవధి మాత్రమే గలదు. ఈ లోపున తామా నూతన కావ్యమును వ్రాసి ముగించి, మాకు పంపవల యును"

"ఈశ్వరానుగ్రహమున్నచో, మూడుమాసము లెందుకు ? మూడు వాసరములలో ఆ కావ్యము పూర్తి కాగలదు"

"ఔను, శివానుగ్రహమునకు మించిన కార్యమేదియునూలేదు" లక్కనామాత్యుడు కూడ ఆతని మాటల ననుకరించినాడు.

"అన్నగారూ ! గురుకృప యొకటియుండిన జాలును. పదు నొకండు దినములలో ఈ కావ్యమును వ్రాసి ముగించగలను. కర్ణాటక జనప్రియమైన ఛందస్సగు భామినీషట్పది గీతములలోనే నా కృతిని గూడ రచించగలను. మీరు నిశ్చింతులరై రాజధానికి మరలుడు" అని ధైర్యము జెప్పినాడు.

"తమరీ కృతిని వ్రాసి ముగించిన విషయము తెలిపినచో సకల రాజ మర్యాదలతో తమను రాజధానికి తోడ్కొని వెళ్ళుటకై అన్నగారు వచ్చెదరు"

"అన్నగారి కీ తొందర కలిగింపదలిలేదు. వారి కింతకంటెనూ ముఖ్య విషయము లెన్నియో యుండును.వారి సమయము నీ విధముగా పాడుచేయకుడు. ఈ కృతి పరిపూర్తియైనతోడనే దానిని నేనే అచ్చుటకు పంపగలను. దానికొరకై మరల మీరిచ్చుటకు రాకుడు"

"తమరే తమ యమూల్య గ్రంథమును రాజసభలో చదువవలయు నని సార్వభౌములు కోరుచున్నారు"

"ఈ విషయములో మాత్రము నన్ను మీరు వత్తిడి చేయకుడు. సామ్రాట్టులపట్ల నే నగౌరవమును వ్యక్తపరచుచుంటినని భావింపకుడు. నేను రచియింపబోవు కావ్యము మరణించినవారి కథగాదు. తన దివ్య బోధచే బసవన, సిద్ధరామ, అక్కమహాదేవి యంతటి విభూతి పురుషు లను జ్ఞానమార్గమునకు గొంపోయిన దివ్యజ్యోతి కథ యది. అల్లమ ప్రభుదేవుని దివ్య కథానకమగు ప్రభు లింగలీల; దానిని నేను మర్త్యుల కొరకై వ్రాయబోవుటలేదు. మర్త్యలోక ప్రభువుల ముందు చదువ బోవుటయునూ లేదు"

లక్కనామాత్యు డా మాటలకు నిరుత్తరుడైనాడు. ఇక నా విష యమై ఒత్తిడి చేసినచో, దానివలన చామరసకవి హృదయ మెచ్చుట బాధ పడగలదోయని భీతిల్లి వచ్చిన కార్యము యశోవంతమైనదను సంతోష ముతో రాజధానికి వెనుదిరిగినాడు.



## 22

## మహాకావ్య నిర్ణయము

లక్కనామాత్యుడు రాజధానికి తిరిగి వచ్చి జరిగిన కథనంత యునూ అన్నగారగు జక్కనాచార్యునకు తెలియజేసినాడు. జక్కనా

చార్యు డిది విని సమాధానపు నిట్టూర్పు విడచినాడు. చివరకు పండితుల సన్నిధిని తాను చెప్పిన విధముగా చామరసకవిచే కీర్తికాయులు కాని శివ భక్తుని కథను కావ్యముగా నిర్మించి తెచ్చుటకు సాధ్యమైనదని సంత సించినాడు. ఇదివరకునూ అతనిని వేధించుచుండిన చింత యిప్పుడు మంచువలె విడిపోయినది.

జక్కనాచార్యుడు సామ్రాట్ ప్రౌఢదేవరాయలను సందర్శించి-

"ప్రభూ! నేను తమతో విన్నవించినట్టుగా, చావనివారిని గురించి రచియింపబడిన ఒక మహాకావ్యమును కనకాభిషేక మొనర్చుటకై రాజ సభకు దెచ్చుటకు తమ యనుమతిని గోరుచున్నాను" అన్నాడు.

ప్రధానామాత్యుని పలుకులకు ప్రౌఢదేవరాయలు చకితుడైనాడు.

"అమాత్యశేఖరా! మీ మాటలను స్పష్టము చేయుడు. మీరానాడు నాతో వేరొక భారతమును దెచ్చి యొప్పగించునట్లు చెప్పితిరి. ఈనాడు చావనివారిని గురించి రచించిన మహాకావ్యము మాట చెప్పుచున్నారు. మీరేమి చెప్పుచున్నారో నా కర్థముగుటలేదు".

"ప్రభూ! మా విరక్తులలో పెద్దవారగు శివయోగి చామరసుకవి గారు ప్రణవ ప్రరూపులగు శ్రీ అల్లమ ప్రభువుయొక్క జీవితమును చిత్రించునొక మహాకావ్యమును రచియించుటకు సమ్మతించియున్నారు" అని జరిగిన విషయములన్నియునూ వివరించినాడు.

"చాల సంతోషము అమాత్యులూ! ఈ విధముగానైన మా కన్నడ సాహిత్య నందనోద్యానము లో నూతన కావ్య మొకటి వికసింప మన్నదికదా!" అని తన సమ్మతిని తెలియజేసినాడు సామ్రాట్.

నవరాత్రి సమీపించుచున్నది. పండుగకు యిక ఒక వారము దిన ములు మాత్రమే యున్నవి.

ఆశ్వయుజ శుద్ధపాడ్యమి శుభముహూర్తమున సామ్రాట్టులు విద్యుక్తముగా దీక్ష బద్ధులగుదురు. ఆ పది దినములలో జరుగవలసిన మహాసరస్వతి, మహాలక్ష్మి, మహాకాళికల పూజకై పలయు నేర్పాటులు గొప్పగా సాగుచున్నవి.

అదివరకే సామ్రాజ్యమందలి సామంతులకూ, మండలేశ్వరు

లకూ, రాజోద్యోగులకూ, తదితర పురప్రముఖులకూ ప్రత్యేకాహ్వానములు పంపబడినవి. ఆహ్వాన లేఖ లందుకొని వారందరూ తమ తమ కానుకలతో బయలు దేరిరాసాగినారు. వచ్చిన అతిథులను వారికై ఏర్పాటు చేయబడిన గృహములలో విడచు గడబిడలో అధికారులు నిమగ్నులై యున్నారు.

ఈ ఉత్సవమునకు రావలసినదని సామ్రాజ్యమందలి ఉత్తమ కళా కోవిదులకూ, కవి, పండితులకూ ప్రత్యేక లేఖలు పంపబడినవి. ఈసారి జరుగనున్న కవి-కావ్య సన్మానము-కనకాభిషేకమును చూచుటకై కన్నడ-తెలుగు సాహిత్యాభిమానులు తండోపతండములుగా రాజధానికి రా నారంభించినారు.

ఆంధ్రకవి సార్వభౌముడగు శ్రీనాథుడు సకలరాజ మర్యాదలతో తన పరివారముతోబాటు వచ్చి రాజధానిలో దిగినాడు. అతనికి రాజధాని యందలి తెలుగుకవులూ, కళాకోవిదులూ, విద్వాంసులూ వైభవముగా స్వాగతము పలికినారు. ఆంధ్రకవి సార్వభౌముని జూచి ప్రజలు పునీతులైనామని భావించినారు.

కాని కన్నడ సాహిత్యాభిమానులకు మాత్ర మీ భాగ్యము లేకపోయినది. వారు నిరీక్షించిన కుమారవ్యాసుడు కాని, చామరసకవి గాని యీ ఉత్సవమునకు వచ్చుటకు సమ్మతించలేదు. వారు తమ కావ్యములను మాత్రము బంపి, ఉత్సవమునకు శుభమును కోరినారు.

కుమారవ్యాసుడు తన కావ్యమును ముకుందపెద్దచేత పంపినాడు కాని రాజసన్మానమును కోరిరాలేదు. అదే విధముగా శివయోగి చామరస కవి కూడ ఉత్సవమునకు రాక తన ప్రభు లింగలీలను బంపినాడు. అతడు లక్కణామాత్యుని కిచ్చిన మాటమేరకు భామినీషట్పది గీతములలో వేయిన్ని నూటపదునొకండు గీతముల గ్రంథమును, దినమునకు ఏకోత్తర శత గీతముల చొప్పున ఏకాదశి దివసములలో పూర్తిచేసి తన శిష్యులలో నొకనిచేత యిచ్చి పంపినాడు.

మొదట ఆంధ్రకవి సార్వభౌముడగు శ్రీనాథుని శృంగార నైషధ కావ్యమును అతనిచేతనే పఠింపజేసి. రాజసన్మానముగా నతనికి కనకాభిషేకము చేయుటకై తీర్మానించబడినది.

శ్రీనాథుడు కొండవీడు రెడ్డినాయక ప్రభువుయొక్క ఆశ్రిత కవి సార్వభౌముడు. బాల్యములో అతని కవిత్వమునకు మెచ్చి ఒక వైశ్య దతనిని తన యాశ్రియమునకు తీసుకొని,అతని కావ్యలత పెరిగి పూవులు వికసించుటకై సాయపడినాడు.

ఆ వైశ్య డాగర్భ శ్రీమంతుడగుటచే విదేశములతో కూడ వ్యాపార సంబంధములు పెట్టుకొని యుండెను. అతని యాశ్రియమున శ్రీనాథుని కవితా వాహిని నిండుగా ప్రవహించి, అత డాంధ్రకవియైనాడు. భీమేశ్వర పురాణము, హరివిలాసము, శివరాత్రి మాహాత్మ్యము,కాశీఖండము, శృంగారనైషధము మొదలగు యుద్గ్రంథములను రచియించినాడు.అతడు శైవమతస్థుడు. మిక్కిలి ధర్మశ్రద్ధ గలవాడు. తనను వాదములో నోడించుటకై వచ్చిన డిండిమ భట్టను గౌడకవిని పరాజితునిగా జేసి, కవి సార్వభౌముడను బిరుదును గడించినాడు. ఆ బిరుదు ఈనాడు సామ్రాట్ ప్రౌఢదేవరాయలచే సార్థకము కాగల సమయము వచ్చినది.

శ్రీనాథ మహాకవికి లభించిన రాజసన్మానమును జూచి కన్నడ సాహిత్యాభిమానులు తమ భాషాకవులను తాము చూచు భాగ్యములేక పోయినది కదాయని మిక్కిలి పరితపించినారు.

కాని కుమారవ్యాసు డీ విషయముపట్ల ఒక నిశ్చితాభిప్రాయమునకు వచ్చి—

"కపికంబెనూ కావ్యము ముఖ్యము. నాకు చేయదలచిన సన్మానము ఆ కావ్యమునకు చేయుడు. ఆ కృతికర్త వీరనారాయణస్వామి. నేను కేవల మతని వ్రాయసకాడను. భగవ దనుగ్రహమువలన ఆ కావ్యము మీ కానందమును గలిగించినచో, మీ యానందములలో నేను కూడ పాలు పంచుకొందును" అని లేఖా మూలకముగా తెలియజేసినాడు.

ఈ ఉత్తరమును చదువుకొని ప్రౌఢదేవరాయలు.

"ఓ ! ఎంతటి నిష్కామసేవ ! ఈ కృతి భగవంతుని కృపను గలిగినదైనచో, దీనిని చదువు రసికులుకూడా ఖండితముగా భగవదనుగ్రహమునకు పాత్రులగుదురు. సందేహములేదు" అని పలికినాడు.

అనంతరము జక్కణాచార్యులు బంగరు పళ్ళెరములో నిడిపట్టు పీతాంబరము గప్పబడిన చామరసకవి కృతమగు ప్రభు లింగలీల యను తాటియాకుల గ్రంథము తెచ్చి సార్వభౌముని ముందుంచినాడు.

సార్వభౌము డా పళ్ళెరముపై కప్పబడిన పీతాంబరమును తొలగించి, గ్రంథమును తీసుకొని కనుల కద్దుకొనినాడు.

కుమారవ్యాసులు భాగవత శిరోమణులైనచో చామరసకవిగారు శివయోగులు. వారి కావ్యమార్గము, కావ్యతత్త్వము భిన్నముగా కనబడిననూ వా రుభయులునూ ఒకే ఆదర్శము నెన్నుకొన్నారు. వారిది ఉదాత్తమైన జీవితాదర్శము. మానవులలో దైవత్వావిర్భావమును, వికాసమును కలుగజేయు కథయే జీవన్ముక్తులగు శ్రీకృష్ణ, ప్రభుదేవుల లీలలు. ఈ దృష్టితోడనే వారిని మహాత్ములనుట. మన ఈ మర్త్యలోకమున జనించి, మనవలెనే జీవించిననూ ఆ దివ్యజ్యోతు లాకసమువైపు లాగి, మన కెల్లరికునూ అమరత్వమగు నిర్మల జ్ఞానతేజములను ప్రసాదించుచున్నవి. ఇంతటి యమూల్య కృతులను దర్శించుట కవకాశమిచ్చిన యీ ఉభయ మహాకవుల కావ్యములను పండితులూ, విద్వజ్జనులూ, సావధానముగా బరిశీలించి, యీ రెండింటిలో నెయ్యది యుత్తమమైనదో నిర్ణయించవలయును"

అనంతరము పది దినములవరకునూ నిరర్గళముగా ఆ మహా కావ్యములను రెండింటినీ పండితోత్తములు శ్రావ్యముగా పఠించినారు.

## 23

# కనకాభిషేకము

విద్వత్సభకై ప్రత్యేకముగా నిర్మింపబడిన విశాలమగు మంటపములో శాస్త్ర్యనుకూలముగల కావ్యగాయకులచే ఉభయ మహాకావ్యముల

పఠనకార్యము ప్రారంభించుటకు తగిన యేర్పాటులన్నియునూ గావింప బడినవి. రసికుల పాలిటికిని, విద్వాంసులపాలిటికినీ యిదియొక సాహిత్య సుధగా దోచినది. ఈ ఉభయ కావ్యములలో నేది సార్వభౌముల మన్న నకు పాత్రము కాగలదోనన్న తమకముచే సాహిత్య పిపాసువులు.ఆరాధ కులు చాతకపక్షులవలె నిరీక్షించసాగినారు.

సామ్రాట్ ప్రౌఢదేవరాయలు తన దైనందిన రాచకార్యముల నడుమ వ్యవధి కలుగజేసుకొని. ఈ సాహిత్యసుధ నాస్వాదించుటకై విద్వత్సభ కరుదెంచినారు.

తొలుత కుమారవ్యాసుని భారత కథామంజరి పఠనము ప్రారంభ మైనది.

కావ్యారంభమే శ్రోతల మనఃఫలకములపై తన ప్రభావమును గనుపరచి. వారిలో మహత్తర పరిణామమును గలిగించినది. సభాసదులు మంత్రముగ్ధులవలె కూర్చొని యున్నారు.

గాయకులు సుశ్రావ్య కంఠముతో కావ్యగానము చేసినారు :

1) శ్రీ వనితా హృదయ విమల కా
జీవ పీఠాధిష్ఠిత జగదతి
పావనా సనకాది సజ్జనపాలా భవనాశా ।
రావణాసుర దమన శ్రవణ సు
ధావి నూతన కథన కారణ
కావు ముష్మద్ భక్తజనముల గదగుపుర నారాయణా।

తాను రచించిన కృతి వినూత్నమైనది. అది శ్రోతల కమృత సదృశము. ఈ కావ్యమును వినెడి సజ్జనులను గదగున వెలసిన శ్రీ వీరనారాయణస్వామి కాపాడుగాక ।

ప్రజలు కవియొక్క యాశయమును విని పరమానంద భరితులై నారు.

గాయకులు తమ శ్రావ్యకంఠముతో మరల కావ్యామృత వాహి నిని ప్రవహింపజేసినారు :

2) శరణ సంగవ్యసన భుజగా
భరణ అమర కిరీటి మండిత
చరణ చారుచరిత్రి నిరుపమ తేజ శిఖినేత్రి
వరద ! నిర్మల భజకర అఘ సం
హరణ దంతి చమూరు చర్మాం
బరుధ గావుము భక్త జనులను పార్వతీరమణ !

ఆహా ! కవి దెంతటి యాశయము! పార్వతీరమణుడు భక్త జను లను బోషించుగాక, యనుచున్నాడు. హరిహరులపై సమాన గౌరవమును ప్రకటించిన కవిహృదయు వైశాల్యమునకు సభాసదు లాశ్చర్యపరవశులై గాయకుల ముఖత! ముందేమి రానున్నదోయని ఆతురత జెందసాగినారు.

కుమారవ్యాసుడు సాంప్రదాయానుసారముగ తొలుత విఘ్న నివా రకుడైన గణపతిని భక్తితో స్తుతించి, తమ కెల్లరికినీ శుభము లొసంగు మని ప్రార్థించినాడు.

సామ్రాట్ ప్రౌఢదేవరాయలు కుమారవ్యాసుని వినాయక వర్ణన "సింధూర వర్ణుడ నటన కౌశల వారురూపు గజాననా" అను దానిని విని తాను సహ్యాద్రి సామీపారణ్యములలో వేటాడి పట్టుకొనిన గజరాజ ములు జ్ఞప్తికి వచ్చి, లోలోపలనే సంతసించినాడు.

కావ్యగానము గంగా ప్రవాహమువలె సాగుచునే యున్నది :

3) గజముఖానన ఏకదంత
నిజగుణాన్విత పరశుధారణ
రజితగిరి యొదయని కుమారుడ,విద్యవారి విధి
అజుడు హరి రుద్రాదులును విను
భజన చేయుదు రనవరతమును
త్రిజగ వందిత యోగణాధిప నిన్ను సంస్తుతి జేయుదున్.

వినాయకుని స్తుతి కాగానే శారదాదేవిని స్తుతించి వా డా మహా కవి.

4) వారిజాసని సకలశాస్త్ర వి
చారణోద్భవ వచన రచ నో

ద్ధార పౌరాణాగమ శ్రుతి సిద్ధిదాయకి
శౌరి సురపతి సకలమునిజన
సూరి వర సంస్తూయ గుణగణ
శారదా। నాజిహ్వామీదను సంతతము నర్తింపుమమ్మా।

ఈకృతి పతి యెవరు? దీనిని రచించిన వారెవరు?

5) వీరనారాయణుడె కవి లిపి
కారుడౌ నీ కుమర వ్యాసుడు
సూరివరులు సనకాదిమౌనులు శ్రోత లీ కృతికి
మారమణ పదధ్యాన నిరతులు
చారుకవనము లల్ల నేర్తురు
శారదా కృప బడయగల్గిన సర్వజ్ఞులౌ పండితులు।

ఇది విని సభాసదులు కుమారవ్యాసుని నిరహంకా రత్వమున కాశ్చర్యపడినారు. అతడు నిజముగా విరక్తుడుగానిచో తన కృతిపట్ల యింతటి నిర్మోహమును వ్యక్తపరచగలడా?

కావ్యగానము చేయుచున్నవారు ఒకటి తర్వాత యొకటిగా మహా లక్ష్మి-గౌరీదేవ్యాది గలవారిని స్తుతించుచూ కవి వ్రాసిన గీతములను గానముచేసి, అతడు ధరించిన కుమారవ్యాసుడను బిరుదుయొక్క యౌచి త్యమును గురించి చెప్పినారు:

6) దురిత కులగిరి వజ్రిపాణియు
ధరను జంగమమూర్తి, కవి వా
రిరుహ దినమణి నిఖిల యతిపతి దివిజవందితుడు
పరగ నను తనవాడటంచును
అరసి తనయుండనుచు కరుణను
వరము లీవుత ప్రీతి వేదవ్యాస గురువరుడున్.

వారిని కవి వేడుకొను చున్న దీ మాత్రమే।
"నమ్మిన వారిని నాశముచేయకు దేవ: జగదారాధ్య గురురాయ।"

తన కావ్య వస్తువును గురించి కుమారవ్యాసుడు స్పష్టముగా చెప్పినాడు :

7) తెలియజెప్పుదు కృష్ణ కథనము
నిల వలంతులు 'భళిర !' యనగను
వెలయ పంచమ వేదమని శ్రీవిభుడు మెచ్చగను
పలు భవమ్ముల పాపరాసుల
తొలచు జలమిది వేదముల తొలి
పలుకు వంటిది భారతంబన పంచమశ్రుతి యో ।

ఇచ్చట నున్నది పద్మనాభుని మహిమ ; లేదా భాగవత ధర్మము యొక్క విచారము. దీనిని భక్తజనులు శ్రద్ధగా విన నిమ్మనునదే ఆకవి యాశయము.

8) వదపు ప్రౌఢియు నవరసంబుల
పొదవుకొను నభిదాన చాతురి
వెదకబోవరు తెలియుప్రౌఢులు ఈ కథావిధిని
ఇది యెరింగియు పట్టి తులసీ
ఉదకమంచు గ్రహింపగోరుదు
పదుమనాభుని మహిమ ధర్మవిచారమాత్రదను.

తన యభిప్రాయమేమి యను విషయముపట్ల కవి ధోరణి యీ విధముగా నున్నది :

9) పలక బలపము పట్టుటొక హె
చ్చల పదంబులు వ్రాయుటొక హె
చ్చలను యితరులు అనుసరింపవి రీతి బూనుట హె
చ్చలపు లేకను వ్రాయ కంఠత
విలుపుకొన్నటు వ్రాయుటొక గొ
ప్పలవదెను ఇవి వీరనారాయణుని బానిసకు.

తానీ భారతము నెందులకు వ్రాసినాడు ; రామచరిత మెందులకు

వ్రాయలేదు ? దీనికి కవి చెప్పుచున్న జవాబేమనగా, భూభారమును మోసుకొని యున్న ఆదిశేషుడు రామాయణ కావ్యముల భారముతో కృంగిపోవుచున్నాడట. అందువలన శ్రీరామ చరితలో పదమూనుటకు తనకు చోటులేదట. కాబట్టి తాను నిర్మలమగు భారత కథామృతమును పంచినాడట.

ఎందుకనగా, భారతము పంచమవేదము. దానిలో లోకమందలి పురాణములు-శాస్త్రములు అన్నియునూ అణగియున్నవని కవి భావము.

10) హరి ముఖంబున నిఖిలలోకము
లిరవుకొని యున్నట్లు భారత
శరధి నడిగిన నఖిలశాస్త్ర పురాణ పుంగములు
పరమభక్తిని పూని కృతి నవ
ధరణమును పొనరించు జనముల
దురితములు బోకార్చి బోగ్రవుము కరుణ వారినిధీ ।

ఈ కావనములో కవి ఏ విషయమును బ్రతిపాదించుటకై పూనుకొనినాడు :

11) నరవరుల కిది వీరకావ్యము
పరమవేదము ద్విజాలకును యోగి
వరులకిది తత్త్వసార మమాత్యులకు నౌయర్థ శాస్త్రము
విరహులకు శృంగారమును విద్యా
పరిణతుల కలంకార గ్రంథము
గురువనగా రచియించిన కుమారవ్యాస భారతము ।

ఇంతటి సత్కృతిని వినినవారికి కలుగు ఫలమేమి ?

12) వేదపారాయణ ఫలము గం
గాది తీర్థస్నాన ఫలము కృ
చ్ఛ్రాది తపోఫలము జ్యోతిష్టోమయాగ ఫలమును
మేదినీ ప్రియదాన ఫలము వ

స్వాద్రీది కన్యాదాన ఫలములు
ప్రోద్రిదిగా వరియించు నీకృతి పూన్కితో నాలింపన్.

ఇంతమాత్రమే కాదు. మహాభారతము యొక్క. ఫలశ్రుతి దీని కంటెనూ ఎక్కుదైనది :

13) హేమఖుర శృంగాభరణములతో
కామధేను సహస్రములను
సోమ సూర్యగ్రహణవేళను సురనదీ తటిని
శ్రీ ముకుందార్పణముగా శత
భూమిదేవుల కిడిన ఫలమగు
నీ మహాభారతము కడు నీమముగ వినువారికి

ఈ కావ్యమందల్లి దోషములను వెదకి, కటువుగా భాషించెడి వారెవరైన నున్నచో. వారివలన కవికిగాని, కావ్యమునకుగాని కళంకము కలుగనేరదు. ఎందులకనగా —

14) చోరుడిందుని నిందసేయడె
క్షీరమును క్షయరోగి రోయడె
వారణాసిని ముదుకగని నవ్వంగ నేమగును ;
భారతపు కథ కద్దుపలుకులు
క్రూర కర్మరులాడ వెరువరు
ఘోరరౌరవమును తరింపగ కోరి వినుడీ సజ్జనుల్.

కాబట్టి సమర్పణాభావముతో నీ కృతిని పఠించుటచే పుణ్యము కలుగగలదు.

భారత కథారంభము, కర్ణ, కురుపాండవుల జననము, పాండవ వృత్తాంతము, సుభద్రాపరిణయము, ఖాండవ వన దహనము వరకునూ గల ఆదిపర్వముయొక్క కథను యిరువది యాశ్వాసములలోనూ, రాజసూయము. జరాసంధ-శిశుపాలుర వధ, కపటద్యూతము, వనవాసము వరకునూగల సభాపర్వమందలి కథను పదునాలాశ్వాసములలోనూ రచించినాడు. అరణ్యపర్వపు కథయగు కిమ్మీరవధ,పాశుపతాస్త్ర సంపాదనము

ఘోషయాత్రి, యక్ష ప్రశ్నలు మొదలుగా గలవానిని యిరువది మూడా శ్వాసములలోనూ, విరాటనగర ప్రవేశము మొదలు ఉత్తరగోగ్రహ ణము, కౌరవుల ఓటమి, ఉత్తరాభిమన్యుల వివాహము వరకునూగల విరాటపర్వము కథను పది యాశ్వాసములలోనూ, మహాభారత యుద్ధ ప్రయత్నము, కృష్ణరాయబారము, కర్ణుని కవచకుండలముల భేదనము మొదలగు ఘట్టములుగల ఉద్యోగపర్వము కథను పదునొకండాశ్వాస ముల యందునూ వర్ణించినాడు.

ఇక తక్కిన భీష్మపర్వముయొక్క కథ-భీష్ముని సేనాధిపత్యము, అతని యంపశయ్య కథను పది యాశ్వాసములందుననూ, ద్రోణపర్వము కథ-ద్రోణ సేనాధిపత్యము మొదలుకొని, అతని మరణము, అశ్వత్థామ యొక్క ప్రళయకోపము నుండి శ్రీకృష్ణుడు పాండవులను రక్షించుట వరకునూగల చరితమును ఏకోనవింశతి యాశ్వాసములలోనూ, మహా భారతము నందత్యంత కరుణాన్విత ఘట్టమగు కర్ణపర్వముయొక్క కథ— కర్ణుని వృత్తాంతము, అతని వియోగములను యిరువది యేడాశ్వాసముల యందునూ చిత్రించినాడు.

శల్యపర్వమందలి మూడాశ్వాసములలో-శల్యవధయునూ, గదా పర్వములో-సుయోధనుడు సేనాపతుడై నిలచి చేసిన కురుక్షేత్ర యుద్ధ మందలి చివరి పోరాటముయొక్క కథ, అతని పరాజయము, ఊరుభం గము, ధర్మరాజు పట్టాభిషేకముల కథను చిత్రించి, భరతవాక్యముగ మరల యీ పుణ్య కృతిని పఠించిన వారికి వేదపారాయణ ఫలమునూ, గంగాస్నాన ఫలమునూ, కృచ్ఛ్రాది తపస్సుయొక్క ఫలమునూ, జ్యోతి ష్టోమయాగ ఫలమునూ, మేదినీ దానఫలమునూ, వస్త్రాది కన్యాదాన ఫలమునూ రాగలదని చెప్పి ముగించినాడు.

కుమారవ్యాసుని కావ్యపఠనమైన తరువాత చామరసకవియొక్క ప్రభులింగలీల కావ్యపఠనమును పెట్టుకొనినచో చామరసకవి కన్యాయము జరుగగలదని దలచి, ప్రాతఃకాలము భారతపఠనమైనచో, సాయంవేళ ప్రభులింగ లీలా పఠనము నేర్పాటు చేసుకొనినారు. అందుచే విద్వజ్జను

లా ఉభయ మహాకావ్యములను గురించి ఒక నిర్ణయమునకు వచ్చుట కను కూలముగా నుండును.

శివకవి చామరసుని దివ్యకృతి, అల్లమప్రభు పుణ్య చారిత్ర్య మును చిత్రించెడి ప్రథమశ్రేణి పురాణ కావ్యమగు ప్రభులింగలీలను కళాకోవిదులు శ్రావ్యముగా గానము చేసినారు.

కుమారవ్యాసుని వలెనే చామరసకవి కూడ తన కావ్యమును సాంప్రదాయ పూర్వకముగనే ప్రారంభించినాడు.

తొలుత తన యారాధ్య దైవమగు శ్రీ గురుగుహేశ్వరుని స్తుతించి అతడు తన కావ్యారంభమును చేసినాడు.

15) వేదపురుషుని సుతుని సతి స
హోదరుని మన్మని కుమారు త
లోదరికి మాతులుడు రూపను దతడు లోబడగ
వాడు గెలిచిన యతని యవ్వకు
నాటినికి గర్భమున జనించిన
ఆదిమూర్తి కావుమా గదగ్ వీరనారాయణ.

అని సూచ్యముగా కథావస్తువును నిర్దేశించి, ఇష్టదేవతా ప్రార్థ నము చేసినాడు :

16) శ్రీమదమల జ్ఞాన భక్తి
ప్రేమ వేదపురాణ శాస్త్ర
స్తోమ నుతనత చరణాంభోజ ఘన మహిమ
నామ రూపక్రియా కలాప వి
రామ యనుపమ దివ్యతేజో
వ్యోమమూర్తి గురుగుహేశ్వర లింగ శరణార్థిన్.

అటుపై ప్రమథ గణములలో పెద్దయూ, పూర్వాచార్యుడునూ యగు సంగన బసవరాజును కవి భక్తిభావముతో స్తోత్రము చేసినాడు.

17) శ్రీ మదమృతాంశు ప్రమాళ

ప్రేమికుల కానందమొసగును
నే మనంబుగ నల్లమప్రభు గురుగుహేశ్వరుడు.

అటుపిమ్మట వీరశైవ సిద్ధాంతమునందు గొప్ప యాచార్య పురుషు డగు గురుచెన్న సంగన బసవనను స్తుతించినాడు.

18) కాయమున గురులింగ జంగము
దాయ యొాదుర్గుణము సులభో
పాయమున నెదిరించి
హాయి నొసగి సమస్త భక్త ని
కాయమును పావనము చేసిన
రాయ పూర్వాచార్య సంగన బసవు శరణార్థి.

తరువాత కర్మయోగియై మహాత్ముడని పేరుగాంచిన సిద్ధరామునికి వందనముజేసి—

'మహా శివలింగ సంగప్రేమియై, శివైక్య పదవిని పొందిన 'అక్కమహాదేవి'కి నమస్కరించి, కరుణాశరధి యని బిరుదుగాంచిన మాచదేవ మహాత్మునీ, శంకరదేవునీ, కేతయ్య, కన్నయ్య మొదలుగా గల శివకవులను భక్తితో స్తుతించి, కథా ప్రారంభమునకు పూనుకొని నాడు :

ప్రభులింగలీల సామాన్యమైన కావ్యముకాదు. అది యజ్ఞులకు సుజ్ఞాన మార్గమును చూపునట్టి యొక మహాకావ్యము.

19) వీరశైవాచార మార్గ వి
చారణా భ్యంతరములను పరి
హారముగ హరకర్మ భక్తి జ్ఞానమున్నదవి
ధారుణియు నలరంగ కరుణా
కారుడై నెలకొన్న స్థలము
ద్ధారణం బొనరించు సంగన బసవు శరణార్థి.

ఈ సత్కావ్యమును తాను రచియించలేదు-శ్రీ గురుగుహేశ్వ రుడే దీనిని రచియించినాడు.

20) అల్లమప్రభు సంప్రదాయపు
సల్లలిత సన్మార్గమును నే
నెల్లరెరుగగ తెలియజెప్పుదు నుచిత వచనముల
కల్లకపటులు ఇచ్ఛగింపరు
తెల్లముగ భావుకులు భక్తియు
గల్లవారలు పొగడు దీ ప్రభులింగ లీలలను.

ఆ దృష్టితో పఠికించినచో ఈకృతి తనదికాదు. దీని వ్రాయస కాడు కూడ తానుకాదు.

21) దేవశము మాటాడినట్టుగ
ఈవిధంబుగ నా ముఖంబున
భావుకులు ప్రతిశబ్దమందలి భావమును దెలియ
జీవుడగు నా గురుగుహేశ్వర
దేవుడొప్పుగ చెప్పజేసెను
సూవె గూఢార్థముల నీ ప్రభులింగ లీలలను.

అయినచో ప్రభుదేవుని లీలా మాహాత్మ్యమేమి ?

22) శివుని లీలలు వివరముగ నే
నవుదునని చెప్పంగజాలను
అవధరించెడి వారు మానవులనుట తప్పగును
శివుని నటనా మహిమగల కథ
శివుని తమలో యెఱుగజాలిన
శివుని భక్తులు తెలియుదురు ప్రభులింగ లీలలను.

ఇది సామాన్యగాథ కాదు. అసామాన్యుడగు శ్రీ అల్లమప్రభు దేవుని దివ్యచారిత్ర్యము :

23) నోటిమాటలు వినియుమరి మో
మోట పడి వ్రాసినది కాదిది
వాటముగ తను; మనము; ధనముమ వ్యయముగాజేసి
నీటి బుగ్గ శరీరమని శివు

సూటిగా మదిలోన నిలిపిన
మేటి మగలు పఠింతురీ ప్రభులింగ లీలలను.

అంతియకాదు —

24) ఆలమును వివరింపదీ కథ
కేళి లీలల గాథ గాదిది
కూళ్లై మరి పాటకూటికి కోరిచేయనిది
ఆలమును పొనరిచు సురాశపు
కీలు కుండలిలోవి తృప్తిని
మేలుగా తెలియంగబరతు సుమీ సుబోధలను.

ఈ కావ్యరసమును గ్రహించ వలయుననినచో, వివేకము కావలయును.

25) మిత్తి మొత్తినవారి, జనన వి
పత్తు నందినవారి కథగా
దుత్త చీకటి కర్మలో బడి చిక్కు-కాలమును
రిత్త బుచ్చెడి కుమతులగు మద
మత్త జనముల గోష్ఠికాదిది
సత్తుగను సన్యాసు లెల్లరు మెత్తు రీ ప్రభులింగ లీలలను.

పరుసవేది సోకిన యినుము బంగారమైనట్లే, తా నల్పుడైననూ, తాను నుడివినది వదరుబోతు వాక్యములేమైననూ గురుగుహేశ్వరుడు ప్రీతితో తన సేవను స్వీకరించగలడను నమ్మికతో యీ కృతిని రచియించితినని కవియొక్క వినమ్రభావము.

తన యారాధ్యదైవము సామాన్యుడుకాదు-అతడు దేవదేవుడు.

26) పరుసవేదిని బెరయులోహము
మెరయుచును అపరంజియౌనటు
తిరముగాని సుఖాలపోలిక తెలివిమీరగ దేవుని
పరమభక్తిని గొల్చుచే భవ

తరణమని నెమ్మదిని గుఱుతుగ
ఎఱుగువారలు మెత్తురీ ప్రభులింగ లీలలను.

తానిచ్చట స్తోత్రము చేయుచున్నది అంతటి యాదిరుద్రుని శివ లీలయైన అల్లమప్రభువుయొక్క దివ్యగాథ. అతడొక్కడే జగదీశ్వ రుడు ! సర్వశక్తుడు !

27) దలపగా రుద్రక్రియా శ
క్తులకు మూలము విష్ణు విష్ణుని
చలన వలనములకును మూలము ఆ మహాలక్ష్మి
తెలియజెప్పగ బ్రహ్మనాదము
పలుకజాలిన దా సరస్వతి
అల సరస్వతి కమల సంభవు నాత్మ ప్రేమించు.

28) పుట్టజేసెడి గుణము బ్రహ్మకు
పుట్టజేయగ రక్షసల్పగ
నెట్టు గుణములు విష్ణుమూర్తికి, రుద్రదేవునికి
పుట్టుజేయుట రక్ష సల్పుట
గిట్టజేయుట ననెడి గుణములు
కట్టడిగ గలిగున్న గురు గుహేశ్వరు గొల్తును.

ఇంతటి మహిమాన్వితుడు మర్త్యలోకమున ప్రభుదేవుడై యవత రించి, గావించిన లీలలను తాను కావ్యముగా వ్రాయుచున్నానని తెలిపి, కవి కథా ప్రారంభమునకు పూనుకొనినాడు.

చామరసకవి ఇరువది యైదాశ్వాసములలో అల్లమప్రభు దేవుని యిహ లీలలను వర్ణించినాడు.

పార్వతీ పరమేశ్వరుల సంవాద కారణముతో జనించిన మాయ, మద్దెలగాడై వచ్చిన అల్లమునిపై మరులుగొన్నది. అతడామెకు లభించక పోవుట, విరాశజెందిన పార్వతి తన సాత్విక కళను ధరకు బంపుట, మహాదేవి కథన వృత్తాంతము, బసవాది ప్రమథుల యవతారము, సిద్ధ రామ, గొగ్గయ, ముక్తాదేవి, గోరక్షక, బసవేశ్వర మొదలగు శివయోగు

లకు చేసిన ఉపదేశము అద్భుతములు-అనుభవ మంటపమున శూన్య సింహాసన మధిష్ఠించి, భక్తుల నుద్ధరించిన ప్రభులీల లన్నింటినీ అతడు మిక్కిలి స్వారస్యముగా వర్ణించినాడు.

ఈ కావ్య పఠనము ముగిసిన పిమ్మట పండితులు-పామరులు ఏది ఉత్తమ గ్రంథమను విషయమును నిర్ణయించలేకపోయినారు. ఉభయ కావ్యములూ వారికి సమాన సంతసమునే కలిగించినవి. ఉభయ గ్రంథ ములూ తమ తమ ఓజస్సుతో ప్రకాశించినవి. తమ సత్యాదర్శమును విశదపరచినవి. విశ్వరూపమును ప్రదర్శించినవి. శ్రోతలా కావ్యము లను తుదముట్టగావిని, తాము రసగంగలో మునిగి పునీతుల రైనట్టుగా భావించినారు. ఈ కావ్య సమాధినుండి మేల్కాంచి, ఉభయ కృతులలో నేది హెచ్చు రుచిని-పాకమును గలిగియున్నదని చెప్పుటకు వా రసమర్థు లైనారు.

వారు తమ తీర్మానమును వెలిబుచ్చలేక సామ్రాట్ ప్రౌఢదేవ రాయల వైపు చూచినారు. దీనిని లక్కనామాత్య-జక్కనాచార్యులు సమ ర్థించినారు.

శ్రోతల డోలాందోళన మానసమును గ్రహించిన ప్రౌఢదేవ రాయలు బహు జాగ్రత్తగా తూచి చేసిన తన నిర్ణయమును వెలిబుచ్చి నాడు.

"ఆంధ్ర కర్ణాట సామ్రాజ్య సరస్వతీ పుత్రులారా!

మీరు నాపై యత్యంత మహత్తరమునూ-బాధ్యతాయుతమునూనగు భారమును మోపుచున్నారు. ఈ ఉభయ మహాకావ్యముల నామూలాగ్ర ముగా తమరు విన్నారు. ఈ రెండింటిలో నేది సర్వోత్కృష్టమగు మహా కావ్యమని తీర్మానించు టతి కష్టతరము. ఈ గ్రంథముల గొప్పతనమును గ్రహింపగల శక్తిగాని, పాండిత్య-ప్రతిభలుగాని, ఈ మహాకవులు కనిన జీవన దర్శనముగాని నాకులేవు. నేనొక సామాన్య రసికునివలె, సహృదయుడగు కావ్యాభాసివలె ఈ యమూల్య కృతుల సౌరభము నాఘ్రాణించి సంతోషించినాను. నాయల్ప బుద్ధికి తోచిన ఒకటి రెండం శములను సంతోషముగా నేను మీ ముందుంచగోరుచున్నాను. వాటి

యాధారముమీద మీరీ కావ్యముల ఘనతను నిర్ణయించుకొనవచ్చును. ఈ కార్యమును నాకంటెనూ, మీకంటెనూ రానున్న ప్రజలే నిర్ణయించ గలరు .కాలపురుషుడు మాత్రమే ఈ కావ్యములపట్ల తన తీర్పు నీయ గలడు.

ఈ ఉభయ గ్రంథములను సమన్వయదృష్టితో పరిశీలించినచో కనబడు అంశమేమనగా, ఒకటి ఆత్మ ప్రకాశమునకు కారణమైన లౌకిక గ్రంథము, మరొకటి ధార్మిక గ్రంథము.ఒకదానియందు పురాణేతి హాస ములు కావ్యవస్తువు లైనచో, వేరొకదానియందు కావ్యవస్తువే పురాణేతి హాసములుగా వికాసము పొందినది. ఒకటి మానవులకు జీవితమును పరి పుష్టముగా జేసి, వారిని కావ్యామృత పానముతో అమరులనుగా జేసిన. వేరొకటి ప్రాణముతో కైలాసము జేరిన వారి అమర చారిత్ర్యము.ఒకటి శ్రీకృష్ణుని లీలావినోదము, వేరొకటి అల్లమాంకిత గురు గుహేశ్వరుని ప్రభులింగలీల. వీటిని మనము వేరువేరుగా తూచి విమర్శించి చూడవల యునుగాని, ఒకే తుల యందిడి తూచి చూచి నిర్ణయించుట తప్పు.

అయిననూ, ఉభయుల మహాకావ్యములలోనూ అనేక సాదృశ్య ములున్నవి. ఇరువురునూ కర్ణాటభాషా ఛందస్సులో నొక జాతిదగు షట్పది గీతములలో పండిత పామరరంజకముగా తమతమ కావ్యములను రచించినారు. ఈ రెండు కావ్యముల శైలి, శయ్య, పాకము, వస్తువిన్యా సము, కథానక క్రమములలో చాల వ్యత్యాసమున్నది. ఈ దృష్టితో నివి రెండునూ వేరువేరు కావ్య శృంగములుగా నిలువగలవు.

కుమారవ్యాసుని గంభీరమగు శైలి, పురుషయుక్తమగు నుడికట్టు, భారతమువంటి వీరరస ప్రధానమగు కావ్యమునకు తగియున్నది. ప్రభు లింగలీలయొక్క శైలి, శాంతిరస ప్రధానమైన ప్రభుదేవుని దివ్యచరిత కనురూపమునూ, మృదుమధురమునూ, సరస గంభీరమునూ, ప్రశాంత మునూ నైయున్నది.

కావ్యరీతిని జూచినచో, కుమారవ్యాసు నిది రూపక విధానము. అతడు రూపక సామ్రాజ్య చక్రవర్తి। అతని భాషావద్ధతి కూడ

స్వతంత్ర మార్గము ననుసరించినది. పద ప్రయోగములలో సైత మతడు ఐంద్రజాలికుడు. అతని సామాన్య పదముల అర్థవ్యాప్తియునూ, భావనా పటిమను గలుగజేయు అద్భుత సామర్థ్యమునూ యెవరి నాశ్చర్య పరవశు లనుగా జేయదు ?

అంతియగాక కుమారవ్యాసుడు వర్ణనాజీవి. అతని కావ్యములో నవరసముల గంగా ప్రవాహము పారుచున్నది. అతని పాత్ర చిత్రణా శక్తికూడ నద్భుతమైనది. అయిననూ అతడు భక్తజీవి. శ్రీకృష్ణుని లీలల నెంత వర్ణించిననూ అతనికి తనివిదీరదు. ఒక్కమాటతో అతడు 'కావ్య గురు'వని చెప్పుకొనిననూ, తాను వీరనారాయణుని సేవకుడను, ఆస్వామి యొక్క వాయసకాడను, అని చెప్పునంతటి నమ్రత, వైరాగ్యమునూ గలదు.

ఇక ప్రభులింగ లీలను గురించి చెప్పదలచినచో, ఒక విరాగి తాను కనిన దివ్యస్వప్నమువలె నున్నది. అతడు పండిత పామర రంజనమునకే కాదు-వారి ఉద్ధారముకొరకై యీ కావ్యమును రచియించినాడు. అతడు కావ్య కన్యను సాంప్రదాయమని చెప్పబడు అష్టాదశ వర్ణనల శృంఖలములనుండి విముక్తనుజేసి, సహజ సౌందర్యముతో ప్రకాశింప జేసినాడు.

అతనిలోకూడ దృష్టాంతములకునూ, రూపకములకునూ కొదువ లేదు. వర్ణనా విభాగమున కంటెనూ, కథాభాగమే హెచ్చుగానుండి, పాత్రలు-దృశ్యములు కనులకు గట్టినట్టున్నవి. భాష సరళముగా నున్ననూ పటుత్వముగా నున్నది. భారతమందు గానబడు పటిమ, గంభీర శైలి, శక్తి మొదలగున వీ ప్రభులింగలీల యందంతగా లేకున్ననూ, ఆ కావ్యమునగల లాలిత్యము, మనోహరత్వము దీనియందు ధారాళముగా నున్నది. చరిత్ర నిరూపణా దృష్టితోడనూ,తాత్త్విక విషయముల సులభ వివేచనా దృష్టితోడనూ యీ ప్రభులింగలీల యుత్తమ కావ్యము.

ఒక్క మాటతో జెప్పవలయుననినచో, కన్నడవాణీ వేణి నలంకరించి, చిరకాలము శోభించగల నీ అమరకావ్య కుసుమద్వయములునూ

మిక్కిలి సుందర తరముగను, శ్రేష్ఠముగనూ నున్నవి. ఈ మహాకావ్య ములు రెండునూ కర్ణాట సారస్వత భాండాగారమందలి రెండు అమోఘ రత్నములు. సాహిత్య ప్రపంచమున నెల్లపుడునూ కౌతుకమును కలిగిం చుచూ, రసికుల కానందమును కలుగజేయు ఓజస్సుతోడనూ, నిత్య నూతనత్వముతోడనూ కూడియున్న రసవాహినులుగా నున్నవి.

ఈపై జెప్పిన విమర్శనాదృష్టితో నే నీ ఉభయ మహాకావ్యము లకునూ కనకాభిషేక గౌరవము జరుగవలయునని చాటి చెప్పుచూ, తీర్పు నిచ్చుచున్నాను".

సార్వభౌముల మాటలకు సభ సంతోషసాగరమున లేచి యాడి నది. కుమారవ్యాస, చామరసకవుల అభిమానులు కరతాళధ్వనులతో సంతోషమును వెల్లడిజేయుచూ, సార్వభౌముని తీర్పునకు తమ సమ్మ తిని తెలియజేసినారు. కాని యీ తీర్పువలన తమ యభిమాన కావ్యమున కవమానము జరిగినదని భావించిన వారుకూడ ఆ సభాసదులలో పెక్కురు గలరు !

# 24

# రక్తాభిషేకము

ప్రౌఢదేవరాయల తీర్పునకు సంతోషించని పెద్దలలో ముకుంద పెద్ద పండితుడుకూడా ఒకడు. అతడు వృందాచార్యునితో—

"సార్వభౌములు కుమారవ్యాసుని కృతిని చాల అన్యాయము జేసి నారు. వారు దానిని చరిత్రలో పుట్టి-పోయిన అల్లమప్రభువు జీవితమును చిత్రించు ప్రభులింగలీలతో పోల్చి. యపచార మొనరించినారు. పంచమ వేదమగు భారత మెచ్చట? ఇదెచ్చట? హస్తితో మేషమును బోల్చు

టయా ? భారత కథామంజరికి గల గొప్పతనము ప్రభులింగలీల కెట్లు రాగలదు ? సార్వభౌములు శైవులగుటచేతనూ, పరివ్రాజక క్రియల యభిమానులగుట చేతనూ చామరసకవి కృతికి మన్నన నొసగి, మహా కావ్యమగు భారతమునకు అవమానము జేసినారు. ఇది మిక్కిలి యన్యాయము. లక్కణామాత్య-జక్కణాచార్యుల ప్రభావముచే సర్వోత్కృష్ట మగు నొక కావ్యమును, సామాన్య కావ్యముతో బోల్చి విలువ కట్టుటయా ? కుమారవ్యాసుని కావ్యమునకు మాత్రమే జరుగవలసిన కనకాభిషేక సన్మానము ప్రభులింగలీలకుకూడ చేయుటయా? దీనిని మనము ప్రతిఘటించవలయును" అని తన హృదయమందలి ద్వేషమును వెల్లడించినాడు.

"పండితులూ ! దీనికి మనమొక ఉపాయము చేయుదము" అనినాడు వృందాచార్యుడు.

"ఏమి ఉపాయము ?"

"కుమారవ్యాసుల కావ్యమును వేరొక యుత్సవముజేసి మనమెందులకు గౌరవించరాదు ? దానిని బంగారు అందలములో నిడి, ఎందులకు రాజధానిలో ఊరేగింపు చేయరాదు ?"

"ఔను, యిది యోగ్యమైన సలహాయే ! రేపే మనమీ కార్యమునకు గడంగుదము. రాజధానిలో నవరాత్రోత్సవములకై వచ్చిన పండితులుండగానే, వారి సముఖముననే యీ యూరేగింపును చేయుదము" అని ముకుందపెద్ద తీర్మానించినాడు.

అటు విరక్తకవి చామరసు వ్రాసిన అతి లోకోత్తరుడునూ, మహేశ్వరుని అపరావతారుడునూ, తన యద్భుత జ్ఞానతేజముతో బసవన, సిద్ధరామ, గోరక్షకేత్యాది మహద్వ్యక్తుల గుణదోషములనూ, హెచ్చుతగ్గులనూ దిద్దిన ప్రణవ స్వరూపుడగు శూన్య సింహాసనాధీశ్వర అల్లమ ప్రభువుయొక్క దివ్య కథానకమును చిత్రించు యద్భుతకృతి ప్రభులింగ లీలతో, చచ్చినవారి కథయగు మహాభారతమును బోల్చి, ఆ రెండింటికినీ కనకాభిషేక మొనర్చినది, జక్కణాచార్య నంతటి మహావ్యక్తి మనస్సునకు కూడ అసమ్మతమైనది.

ఈ విషయములో తన యన్నగారి అసమ్మతిని జూచి, లక్కనా మాత్యుడు—

"ఓ నిందన్నగారూ ! సామ్రాట్టులు కేవలము లౌకికన్యాయ మవలంబించి ఆ విధముగా తీర్పు జేయవలసి వచ్చినది. చామరసకవి కృతి కీ సన్మానము లభించినచో, సామ్రాజ్యము నందధిక సంఖ్యలో నున్న వైష్ణవ మతస్థులకు బాధగా నుండుననియూ, వారు తమ నపార్థము చేసుకొన వచ్చుననియూ, దూరదర్శియై యీ విధముగా రెండు కావ్యము లకునూ సమానగౌరవ మొసగి సన్మానించినారు. ఇందులో స్వార్థమేది యునూలేదు. కేవల లౌకికన్యాయమిది" అని సమాధానపరచ బ్రియ త్నించినాడు.

"లక్కనా ! నాచింత యదికాదు, మునుపే మన శివకవుల కృతు లను చులకన జేయుచున్న ఈ వైష్ణవు లిపుడు తమ కృతికి రాజసన్మా నము లభించుటచే వూరకుండగలరా ? భారతమును నేను చచ్చినవారి కథ యని హేళనజేసి యుంటిని, నీకు జ్ఞాపకము గలదా ? ఇపు డటువంటి మహాభారతమునకు సామ్రాట్టులు సన్మానముజేసి,మన ప్రభు దేవుని దివ్య చరితతో సమానముగా గౌరవించినారు. అట్లు చేయుటవలన వారి ధర్మ సమన్వయదృష్టి వ్యక్తమైననూ, తమ ధర్మముపట్ల అతిశయమైన అంథ శ్రద్ధయునూ, యితర ధర్మముపట్ల దానికంటే వెక్కుడు తిరస్కార భావ మునూ గలిగియున్న ముకుందపెద్ద, వృందాచార్యు లంతటి వ్యక్తు లీ తీర్మానముతో యిక వూరుకొనగలరా ? వారు తమ మతముయొక్క గొప్పతనమును చాటుటకై మరల నే కార్యమునకు బూనుకొనగలరో నెవరెరుంగుదురు ? ఈనాడు కుమారవ్యాసుని భారతమునకు చెందిన గౌర వము.తమ మతమునకు గలిగిన గౌరవమని భావించి, పరమత గ్రంథము లనూ, కవులనూ దూషించుటకు పూనుకొనక యుండగలరా? వారిముందు ప్రతిన జేసిన నా మాటకు లభించిన విలువ ఏమి ? ఇది నాకు జరిగిన పరాభవము మాత్రమేకాదు—శివ పరివ్రాజకు లందరికినీ జరిగిన పరా భము !"

అని విచారముగా జక్కనాచార్యు లనినాడు. ఇదివిని లక్కనా మాత్యుడు గంభీరుడై కూర్చొనినాడు.

అంతలో ఎవరో యొక జంగమయ్య వచ్చి జక్కనాచార్యుని సందర్శించినాడు.

"ఏమి విషయము విరూపాక్షా ?" జక్కనాచార్య డడిగెను.

"అన్నగారూ, ముకుందపెద్ది మొదలగు వైష్ణవులు రేపటి రోజు తమ కుమారవ్యాస భారతమును మన కవమానము జేయవలయునను యుద్దేశముతో మన వీధిలో ఊరేగింపు చేయుటకై నిశ్చయించినారు. ఈవార్త తెలిసి, మన విరక్త మతముయొక్క జంగములుకూడ చామరస కవి ప్రభులింగలీల నిదేరీతిని ఊరేగింపుజేసి వారి యహంకారము నణచుటకై ప్రయిత్నించుచున్నారు. దీనికి మీ యనుజ్ఞకొరకై ఎదురు చూచుచున్నారు" అని విన్నవించుకొనినాడు.

ఈ మాటవిని జక్కనాచార్యుడు విచారముగా నవ్వుచూ లక్కనామాత్యుల ముఖ మవలోకించినాడు.

"లక్కనా ! నేను చెప్పిన మాట లబద్ధములు కాలేదు చూడుము. ఇంత త్వరలో మతేతరులు మనమీద ప్రతీకారము తలపెట్టగలరని నేను భావింపలేదు. కుమారవ్యాసుని భారతమునకు లభించిన రాజమర్యాదను వారు తమకు లభించిన దిగ్విజయముగా భావించి, మనల నవమానించుటకై యీ యుత్సవమును జేయుచున్నారు తెలియునా ?" యని బాధగా పలికినాడు.

"అయినచో, మనమెందులకు ప్రభులింగలీల నూరేగించి, వారికి తగిన జవాబు చెప్పరాదు ?" అని లక్కనామాత్యు డనినాడు.

"నీవునూ యీ యభిప్రాయమునే కలిగియున్నావా ?" అని యాశ్చర్యపడుచూ నుడివినాడు జక్కనాచార్యుడు.

"ఔను అన్నగారూ ! ముకుందపెద్ది వంటి ధర్మపాషండులకు మనము బుద్ధిజెప్పు మార్గ మిదియొక్కటే. అజ్ఞాత జీవనుడుగా నుండిన వానిని రాజాస్థానమునకు దోడ్కొని వచ్చి మనమెంతటియవివేక మొనర్చితిమి ! అతనికి చేసిన మేలు పాముకు పాలుదోసి పెంచిన విధముగా నైనది. మనమీ విషయమై ఊరక కూర్చొని యుండినచో శివభక్తుల

దూషణకూ, మన శాస్త్రములను ఖండించుటకూ వారికి నూతనోత్సాహము వచ్చినట్లు కాగలదు. మనము వారి యుత్సవమునకు ప్రతిగా వేరొక యుత్సవమును చేసి, వారికి సరియైన బుద్ధి గరపవలయును" అని యుద్రేక పూరితుడైనాడు లక్కనామాత్యుడు.

ఇష్టములేకపోయిననూ యీ కార్యమునకు జక్కనాచార్యుడు సమ్మతించవలసి వచ్చినది.

జక్కనాచార్యుని సమ్మతి లభించిన పిమ్మట విరక్తమత సన్యాసులు ద్విగుణీకృతోత్సాహముతో తమ అభిమాన కావ్యమునకు సన్మానము చేయ నుద్యుక్తులైనారు.

ఈ విధముగా రాజధానిలో వైష్ణవ-శైవుల నడుమ హఠాత్తుగా నేర్పడిన వైషమ్యమునకు వలయు భూమిక సిద్ధమైనది.

ముకుందపెద్ద, వృందాచార్యుడు మొదలగువారు తమ నిర్ణయము మేరకు కుమారవ్యాసుని భారతమును బంగరు పళ్ళెరములో నిడి, దానిని సన్నని జరీ వస్త్రముతో నలంకరించి, దివ్యమైన పల్లకిలో బెట్టి, దానిని స్వయముగా తామే మూపులపై నిడుకొని, కుమారవ్యాసునకు జయకారములు పలుకుచూ, భారతముయొక్క గొప్పను చాటుచూ, రాజధాని యందలి ముఖ్యమైన వీథులలో నూరేగింపు బయలుదేరినారు. వారివెనుక ఛత్రి చామరములవారు, వారిని వెన్నంటి నూరారుమంది వైష్ణవులూ, కుమారవ్యాసుని అభిమానులూ నడచినారు.

బయలుదేరినపు డతి స్వల్పసంఖ్యలో నుండిన యీ యూరేగింపు ముందుకు నడచిన కొలదిని మహాసైన్య వాహినిగా మారినది.

అటువైపున లక్కనామాత్యుని నేతృత్వము క్రింద విరక్తమతము వారగు జంగములూ, చామరసకవి యభిమానులూ ప్రభులింగ లీలను బంగారు అందలములోనిడి, అదేవిధమైన ఘోషణలను వెలువరించుచూ వచ్చినారు.

ధర్మకర్మ సంయోగమువలన ఉభయపక్షముల ఊరేగింపు జనులందరునూ జక్కనాచార్యుని మహామందిరమువద్ద సంధించినారు. కాని

దురదృష్టవశమున ఏమి జరుగకూడదని వా రాశించి యుండిరో అదియే జరిగినది. ఉభయపక్షముల నడుమ హఠాత్తుగా వాద-వివాదములు చెల రేగి, అది యనూహ్య విధానములో పర్యవసానము నందినది.

మహామాత్యుని మహామందిరము వద్దకు వైష్ణవుల ఊరేగింపు గుంపు చేరగనే ఎవరో "కుమారవ్యాసులకు జయమగుగాక ! మహాభార తము ఆచంద్ర తారార్కమగుగాక !" అని యరచినారు. ఇంతలో వేరొక వైపునుండి ఎవరో "చామరస కవికి ధిక్కారమగుగాక ! ప్రభులింగ లీలకు పురస్కారమగుగాక !" అని ఘోషించినారు.

ఇదివిని శైవులు-చామరసుని యభిమానులు మండిపడి కుమార వ్యాసుని, మహాభారతమునూ తమ నోటికి వచ్చినట్టు దూషించినారు.

ఈ పోరు అంతటితో ఆగలేదు. కొందరు మతాభిమాను లీ హేళ నతో నుద్రేకులై, రాజమార్గమును బాగుచేయుటకై యచ్చట వేసియున్న రాళ్ళు తీసుకొని ప్రతికక్షులపై రువ్వినారు.

ఈ చర్యలతో మండిపడిన ప్రజలు ఉత్సవముయొక్క యాశయ మును మరచి, ఒకరినొకరు రాళ్ళతో రువ్వుకొన మొదలిడినారు. క్షణ కాలములో నచ్చట రాళ్ళవర్షము కురిసినది. ఉభయపక్షములవారు ఒకరిపై నొకరు పడి ఘోరముగా పోట్లాడుకొనినారు. కొందరికి గాయములైనవి, మరికొందరికి వస్త్రములు చీలికలు-పేలికలుగా చిరిగిపోయినవి.

ఇంత జరిగిననూ పోరాటములో తమ పూజ్యగ్రంథములకు అప చారము జరుగరాదని యిరుపక్షములవారునూ జాగ్రత్త వహించి, వాటి రక్షణకై పూనుకొనినారు.

ముకుందపెద్ద పండితుడు అందలములోనున్న కుమారవ్యాస భార తము పరమతము వారిచే నాశనము కాగూడదని,దానిని రెండు చేతులతో నెత్తి శిరముపై నిడుకొని, యచటినుండి సురక్షితమైన ప్రదేశమునకు వెళ్ళుటకై ప్రయత్నించినాడు.

అతని యీ ప్రయత్నమును జూచి ఎవడోయొక్క ధర్మద్రోహి గురిచూచి అతని తలపై బడితెతో మోదినాడు. ఆ దెబ్బకు ముకుందపెద్ద

'అయ్యో !' అని అరచుచూ నేలగూలి మరుక్షణమందే ప్రాణములు విడచినాడు.

అతడు నేలగూలిన వెంటనే యతని అనుచరు లచటికి వచ్చినారు. కాని అంతలో జరుగగూడని అనాహుతము జరిగిపోయినది. ముకుందపెద్ద తన కావ్యమునూ-తన మతమునూ రక్షించుటకై తననే బలిగావించుకొనినాడు.

తమ నాయకుడు మరణించుట జూచి వైష్ణవులు, దానికి కారకులైన హత్యాకారులమీద పగదీర్చుకొనుటకై దైత్యావేశముతో ముందుకు దూకినారు. కాని యీ యావేశమును జూచి ప్రతికక్షి లచటినుండి కాలు తీసినారు.

ఇదంతయునూ క్షణములమీద జరిగిపోయినది.

ఇంతలో తమ యింటిముందు జరిగిన కోలాహలముచే దిగులంది లక్కనామాత్య-జక్కనాచార్య లచటికి వచ్చినారు.

క్షణకాలములో వారికి జరిగిన హత్యాకాండయొక్క స్వరూపము తెలిసిపోయినది. వా రుద్రేక పూరితులైన ప్రజలను సమాధాన పరచ బ్రియత్నించి, ముకుందపెద్దకు ఔషధోపచారములు జరుపుటకై జూచినారు.

లక్కనామాత్యుడు రాజవైద్యుల దోడ్కొని వచ్చుటకై దూతలను బంపినాడు. కాని వారు వచ్చునంతలో ముకుందపెద్ద యిహలోకయాత్ర ముగిసిపోయినది. అతడు తానేది సత్యమని భావించెనో దాని రక్షణకై తన సర్వస్వమునూ బలియిచ్చి హుతాత్ముడైనాడు.

ఈవార్త మెరపువలె అతని భార్యకు తెలిసినది. ఆమె పిచ్చిదాని వలె అచ్చటికి పరుగున వచ్చినది. భర్త మృతకళేబరముపై బడి గోల్లుమనినది.

చివరకామె ఏమని భావించినదో, తన భర్త మృతకళేబరము నతి కష్టముపై నెత్తుకొని నేరుగా అంతఃపురమునకు నడచినది. ఆమె నడ్డుటకై జూచిన వారందరి ప్రయత్నములునూ వ్యర్థములైనవి.

ఆమె బాధాగళముతో పరిపరి విధములుగా రోదించుచూ తన పతి శవము నెత్తుకొని పిచ్చిదానివలె నడువసాగినది.

వృందాచార్యుడు మాత్రి మామెను నీడవలె వెన్నంటి వెళ్ళినాడు.

ఆమె నేరుగా సామ్రాట్ ప్రౌఢదేవరాయల అత్యవసర సమావేశ సభ ముందుకు వచ్చి, అచ్చట భర్త మృతశరీరమును బడవైచి రోదించుచూ కూర్చున్నది.

ఈ రోదనమును విని సార్వభౌము డచ్చటి కరుదెంచినాడు.

సార్వభౌముని జూడగనే ఆమెకు దుఃఖము పెల్లుబికి వచ్చినది. ఆమె పిచ్చిదానివలె యరచుచూ తన వియోగ భరమును ప్రదర్శించినది:

"ప్రభూ ! ఇపుడు మీకు శాంతి లభించినదా ? ఇక మీరునూ, మీ శివ పరివ్రాజకులునూ సుఖముగా నుండుడు. ఈ శిక్ష విధించవలయు ననియేనా అగ్రహారములో సుఖముగా నుండిన మమ్ములను మీరిచ్చటికి తోడ్కొని వచ్చినది ? అయ్యో దైవమా ! నిరపరాధులమైన మాకెంతటి శిక్షను విధించితివి ? మేము చేసిన యపరాధమేమి? వైష్ణవులుగా జన్మించుటపరాధమా ? ఆ మతస్థులమై ఈ హిందూ సామ్రాజ్యములో బ్రతుకగోరు టపరాధమా ? అయ్యో ! నా స్వామిని ఈ నీచులు-ధర్మపాషండులు హత్యజేసినారు. నా మాంగల్యము నపహరించినారు.: నా వైధవ్యమును జూచి మీకు తృప్తి కలిగినదా ? అయ్యో స్వామీ ! నన్నీస్థితిలో విడచి స్వర్గమునకు వెళ్ళుటకు మీకెట్లు మనసు వచ్చినది ? హే ముకుందా ! నీకు నా జీవితమును నాశమొనర్చుటకు మనసెట్లు కలిగినది? నాపతి సౌభాగ్యము నీకు సహింపకపోయినదా ? హే, మాతా ! జగజ్జననీ ! నిన్ను తల్లియని సేవించుచూ వచ్చితినే, నీ వెందులకు నీ భక్తులపై కోపగించుకొనినావు ? వారి ప్రాణములను అన్యమతముల వారిచే ఎందులకు హరణము జేయించితివి? నా ప్రాణము నీకు ప్రియమైనచో ఇదిగో తీసుకొనుము. నేనునూ నీ సన్నిధికి వచ్చెదను. మా ఉభయులనూ నీ ఒడిలో వేసుకొనుము ! జీవితమున మేము విడివడినవారము గాము. ఇక మరణమున ఎందులకీ వియోగము ? తల్లీ ! యిదిగో వచ్చుచున్నాను. నీ

కుమార్తెకు స్వాగతమిమ్ము! దీవించుము! అచ్చటనైననూ నా మాంగల్య భాగ్యము స్థిరముగా నుండనిమ్ము. స్వామి, నేను నీవద్దకు వచ్చుటకై నిశ్చయించినాను. నీవు నన్నడ్డుకొనవలదు ! నీవులేని పిమ్మట నాకు బ్రతుకులేదు. ఇదిగో, వచ్చితిని ! మీపాద సేవాభాగ్యమును నాకు ప్రసాదింపుడు" అని పలికి అచ్చటినుండి హఠాత్తుగా లేచి నిలిచి చుట్టునూ పరికించినది.

ఆమె కంటికొక ఱాతిస్తంభము కనబడినది. సూటిగా వెళ్ళి ఆమె దానికి తన తలను ఢీకొన్నది. తల పగిలినది. శరీరము రక్తాభిషేకము చేసికొనినది. ఆ సాధ్వి ఒక్కసారిగా అరచి నేలగూలినది. ఆమె పెదవులు కదలినవి. మెల్లగా ధ్వని వినబడినది.

"నన్ను క్షమింపుడు స్వామీ ! వచ్చుటకు తడవైనది"

ఆమె తన కార్యములో కృతకృత్యురాలైనట్టుగా తృప్తితో కనులు మూసి తన యిహలోక యాత్రను చాలించినది. ఆమెను కాపాడవలయునని సార్వభౌముడు ప్రయత్నించినాడు. కాని క్షణములో యింతటి దారుణకృత్య మతని కనుల యెదుటనే జరిగిపోయినది.

సామ్రాట్ ప్రౌఢదేవరాయలు శిలావిగ్రహమువలె నిలబడి చూచినాడు. బ్రతుకు నందెంతయో, మరణముననూ అదే విధముగా ముకుందపెద్ద దంపతులు వెనువెంటనే యిహలోక ఋణమును దీర్చుకొనినారు. వారి మృత శరీరములను జూచి, సార్వభౌముని నోటిద్వారా 'అయ్యో, ఎంతటి అకార్యమైనది !' అను బాధామిశ్రిత వాక్కులు బయల్వెడలినవి. సామ్రాట్ ప్రౌఢదేవరాయలకు క్షణకాల మిదియంతయునూ ఒక దుస్స్వప్నమువలె దోచినది. అతడు తన కనులను తానే నమ్మలేకపోయినాడు.

నిర్జీవములైన తన కనులతో ఆ దృశ్యమును దిలకించినాడు.

అతని కనులఎదుట ముకుందపెద్ద దంపతులు చచ్చిపడియున్నారు వారి దేహములు రక్తప్రవాహములో తేలియాడుచున్నవి. ఈ హత్యాకాండకు కారకులెవరు? ముకుందపెద్ద ఎందులకు మరణించినాడు? అతని సతి తన కనులఎదుట ఎందుల కాత్మహత్య చేసుకొనినది ?

– – –

ప్రౌఢదేవరాయ లా కళేబరములను రెప్పవేయక చూచినాడు. అతని కనులవెంట అశ్రువులు ధారగా ప్రవహించ సాగినవి. అతనికి ఆ దంపతులవలన పొన్నలాదేవి యన్వేషణములో జరిగిన సహాయము తలపునకు వచ్చినది. వారిని బలవంతముగా తాను రాజధానికి తోడ్కొని వచ్చినది కూడ జ్ఞప్తికి వచ్చినది. రాజధానికి వచ్చిన తరువాత అతడు వారితో ఎన్నియో రసఘడియలను గడపినాడు. వారు పొన్నలాదేవికి తలి దండ్రులవలె యుండిరి. అటువంటివారి కెంతటి మరణము సంప్రాప్త మైనది ? అదియునూ తన మూలముననే ? ఇదంతయునూ దలచుకొని సార్వభౌముడు కింకర్తవ్యతా మూఢుడైనాడు. అతనికి తాను స్వప్నలోక ములో విహరించుచున్నట్టు దోచినది. ఆహుతాత్ముల కళేబరముల రౌద్రి తను చూడలేక కనులు మూసుకొన్నాడు. కాని ముకుంద పండితుని భార్య యనిన మాటలింకనూ చెవులలో కఠోరముగ ప్రతి ధ్వనించుచునే యున్నవి.

"ప్రభూ ! ఇప్పుడైననూ మీకు శాంతి లభించినదా ? మీరునూ, మీ శివ పరివ్రాజకులునూ సుఖముగా నుందుడు. మమ్ములను మతాంతరు లకు బలియిచ్చుట కొరకనియే యిచ్చటికి దోడ్కొని వచ్చినారా ?"

ఈ వాక్కులు శూలములవలె సార్వభౌముని బాధించసాగినవి. చివర కత దచ్చట నిలువలేక అంతఃపురమునకు వెనుదిరిగి, ఏకాంత ముగా కూర్చొని ఏదియో చింతించసాగినాడు.

అతని మానసపథమున కుమారవ్యాస, చామరస కవులు కనబడి "నీవు కనకాభిషేకమునకై బ్రియత్నించి, మా కావ్యములకు రక్తాభిషేక మును జేసినావు" అని వెక్కిరించినట్టుగా దోచినది. ఆ దృశ్యమును జూడలేక సార్వభౌముడు కనులు మూసుకొనినాడు.

అతని కీ హత్యాకాండమంతయునూ తనవలననే జరిగినదను వ్యథ గలిగినది.

కాని యిందులో తన తప్పేమిగలదు? తాను ఆంధ్రకర్ణాట సాహి త్యముమీద గల యభిమానముతో ఆ రెండు మహాకావ్యములకునూ కన

కాభిషేకము జేయ ప్రయత్నించుట యపరాధమా? శ్రీనాథ కవిగారి శృంగారనైషధమునకు పురస్కృతి లభించిన విధముగానే యీ కన్నడ కావ్యములకు సన్మానము లభింపనిమ్మని యాశించు టపరాధమా? చామరస, కుమారవ్యాసుల కావ్యములు రెండునూ సమానమైనవని తాను తీర్పు నిచ్చుట నేరమా? సామ్రాజ్యుల కేదియునూ తోచలేదు.

"దీనికి నేను బాధ్యుడనుగాను. ఈ విషయములో నేను విరవ రాధిని" అని యతని మనసు చెప్పసాగినది.

కాని, దానికి జవాబుగా అంతరాత్మ యనినది:

"నీవు సార్వభౌముడను విషయమును విస్మరించకుము. ప్రజా కోటి రక్షణ-పోషణలు నీకు సంబంధించినవి. నీవు సామ్రాజ్యమునగల మతముల నన్నింటినీ సమాన గౌరవముతో చూడవలయును. సర్వ ధర్మములందునూ సమాన శ్రద్ధగలిగి యుండవలయును. కాని నీవట్లు నడచుకొనక విరక్తుల కూటమిలో చేరి, వారి మతధర్మములు సామ్రాజ్య ములో వ్యాపకము జేయుటకై పరోక్షముగా బ్రయత్నించలేదా? దాని ప్రత్యక్షఫలమే యిది: అనుభవించుము"

"కాని నే నెన్నడునూ అధర్మ ప్రవర్తకుడను కాలేదు. సామ్రాజ్య మందలి ఏ మతమునకునూ-ధర్మమునకునూ అన్యాయము చేయలేదు"

"అది యసత్యము! ఆత్మకళ్యాణము పేరుతో నీవు రాష్ట్ర కళ్యాణమును మరచినావు. శివ పరివ్రాజకులగు విరక్తుల కూటమిలో జేరి. జక్కణాచార్యుని ప్రభావమునకు లోనై. విజయనగరములో వింకొక ధార్మిక కాంతిని బరువజూచినావు. దాని ప్రత్యక్ష పరిణామ మీ ముకుంద పెద్ద బలిదానము తెలిసినదా?"

"ఇందులో నా యపరాధమేమి గలదు?"

"నీవు సార్వభౌముడవై ప్రజలందరినీ ధర్మముగా పరిపాలింప వలయును. కాని నీవొక విశిష్టధర్మము పక్ష మవలంబించి, దాని తత్త్వ ముల ప్రచారమునకు బద్ధ కంకణుడవైతివి. ఇదియే నీ యపరాధము. ముకుందపెద్ద మొదలగు అన్యమతీయులు నీ విషయములో దురభిప్రాయ

పడుట కవకాశము కలిగినది-ఈయపార్థమునకై నిరపరాధులగు ముకుంద పెద్ద దంపతులు బలియైనారు. వారి మరణమునకు సంబంధించిన బాధ్యత యంతయునూ నీవు వహించవలసినదే ! దీనినుండి నీవు తప్పించుకొన లేవు"

"ఈ హత్యలో నాకేమాత్రమునూ సంబంధములేదు. నేను నిరప రాధిని !"

"అయినచో నీవు నా ప్రశ్నకు జవాబు చెప్పుము : ఆరోజు జక్కనాచార్యుడు మహాభారత కథను చచ్చినవారి కథయని హేళన జేసి నపుడు, నీవా నింద నెందులకు అడ్డుకొనలేక పోయితివి ? ఈ విషయమై జక్కనాచార్యునికి తెలియజెప్పక ఎందులకు వూరక యుండినావు ?"

"ఔను ! అపుడు నేను శైవాభిమానినై, అల్లముని వెక్కిరించు టను విని విసుగుజెందినాను. పరమత దూషణమును నిర్లక్ష్యము జేసితిని. కాని నేను పక్షపాతిని మాత్రము కాలేదు-కుమారవ్యాసుని భారతముపట్ల నాకేమియునూ చులకన భావములేదు"

"నిజమే. కాని ఆ నీ గౌరవము కార్యరూపమును దాల్చలేదు"

"నేను చామరస-కుమారవ్యాసుల కావ్యములు మహాకావ్యములని భావించి, కనకాభిషేకము జేయలేదా ?"

"నిజమే ! కాని యితర మతములవారు తమ కావ్యముల నూరే గింపు చేయ సంకల్పించినపుడు నీవు దానిని నిలుపలేదు"

"ఇటువంటి ఊరేగింపు నందింతటి హత్యాకాండ జరుగునని నే నూహించలేదు"

"ఊహించి యుండవలయును. అది నీ కర్తవ్యము ! ఇటువంటి మతవైషమ్యము నిదివరకే హరిహరపుర ప్రకరణములో జూచియున్నావు. కాని నీవా విషయమై జాగ్రత్త వహించలేదు. ముకుందపెద్ద హత్యకై రేపు నీవు శిక్ష ననుభవించవలసి యుండును"

"ఎందులకు ?"

"శైవ-వైష్ణవుల మతధర్మములను సమన్వయపరచుటకై ప్రియ

త్నించి, ఆ ఉభయ మతముల వారునూ పరస్పరము ద్వేషించుకొను నట్టుగా జేసినావు"

"దానికి నేను బాధ్యుడనుగాను. నా దృష్టికి హరిహరులలో భేదము లేదు. జగత్తును పరిపాలించు ఆ చిచ్ఛక్తి యొకటే! దానిని మన మే పేరున పిలచిననేమి?"

"అది యాదర్శవాక్కు. కాని యిటువంటి యాదర్శములను కార్యగతము చేయునపుడు అభిప్రాయభేదములు కలుగుట సహజము. అటు వంటి యభిప్రాయభేదమే నీ యధికారులగు అక్కానామాత్య-జక్కానాచార్యుల వలన సంభవించినది. వారి మత తీవ్రత-అభిమానము ముకుంద పెద్దను బలి గైకొనినవి. వారి ప్రభువుగా ఈ హత్యలో నీకునూ భాగము గలదు"

"నేను నిరపరాధిని! ఈ హత్యకునూ, నాకునూ సంబంధము లేదు"

"ఉన్నది. బాగుగా ఆలోచించుము. నీకే వేద్యము కాగలదు"

"తెలియలేదు"

"రెండు చేతు లొకటిగా కలిసిననేకదా చప్పుడగుట? ఉభయ మతాభిమాను లొకటిగా చేరినచో ఘర్షణ జరుగదా? దీనిని నీవు ఉపాయముగా తప్పించి యుండవచ్చును. కాని యీ కార్యమును చేయలేదు"

ఈ యంతరాత్మ పలుకులు విని సార్వభౌమునికి తాను కర్తవ్య చ్యుతు డైనాడేమోనను సంశయము కలుగసాగినది.

"అయినచో నా యపరాధమునకు ప్రాయశ్చిత్తము లేదా?"

"ఉన్నది. నీవు ధర్మాత్ముడగు సార్వభౌముడు కమ్ము. నీ సామ్రాజ్యమందలి మతధర్మములనూ సమాన గౌరవ-శ్రద్ధలతో జూచు కొనుము. నీవు శివ పరివ్రాజకుల అధ్వర్యుడవుగాక, సర్వసమన్వయ దృష్టికి జీవితోదాహరణుడ వగుము. సామ్రాజ్య ప్రజలచే కేవలమొక మతాభిమాని, ఒక పక్షము నవలంబించువాడు అను మాటలు రాని విధముగా నీ జీవితమును నడుపుకొనుము. అట్లు గావించుటచే నీకునూ, సామ్రాజ్యమునకు క్షేమకరము!"

ఈ వాక్కులందలి యథార్థము సార్వభౌముని మానసమున విద్యుల్లతవలె తళుక్కున మెరసి మాయమైనది. ఔను సార్వభౌముడగు తా నే పక్షమునూ-ఏయొక్క మతమునూ అవలంబించక సర్వమత ధర్మములనూ సమాన గౌరవాదరములతో చూచుకొని యుండవలసినది. కాని తాను పరివ్రాజకుల జీవన విధానమును మెచ్చుకొని, వారి చర్యలకు పరోక్షముగా సాయపడు టపరాధమైనదని తోచినది. అతడు మున్ముందు తప్పు చేయక యుండుటకై తగిన జాగ్రత్త తీసుకొనవలయునని నిశ్చయించినాడు.

ఇంతలో సార్వభౌముని సన్నిధియందు జరిగిన హత్యాకాండ కథను విని,లక్కనామాత్యుడు దిగులుజెంది రాజాంతఃపురమునకు పరుగునవచ్చి, సామ్రాట్టుని సందర్శించినాడు. అమాత్యులను చూచి సామ్రాట్టు:

"అమాత్యులూ! నేను మహాకావ్యములకు సన్మానము చేయదలచి ఎంతటి దురంతమునకు కారకుడనైనాను" అని విచారమును వ్యక్తపరచినాడు.

"ఈ విధముగా జరుగగలదని ఎవ రాలోచించినారు- ప్రభూ ?"

"అంతయునూ భగవదేచ్ఛ ! ఇంతకునూ నేనేదో యపరాధమొనరించినానని తోచుచున్నది. ఉభయ కావ్యములకునూ ఏక కాలములో సన్మానము చేయక యుండవలసినది"

"మీరు కనకాభిషేకము చేయక యుండిననూ యీ దురంతము జరిగియే యుండును. ఏయొక్క కావ్యమునకు సన్మానము చేసిననూ దీనిని తప్పించుటకు సాధ్యపడియుండదు" అని లక్కనామాత్యుడు కూడ విచారమును వ్యక్తపరచినాడు.

"నిజమే. నేను కనకాభిషేకమను నెపముతో కర్ణాట సాహిత్యమునకు నా శ్రద్ధాంజలిని సమర్పింప దలచితిని. కాని నే నొకటి దలచిన దైవమొకటి దలచినది.

"ప్రభూ ! ఈ విషయములో మన మెవరునూ అపరాధులము కాము. ద్రోహులు తమ విద్రోహమునకు తామే చిక్కి నాశనమైనారు. అంతియే ! వారిని కాపాడుటకు మన మెవరునూ సమర్థులము కాము"

"ముకుంద పండితులు తాము త్రికరణ పూర్వకముగా నమ్మిన ధర్మముకొరకై బలియైనారు. ఇంతటి బలిదాన మావశ్యకములేదు.మనము కొంత జాగ్రత్త వడియున్నచో దీనిని తప్పించి యుండవచ్చును"

"ఎట్లు ?"

"ఈ ఉత్సవమునకు-ఊరేగింపునకు మన మవకాశమిచ్చి యుండ రాదు"

"ఇప్పుడు గడచినదానికై వగచి ప్రయోజనము లేదు ప్రభూ !"

"ఫలములేదు నిజమే.కాని ముకుంద పెద్దలను హత్యచేసిన వారిని పట్టితెచ్చి శిక్షించుటవలన వారికి జరిగిన యన్యాయమును చక్కబరచి నట్లు కాగలదు. ఈ విధముగా జేయుటచే ప్రక్షుబ్ధమానసులగు ప్రజలను సమాధాన పరుపవచ్చును"

"ప్రభూ ! ఈ విషయముపట్ల మీకుగల విశ్వాసము నాకులేదు. మన మిపు డేపక్ష మవలంబించిననూ రెండవ పక్షమువారు అపార్థము చేసుకొను నవకాశము గలదు. అందువలన యీ పోట్లాటను నిర్లక్ష్య పరచుటయే ఉత్తమమైన రాజనీతి !"

"ఔను ! ఇకపై మన ప్రభుత్వము సామ్రాజ్యమందలి సర్వమత ముల వారికినీ రక్షకవచమగుగాక ! సామ్రాజ్యములో ఎవరునూ పరమత ధర్మములపట్ల చులకన భావము వహించకుందురుగాక !"

"అయినచో తామీ పరివ్రాజక పరివారమునుండి తొలగి పోయె దరా ప్రభూ !"

"ఔను! సామ్రాట్టునైన నేను మతాతీత ప్రభువుగా నుండవలయు నని నిశ్చయించుకొనినాను"

సామ్రాట్టుని మాటలు లక్కనామాత్యుని కాశ్చర్యము కలిగించి నవి. శివభక్తుడునూ, శివ పరివ్రాజక పరివార పోషకుడునూనగు సామ్రాట్ ప్రౌఢదేవరాయ లీ విధముగా చెప్పగలడని అతడు భావింప లేదు.

"ప్రభూ ! తమ రీ విరక్తుల చర్యలలో నేమి దోషమును కను గొనినారు ? తెలిపినచో దిద్దుకొనగలము"

"అమాత్యులూ ! ధార్మికచర్యలేవి యున్ననూ అవి ధార్మిక పురుషులకే ప్రత్యేకింప బడనిమ్ము.వాటి నాచరించవలసిన వారు ఆచార్యులూ, స్వాములూ, మహాత్ములూ, మఠాధిపతులే కదా ! వారి కార్యక్షేత్రమును సామ్రాజ్యమునకు ప్రభువైన నే నాక్రమించుకొనుట న్యాయముకాదు. దీనివలన ప్రభుత్వముయొక్క ధర్మ సమన్వయ దృష్టికి లోపమేర్పడ గలదు. కాబట్టి నేనీ విరక్తుల చర్యలకు దూరముగా నుండదలచితిని. ఇకపై నేను మతధర్మము వ్యక్తియొక్క ఆత్మ సమ్మతమైన విషయమని ప్రకటించి,రాజకీయములలో దాని ప్రభావమునకు చోటివ్వక జాగ్రత్తగా ప్రవర్తించవలయునని నిశ్చయించినాను" అని తన నిర్ణయమును తెలుపగా లక్కనామాత్యునికి చాల నిరాశయైనది.

అతడు సార్వభౌముని ఆదేశానుసారము ముకుందపెద్ద దంపతులకు వృందాచార్యునిచే నంత్యక్రియలు చేయించుటకై వెళ్ళినాడు.

అనంతరము సార్వభౌముడు పెంపుడు తలిదండ్రుల మరణమునకై వియోగభరము ననుభవించుచున్న పొన్నలాదేవిని సమాధాన పరచుటకై ఆమె యంతఃపురమునకు వెళ్ళినాడు.

# 25

# అనుకూల శత్రువులు

ముకుందపెద్ద పరమతము వారియొక్క వైషమ్యమునకు చిక్కి బలియైన విషయము మెరపువలె తేకల్ పట్టణమును చేరినది. ఈవార్త విని గోపరాజు తల్లడిల్లినాడు. శైవమతస్థులచే నన్యాయముగా ముకుందపెద్ద హత్య చేయబడినాడను విషయము, ప్రౌఢదేవరాయలపై నిదివరకే సదభి

పాప్రియములేని గోపరాజు మానసమును మరింత క్షుబ్ధ పరచినది. అతడు తన మతమువారగు వైష్ణవులకు జరిగిన ఈ యన్యాయమునకై పరితపించినాడు.

ఈ విషయము నతడు తన యాప్త మిత్రుడగు సింగరాజుతో ప్రస్తావించగా, సింగరాజు....

"గోపరాజా! ఇదంతయునూ ఆ లక్కనామాత్య సోదరుల కుట్రయే యైయుండవలయును. ఇపుడు శైవుల దుండగములకు వైష్ణవులు రాజధానిలో బ్రతుకుట కష్టముగా నున్నది. ఆరోజు హరిహరపురములో ఆ విధముగానైనది; ఈనాడీ కనకాభిషేక సందర్భమున రాజధానిలో యీ విధముగా జరిగినది. ఇదంతయునూ జూచినచో నాఘూరులు దేనికైననూ వెనుదీయరని తెలియుచున్నది. మనమిపుడే జాగ్రత్త వహింపనిచో, ఆత్మవినాశ మొనర్చుకొనుట తథ్యము!" అనినాడు.

"ముకుందపెద్ద హత్యలో లక్కనామాత్యుడు మొదలగు వారి ప్రవేశమున్నదని నీవనుచున్నావా?"

"ఔను. ఈవార్త వినిన దాదిగా నాకు వారిమీద సందేహము కేంద్రీకృతమైనది. ఎందులకనిన, మహాభారతమును చచ్చినవారి కథ యని చులకనజేసి,దానికి కనకాభిషేకమును తప్పింప ప్రయత్నించినాడు జక్కనాచార్యుడు. అతని ప్రయత్నము ఫలించకపోగా, అత డెందులకీ ముకుందపెద్దమీద తన పగ దీర్చుకొని యుండరాదని నా భావన. అదియునుగాక ఈ హత్యాకాండ జక్కనాచార్యుని మహామందిరము ముందు జరిగినదని తెలియవచ్చినది. కాబట్టి ఈ హత్యలో తప్పక యతనికి సంబంధ ముండగలదు"

"నాకునూ యట్లే తోచుచున్నది. ఎందుకనగా యీ హత్యను జేసిన హంతకుని పట్టి శిక్షించు ప్రయత్నమేదియునూ రాజధానిలో జరిగియున్నట్లు కనబడుటలేదు. ఇదంతయునూ పరికించినచో, లక్కనామాత్యుడు మొదలగు వారు సామ్రాట్టులను తమ బుట్టలో వేసుకొనియుండవచ్చునని దోచుచున్నది. లేనిచో సార్వభౌముడు తన పత్నియగు

పొన్నలాదేవి పెంపుడు తండ్రివలె నుండిన ముకుందపెద్ద వందితుని మరణముపట్ల యింత నిర్లక్ష్యభావము వహించదు"

ఈ మాటలకు సింగరాజు తల యాడించినాడు. ఈ విషయములో వా రిరువురునూ ఏకాభిప్రాయులైనారు. మున్ముందు తా మాచరించవల సిన కార్యములను గురించి గోప్యముగా చర్చించినారు.

ఈ పర్యాయము వారు తమ విద్రోహాచరణము తెలిసి సార్వ భౌముడు తమను దండించవచ్చునని భీతిల్లి కనకాభిషేకమునకు గాని. నవరాత్రోత్సవములకు గాని రాలేదు. సార్వభౌముని వద్దనుండి విశేషా హ్వానము వచ్చిననూ వారు అనారోగ్యమను సాకుతో తేకల్ పట్టణము ననే నిలచినారు. వారి యీ ప్రవర్తనను సార్వభౌముడు ఖండితముగా అనుమానించుట కవకాశముగలదు. తమ విద్రోహాచరణ పూర్తి కానిచో వారికి లక్కనామాత్యుని వలన గండము సంభవించగలదు.

ఇపుడు వారి నడుమగల సంబంధము తెగిపోవునంతటి వార్త — ముకుందపెద్ద మరణము రాజధానినుండి వచ్చినది. తా మిపుడు కార్యో న్ముఖులుగానిచో సామ్రాజ్యములో వైష్ణవ ధర్మము నామావశిష్టము కా గలదనియునూ.నిరపరాధుల రక్తము ప్రవహింపగలదనియునూ భావించి వారు. అంతియగాక.సామ్రాట్టుని ప్రాణమూ-సింహాసనమూ గండములో చిక్కుకొనగలదని శంకించినారు.

కాని వా రాతురత జెందుటకు వీలులేదు. పెట్టెడి ప్రతి అడుగు యునూ, చేబూను నిర్ణయమునూ చాల జాగ్రత్తగా నాలోచించి చేయ వలసి వున్నది.వారి నిర్ణయముపై సామ్రాజ్యమందలి వైష్ణవమత మాధార పడి వున్నది. అంతియకాదు, సామ్రాజ్య మనుగడ-పతనములు కూడ నిలచివున్నవి. ఈ ప్రయత్నములో విఫలులైనచో, వారి ప్రాణములకు విపత్తు సంభవించుటయేగాక, సింహాసన మన్యాక్రాంతము కాగలదు. అందువలన వారీ విషయమై కూలంకషముగా విచారించి. కార్యనీతిని నిర్ణయించవలసి వున్నది.

వారి కిపుడొక విషయము స్పష్టమైనది. తమ కెదురు తిరుగు

వారిని, తమ యాశయముల కడ్డు తగులువారినీ లక్కనామాత్య సోదరు లూరక విడచుటలేదు. ఈ విషయమును ముకుందపెద్ద మరణ ఘట్టము నుండి వారు గ్రహించినారు. మున్ముందు తమ విద్రోహకర కృత్యములు బయల్పడినపుడు వారివలన తమకునూ యాపద సంభవింపవచ్చును. సామ్రాట్టు సోదరుల నెదిరించినచో వారిప్రాణమునకు సైతము గండము సంభవించియే తీరును. అందువలన తామిపుడే ఆ సోదరుల ప్రతిబంధక మును తొలగించుకొనవలయును. లేనిచో వారివలన సామ్రాట్టులూ, సామ్రాజ్యమూ నాశము కాగలదు. ఏవిధముగానైననూ తామీ సామ్రాజ్య దురంతమును తప్పించవలయును" అని వారాలోచించినారు.

"నీమీద యిపుడొక మహత్తరమైన బాధ్యతాభారము పడివున్నది గోపరాజా! నీవు సామ్రాట్టుల మేనల్లుడవు-దౌహిత్రుడగు నీకు సింహా సనపు హక్కుగలదు. ఇపుడు నీవు సింహాసనముకొరకై పోరాడనిచో, అది యన్యాయముగా ఆ హొయిసల వంశీయులకు వశముకాగలదు. సామ్రాజ్య క్షేమ చింతనాదృష్టితో నీవిపుడు సంగ్రామ దీక్షను బూనవల యును" అనినాడు సింగరాజు తన తీర్మానమును వెలిబుచ్చువానివలె.

"ఒకవేళ సామ్రాట్టులు మనల నన్యథా భావించి, మన నాశనము నకు బ్రయత్నించినచో?"

"మనము నిర్దయులమై వారిని సంహరించవలసి వుండును. అంగ వ్రతములో చికిత్సకుడు దుష్టాంగమును ఖండించి, శేషాంగ శ్రేణికి రక్ష నిచ్చునట్లుగా, సామ్రాజ్య భద్రతా దృష్టికి ప్రతిబంధకములగు వారి నందరనూ మనము తొలగించవలయును. భిషగ్వరులవలె మన మీ కార్యముపట్ల నిర్దయాత్ములమై ప్రవర్తించవలయును. మనకేర్పడు యడ్డంకి ఏదియైననూ దానిని మనము లెక్కించరాదు"

"విజయనగర సింహాసనము నాక్రమించుకొనవలయునను నిరాశ నాకులేదు. సామ్రాజ్యమందు విరపరాధులగు వైష్ణవులకు శైవమతస్థుల వలన చిక్కులను దప్పించిన జాలును. దానితో నేను తృప్తిజెందగలను"

"విజయనగర సింహాసనము నెక్కవలయునను యాశ మీకు లేనిచో, శ్రీగిరి ప్రతాపరాయలను దానిపై కూర్చుండజేయుదము?"

"అతనివలన కూడ వైష్ణవ మతోద్ధరణ జరుగగలదని నే నను కొనలేను"

"ఎందులకు ?"

"అతడు శ్రీశైల శ్రీ మల్లికార్జున స్వామికి పరమభక్తుడని విని యున్నాను. అటువంటి వానిచే వైష్ణవుల క్షేమచింతనము జరుగగలదా?"

"ఎందులకు జరుగరాదు ? మన మతనికి సింహాసనము లభించుటకు సాయపడినచో అతడు మనము చెప్పినట్లు వినగలడు. అతనిని మన చేతి కీలుబొమ్మనుగా చేసుకొనినచో, యిక సింహాసనముపై మనము కూర్చొని యున్నట్లేకదా ?"

"మన యీ విద్రోహాచరణ కతడు సాయపడగలడా ?"

"ఎందులకు సాయపడడు? సామ్రాట్టులకునూ, అతనికినీ సింహాసన విషయములో చాల దినములుగా వైమనస్య మున్నదని విని వున్నాను. మన మతనికి సాయపడినచో, మన స్వార్థము సాధింపబడగలదు. ఎందులకనగా, మన స్వార్థము నెరవేరుట కతని రక్షణయను భద్రకవచ మత్యంతావశ్యకము"

"నాకు సింహాసనము నపహరించవలయునన్న యాశలేదు. అది యన్యాక్రాంతమగుటను తప్పించి,సంగమ వంశమువారి చేతిలో సుభద్రముగా నుండిన జాలును. అంతకంటెనూ ఎక్కుడుగా నేనేమియునూ గోరుటలేదు"

"ఆ లక్కనామాత్యుని వలన సామ్రాజ్యమునకు సంభవించిన విపత్తును శ్రీగిరి ప్రతాపరాయలకు దెలిపినచో,అతడు మన విద్రోహమునకు సాయపడగలడను నమ్మక నాకుగలదు. అంతియగాక, యీ విరక్తుల కార్యముల యథార్థ స్వరూపము నెరిగినచో ఆతడు త్రికరణ పూర్వకముగా మనకు సాయపడవచ్చును"

"అయినచో, నీవిపుడే పెనుగొండకు వెళ్ళి, శ్రీగిరి ప్రతాపరాయలను సందర్శించి, అతనిని మనపక్ష మవలంబింపజేసి రమ్ము. ఈ కార్యమునకు నీవు తక్క అన్యులు సమర్థులు కాజాలరు"

—అనినాడు గోపరాజు.

మిత్రుని పలుకులకు సంతోషించి, సింగరాజా మరుదినమే పెను గొండ దారి పట్టినాడు.

ఘనగిరి (పెనుగొండ) రాజ్య పాలకుడగు ప్రతాపరాయలు బాల్యమునుండియునూ ప్రౌఢదేవరాయల విషయములో అసంతృప్తిని వహించి వుండెడివాడు.

అతడు విజయనగర సార్వభౌముడుగా నుండిన వీరవిజయ మహా రాజుల ముద్దుల కుమారుడు. అయిననూ ధర్మనిరతుడగు వీరవిజయ మహారాజులు తన యనంతరము సింహాసనమును చిన్నవాడగు ప్రతాప రాయని కీయక, జ్యేష్ఠపుత్రుడైన ప్రౌఢదేవరాయల కిచ్చి మరణించి నాడు. అయిననూ వారు జీవించి వున్నపుడే యీ సింహాసన విషయ ములో తండ్రికొడుకుల కెన్నియో పర్యాయములు చర్చలు జరిగినవి.

తండ్రి మరణానంతరము ప్రతాపరాయలు సామ్రాజ్యములో తనకు సగభాగము పంచిపెట్టుమని పట్టుబట్టినాడు. అపుడు కుల గురువు లగు శ్రీ చంద్రభూషణ క్రియాశక్తి పండితులు ప్రతాపరాయలకు బుద్ధి జెప్పి, అతనిని సమాధాన పరుప బ్రయత్నించినారు :

"కుమారా ! సంగమ వంశములో యిదివరకెన్నడునూ ఔరస సంతానముండగా సింహాసనమునకై జ్యేష్ఠోల్లంఘనము జరుగలేదు. వంశ పారంపర్యముగా నీ ధర్మ సింహాసనము సామ్రాట్టుల జ్యేష్ఠపుత్రులకే లభించుచూ వచ్చినది. ఇందులకు ధర్మశాస్త్రముల యాధారముకూడ మున్నది. కాబట్టి నీవు సింహాసనమును కోరుటగాని, అఖండమగు సామ్రాజ్యమును విభజింపుమని చెపుటగాని, అధర్మము కాగలదు. దీనిచే సామ్రాజ్య భద్రతకు లోపమేర్పడ గలదు. గనుక మీ సహోదరు లంద రునూ అన్యోన్యముగా నుండి, సామ్రాజ్యమునకు సేవ జేయవలయు నని మా యాశయము. నీకు సమ్మతమైనచో యువరాజ పదవి ననుగ్ర హించునట్లు ప్రౌఢదేవరాయలకు నేను చెప్పగలను. అదియును గానిచో సామ్రాజ్యమందు సంపద్భరితమగు రాజ్యముగానున్న ఘనగిరికి నిన్నధి పతినిగా జేయునట్లు చెప్పెదను" అని ప్రతాపరాయల విద్రోహ బీజాంకు రమును మొలకలోనే నాశనము చేసినారు.

సామ్రాజ్యమందలి స్వామినిష్ఠా సేవకులూ, గురువులూ, ఆస్థానీకులూ, దండనాయకులూ అందరునూ ప్రౌఢదేవరాయల పక్షమవలంబించుటను జూచి ప్రతాపరాయలు వేరుదారి గానక, గురువులు చెప్పినట్లు సామ్రాట్టువద్ద యువరాజుగా నుండుట కిష్టపడక, ఘనగిరి రాజ్యమున కధిపతియై, పెనుగొండకు వచ్చినాడు. అచ్చట గడచిన పదునెనిమిది సంవత్సరములుగా తన విద్రోహ వృక్షమునకు నీరు పోయుచూ వచ్చినాడు. విజయనగర సింహాసనము నపహరించుటకై తరుణము నెదురు చూచుచూ కూర్చున్నాడు.

అతనికి సాళ్వగోపరాజు సార్వభౌమునిమీద కత్తికట్టివున్న విషయము తెలిసినది. హరిహరపుర ప్రకరణములో గోపరాజు సార్వభౌముని కెదురు తిరుగు టతనికొక సంతోషవార్త యైనది. గూఢచారులద్వారా అతడు రాజధానియందునూ, తేకల్ పట్టణమునందునూ జరుగు చర్యల నన్నింటినీ క్రమముగా తెలుసుకొన సాగినాడు. రాజధానిలో జరిగిన ముకుందపెద్ద బలిదానపు కథయునూ, దానిపై గోపరాజుయొక్క ప్రతిక్రియయునూ వేగు లతని కెరిగించినారు. తన రొట్టెను నేతిలో పడవేసుకొనుట కిది తగిన సమయమని భావించి, ప్రతాపరాయలు సాళ్వ గోపరాజు వద్దకు తన నమ్మికకు పాత్రుడైనవాడునూ, చతుర రాజకీయ తంత్రజ్ఞుడునూ నగు ముమ్మయనాయకుని ఛద్మవేషములో బంపినాడు.

ముమ్మయనాయకు డీ పదిహేను సంవత్సరములనుండి సామ్రాట్ ప్రౌఢదేవరాయల వలన తనకు జరిగిన పరాభవమునకు ప్రతీకారము దీర్చుకొనుటకై తోకత్రొక్కిన త్రాచువలె, ప్రతాపరాయల ఆశ్రయములో నుండినాడు.

ఆనాడు తిరకినాయకుని హత్య జరిగిన తరువాత అతని సైనికులు బోలెయ దుర్గముపై దాడి జరుపగా, వారి ముట్టడి నెదిరించి పోరలేక ముమ్మయనాయకు దచటినుండి తప్పించుకొని వెళ్ళినాడు. శత్రువులకు కోట వశమగుటకు పూర్వమే యతడు తన భాండారములో నుండిన విలువగల వస్తువుల నెత్తుకొని, అంతఃపురమునకు చిచ్చుబెట్టి, రహస్య మార్గముద్వారా బయటపడి పారిపోయినాడు.

అంతఃపుర మగ్నిలో దగ్ధముకాగానే, ముమ్మయనాయకుడు కూడ అందులో చిక్కుకొని మరణించి వుండవచ్చునను వదంతి పుట్టినది. అతనిని ప్రాణములతో పట్టుకొనుటకై సార్వభౌముడు చేసిన ప్రయత్న ములు, వీరనాయకుని సాహసకృత్యములు అన్నియునూ వ్యర్థమగుటచే, అతడు మరణించి వుండవచ్చునని అందరునూ తీర్మానించుకొనినారు.

ఇది ముమ్మయనాయకునకు అనుకూలమేయైనది. అతడు మారు వేషములో పెనుగొండకు వచ్చి, ప్రతాపరాయల హృదయాంతరాళములో దాగివున్న విద్రోహమునెట్లో గ్రహించి, అతని యాశ్రములో నిలచి నాడు. చిరకాలముగా నటువంటి సంగడికానికొరకై ఎదురు చూచుచుండిన ప్రతాపరాయలు సంతోషముగా నతని కాశ్రయమిచ్చి, అతనిని తన యాంతరంగిక మిత్రులలో నొకనినిగా స్వీకరించినాడు.

ఇపుడు గోపరాజు హృదయాంతరాళములో రగులుచూ వున్న పగాగ్నిని గ్రహించిన ప్రతాపరాయ లతనిని వశపరచుకొని, అతని సాయముతో తన విద్రోహమున కొక నిశ్చితరూప మిచ్చుటకై నాలో చించి ముమ్మయనాయకుని తేకల్ పట్టణమునకు బంపినాడు.

ముమ్మయనాయకుడు తన నెవరునూ గుర్తించరాదని పాముల నాడించు వాని వేషము ధరించి తేకల్ పట్టణమును చేరుకొనినాడు.

అతడు సూటిగా నంతఃపురమునకు వెళ్ళి గోపరాజు సందర్శన మును గోరినాడు.

ఆ సమయములో గోపరాజు చోళ మండలమునుండి వచ్చిన వేగులవారి వార్తలను వినుచున్నాడు.

చోళమండలమునుండి వేగులవా రతనికి ప్రియకరమైన వార్తనే తెచ్చినారు.

ఇతఃపూర్వము స్వతంత్ర రాజ్యములుగానుండి, యిపుడు విజయ నగర సామ్రాజ్యములో చేరివున్న చోళ-పాండ్య రాజ్యములు మరల స్వతంత్ర రాజ్యములగుటకు ప్రయత్నించుచున్నవి. ఆ రాజ్యములలో రగులుచున్న విద్రోహాగ్ని నార్పుటకై లక్కనామాత్యుడు దండెత్తి వెళ్ళ గలడను వార్త రాజధానినుండి వచ్చినది.

ఈ వార్తవిని గోపరాజు తన విద్రోహము కార్యరూపమునకు తెచ్చుటకు మంచి తరుణము లభించినదని పగటికలలు కనుచూ కూర్చొని యుండగా, సేవకులు వచ్చి—

"ప్రభూ ! తమనొక పాములవాడు సందర్శించగోరి, చాలసేపటి నుండి నిరీక్షించుచున్నాడు. తమతో స్వయముగా మాటలాడ వలసిన రహస్య విషయమేదియో నున్నదట" అనినాడు.

"చూచుట కత డే విధముగా కనబడుచున్నాడు? నిజముగా నతడు పాములవాడా ? లేక ఛద్మవేషములోనున్న రాజకీయ తంత్రజ్ఞుడా ?"

"అతడేదియో రహస్య కార్యార్థమై వచ్చివున్న ఛద్మవేషపు గూఢచారివలెనే దోచుచున్నాడు ప్రభూ !"

"అట్లయినచో, అతనిని లోనికి ప్రవేశపెట్టుము" అని యాజ్ఞాపించినాడు గోపరాజు.

సేవకు డటు వెళ్ళినాడు; పాములవా డిటు ప్రవేశించి గోపరాజు నెదుట నిలువబడినాడు. గోపరా జతనిని పరీక్షగా చూచినాడు. ఆచూపు అతనిని మ్రింగివేయునట్లున్నది. అనంతరము నవ్వుచూ ప్రశ్నించినాడు.

"పాములవారికి మాతో పనియేమిటో తెలుసుకొనగోరు చున్నాము ?"

"ప్రభూ ! నేనొక నాగమణిని దెచ్చివున్నాను. దానిని తమరు పరికించినచో తమకు మంగళప్రదమగును"

—అతడుకూడ నవ్వుచూనే జవాబిచ్చినాడు.

"ఏదీ ఆ నాగమణి ?"

"అంతటి యపూర్వ రత్నము నందరి ఎదుటనూ ఎవరైనా చూపగలరా, ప్రభూ !"

అతని పలుకుల యందలి అంతరార్థమును గ్రహించి, గోపరాజు అచ్చటనున్న భటులను వెలుపలికి బంపి, అతనితో రహస్యముగా యని నాడు.

"ఇప్పుడు చెప్పుము. నీవు నిజమైన పాములవాడవో లేక ఛద్మ వేషధారుడవగు గూఢచారివో ?"

"ప్రభూ ! మీయూహ యధార్థమైనదే ! నేను సామాన్యుడగు పాములవాడను కాను - విద్రోహమను నాగసర్పము నాడించుచున్న వాడను"

"చూచుటతోడనే నీవొక సామాన్య వ్యక్తివికావను నూహ నాకు పొడమినది. ఉండనిమ్ము. నీ వెవరవు ? ఇచ్చటికేందులకు వచ్చినావు ? నీకు నావలన ఏమి సహాయము కావలయును ?" అని గోపరా జాత్మీయముగా నడిగినాడు.

"ప్రభూ ! మీతో దాపరికమెందులకు ? నేను ముమ్మయనాయకుడను. బోలెయదుర్గమునకు ప్రభువుగానుండి, సామ్రాట్ ప్రౌఢదేవరాయల కోపమునకు గురియై రాజ్యకోశములను పోగొట్టుకొని, ఇపుడు ప్రవాసివలె తిరుగుచున్న నిర్భాగ్యుడను"

"ఏమీ, అరగసీమకు సామంతరాజగు ముమ్మయనాయకులా మీరు ?" ఆశ్చర్యముగా యడిగినాడు గోపరాజు.

"ఔను. మీ కనుమానముగా నున్నదా ?"

"మీరు అంతఃపురమునకు నిప్పంటుకొనినపుడు దానిలో దగులొ్కని మరణించినారని వదంతి—కాని బ్రతికియే వున్నారని యిప్పుడు తెలియుచున్నది"

"సార్వభౌములను మోసగించి, కార్యమును సాధించుటకై నే నీ నాటక మాడితిని. లేనిచో వారు నన్ను 'నరవేట' యాడి సంహరించెడివారు"

"ఇప్పుడు మీరు........"

"ఘనగిరి రాజ్యమునుండి వచ్చుచున్నాను—ప్రతాపరాయల ప్రతినిధిగా, తమతో రహస్యముగా, మంత్రాలోచన చేయుటకై వచ్చి వున్నాను"

"అయినచో, మీ రింతవరకునూ ప్రతాపరాయల ఆశ్రయములో నుంటిరా ?"

"ఔను ! సార్వభౌముని వలన నాకు జరిగిన యన్యాయమున కత నిపై పగదీర్చుకొనదలచి, నేను వారి యాశ్రయమును పొందినాను. నన్నీ దుస్థితికి తెచ్చినవారిని నాశనము జేయుటకై ప్రతినబూని, చావక జీవించి వున్నాను. సార్వభౌముని సంహరించు వంతవరకునూ నా జీవితమునకు శాంతి లభించదు"

"అయినచో, మన ముభయులమూ మిత్రులమే !"

—అని చెప్పి, యతనిని అంతరంగిక మిత్రునివలె భావించి, తన విద్రోహ చర్యలనంతయునూ అతనికి సవివరముగా తెలిపినాడు. ఆ తరువాత ఈ విషయమై ప్రతాపరాయలను సందర్శించి మాటలాడుటకొరకై సింగరాజును బంపియున్న విషయము నెరిగించినాడు. ముమ్మయనాయకు డిది విని సమాధానముగా నిట్టూర్పు విడచినాడు.

# 26

# దుష్టచతుష్టయము

పెనుగొండను చేరిన సింగరాజు రహస్యముగా శ్రీగిరి ప్రతాపరాయలను సందర్శించి, గోపరాజు బంపిన లేఖ నతని కొసగి, తన పరిచయమును చేసుకొనినాడు.

ప్రతాపరాయ లతనిని తీక్షణముగా చూచుచూ "మీ విషయమై మేము చాల వినివున్నాము సింగరాజులూ ! మీరు మా మిత్రులనునది కూడ మాకు తెలియును. మీలో రగులుచున్న పగ ఏమిటో కూడ తెలియును. మీ రీ విషయమై సంకోచపడక, నాతో హృదయము విప్పి మాటలాడవచ్చును"

—అని యతడనగా సింగరాజునకు కలిగిన సంతోషమునకు మేరలేక పోయినది.

"ప్రభూ! తమను మిత్రులనుగా భావించియే మే మిచ్చటికి వచ్చినాము. మా గోపరాజుకు మీమీద అమితమైన గౌరవము-ప్రీత్యా దరము లున్నవి. మీపై వారెన్నియో ఆశలను పెట్టుకొని వున్నారు. మీ సహాయముచే ధూర్తులగు నా లక్కన సోదరులను పదవీచ్యుతులనుగా జేసి, సామ్రాట్టులను సింహాసన భ్రష్టులనుగా జేసి, విజయనగర సింహాసనమును మీకు సంపాదించి యివ్వవలయునను భావన కలిగివున్నారు"

"నామీద గోపరాజుల కెంత యభిమానమున్నదో నాకు దెలియును. అతడు నా మేనయల్లుడు మాత్రమేకాదు—మిక్కిలి దక్షతతో రాజ్యపాలనము చేయగల సామర్థ్యపరుడు, సామ్రాజ్య నిష్ఠా సేవకుడు. అతనివలన మా కమితమగు సహాయము లభించగలదని మేము భావించి నాము. శ్రీ మల్లికార్జునస్వామి దయవలన మా నిరీక్ష వ్యర్థముకాలేదు"

అనంతరము వా రుభయులునూ కూర్చొని అనేక విషయములను గురించి చర్చించినారు.

గోపరాజెంతటి శక్తి-సామర్థ్యములు గలవాడను నది ప్రతాపరాయలకు బాగుగా తెలియును. అతనివంటి మహదాకాంక్ష గలవాడు సాయపడినచో తన కార్యము నిర్విఘ్నముగా నెరవేరగలదని కూడ తెలియును. కాని నిజముగా నతడు తనకు సాయపడ నిచ్ఛగించుచున్నాడా? లేక ఏదియో స్వార్థసాధనకై తనను వంచించుట కీ నాటక మాడుచున్నాడా? తెలుసుకొనవలసి వున్నది.

అందువలననే యతడు సింగరాజు-గోపరాజుల ఆంతర్యమును భేదించుటకై యనినాడు:

"సింగరాజులా! సామ్రాట్ ప్రౌఢదేవరాయల మీద మన గోపరాజుకు చాల ఆదరమున్నది. అంతియే గౌరవభావము కూడను గలదు. హఠాత్తుగా అతడు సామ్రాట్టుల విరోధిగా మారినా డనినచో ఆశ్చర్యమగు చున్నది"

"ఇందున ఆశ్చర్యపడవలసిన విషయమేమియునూ లేదు ప్రభూ! రాజధానిలో లక్కనామాత్యుడు మొదలగువారు నడపిన రాజ్యక్రాంతి యొక్క కుట్రల నెరింగిన వారెవరునూ యీ విషయమై నాశ్చర్యపడరు. ఇపు డా హొయిసల వంశీయులవలన సామ్రాజ్యమునకు గండము సంభవించినది. వారు సింహాసనము నపహరించుటకై ఎత్తులు వేయుచున్నారు. తమ విద్రోహమును ప్రజల దృష్టి నుండియునూ, సామ్రాట్టుల దృష్టి నుండియునూ తప్పించుటకొరకై ఈ విరక్తుల చర్యలను నాటకమాడు చున్నారు. వాస్తవముగా సింహాసనము నపహరించుటయే వారి ఉద్దేశము. ఈ ఉద్దేశ సాధనమున కనియే వారు మిమ్ములను మమ్ములను రాజధాని నుండి దూరముగా నుంచినారు. ఇపుడు మన ముభయులమునూ సంఘటితులమై దుష్టశక్తుల నెదిరించక పోయినచో, పవిత్రమగు విజయనగర ధర్మసింహాసన మన్యులపాలగుట తథ్యము. అందులకై మేము మీవద్దకు రావలసివచ్చినది."

"లక్కనామాత్యుడు మొదలగువారు విరక్తుల కార్యకలాపముల పేరుతో రాజ్యమును దురాక్రమించుటకై ఎత్తులు వేయుచున్న సంగతి సత్యమైనచో, సామ్రాట్ ప్రౌఢదేవరాయ లెందుల కింకనూ వూరక వున్నాడు ? ఈ విషయమై తగిన ముందుజాగ్రత్త వహించక మౌనముగా ఎందులకు కూర్చొనినారు ?"

"వారి నా ద్రోహులు ధర్మబోధచే పిరికి పందనుగా జేసి వైచినారు. వారికిపుడు పారమార్థికపు పిచ్చెక్కునట్టు చేసినారు. విజయనగరములో సైత మొక శూన్య సింహాసనము నేర్పరచి, దానికి సామ్రాట్టుల నధిపతులనుగా జేయు నాటకమాడి, వారిని రాజకీయ పరాఙ్ముఖులనుగా జేసి వున్నారు. ఆ సోదరుల దుర్బోధనలవలన సామ్రాట్టులు పరివ్రాజక పరివారములో జేరి, రాజ్యకోశములను లక్కనామాత్యుని కప్పగించినారు. ఇటువంటి సామ్రాట్టును నమ్మి కూర్చొనినచో, మన సామ్రాజ్యమునకు మనుగడలేదు. అందువలననే రాష్ట్ర ప్రజలు మిమ్ములను సింహాసనాసీనులనుగా జేయ నాలోచించుచున్నారు. సామ్రాజ్యమందలి స్వామినిష్ఠాగరిష్ఠు లెల్లరి ఆశయమునూ ఇదియే! పూజ్యులగు విద్యారణ్య మునీంద్ర

లచే స్థాపింపబడిన యీ ధర్మ సామ్రాజ్య మన్యాయముగా ద్రోహం పాలు కాగూడదని మే మందరమునూ గోరుచున్నాము. ఈ పవిత్ర కార్యమునకు తమరు కంకణము ధరించి, నాయకులై ముందు నిలచి మా కెల్లరకునూ మార్గదర్శనము చేయుడు"

ఈ మాట లాలించి ప్రతాపరాయలకు స్వర్గమరచేత విడుకొనినంత హర్షమైనది. అతడు సింగరాజును గాఢముగా కౌగిలించుకొని—

"సింగరాజా! మీవంటి మిత్రులుండగా మాకేభయమునూ లేదు. మీవంటి సామ్రాజ్య నిష్ఠాపరులగు సేవకు లున్నంతవరకూ సామ్రాజ్యమునకు గూడ ఏ భీతియునూలేదు" అని హర్షమును వెలిబుచ్చినాడు.

అనంతరము చిరకాలము తరువాత కలసుకొనిన ఆప్తమిత్రులవలె వా రుభయులునూ తమ విద్రోహాచరణను గురించి అనేక విషయములను చర్చించినారు.

"ఈ సమయములో గోపరాజుకూడ యిచ్చట నుండినచో చాల బాగుండెడిది. ఈ విషయమై మనమొక అంతిమ తీర్మానమునకు వచ్చి వుండవచ్చును" అన్నాడు ప్రతాపరాయలు.

సింగరాజీ మాటలకు సమ్మతించినాడు. గోపరాజును రహస్యముగా పెనుగొండకు దోడ్కొని వచ్చుటకై దూతలను బంపవలయునను కొనుచుండగా, అడబోయిన తీర్థ మెదురైనదనునట్లు ముమ్మయనాయకుని సలహా నంగీకరించి, తమ విద్రోహమునకు అంతిమ స్వరూప మిచ్చుటకై అతడే యచటికి వచ్చినాడు.

చిరకాలానంతరము వచ్చిన మేనల్లునికి ప్రతాపరాయలు మిక్కిలి యాదరముతో స్వాగతము పలికి సత్కరించినాడు.

ఒకటి రెండురోజులు విశ్రాంతికొరకై వినోద కృత్యములలో గడపిన పిమ్మట, అందరునూ ప్రతాపరాయల మంత్రాలోచన మందిరములో రహస్యముగా సభ చేరినారు.

సభలో అందరునూ వారివారి యభిప్రాయములను హృదయము విప్పి చర్చించినారు. తొలుత సింగరాజు మాటలాడి, సామ్రాజ్యమున

కేర్పడిన గండమును గురించి అందరికినీ బాగుగా మనసున నాటునట్లు తెలియజేసినారు. తను చెప్పవలసిన దంతయునూ చెప్పి ముగించుచూ, తుదిపలుకులుగా___

"....సామ్రాజ్యమందలి గణ్యస్వామి నిష్ఠాగరిష్ఠులారా ! ఇదివర కెన్నడునూ రాని విపత్తు సామ్రాజ్యమున కీ లక్కనామాత్య - జక్కనా చార్యుల వలన సంభవించినది. వారు విష్ణువర్థనుని గోత్రజులు. నష్ట చేతనమైన హొయిసల రాజ్యలక్ష్మిని మరల విజయనగర సింహాసనా సీనను జేసి, హొయిసల సామ్రాజ్యమునకు తాము ఆదిపురుషులు గావ లయునని ఆ ద్రోహు లాలోచించుచున్నారు. ప్రజలను మోసగించుటకై వారీ శివపరివ్రాజకుల ముఠాను తయారుచేయుచున్నారు. చూచుటకు వారి చేతలన్నియునూ ధర్మ స్వరూపములుగా గోచరించిననూ, వారి యాశ యము రాజ్యకాంతిని కలుగజేయుటయే. మనకు వారిని పదవీచ్యుతు లనుగా జేయుట వలనుపడదు. ఎందువలననగా ఆ సహోదరుల చేతిలో సామ్రాజ్య సూత్రములు భద్రముగా నున్నవి. సామ్రాట్టులు కూడ వారి చేతిలో కీలుబొమ్మలైనారు. బహిరంగముగా యుద్ధమును ఘోషించి వారిని చంపుటకు మనకు శక్యముగాదు. మనలను వారు మోసగించు చున్నట్టే వారినికూడ మనము ప్రతిమోసముతో జంపి, రాజ్యలక్ష్మి నా ధూర్తుల చేతినుండి రక్షించవలయును.

"ఇపుడు మన విద్రోహమును కార్యరూపమునకు దెచ్చుటకు సదవకాశము లభించినది. దక్షిణాపథమున చోళమండలములో ప్రజలు సామ్రాజ్యమునకు వ్యతిరేకముగా దండెత్తి యున్నారనువార్త వచ్చినది. దాని నణచుటకై లక్కనామాత్యుడే స్వయముగా సైన్యసమేతుడై వెళ్ళు నట్లు కూడ దెలిసినది. ఈ తరుణమున మనమెట్లయిననూ వారిని పదవీ చ్యుతులనుగా జేసి, సామ్రాట్టులను మూలకు ద్రోసి, సింహాసనముపై ప్రతాపరాయలను కూర్చుండబెట్టినచో, లక్కనామాత్యుడు తిరిగి వచ్చు నంతలో సామ్రాజ్య పాలనా సూత్రములన్నియునూ మనచేతిలో భద్ర ముగా నుండగలవు. మనకెదురు తిరుగువారిని నాశమొనర్పవచ్చును. దీని వలన సామ్రాజ్యమున కేర్పడిన ముప్పు తొలగి, ఈ ధర్మ సింహాసన

మన్యుల పాలగుట తప్పునని నమ్ముచున్నాను. ఈ విషయమై తామెల్లరునూ తమ స్పష్టాభిప్రాయములను వెల్లడించవచ్చును" అని చెప్పినాడు.

"సింగరాజుల సలహా ఆచరణీయమైనదిగనే వున్నది. మనము కార్యోన్ముఖుల మగుట కిది మంచితరుణము. రాజధానియందుననూ, సామ్రాజ్యమందలి మరికొన్ని ప్రదేశములలోనూ ప్రజ లీ శివ పరివ్రాజకుల మతా వారొనరించుచున్న దుష్ప్రచారములకు విసిగివున్నారు. ముకుందపెద్ద పండితుని దుర్మరణమును విని పరితాప పడుచున్నారు. అటు చోళ మండలములో క్రాంతిజ్వాల లెగయుచున్నవి. ఇటువంటి సమయములో మనము విద్రోహులకు బలమైన ఘాతము నేర్పరచి.వారివి నాశమొనర్చి సామ్రాజ్య లక్ష్మిని కాపాడవలయును" అని గోపరా జనినాడు.

"ఏమైననూ సరియే ! మనమీ తరుణమును జారవిడచుకొనరాదు. ద్రోహియగు నీ సామ్రాట్టును పదవీచ్యుతునిగా జేసి, వీలైనచో చంపి, మనము సింహాసనమును చేజిక్కించుకొని దానిపై ప్రతాపరాయల నధివసింప జేయవలయును. లేనిచో యీ సామ్రాజ్య మెక్కువకాలము మనజాలదు" అని ముమ్మయనాయకు డనినాడు.

ఇపుడు సామ్రాట్టులను చంపుటయా; విడచుటయా ? అను విషయమును గురించి జిజ్ఞాస యేర్పడినది.

"సామ్రాట్టులను విడచిపుచ్చినచో మరల వారివలన మన కపాయమేర్పడవచ్చును. కాబట్టి వారిని చంపుటయే మంచిది" అని ముమ్మయనాయకుడు తీర్పు నిచ్చినాడు.

ఇతరులు వేరుదారి గానక అతని మాటల నామోదించినారు. అపై ఆ నిర్ణయమునెట్లు కార్యరూపమునకు దేవలయునను విషయమై దీర్ఘచర్చ జరిగినది.

అందరునూ దీర్ఘముగా నాలోచించి ఒకనిర్ణయమునకువచ్చినారు. తమ విద్రోహచర్యలు శత్రువులకు తెలియనట్లు జాగ్రత్త వహించి, ప్రతియొక్కరూ తమతమ కర్తవ్యములను నిర్వహించవలయునని తీర్మానించినారు.

కాని సార్వభౌమునిమీద పగ దీర్చుకొనుటకు వారు విజయనగర ములో నుండు టావశ్యకము. లేకల్ లేహ పెనుగొండనుండి రాజధానికి కారణము లేకుండా వచ్చి వెళ్ళినచో లక్కనామాత్యుడు మొదలగు వారికి సంశయము కలుగవచ్చునని, అది నివారించుకొనుటకై ఒక ఉపాయము నాలోచించినాడు.

ప్రతాపరాయలు విజయనగరములో తన వైభవమునకు తగినట్లుగా ఒక అంతఃపురమును నిర్మించుటయునూ, అది పూర్తికాగానే, అతని కుమారుని జన్మదినోత్సవము సాకున ఒక విందు నేర్పాటుజేసి—సార్వభౌముని, లక్కనామాత్య సోదరులను, వారి యభిమానులను ఆహ్వానించి ఆ సందర్భములో రహస్యముగా హత్యజేసి, తాము సామ్రాజ్యాధికారమును చేజిక్కించుకొనవలయుననియునూ తీర్మానమును జేసికొనినారు.

ఆ తీర్మానము మేరకు సత్వరమే ప్రతాపరాయలు విజయనగరమున కరుదెంచి, సామ్రాజ్ఞులను సందర్శించి కుశలప్రశ్నలు వేసినాడు.

బహుకాలానంతరము కలుసుకొనిన తన సహోదరుని ప్రౌఢదేవరాయలు ఆదరముతో ఆహ్వానించి సత్కరించినాడు,

"అన్నగారూ ! మిమ్ములను క్షమాపణ కోరుటకై నేనిచ్చటికి వచ్చినాను" అని విచారముగా ప్రతాపరాయ లనినాడు.

"అంతటి విషయమేమి జరిగినది, ప్రతాపా ?"

"ఈపర్యాయము రాజధానిలో జరిగిన నవరాత్రోత్సవములకు వచ్చుటకు వీలులేక పోయినది. మహాకవులకు-వారి కావ్యములకు జరిగిన కనకాభిషేకమును కనులార గాంచు ప్రాప్తము నాకు లేకపోయినది. రాజధానికి రావలయునని చాల యాశతో నుంటిని. కాని చివరి ఘడియలలో మంచము పట్టి పడుకొన్నాను. ఇపుడిపుడే కొంత స్వస్థత చేకూరు చున్నది. మీరు నవరాత్రోత్సవములకు నేను గాలేదని ఎచ్చట కోపగించు కొనగలరోనని, క్షమాపణ కోరుటకొరకై వచ్చినాను."

"అంతియేకదా ? నీపై నేను కోపపడలేదు—ఒకవిధముగా నీవు రాకయుండుటయే క్షేమమైనది. ఆ ముకుందపెద్ద పండితుని హత్యా

కొండను దలచుకొనినచో శరీరము జలదరించును. నేనొకటి దలచిన దైవమొకటి దలచినది" అని సార్వభౌముడు బాధాగళుడై యనినాడు.

"మీరు నన్నపార్ధముచేసుకొనక యుండినచో జాలును. నా యారోగ్య మింకనూ కుదుటబడలేదు. రాజవైద్యులు గాలిమార్పు చేయ వలసినదవి చెప్పిరి. విజయనగరపు వాతావరణము నాశరీరమున కారోగ్య కరముగా నున్నది. ఇచట కొంతకాల ముండి, నాయారోగ్యమును చక్క బరచుకొని పోవలయునని నిశ్చయించు కొనినాను." అని సార్వభౌముని దైన్యముగా చూచినాడు.

"అందులకై నీవింత ప్రార్ధించవలయునా? ఈ రాజ్యకోశము లపై నాకెంత యధికారము గలదో నీకునూ అంత యధికారము గలదు. నీ యిష్టమువచ్చిన చోట-యిష్టమువచ్చినన్ని దినము లుండుము. ఆరో గ్యము చక్కబడునంత వరకునూ యిచ్చటనే యుండుము. రాజవైద్యుల సహాయమునూ, వారి యుపచారమునూ యిచ్చట లభించగలవు"—అని ప్రతాపరాయలను సమాధానపరచినాడు.

అన్నగారి యనుమతి లభించిన పిమ్మట ప్రతాపదేవరాయలు అనారోగ్యమను నెపముతో విజయనగరమున నిలచి, తన నివాసమున కనుకూలమగు నొక భవ్యమైన అంతఃపురమును నగరపు శ్రీమంతుల నివాసములో కట్టించసాగినాడు. చతురులైన శిల్పు లెచ్చటినుండియో వచ్చి, సార్వభౌముడు నివసించుటకు తగినట్టి సుందరమగు నొక మంది రము నత్యల్పకాలములో నిర్మించి యిచ్చినారు. అచటికి వచ్చి నిలచిన తరువాత ప్రతాపరాయలు తన యారోగ్యము చక్కబడుచున్నదను వదం తిని వ్యాపింపజేసినాడు. దాదాపు పూర్తిగా గుణముఖుడైనట్టు, అచిర కాలములోననే అతడు పెనుగొండకు మరలునట్టు ప్రజ లనుకొనసాగి నారు.

ఈ యవధిలో సామ్రాజ్య దిగంతములలో విద్రోహ మేఘము లావరించినవి. చోళమండలము వైపునుండి వీచుచున్న అసంతృప్తి వాయువు తనతో నొక ప్రచండ మారుతమును తీసుకొనివచ్చి సామ్రా జ్యమును తల్లడిల జేసినది.

చోళ మండలమునకు సంబంధించిన పుదుపీడు (పుదుచ్చేరి) రాజ్యములో సామ్రాజ్యులపై తిరుగుబాటు జరిగినది. దీనికి నిజమైన కారణ మేమి యనునది చాలకాలము వరకునూ ఎవరికీ తెలియలేదు.

పుదుపీడురాజ్య మిప్పటి కంజీవరము-(కంచి లేక కాంచీపురము) చెంగల్పట్టు జిల్లాల నడుమ నున్న బూభాగము.దానికి రాజగంభీర రాజ్య మను మరొక పేరుకూడ నున్నది. రాజగంభీర దుర్గము దాని రాజధాని. అచ్చట నొక పెద్దకోటను నిర్మించుకొని, సంభవరాయలను చిన్నపాళియ గారు ప్రజోపద్రవమును గలిగించు చుండెడివాడు. బుక్కరాయ లతని దుశ్చర్యములనుజూచి, తన కుమారుడగు కంపరాయల నేతృత్వములో ఒకపెద్ద సైన్యము నతనిని ముట్టడించుట కొరకై బంపినాడు.

ఈ దండయాత్రలో సాళ్వ మంగరసు ముఖ్యపాత్ర వహించి నాడు. అతనికి సాయముగా వెళ్ళిన గోపనార్యుడు మధుర, శ్రీరంగము, చెంజి (జింజి) మొదలగు ప్రదేశములలో నుండిన యవనుల నోడించి, ఆ రాజ్యములకు యవనహస్తముల నుండి విముక్తిని కలుగజేసినాడు. రాజగంభీర దుర్గమును ముట్టడించి వశపరచుకొని సంభవరాయలను నిగ్ర హించి, అతని నుండి కప్పములను-కానుకలను గైకొని రాజధానికి వెను దిరిగినాడు. ఈ దిగ్విజయమును కంపరాయల పత్ని గంగాంబ తన 'మధురావిజయ' మను కావ్యములో చక్కగా వర్ణించినది.

వీర విజయ సార్వభౌముల కాలములో పుదుపీడు రాజ్యమునకు లక్కనామాత్యుడు మండలేశ్వరుడుగా నుండినాడు.

అతడు తన సోదరుడగు మాదనను తన పరముగా నా రాజ్యము నకు మాండలీకుని జేసి, తాను రాజధానిలో అమాత్యపదవిని చూచుకొను చున్నాడు. మాదన తన యన్నగారి అడుగుజాడలలో నడచి, పుదుపీడు రాజ్యములో అనేకములగు జనోపకార్యములను జేసి, దక్షతగా రాజ్య పాలనము చేయుచున్నాడు. కాని, అచటి ప్రజలు మాత్రము లోలోపల అసంతృప్తితో మధనపడ సాగినారు.

దీనికి విరక్తుల చర్యలే కారణమని చెప్పసాగినాడు. వారి చర్య లతో విసుగుజెందిన కొందరు మాండలీకునిపై తిరుగుబాటుజేసి, పన్నులు

మొదలగు వాటిని రాజబొక్కసమునకు చెల్లించకుడని ప్రజలకు దుర్బో ధలు జేసినారు. ఇది విచారణజేసి, దేశములో లేని క్షోభను కలుగజేసిన కొంతమంది విద్రోహులను మాదన కఠినముగా శిక్షించినాడు. ఈ శిక్షతో పాఠము నేర్చుకొనుటకు మారుగా, వారు క్రోధ మానసులై, సామ్రాట్టులపై తిరుగుబాటు జేయుటకు తలపడినారు.

ఈ యవకాశము నుపయోగించుకొని, స్వాతంత్ర్యమును వీగొట్టు కొని, విజయనగర సార్వభౌముల సామంత రాజులుగానున్న పాండ్య, చోళులు మరల తాము స్వతంత్రులు కాగోరి, దండెత్తుటకు సిద్ధముగా మన్నారు. వారికి రాజధానిలో జరిగిన విరక్తుల చర్యలక్షోభ, పుదుపీడు ప్రజలలో చెలరేగిన యసంతృప్తి మంచి యవకాశమును కలిగించినవి. వారు ధైర్యముగా దండెత్తి, తాము స్వతంత్రరాజులని చాటించుకొని, సామ్రాజ్యము నుండి వేరుపడినారు.

ఈవార్త మెఱుపువలె వచ్చి లక్కనామాత్యుని చెవిని పడినది. తన రాజ్యములో యింతటి క్రాంతి చెలరేగివందుల కతనికి చాల అవమాన మైనది. అతడు సార్వభౌముని సందర్శించి, ఖిన్నవదనుడై జరిగిన విష యము లన్నియునూ వివరించినాడు.

"ప్రభూ ! నా కనుజ్ఞ దయచేయుడు. ఆ దుండగుల మద-మణచి వచ్చెదను. మరల యిటువంటి విద్రోహకారు లెవరునూ సామ్రాట్టులపై కత్తిగట్టకుండ జేసి వచ్చెదను" అని ప్రార్థించినాడు.

"ఈ స్వల్పవిషయమునకై మీరు వెళ్ళవలయునా అమాత్యులూ!" అని సామ్రాట్టు నవ్వుచూ ప్రశ్నించినాడు.

"ఔను ప్రభూ ! నేనే వెళ్ళవలయును. అది నా మండలము. అచట జరుగు విద్రోహమేదియైననూ రేపు సామ్రాజ్యమున కాపద గలి గించ వచ్చును. ఈ ద్వేషాంకురమును చిన్నమొక్కగా మన్నపుడే నాశ నము జేసి వచ్చెదను. దీనివలన యితరులకు కూడ గుణపాఠమును నేర్పినట్టు కాగలదు !"

అనిపనికి, బలవంతముగా సామ్రాట్టులయనుమతిని పొంది యుద్ధ తాంబూలమును స్వీకరించి, పుదుపీడు మీద దండెత్తి వెళ్ళుట కుద్యుక్తు డైనాడు. అతనికి వీడ్కోలిచ్చునపుడు సార్వభౌముడు :

"లక్కనామాత్యులుగారూ! సాధ్యమైనచో మీరల్లే సింహాళము వర కునూ దండెత్తి వెళ్ళి, రామేశ్వరములో నొక విజయస్తంభమును మా స్మృతి చిహ్నముగా స్థాపించిరండు. ఇతరుల కది మార్గదర్శకముగా నుండుగాక !" అని యుద్ఘోషించినాడు.

లక్కనామాత్యుడు సార్వభౌముని వద్ద సెలవు పుచ్చుకొని, వెళ్ళ బోవుచూ తన విధ్యుక్త ధర్మముగా సార్వభౌమునికి చెప్పవలసిన మాట లను చెప్పినాడు :

"ప్రభూ ! ఈ పర్యాయ మెందులకో రాజధానివి విడచి వెళ్ళు టకు నాకు కాళ్ళాడుటలేదు. అయిననూ, ఈకార్యమునకు నేనే వెళ్ళ వలసి వచ్చుటచే వెళ్ళుచున్నాను. నేను రాజధానిలో లేని సమయమున మీరు చాల జాగ్రత్తగా నుండవలయును. వేయి కనులు గలిగి ప్రవ ర్తించ వలయును. మా జక్కనాచార్య లున్నారను ధైర్యముతో మీ యోగక్షేమమును వారి కప్పగించి వెళ్ళుచున్నాను. అయిననూ, మీరెవ రినీ అంతరంగికులనుగా స్వీకరించి, వారి మాటలను నమ్మి నడువకుడు. ఆహార పానీయములను పరీక్షించనిదే గైకొనకుడు. స్థల పరీక్ష గావించ నిదే కూర్చొనకుడు. ఇది రాజైనవారికి మంత్రి చెప్పు ఉపదేశ వాక్యం ! ఈ పలుకులు పూర్వులు చెప్పినవేయైననూ మరల తమ యవగాహనకు తెచ్చినాను."

"అమాత్యులూ ! నా విషయమై మీరు చింతించకుడు. నిర్భయ ముగా పుదుపీడునకు వెళ్ళిరండు! శ్రీ విరూపాక్ష స్వామి మీకు మంగళ ప్రద మొనరించుగాక !" — అని వీడ్కోలిచ్చి పంపినాడు.

లక్కనామాత్యుడు వెళ్ళినాడు. సార్వభౌముడు అమాత్యుడు కంటి కగపడునంత వరకునూ చూచుచూ నుండి, అనంతర మెందులకో ఒక భారమైన నిట్టూర్పు విడచినాడు.

270

# 27

# మృత్యుగహ్వరము

సర్వమునూ గోపరాజు - సింగరాజుల యాలోచన మేరకే జరిగినది. ప్రతాపరాయలు సందేహించుట కవకాశ మివ్వని రీతిని రాజధాని యగు విజయనగరములో నొక యంతఃపురమును కట్టించి తన విద్రోహ రంగమునకు భూమికను సిద్ధపరచినాడు. దానికిక చిచ్చుపెట్టుట యొక్కటే తరువాయి.

ఆ సమయము కూడ ఆసన్నమైనది. అక్కనామాత్యుడు రాజధానిలోనున్న సైన్యమం దెక్కుడుపాలు తనవెంట తీసుకొని పుదుపీడునకు వెళ్ళినాడు. ఈ సమయము తమ విద్రోహాగ్నిని ప్రజ్వలింపజేయుటకు సర్వ విధముల కనుకూలముగా నున్నదని భావించి.

ప్రతాపరాయలు తన పథకము మేరకు ఒక శుభదినమును జూచి, ఆనాడు తన యంతఃపురమునకు భోజనమునకు రావలసినదిగా సామ్రాట్ ప్రౌఢదేవరాయలకునూ, జక్కనాచార్య, సింగననాయకుడు మొదలగు రాజోద్యోగులకు ఆదరముతోగూడిన ఆహ్వాన మంపి, సమయమునకు వారెచ్చట తప్పించుకొనగలరోనని తానే స్వయముగా వెళ్ళి పిలచి వచ్చినాడు. ఈ విషయమై తనపై నెవరికినీ సందేహము కలుగకుండుటకై కుమారుని జన్మదినోత్సవమును కారణము చేసుకొనినాడు. దూరప్రాంత్యముల నుండి రావలసిన అతని బంధు మిత్రు లిదివరకే రాజధానిని చేరుకొనినారు.

అతని ముఖ్యస్నేహితులుగా తేకల్ పట్టణము నుండి గోపరాజు-సింగరాజులునూ, ముమ్మయ నాయకులునూ వచ్చినారు. ముమ్మయ నాయకు డెనిమిది దినములు ముందుగనే వచ్చి, పాకశాలాధికారి వేషములో ప్రతాపరాయల వంటయింటిలో నిలచినాడు. ఈవేషములో అతని నెవరునూ గుర్తించలేదు.

ఆనాడు ఆచరించవలసిన ప్రతి కార్యమునూ వారు రహస్య మంత్రాలోచన మందిరములో కూలంకషముగా విచారించి తీర్మానించు కొనినారు. ఆ తీర్మానక్రమ మీవిధమైనది :

తొలుత అంతఃపురమునకు వచ్చు అతిధులకు ఒక్కొక్కరికి స్వాగతము పలికి ప్రతాపరాయలు వారిని భోజన గృహమునకు పంప వలయును.

ఆ యతిథుల నుచిత మర్యాదలతో గోపరాజు దోడ్కొని వెళ్ళి సింగరాజు కప్పగించవలయును.

సింగరాజు వారిని పాకశాలాధికారి యగు ముమ్మయ నాయకున కప్పజెప్పవలయును.

వచ్చిన ముఖ్యాతిథులను అతని కప్పగించినచో, యిక అంతటితో వారి కథ ముగిసినదని యర్థము. సామ్రాట్ ప్రౌఢదేవరాయలూ, జక్కనాచార్య. సింగననాయకులు మొదలగువారు విహతులైనచో, సింహాసనము సులభముగా కైవసమైన దనుకొనవచ్చును. మరల దానిని లక్కన - మాదన సోదరు లెవరునూ తమ చేతినుండి లాగుకొనలేరు. ఈ యాలోచనను కార్యగత మొనరించు టొక్కటే యిక తరువాయి —

ఆనాడు ప్రతాపదేవరాయల అంతఃపురములో ఎటుజూచినను ఆనందోత్సాహములు - సంబరములే గోచరించసాగినవి. అతని కుమారుని జన్మదినోత్సవమునకై రాజధాని యందలి సుప్రతిష్ఠిత వ్యక్తులందరునూ ఆహ్వానింప బడినారు. కుమారునికి శుభము గలుగుటకై దేవాలయములందు విశేషోత్సవములు - బీదసాదల కన్నదాన, వస్త్రదానములు యథేచ్ఛగా జరిగినవి. సామాన్యాతిథులకు మధ్యాహ్నమే భోజనపు టేర్పాటు జరుగుటచే వారందరునూ భుజించి వెళ్ళిపోయినారు.

రాత్రి విందునకు సామ్రాజ్యమందలి ముఖ్యులగు కొందరను మాత్రమే ఆహ్వానించడమైనది. వారిలో సామ్రాట్ ప్రౌఢదేవరాయలు, మహామాత్యుడు జక్కనాచార్యులు, సింగన దండనాయకుడు, కార్యార్థమై రాజధానికి వచ్చియున్న మాదనదండనాయకుడు తదితర ముఖ్యులూ నున్నారు. ఈ విందు భోజనమును అంతఃపుర మందలి ప్రత్యేక మందిరములో ఏర్పాటు చేయడమైనది. అతిథుల కొరకై భక్ష్య భోజ్యములు

తయారైనవి. రాబోవు అతిధుల మనోల్లాసమునకై ఒకవైపు సంగీతమూ, వేరొకవైపు నృత్యమూ జరుగుట కేర్పాటైనది.

రేరాజు చల్లని వెలుగులో జగత్తంతయునూ ఆహ్లాదకరముగా నున్నది. మంద మారుతము పూదోటల మీద వీచి, సువాసనలను మోసుకొని వచ్చుచున్నది. అంతఃపురములో జ్వాజ్వల్యమానమగు దీపములు వెలుగుచున్నవి. చూచుటకది దేవేంద్ర భవనము వలె ప్రకాశించుచున్నది.

నిశ్చిత సమయమునకు సరిగా అతిధు లొక్కొక్కరే అంతఃపురమునకు రాసాగినారు.

దివ్యాలంకార భూషితుడై ప్రతాపదేవరాయలే స్వయముగా నిలచి, వచ్చెడి యతిధులకు స్వాగత మిచ్చుచున్నాడు.

వారిని గోపరాజు - సింగరాజు లాదరముతో లోనికి తోడ్కొని వెళ్ళుచున్నారు.

మొదట మాదన దండనాయకుడు వచ్చినాడు. అతని వెనుకనే సింగన దండనాయకుడు కూడ వచ్చినాడు, కాని, జక్కనాచార్యుడు మాత్రము రాలేదు. అతడు రాకపోవుట జూచి ప్రతాపరాయలకు - గోపరాజుకు ఆశ్చర్యము కలిగినది. తమ ఎత్తుగడ వారికేమైననూ తెలిసిపోయినదేమోనను అనుమానము కూడ కలిగినది. అయిననూ, ప్రతాపరాయలు నవ్వుచూ అనినాడు :

"జక్కనాచార్యులు, సామాత్రులూ వచ్చు వరకునూ మేము నిరీక్షించ వచ్చునుకదా !"

"జక్కనాచార్యుల కొరకెదురుచూడ పనిలేదు. నేను వారి మందిరము నుండియే వచ్చుచున్నాను. వారి కీనాటి ఉదయము నుండి హఠాత్తుగా హృద్రోగము కానబడినదట. ఆహారమును సేవించరాదని రాజ వైద్యులు సలహా యిచ్చినారట.... ...." అనినాడు సింగన దండనాయకుడు.

"అయినచో వారు రారా !" ఆందోళన పడుచూ గోపరాజు అడిగినాడు.

"బహుశః రారు ! ఒకవేళ దేహస్థితి కొంత మెరుగుగా నుండి నచో వచ్చిననూ రావచ్చును" అని సింగన దండనాయకుడు జవాబు చెప్పినాడు.

"అయినచో నేను వెళ్ళి వారిని దోడ్కొని వత్తునా ?" ప్రతాప రాయ లనినాడు.

"అక్కరలేదు. వృథాగా నెందులకు శ్రమపడెదరు ? స్వస్థతగా నున్నచో వారే వత్తురు !" అని సింగన నాయకుడు మారుపల్కినాడు.

ఈ మాటలు ప్రతాపరాయలు, గోపరాజు, సింగరాజులకు అను మాన కారణము లైనవి.

"పోనిమ్ము. సామ్రాట్టులను కలుసుకొనినారా ? వారు తప్పక రాగలరు కదా !" గోపరాజు ప్రశ్నించినాడు.

"వచ్చునట్లుగా వారు నాతో చెప్పినారు. ఒకటిరెండు క్షణములలో రాగలరని తలచెదను" అనినాడు మాదనదండనాయకుడు.

కొంతసేపు సామ్రాట్టుల కొరకయి వారందరునూ నిరీక్షించినారు. సమయమునకు సరిగా సామ్రాట్ ప్రౌఢదేవరాయలు తన ఆప్త పరి వారముతో బాటు ప్రతాపరాయల అంతఃపురమునకు వచ్చినాడు.

పల్లకీని వెనుకకుబంపి. ప్రతాపరాయలు అన్నగారికి స్వాగతము పలికి, ఆదర సత్కారములు చేసినాడు.

"అన్నగారూ! నాపై యింతటి అభిమాన మున్నందులకు మిక్కిలి సంతోషించుచున్నాను. జక్కనాచార్యులవలె మీరునూ ఎచ్చట రాక పోయెదరోనని యనుకొన్నాను" ప్రతాపరాయలు నవ్వుచూ అనినాడు.

"ఏమీ, జక్కనాచార్యులు రాలేదా ?" సార్వభౌము డాశ్చర్య చకి తుడై ప్రశ్నించినాడు.

"లేదు ప్రభూ ! వారెందులకో హఠాత్తుగాఅస్వస్థులైనారట. దేహ స్థితి కొంత నెమ్మదించినచో వచ్చిననూ రావచ్చును" అనినాడు మాదన.

"వారు భోజనమునకు నిలువకపోయిననూ, మాతో కొంతసేపు గడపి వెళ్ళవచ్చును కదా !" అనినాడు సార్వభౌముడు.

సార్వభౌముని మనోభావమును గ్రహించి, సింగననాయకుడు జక్కనాచార్యుని దోడ్కొని వచ్చుటకై మాదనను బంపినాడు.

"అంతవరకునూ ప్రభువు లీ నృత్యగీతములను తిలకించవలయునని ప్రార్థన !" అని గోపరాజు కృతక విశ్వాసమును నటించుచూ చెప్పినాడు.

సార్వభౌము డందుల కంగీకరించి నాట్య గృహమునకు వెళ్ళినాడు. తక్కినవా రతని ననుసరించినారు.

మహామాత్యుని మందిరమునకు వెళ్ళిన మాదన తిరిగి వచ్చి అమాత్యుని లేఖను సార్వభౌముని కిచ్చినాడు. అందులో జక్కనాచార్యుడు :

"ప్రభూ ! హఠాత్తుగా నాకు హృద్రోగము సంభవించినది. అందుచే విందు భోజనమునకు వచ్చి మీతో కొన్ని రసఘడియలను గడుపలేక పోవుచున్నందులకు చింతించుచున్నాను. తమరు నాకొరకై ఎదురు చూడకుడని వినమ్రుడనై ప్రార్థించుచున్నాను" అని వ్రాసినాడు.

ఈ లేఖను జదివి చూచి ప్రతాపరాయలు భీతిల్లినాడు. తమ విద్రోహకార్యము జక్కనాచార్యునికి తెలిసియుండవచ్చునా ? లేదు.... తెలియుట కవకాశము లేదు ! తెలిసివున్నచో సార్వభౌముని హెచ్చరించి వుండడా ?

"ప్రభూ ! వడ్డించుటకు సిద్ధముగా నున్నాము. తాము దయ చేయుడు" అని ద్వంద్వార్థభావముతో గోపరా జనినాడు.

సామ్రాట్టు సింగన, మాదన దండనాయకులవైపు చూచినాడు. వారు సమ్మతించగా అచ్చటినుండి లేచినాడు.

వారు భోజనము చేయుటకై లేవగా జూచి, ప్రతాపరాయలు : "గోపరాజా ! సార్వభౌములను నీవు ఉప్పరిగె మీదికి తోడ్కొని వెళ్ళుము. సింగన-మాదన దండనాయకులను నేను విచారించుకొనెదను" అని యర్థగర్భితముగా నుడివినాడు.

ఆ మాటలలోని యర్థమును గ్రహించి గోపరాజు సామ్రాట్ ప్రౌఢ దేవరాయల నుచిత మర్యాదలతో అంతఃపురోపరి భాగమందలి గది

లోనికి తోడ్కొని వెళ్ళినాడు. సామ్రాట్టులు గదిలో ప్రవేశించగనే అత నికి తెలియకుండానే గది తలుపులను బిగించినాడు.

ఇటు ప్రతాపరాయలు సింగన-మాదనలను ఉప్పరిగకు తోడ్కొని వెళ్ళి ముమ్మయనాయకుని కప్పగించి, ప్రభువులను దోడ్కొని పోవు టకయి వచ్చినాడు.

ఇంతలో రహస్యమందిరముయొక్క లోపలి గదినుండి ఎవరో "అయ్యో, చచ్చితిని" అని యరచుట వినబడినది. అచ్చటికి ప్రతాప రాయలు-సింగరాజు వచ్చునంతలో జరుగవలసిన హత్యాకాండ జరిగి పోయినది.

గదిలోనుండి గోపరాజు పిచ్చి యావేశముతో, ఉన్మత్తునివలె వెలుపలికి వచ్చినాడు. అతని తలవెండ్రుకలు చెల్లాచెదురుగా నున్నవి. కను లగ్నిగోళములవలె నున్నవి. వస్త్రములు రక్తమయమై వున్నవి.

గదిలోనుండి బయటపడగానే అతడు ప్రతాపరాయ - సింగరాజు లను జూచి బిగ్గరగా నవ్వినాడు.

"గోపరాజా ! ఏమైనది ? సామ్రాట్టుల కథ ఏమైనది?" ప్రతాప రాయ లాందోళనగా అడిగినాడు. అతని కంఠము బొంగురుపోయినది.

"సామ్రాట్టుల కథ ముగిసినది" అని జవాబిచ్చినాడు గోపరాజు.

"ఏమీ, సామ్రాట్టులను హత్యజేసితివా ?" ప్రతాపరాయలు భీతి జెందుచూ మరల ప్రశ్నించినాడు.

"ఔను. అతనిని హత్యజేసినాను. ఒక్కదెబ్బతో నేలగూలి అసు వులను గోల్పోయినాడు" విజృంభణతో అనినాడు గోపరాజు.

"సామ్రాట్టుల శరీరమెచ్చట నున్నది ?"

"ఎవరునూ చూడరాదని దానిని తీసుకొని వెళ్ళి ఉగ్రాణమందలి గదిలో పడవేసి వచ్చినాను"

"మంచిపని చేసితివి. ప్రస్తుతమునకు శని తొలగినది. మన రాజ్యమునకు సంభవించిన గండము తప్పినది" అనినాడు ప్రతాప రాయలు.

"ఇంతమాత్రమునకే ఎచ్చట ముగిసినది ? ఆ ద్రోహులగు లక్కనామాత్య-జక్కనాచార్యులు తప్పించుకొనినారు. వారు మరణించు నంతవరకునూ మనకు మనుగడలేదు" అనినాడు సింగరాజు.

"అయినచో మనమిపుడే ఆ జక్కనాచార్యు నతని మందిరము లోనే నిహతుని జేయుదము" ప్రతాపరాయ లనినాడు.

అంతలో ముమ్మయనాయకుడు "మహా ప్రతాపదేవరాయ సార్వ భౌములకు జయమగుగాక!" అని ఉద్ఘోషించుచూ ఉప్పరిగెనుండి క్రిందకు దిగి వచ్చినాడు.

"సింగన-మాదనల కథ ఏమైనది ?" ప్రతాపరాయలు కుతూ హలముతో ప్రశ్నించినాడు.

"వారు శివ సామ్రాజ్యమును చేరుకొన్నారు" అని ముమ్మయ నాయకుడు వికటాట్టహాసము చేసినాడు. తరువాత "గోపరాజా, సామ్రి ట్టులు ఎచ్చట నున్నారు ?" అని ప్రశ్నించినాడు.

"వారు శివ సాయుజ్యమును జెందినారు. ఆ ద్రోహికి తగిన శిక్ష జరిగినది. ఈ దినముకొరకే నే నింతవరకునూ జీవించి వుంటిని" అని విజయోన్మాదముతో విజృంభించినాడు.

"ప్రతాపరాయలూ ! మనమిపు డాలస్య మొనరించరాదు. ద్రోహి యగు ఆ జక్కనాచార్యుని హత్య మొనరించి, అంతఃపురమునూ, ఆయుధా గారమునూ, రాజ భాండాగారమునూ తొలుత వశపరచుకొన వలయును" అని సింగరాజు సలహా చెప్పినాడు.

"ఔను ! ఇపుడే ఆ పని జరుగవలయును. శత్రువు లేమాత్రము జాగ్రత్త పడిననూ మన సర్వనాశనము తప్పదు" అనినాడు గోపరాజు.

ఇక వారు మహామాత్యుని మందిరముపై దండెత్తవలయుననుకొను చుండగా, యింతలో వెలుపల :

"ప్రౌఢప్రతాప సార్వభౌములకు జయమగుగాక ! గజవేట కారు లకు జయమగుగాక ! !" అని జయజయ ధ్వానములు చేసుకొనుచూ, శత్రు సైనికులు హఠాత్తుగా ప్రతాపరాయల అంతఃపురమును ముట్టడించి వారు.

వారెవరు ? యిచటికెందులకు వచ్చినారు ? వారి నాయకులెవరు? వారు తమమీద ఎందులకు ముట్టడి జరుపుచున్నారు ? అను విషయములు శ్రీగిరి ప్రతాపరాయల పక్షమువారి కెవరికినీ తెలియవు. అందుచే వారు విభ్రాంతులై నిలబడిపోయినారు.

ఇంతలో మరల నొకసారి శత్రుసైనికుల రణఘోషణలు వినబడినవి :

"జై మహాకాళీ ! జై భువనేశ్వరి ! జై ప్రౌఢప్రతాప !"

ఈ జయకాంక్షల వెనువెంటనే వెయ్యాయమంది అశ్విక భటులు చేత ఖడ్గము ధరించి, రౌద్రావేశములో ప్రతాపరాయల అంతఃపురమును ముట్టడించినారు.

చూచుచుండగనే అంతఃపుర మహాద్వారములు శత్రుదాడికి చిక్కి నుగ్గు నూచములైనవి.

ప్రతాపరాయ, గోపరాజు, సింగరాజు లచటినుండి తప్పించుకొనుటకై పరువెత్తినారు. కాని ముమ్మయనాయకుడు మాత్రము తాను సామ్రాట్టులపై పగ దీర్చుకొన్నాడను సంతోషాతిరేకముచే ఖడ్గము చేతధరించి, దీరునివలె శత్రువులపై బడినాడు.

క్షణకాలములో ప్రౌఢదేవరాయల సైనికు లాతని తలను, మొండెమునుండి వేరు చేసినారు, అతని శరీరముపై నడచి వెళ్ళి సైనికు లంతఃపుర మంతటా ప్రతాపరాయ, గోపరాజ, సింగరాజుల కొరకయి శోధించినారు. కాని వారి కచ్చటి గదులలో ఆక్రందనము చేయు స్త్రీ-పురుషులూ, భీతిల్లి శోకించుచున్న హజనము తప్ప యింకెవరునూ కనబడలేదు.

ఉప్పరిగెకు వెళ్ళగా అచ్చట హృదయ విదారకమైన దృశ్యము వారి కనుల బడినవి. సింగన,మాదన వారి పరిజనులూ, తరితర సామ్రాజ్య నిష్ఠాగరిష్ఠులూ క్రూరముగా హత్యచేయబడి రక్తపు మడుగులో పడివున్నారు.

అయినచో ఆ నీచులు సామ్రాట్టులను హత్యజేసి తప్పించుకొని వుండవచ్చునా ?

సేనాధ్యక్షుడు ప్రతాపరాయ, గోపరాజు, సింగరాజులను వెతుకుటకై తన సైనికులను దంపి, సార్వభౌముని వెతుకుటకు తానే పూనుకొనినాడు. చాలసేపు వెదకిన పిమ్మట ధనాగారపు గదిలో సామ్రాట్టుల దేహము లభించినది. వారి యదృష్టమువలన సామ్రాట్టులు మరణించి వుండలేదు. అతని వక్షములో ఒక పదునైన బాకు గుచ్చుకొనివున్ననూ, అతడు ప్రాణగండమునుండి తప్పించుకొన్నాడు.

సామ్రాట్టుని చూడగనే సైనికులు "జై పంపావతి ! జై భువనేశ్వరి ! జై ప్రౌఢప్రతాప !" అని హర్షధ్వానములు జేసినారు.

"ప్రభూ ! తమరు క్షేమముగా నున్నారుకదా !" అని ఆ సైన్యాధ్యక్షు డడిగినాడు.

"ఎవరు, మా లక్కనామాత్యులా !" అని కనులు తెరచి చూచి మెల్లగా అనినాడు సామ్రాట్టులు.

"ఔను ప్రభూ ! మిమ్ముల నీ యాపదకు గురిచేసి, రాజధానిని విడచి వెళ్ళిన ఆ పాపియే నేను. నేను వచ్చుట కొంత యాలస్యమై వుండిననూ తమ ప్రాణమునకు గండము సంభవించి వుండెడిది. సామ్రాజ్యము ద్రోహుల హస్తంగతమై వుండెడిది" అని లక్కనామాత్యుడు విట్టూర్చినాడు.

"మీరు వుదయగిరినుండి ఎపుడు వచ్చినారు?"

"అదొక పెద్ద గాథ ప్రభూ ! తొలుత తాము స్వస్థులుకండు" అని రాజవైద్యులను బిలిపించి, వెంటనే వారిచే సామ్రాట్టులకు చికిత్స చేయించినాడు.

ఇంతలో వెలుపల విద్రోహకారుల కొరకై వెదకుచున్న సైనికులు సంతోషవార్తను తెచ్చినారు.

అంతఃపురమునుండి మారు వేషములతో పారిపోవుచున్న గోపరాజు, సింగరాజు, ప్రతాపరాయలను వారు బంధించి తెచ్చినారు.

సామ్రాట్టులు వారిని తిరస్కార దృక్కులతో జూచి "గోపరాజా! చివరకు నీవు అన్నముపెట్టిన వారి యింటికి కన్నము పెట్టితివా? ఏ యపరాధ మొనరించితినని నన్ను నీవు చంప బ్రయత్నించితివి?" అన్నాడు.

"ప్రభూ! నాకొక ఖడ్గమిచ్చి యడుగుము. సరియైన జవాబు చెప్పెదను" అని యతడు సార్వభౌముని ముఖ మవలోకించినాడు.

సామ్రాట్టులు తన మొలలోనున్న ఖడ్గమును దీసి అతనివైపుకు విసరినాడు. గోపరాజు దాని నెత్తుకొని—

"ప్రభూ! నేనిచ్చు జవాబిదియే" అని చెప్పి, హృదయములో గ్రుచ్చుకొని, ప్రాణములను వదలినాడు.

అతడు పిరికిపందవలె బ్రతికి-ద్రోహివలె జీవనమును గడపి-పిరికివలె మరణించినాడు.

సామ్రాట్టులు తక్కిన వారిని కారాగారములో వేయుడని యాజ్ఞాపించినాడు.

"ఇపుడు జెపుడు అమాత్యులూ! మీరు సకాలములో యిచ్చటి కెట్లు వచ్చితిరి? నన్నీ దురాత్ముల కుతంత్రమునుండి ఎట్లు రక్షించితిరి? మీకు వారి కుట్ర ఎట్లు తెలిసినది?" అని యాశ్చర్యముగా కృతజ్ఞతా భావమును ప్రకటించుచూ అడిగినాడు.

"నాకథ అటుండనిమ్ము ప్రభూ! తమ రెడ్డి హత్యాపాతకుల వలలో చిక్కుకొన్నారు? వారి చేతినుండి చావక ఎట్లు తప్పించుకొని నారు? ఈ విషయములను ముందు నా కెరిగింపుడు!" అని లక్కనామాత్యుడు ప్రార్థించినాడు.

ప్రౌఢదేవరాయలు తాను గోపరాజు చేతినుండి తప్పించుకొనిన యద్భుతకథను చెప్పినాడు.

నయగారపు మాటలతో గోపరాజు తన ప్రవర్తన వితరు లనుమానించని రీతిని, ఉప్పరిగెమీదకు తోడ్కొని పోవునట్లు నటించి, రహస్య మందిరమందలి గదిలోనికి తీసుకొని వెళ్ళి, ద్వారములను మూసి, సార్వభౌము డనుమానించుటకు పూర్వమే అతని మీదపడి బాకును హృదయముపై నాటినాడు.

'అయ్యో!' యని అరచి సామ్రాట్టులు నేలకూలినాడు. అతడు కూలుటను జూచి, మరణించినాడని దలచి గోపరాజు అతనిని ధనాగారపు గదిలో బంధించి వచ్చినాడు. కాని గాయము పెద్దగా తలిగిననూ ప్రాణా

పాయము కలుగలేదు. అత డతికష్టముపై స్మృతి వచ్చిన తరువాత — గదిలోనుండి వెలికి వచ్చుటకు ప్రయత్నించుచూ, అరచుచూ, మూల్గుచూ నుండగా ఆ బాధాశబ్దము నాలించి, లక్కనామాత్యు డచటికి వచ్చి సకాల ములో నతనిని రక్షించినాడు.

అయినచో, లక్కనామాత్యు డచటికెట్లు వచ్చినాడు ?

అదియొక పెద్ద గాథ! —

అతడు పునుపీడుకు వెళ్ళునపుడు తేకల్ పట్టణ మార్గముగా వెళ్ళి నాడు. గోపరాజు - సింగరాజు ప్రతాపరాయలతో గలసి ఏదియో రహస్య చర్చ జరుపుటకై, ఒకరివెనుక నొకరుగా పెనుగొండకు వెళ్ళిన విషయము గూఢచారుల వలన అతనికి తెలిసినది. అంతకంటెనూ ముఖ్య మగు విషయము, ముమ్మయనాయకుడు ప్రతాపరాయల ఆశ్రయములో మారువేషములో నుండుటకూడ తెలిసినది రాజద్రోహియు-సామ్రాజ్య శత్రువును నైన ముమ్మయనాయకునకు ప్రతాపరాయ లాశ్రయమిచ్చి యున్న విషయపు వెలుగులో, గోపరాజు - సింగరాజుల రాయబారములు మిక్కిలి యర్థవంతములుగా దోచినవి. అతనికి వారిపై సంశయమేర్పడి నది.

ఈ సంశయమునకు తగినట్టు, ప్రతాపరాయలు రాజధానిలోనిలచి ఒక అంతఃపురమును నిర్మించుచున్న విషయము కూడ అనుమాన కారణ మైనది. ఈ నూతన అంతఃపుర నిర్మాణమునకూ గోపరాజ - సింగరాజ- ముమ్మయనాయకుల రహస్య కుట్రకూ సంబంధమేమైననూ గలదా ? అని యాలోచించగా, అతనికి అనుమానము కలిగినది.

చివరకు, తన దండయాత్ర నితర నాయకుల కప్పగించి, ఎవరి కినీ తెలియనట్లు రహస్యముగా రాజధానికి వెనుదిరిగి వచ్చినాడు. తనకు తెలిసిన విషయములన్నింటినీ అన్నగారగు జక్కనాచార్యులకు తెలుపు టకై వారి మందిరమునకు వెళ్ళగా, అచట ప్రతాపరాయల మందిరము నకు సార్వభౌముడు విందు భోజనమునకై వెళ్ళినాడను విషయము తెలిసినది.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA125B155 |
| పుస్తకం పేరు | సమ్రాట్ ప్రౌఢదేవరాయులు |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 297 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 1708 |
| తయారు చేసినది | Vedavathi |
| పేజీలు విడదీసినది | Vedavathi |
| స్కాన్ చేసినది | Ch. Ramya |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | GOOD |